శ్రీ విచిత్రనవలా గ్రంథమాల. 2

# మాయామయి

ఏడవ భాగము

కోసూరి రంగయ్యచే
రచియింపఁబడినది.

( మొదటి కూర్పు. )

ప్రకాశకులు,

కోసూరి రంగయ్య అండ్ సన్సు,

శ్రీ విచిత్రనవలా గ్రంథమండలి,

నర్సాపురం.

1934



...లకు, రు 1—0—0 ] [ ఇతరులకు, రు 1—8—0

# మాగ్రంథమాలను పోషించినవారు, పోషించుచున్నవారు.

—※—

౧. రా. రా. శ్రీ శ్రీరాజా శ్రీనివాస అప్పారావు బహద్దరువారు.
కపిలేశ్వరపురం జమీందారువారు, నూజవీడు.

,, శ్రీరాజా వెల్లంకి సీతారామారావు బహద్దరువారు,
పోలిశెట్టిపాడు జమీందారువారు, తిరువూరు.

,, శ్రీరాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
ఉయ్యూరువగైరా యెస్టేట్ల జమీందారువారు,
నూజవీడు.

,, జుబ్దతుల్ యకాన్, శ్రీరాజా యినుగంటి రాజగో
పాల వెంకటనరశింహారాయనిం బహద్దరువారు.
కిర్లంపూడి A 2, అన్నదేవరపేట, ప్రక్కిలంక
వగైరా యెస్టేట్ల జమీందారువారు, శనివార
పుపేట, యేలూరు.

,, రావుసాహెబు గుత్తా వెంకయ్య చౌదరిగారు,
భూస్వాములు, పాండురంగ సినిమా మేనేజింగు
ప్రొప్రయిటరు, యేలూరు.

,, యర్రమిల్లి నారాయణమూర్తిగారు, బి.ఏ.,బి.యల్,
అడ్వొకేటు, నర్సాపురం.

,, వల్లూరి వెంకట్రావుగారు, బి. ఏ., బి. యల్.,
అడ్వొకేటు, నర్సాపురం.

,, కీ॥ శే॥ శ్రీపా[illegible] మూర్తిగారు, బి. ఏ.,
[illegible]పురం.

,, గ్రంధి వెంటరెడ్డిగారు, బి. ఏ., బి. యల్.,
వకీలు, నర్సాపురం.

,, తులసి సుబ్బారావుగారు, ఎక్సైజు సబుయిన స్పెక్టరు
నరసాపురం రేంజీ, నరసాపురం.

,, గుడిమెట్ల తిరువెంగళాచార్యులుగారు, భూస్వాములు
మచ్చిపురి, నర్సాపురం.

,, కొప్పర్తి రామచంద్రిరావుగారు, భూస్వాములు,
సీతారాంపురం.

,, పెన్మెత్స సోమరాజు, దాట్ల రామరాజుగార్లు,
డిస్ట్రిక్టుబోర్డు కంట్రాక్టర్లు, మిల్లువోనర్లు,
భూస్వాములు, నరసాపురం.

,, కాకర్ల సత్యబ్రహ్మానందంగారు, భూస్వాములు,
యూనియర్ బోర్డు ప్రెసిడెంటు, నరసాపురం.

,, కీ॥ శే॥ యాతం వెంకన్నగారు, తాలూకాబోర్డు మెంబరు,
భూస్వాములు, వర్తకులు, నరసాపురం.

,, కీ॥ శే॥ కోనూరి వెంకటరెడ్డిగారు, నేటీవుడాక్టరు,
నరసాపురం.

,, కోసూరి వెంకటలింగంగారు' ఎల్. యఫ్.
డ్రాప్పుమెన్, తాడేపల్లిగూడెం.

,, వస్తాదు వెంకటస్వామిగారు, భూస్వాములు,
నేటీవ్ డాక్టరు, నరసాపురం.

,, బెజవాడ కోటిలింగంగారు, భూస్వాములు,
యేలూరు.

,, బోళ్ల సుబ్బారావుగారు, డిస్ట్రిక్టుబోర్డు వైసు [illegible]
టు. టెంపిల్ కమిటీ ప్రసిడెంటు, భూస్వామి
పాలకొల్లు.

, నన్న నారాయణసా [illegible] దరిగారు,
భూ [illegible]

,, శింగంశెట్టి సుందరంగారు, భూస్వాములు,
నరసాపురం.

మ. రా. రా. శ్రీ బెజవాడ పెదరత్తయ్యగారు, భూస్వాములు,
యేలూరు.

,, జవ్వాది లక్ష్మయ్యగారు, యూనియన్‌బోర్డు ప్రెసిడెంటు, తాలూకాబోర్డు మెంబరు, డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, లేండుమార్ట్గేజిబ్యాంక్ ప్రెసిడెంటు, సెకండరీ యడ్యుకేషనలు కౌన్సిల్ మెంబరు, భూస్వాములు, పెనుగొండ

,, పత్తి కామిరెడ్డిగారు, రైసుమిల్లు కంట్రాక్టరు,
మారుటేరు.

, కోసూరి నారాయణస్వామిగారు, భూస్వాములు,
బేంకర్లు, నరసాపురం.

## సహాయులు.

మ. రా. రా. శ్రీ ప్రయాగ సూర్యవరప్రసాదరావుగారు,
భూస్వాములు, నరసాపురం.

,, డాక్టరు, కోసూరి శ్రీరామమూర్తిగారు,
యల్. యం పి. తిరువూరు.

,, డాక్టరు, కోసూరి వనమరాజుగారు, యల్. యం. పి
బంటుమిల్లి, బందరు తాలూకా.

,, డాక్టరు, కోసూరి ఆదినారాయణగారు,
ఎల్. యం పి., నరసాపురం.

మ. రా. రా. శ్రీ మానెం వెంకటరత్నముగారు, భూస్వాములు,
నరసాపురం.

,, మానెం శేషయ్యగారు, సబు మేజస్ట్రీటు,
రాజోలు.

,, అంబటి వెంకటస్వామిగారు, భూస్వాములు,
నరసాపురం.

,, మానెం సాంబయ్యగారు, డిస్ట్రిక్టుబోర్డు మెంబరు,
భూస్వాములు, నరసాపురం.

,, అతికారి చిన్న వెంకటస్వామిగారు, భూస్వాములు
వర్తకులు, నరసాపురం.

,, జక్కం వెంకటస్వామిగారు, భూస్వాములు
వర్తకులు, రుస్తుంబాదా

,, మానెం కృష్ణమూర్తిగారు, భూస్వాములు,
వర్తకులు, పెనుగొండ.

,, బుడ్డిగ వెంకన్నగారు, భూస్వాములు,
వర్తకులు, నరసాపురం.

,, రవుతుల చిన్న కొండలరావుగారు, నేటివు డాక్టరు.
నరసాపురం.

,, కొండూరి నారాయణరావుగారు, ప్రొప్రయిటరు,
శ్రీ వేణుగోపాల రైసుమిల్లు, యేలూరు.

,, కాకరాల సత్యనారాయణమూర్తిగారు,సత్యవోలు
గ్రామమునసబు, భూస్వాములు, పెదపాడు.

,, ముల్లపూడి సత్యనారాయణబ్రహ్మంగారు,
భూస్వాములు, పట్లూరు.

# చందాదారుల కొఱకు విజ్ఞప్తి.

మహాశయులారా!

మన దేశమందు నెలకొని యుండిన యార్థిక దుస్థితిని గమనించి దాదాపు రెండువత్సరములనుండి మా గ్రంథమాల కార్యములను నిలిపియుంచితిమి. సహృదయులగు మా చందాదారులలో ననేకులు మాయామయి మిగతభాగములను పంపుఁడని మాటిమాటికి వ్రాయుచుండుటచేతను, దానిభాగములను పూర్తి పఱచు బాధ్యత మాయం దుండుటచేతను మేమిపుడు మాయామయి యేడవభాగము ప్రకటించియుంటిమి. మఱియుఁ గ్రమము తప్పక 3 మాసముల ఒకగ్రంథము చొప్పున ప్రకటించుటకుఁ దగు నేర్పాటులను గావించియున్నాము. ప్రతిగ్రంథము 250-300 పుటలకు తక్కువ గాకుండ సుందరములగు చిత్రములు గూడ నేర్పాటు గావింపఁబడినది. కావున, చందాదారులు మున్నువలె గ్రంథముల నందుకొనుచు మా గ్రంథమాలాభివృద్ధికిఁ దోడ్పడఁ బ్రార్థితులు.

☞ ముఖ్యముగ గమనింపవలసిన విషయము:—

పుస్తకములను వి. పి. గా పంపుటవలన గ్రంథము 1 కి రు 0—3—0 రు 0—4—0 లు వ్యర్థముగ పోష్టుఖర్చులకింద వ్యయమగుచున్నది. కావున సంవత్సరము చందా రు 4—0—0 లు మాకు ముందుగ పంపినగాని లేక గ్రంథము వెలువడినటుల మేము ప్రకటించిన వెంటనే ప్రతిగ్రంథమునకు రు 1—0—0 చొప్పున మణిఆర్డరుద్వారా మాకందచేసినగాని పుస్తకమును అన్ రిజిష్టరు పార్శిలుద్వారా పంపుచుందుము.

ఇట్లు,

ప్రకాశకులు.

# మాయామహలు

## ఏడవ భాగము.

### ౧

విజయేంద్రసింహ మహీపాలుఁడు తిలస్మనిపాతగృహము నుండి (కుమారమహేంద్రసింహుఁడు మున్నగు వారలు చిక్కియుండిన స్థానము) రోహిణీగడమునకుఁ దరలిపోవు సమయంబున నభయసింహుఁ డాభూరమణునితో నేమియో సంభాషించి వాని వెంట రోహిణీగడమున కేగక నచటనుండి వేఱుపడెనని యాఱవ భాగము దాఁక ప్రకరణమందు లిఖించి యుంటిమి. మేమిపుడచటి నుండియే మాకథ నారంభించి వ్రాయుట సముచితముగఁ దలంచుచుంటిమి.

అభయసింహుఁ డొక పగలును రేయియు నాతిలస్మనిపాత గృహమునకు నలుదెసలఁగల యరణ్యమందుఁ గుప్తసంచారియైయుండెను గాని, యందు వలన వానికెట్టి ప్రయోజనమును జేకూరదాయెను. అతఁడు మఱునాఁడు నట్టి విధంబుననే యాయడవియందు సంచరించుచు నొక పురాతన శివాలయమునొద్దకుఁ బోయిచేరెను. ఆయాలయమునకు నలుదెసల బిల్వపారిజాతాది వృక్షములు దట్టముగను గుబురుగను బెరిగి యుండుటచే నాస్థానమందు శీతలచ్ఛాయ బాగుగ వ్యాపించియుండెను. అభయసింహుఁ డచటి బిల్వవృక్షమునుండి కొన్ని పత్త్రములను గోసి తదాలయమందుఁ జొచ్చి భవానీపతియగు శంకరుని భక్తిపూర్వకంబుగఁ బూజించి మరల

వెలుపలకు వెడలివచ్చెను. తదనంతర మతఁడాయాలయమున కొక తట్టున బ్రవహించుచుండిన నదీతీరమున కేగి యచట నుపవేశించి యిపుడేమి సేయువలెనని యోజింపఁ దొడంగెను. ఆసమయంబున నభయసింహుఁ డొక సాధారణుఁడగు కృషీవళుని రూపంబున నొప్పుచుండెను. ఆతావునకును దిలస్మనిపాతగృహమునకును విశేష దూరము లేదు.

కొంతసేపటికిఁ గొందఱు మనుజులు సంభాషించుచుండిన సవ్వడి వానికి గర్ణగోచర మయ్యెను. ఆపలుకులు విస్పష్టముగఁ దెలియకుండుటచే వారలు కొంత దవ్వున నుందురని యూహించుకొని శిరముపై కెత్తి కాంచునంతఁ గొంత దూరము నుండి యిరువురు మనుజు లాశివాలయము దెస కేతెంచుచుండుట వానికిఁ జూపట్టెను. అభయసింహుఁ డానదీతీరమునుండి లేచి యొకపొదమాటునకుఁ బోయి దాఁగి వారలెచటి కేగుచుండినదియుఁ దెలిసికొను తలంపుతో వారివైపున కనిమేష లోచనంబుల బరికింపసాగెను. ఆమనుజు లిరువురు ధరించియుండిన దుస్తు లజితసింహుని చతురత వలన, నేమనుజు లాతిలస్మనిపాతగృహమందు మూర్ఛాగతులయి పడియుండిరో, మఱియు విజయేంద్రసింహ మహీపాలుఁడు సాధుపుంగవుని (తిలస్మాధ్యక్షుని) సమేతముగ నేమనుజులను బంధించి రోహిణీగడమునకుఁ గొనిపోయియుండెనో యామనుజుల పుట్టంబులతో సరిపోలియుండెను. తత్కారణంబున దామెవరి హేతువుచే రాజ్యధామములను వీడి చెట్టుకుఁ బుట్టకుఁ దిరుగవలసి వచ్చెనో, వీర లాపగతుఁడ పరివారములోని వారని యభయసింహుఁడు దెలిసికొనెను. మఱియు నాయిరువురను గాకపోయినను వారిలో నొక్కనినైనఁ దనచేఁ జిక్కించుకొని తన మాయాజాలమును విస్తరింపఁ జేయువలె నని యతఁడు కృతనిశ్చయుఁడై యుం

# ఏడవ భాగము.

డెను. ఆమనుజు లిరువురుఁ గ్రమముగ నాశివాలయము పొంత
కేతెంచి దానియందుఁ బ్రవేశించుట మన యభయసింహుఁడు
దిలకించెను. దాదాపు రెండు గంటలకాలము గడచినను వార
లామందిరము నుండి మగుడి రాకుండుటచే నభయసింహుఁడు సంశ
యాకులచిత్తుఁడగుచు నాపొదమాటున నుండి వెడలి యాయాల
యము నొద్దకుఁజని దానిలోనికిఁ దొంగి చూచెను. దానియందెట్టి
సవ్వడియు వినిపింపకుండుటచే నబ్బురపాటునొందుచు నతఁడా
గుడియందుఁ బ్రవేశించి శివలింగము సమీపమునకుఁ జని వారిని
వెదక నారంభించెను గాని, యచట నాయిరువురిలో నొక్కరును
వానికిఁ జూపట్టరైరి. అభయసింహుఁడు దివ్యమందిరము లద్భుత
నికేతనము లంతఃపురములు మున్నగువాని నెన్నింటినో పరికిం
చియుండినవాఁడగుటచేఁ గొలఁది గొప్ప వాటి మర్మములనుగూడ
నెఱింగియుండెను. తత్కారణంబున నాయాలయమందొక యంత
ర్భవనముగాని గుప్తమార్గముగాని యవశ్య ముండెననియుఁ దత్కా
రణంబుననే వారలిరువు రాయాలయమునుండి యదృశ్యులై యుం
డిరనియు నతఁడు నిశ్చయించుకొనెను.

అభయసింహుఁడా మనుజు లిరువురుగాని యొక్కఁడుగాని
వెలుపలికేతెంచు దనుక నచట వేచియుండుటకు నిశ్చయించుకొని
తదాలయమున కెదురుగ నొకబిల్వవృక్షముక్రింద వారిరాకను బ్రతీ
క్షించుచుఁ గూర్చుండి యుండెను. ఒక గంటకాలము గడచిన
పిదప నొకఁడా శివాలయమునుండి వెడలి వచ్చుచుండుటఁ బరికించి
తటాలున తన స్థానమునుండిలేచి నిలచెను. పరస్పర మొండొరులను
దిలకించిన తోడనే యభయసింహుఁడు సవినయముగ శిరమును
వంచి వానికి నమస్కరించెను. మఱియు వానితో "అయ్యా! భగ
వంతుఁడు మీకు నిరంతరము శుభముల గూర్చుగాత! వేగమె యరు

డెంచి నాసహోదరుని రక్షింపుఁడు. రక్షింపు"డని మొరబెట్టు కొనెను.

మనుజుఁడు:—నీవెవ్వరవు. నీసహోదరుఁ డెచటఁ గలఁడు?

అభయ:—అయ్యా! నేనొక కృషీవలుఁడను. (చేతితోఁజూపుచు) ఆపాద కావలివైపున నాసహోదరుఁడు గలఁడు. పాపము! వాని నొక ముదుసలి మిక్కుటముగ బాధించుచున్నది. మీరు దైవభక్తులు. ధర్మాత్ములరు. ఎవ్విధంబుననేనియు వానిని గాపాడుఁడు. మేమీకష్టముల ననుభవించుటకే యీవైపున కేతెంచితిమి కాఁబోలు" నని విలపించుచు, "అయ్యా! ఆలసింపకుఁడు. త్వరపడుఁడు. పరాత్పరుఁడు మీకు శుభమునుగూర్పఁ గలఁడ"నెను.

అభయసింహుని వచనముల నాలించినంతనే యామనుజుఁ డాశ్చర్య చకితుఁడయ్యెను. మఱియు నయ్యది యాశ్చర్యకరంబగు విషయమే! కారణంబేమన, నభయసింహుఁడారోగ్య సంపన్నుఁడు గను బలిష్ఠుఁడుగను గనిపించుచుండెను. వానిని గాంచిన వార లట్టి విధంబుననే వాని సోదరుఁడును బలదారుఢ్యములు గలిగియుండు నని తలంపకమానరు. అట్టిస్థితియందు మిగుల బలిష్ఠులగు నిరువురు సోదరుల నొకముదుసలి బాధించుచుండెనను మాట యాశ్చర్యవిష యముగాక మఱియేమి కాఁగలదు?

తుద కామనుజుఁడు గొంతసేపు యోజించుకొని యభయ సింహునితో "మంచిది. నడువుము. ఆముదుసలి యెంతపరాక్రమ శాలినియో కనుగొనియెద"ననెను.

అభయసింహుఁ డామనుజుని తనమాటలయందుఁ జిక్కించుకొని శివాలయమునకుఁ గొంత దవ్వునగల నొకపాదసమీప మునకుఁ దోడ్కొనిచని యచట నిటునటు వెదక నారంభించెను.

మనుజుఁడు:—నీసోదరుఁ డెచటఁ గలఁడు?

అభయ:—వానినేకదా వెదకుచుంటిని.

మనుజుడు:—నీవాతని నెచట విడచివచ్చితివో యది నీకు జ్ఞాపకము లేదా?

అభయ:—అయ్యో! భగవంతుడా! నేనెట్టియవివేకి సహాయము నర్థించితిని! ఓరీ! దుర్మతీ! నాకుజ్ఞప్తిలేనిచో నిన్నితావునకెటులఁ దోడ్కొని వచ్చితిని!

మనుజుడు:—ఓరీ, నీచుఁడా! నీకుఁ దోడ్పడ నేతెంచిన నన్నేలతూలనాడెదవు?

అభయ:—ఛీ! అవివేకుఁడా! నీవవివేకివేకాదు. దుర్మార్గుఁడవు. నీచాధముఁడవు. నీవు స్వయముగా నిన్ను గాపాడుకొనఁజాలనివాఁడవు. ఇఁక నితరుల కెటులఁ దోడ్పడఁగలవు?

ఇవ్వచనంబుల నాలించినంతనే యామనుజుఁడు ప్రబోధితుఁడై యీతండెవ్వఁడో మోసగాఁడని గ్రహించి యభయసింహుని వైపునకు నిదానించి చూడనారంభించెను. మఱియు నతఁడొక మైయారుఁడని వానికిఁ దోచుటతోడనే తనమొలనుండి ఖడ్గమును దూసి వానిపైఁ బ్రహరించెను. అభయసింహుఁ డావ్రేటు నతినేర్పుతోఁ దప్పించుకొనెను. మఱియు నామనుజని మణిబంధమును గట్టిగఁ బట్టుకొని ఖడ్గమూడి క్రిందఁబడునటుల వానిచేయి గట్టిగ విదల్చెను. ఆమనుజుఁడు దనచేతినుండి యడిదము జరి క్రిందఁబడుటతోడనే కోపోద్దీపితమానసుఁడై యభయసింహునిపైఁ గదసెను. పరాక్రమశిఖామణియగు నభయసింహుఁడు వానిని సులువుగ నిర్జించి భూమిపైఁ గూలఁ ద్రోసెను. అతఁ డభయసింహుని విక్రమమునకు బెగడొంది గట్టిగా నఱవనారంభించెను. కాని, ప్రయోజనమేమి? అభయసింహుడు వెంటనే వాని నాసికారంధ్రముల

యందు మచ్చుమందునింపుటచే నతఁడొక తుమ్ముతుమ్మి మూర్ఛాగతుఁడయ్యెను.

అభయసింహుఁ డామార్గమున వచ్చిపోవు తెరవరులు దనకు బాగుగఁ గనిపించుచుండుటకును దానొరుల కంటఁబడకుం డుటకును దగిన పొదరింటి నొకదానిని వెదకి మూర్ఛాగతుఁడై పడియుండిన యామనుజుని గొంపోయి దానియందుఁ బరుండఁబెట్టెను. తదనంతర మతఁడు నలుదెసలఁ గలయఁగని దృష్టిపథమున కెవ్వరుఁ జిక్కకుండుటచేఁ దనలో దానిటుల వితర్కింప సాగెను.

“అకటా! నేనీసమయమున నేకాకినైతిని. నాయనుచరు లెవ్వరేనియు వెంటనుండిన వీనిని రోహిణీగడమునకుఁ బుత్తెంచి నిశ్చింత నా కార్యంబుల నిర్వహించుచుందును. కానిమ్ము! చింత యేటికి? ఇపుడు నాకార్యము సిద్ధించె ననియే తలంపవచ్చును.”

ఇవ్విధంబునఁ దలపోసి యభయసింహుఁడు దన కక్షపాల నుండి సామానులను వెడలించి తనరూప మామనుజునిరూపమువలె నతిజాగరూకతతో దిద్దుకొనెను. తదనంతరము వాని దేహమందలి వస్త్రములను వెడలించి తానుధరించిన పిదప వానిరూపమునుగూడ మార్చుటకుఁ బ్రియత్నింప సాగెను. అభయసింహుఁ డొకానొక మందువలన నామనుజుని మోముపైఁ గొన్ని గాయపు మచ్చలను చిత్రించెను. వానిని గాంచుటవలన నామచ్చ లనేక వత్సరముల నుండి వానిమోమునం దేర్పడియుండిన విధంబున దోఁచుచుండెను అటుపిమ్మట నతఁడు వానిదేహమంతయు నొక విధంబగు మసాలా వలన బూఁత పెట్టెను. దాని నభయసింహుఁడు దన బుద్ధికుశలతవ లన స్వయముగ నిర్మించియుండెను. ఆమసాలాతోఁ బూఁతఁబెట్టఁబ డిన దేహము గాటుకవలె నల్లబాఱి యెన్నిసంవత్సరములు గతించి నను, వన్నెమాఱకుండును. ఆఘాఁతయరఁటియాకురసముతోఁ దక్క

నితరయేపదార్థమును బ్రయోగించినను జెడకుండును. ఆమనుజుని దేహచ్ఛాయ గౌరవర్ణముగలది. కాని, యతఁడిపుడు పూర్తిగ నల్ల నివాఁడయ్యెను. తదనంతర మభయసింహుఁడు వాని రూపమును బాగుగనిదానించిచూచి శిరము నాడించుచు నచటినుండి లేచి నిల చెను. అందువలన నామనుజుని రూపము పూర్తిగ మాఱియున్నద నియుఁ దానికనెట్టి పరిశ్రమయుఁ జెంద నగత్యములేదనియు నతఁడు భావించుచుండినటులఁ దెల్లమగుచుండెను. మఱియు నయ్యది నిక్కువము. ఇతరుల విషయ మెటులుండినను గన్నతల్లియైనను వానిని గాంచి యతఁడు దనకుమారుఁడని గుర్తింపఁజాలదు.

ఆమనుజుని కటిప్రదేశమం దొక కక్షపాలగలదు. అభయ సింహుఁడు దానిని వాని మొలనుండి విప్పి తన కక్షపాలయందలి సామానులను దానియందు జతనపఱచి దానియందుఁగల వస్తువు లను దనకక్షపాలయందునిచి దానిని వాని నడుమున కెప్పటియ టుల బంధించి యచటినుండి బయలు దేరెను.

అభయసింహుఁడు మరల నాశివాలయము నొద్దకుఁజని యొక బిల్వవృక్షముక్రిందఁ గూర్చుండి పాటలను బాడ నారంభిం చెను. సూర్యభగవానుఁ డస్తమించు సమయంబున నాదేవళము నుండి రెండవమనుజుఁడు గూడ వెలుపలకు వెడలివచ్చెను. అతఁడు దన యనుచరుఁ (అభయసింహుఁడు) డొక వృక్షము క్రిందఁ గూర్చుండి పాటలను బాడుచుండుటఁ గాంచి క్రోధావేశుఁడై వడి వడి వాని సమీపమునకేగి కఠోరస్వరంబుతోఁ “గాంచనసింహా! బాగు బాగు! నీవింతదనుక నిచటఁగూర్చుండి సంగీతమును బాడు చుంటివా? నీవు వెడలి యుండిన కార్యమేమాయె” నని వానిని బ్రశ్నించెను.

వాని వచనముల వలన డానెవరిరూపమును దాల్చుకొని

యుండెనో వానినామము గాంచనసింహుఁడని యభయసింహునకు దెలిసికొనెను. ఇఁక నభయసింహుఁడు దన యసలు రూపములోనికి వచ్చుదనుక మేమును వానిని గాంచనసింహుఁడను పేరుతోడనే వ్యవహరించెదము.

కాంచనసింహుఁడు దన యనుచరుని వచనముల నాలించి పాడుట మాని వానితో నివ్విధంబున బలికెను:—

"(రెండుమూడు మారులు దగ్గి)మాట్లాడకుము. నాకుదగ్గు వచ్చుచున్నది. మంచిది! నీవు నాసమీపమునకు వచ్చి కూర్చుండుము. నాకంఠము రుద్ధమగుచున్నది. నేనెంతగఁ బ్రయత్నించినను నాస్వరము చక్కఁబడకున్నది. మనమిరువురము గలసి పాడిన కొంత బాగుపడునేమో, వచ్చి కూర్చుండుము."

"కాంచనసింహా! ఇదియేమి? నీమతి భ్రమసి యుండదు గదా? మహారాణి కార్య మావలకుఁద్రోసి మనమిచటఁ గూర్చుండి పాడుచు నానందింప వలయునా!"

"కొలఁదిపాటి భంగు నాకెంతయో యానందమును గలిగించుచున్నది. బిడ్డా! బ్రతికియుండుము. భగవంతుఁడు నిన్ను గాపాడును. నీయభీష్టములెల్ల దీరగలవు."

"అయ్యో! నీకేమాయెను. మిగుల యోగ్యుఁడవు గదా?"

"యోగ్యత యెపుడు లేకుండెనో మనుజుఁ డపుడే పెద్దవాఁడగుచున్నాఁడు. మంచివాఁడగు చున్నాఁడు. నీలెక్క యేమికలదు! పదునే డేనుగులు జలపాన మొనరించి కూర్చున్నవి. ఆ దురాత్ముఁడు గొంచె మున్నైనను వేయలేదు. చప్పిడి భక్ష్యమే తినవలసివచ్చినది. హి, హి, హి, హి,! రమ్ము. కూర్చుండుము. నీవుగూడ నొక గాడిదను దినుము. కాదు కాదు. పంది మంచిది. కుక్కయగుచో మఱియుమేలు. హి, హి, హి,! ఎంతగొప్ప యాలోచన

దోఁచినది! బిడ్డా! ఐయారితీనమును గావించుచుంటివా? అరకదున్ను
టయే తెలియదు భూతమును బట్టెదలంచుచుంటివి. హి, హి, హి,
భంగింకను నానాలుక బెనవైచుచున్నది. చూడుము! చూడుము!!
(నాలుక శెనవైచి చూపును.)"

"ఆశ్చర్యము!"

"ఇపు డబ్బుర పడుటవలన బ్రయోజనమేమి? కావలసి దే
దియో యయ్యెఁగదా! ఓరీ! నీవిఁక పిండప్రదాన మొసరింపుము.
నీతండ్రి శ్రాద్ధమెపుడు పెట్టెదవు? చింతింపకుము. నేను వెడలి బ్రా
హ్మణార్థము గొందఱను బిలుచుకొని వచ్చెదనులే! నీవు శ్రమనొందఁ
బనిలేదు."

"(శిరమునాడించి) నీకుఁ బిచ్చపట్టెననుట కెట్టినందియమును
లేదు. నీకెవ్వరో మందుఁబెట్టినటులఁ దోఁచుచున్నది."

"నిక్కువము. సందేహములేదు. నీ వీపిచ్చి పరిసంగమును
బూర్తిగఁ గట్టిపెట్టుము. మీలో నేనొక్కఁడను దక్క మిగతవాం
డ్రిందఱుఁ బిచ్చివాండ్రే! ఒకలోటా భంగు రెండువందల మువ్వది
మైళ్ళ పదమూఁడణాల నిపాచేసినది. ఐయారులయోగములొకటా
కటికంటె మించిన పెక్కుచిటకాలు నాకుఁ దెలియును. ఓడ తెర
మెటులెగురుచున్నదో చూడుము. వహ్వా! ఇది యెట్టి యంధకార
బంధురంబగు రాత్రిసమయము! అయ్యారే! సూర్యుఁడస్తమించుచు
న్నాఁడు! నీవుగాదు. నేనుకాదు. మంచిది. నీవే సరి. మంచిబుద్ధిశా
లివి. బుద్ధి, బుద్ధి, బుద్ధి, శాలివి. శాలివి. శాలివి. (కొంచెమునేపూ
రకుండి) అహాహా! ఎంతయద్భుతము. నాపేరు మఱచిపోయితిని.
నా నామము గాంచనసింహుఁడని యిప్పటివఱకు జ్ఞాపకమున్నది.
కాని, యిపుడే మఱచిపోయితిని. నాకుఁ గొంచెమైనను జ్ఞాపకముం
డిన నీశిరముపై నాన, సోదరా! మిత్రమా! సంగడీఁడా! నాపేరే

మిఱెూ కొంచెము వచియింపుము!"

"పశ్చాత్తాపకరము. గదాధరసింహుఁడు దన యనుచరుని జతనపఱపఁజాలఁడయ్యెనని మాయారాణి నన్ను నిందింపక మానదు."

"హీ, హీ, హీ, మిత్రమా! గదాధరసింహా! అ, ఆ, ఇ, ఈ, చ, ఖా, ట, ర, ప, మ............"

"ఇది యేమైయారుని పైశాచికకృత్యమో కావలయును. అతఁడు వీని కేదియో మందు దినిపించియుండును. నాయనుచరుఁడు గాంచనసింహుఁ డున్మత్తుఁడయ్యెననుట కెట్టిసందియమును లేదు. వీనితో విశేషముగ బ్రసంగింపరాదు. వీని కెవ్విధంబుననైనను బోధించి యింటికిఁ దోడ్కొనిపోవుటయే మే"లని తలంచి, గదా ధరసింహుఁడు వానితో, "మిత్రమా! క్రియముగఁ బ్రొద్దు వ్రాలు చున్నది. ఇఁక నింటికిఁ బోవుదము నడువు"మనెను.

"ఇంటికి నడచుటకు నేనాఁడుదాన ననుకొంటివా? అడవికిఁ బోవుదము రమ్ము. పులులను వేటాడుదము. వేశ్యాంగనల నృత్యము దిలకింతము. గీతముల నాలింతము. అన్నియుఁ దీరినపిదప నేను నీశి రమునొద్దఁగూర్చుండి యేడ్చెదను. హీ. హీ. హీ. హీ."

"మంచిది. నీయిష్టము. అడవికిఁ బోవుదము నడువుము."

"ఏమి! అడవికేగుటకు నేను సాధువు ననుకొంటివా? సన్న్యాసి ననుకొంటివా? చాలుఁజాలును. నేనిచటనే యుండెదను. భంగు గ్రోలెదను. ఆనందించెదను. విశ్రమించెదను. నవ్వెదను. ఏడ్చెదను. ఇదియు నడవియే కదా! దీనియందు నినుబోలు గార్దభములను వేటాడెదను. ఎట్టివాటిని? గ్రుడ్డి. గ్రుడ్డి. గ్రుడ్డి. (యిటునటుఁగాంచి) ఏడు, ఐదు, పది, పండ్రెండు, ముప్పదిమూఁడుగంటలు గడచిపోయి నది. ఆదురాత్ముఁ డింతదనుక భంగు తీసికొనిరాఁడాయెను. వాఁడు

పట్టి కట్టిరి. కాని, నిన్ను మించి కాదు. నీవు తుచ్ఛుఁడవు. దుర్మార్గుఁడవు. దుష్టుఁడవు. ఇఁక నేను వారిపీక్కై వేచియుండఁ జాలను. మిత్రమా! నడువుము. ఇంటివైపునకు మోము త్రిప్పుము. నాచేయి పట్టుకొనుము. నాకేమియుఁ గాన్పించుటలేదు.

"బ్రతికి బైటఁబడితి"నని సంతసించుచు గదాధరసింహుఁడు వాని చేయిఁబట్టుకొని మాయారాణి మహలువైపునకు దారి పెట్టెను. భళిర! అభయసింహా! ఉన్మాదుఁడవై నీవెట్టి ఘన కార్యమును సాధింపఁ దలంచుచుంటివి? నీవిపుడెట్టి యసందర్భాలాపముల నాడినను నిన్ను సందేహించుట కెవరికిని సాధ్యము కాదుకదా!

మాయారాణి కాంచనసింహుని మిక్కిలి మన్నించుచుండెను. ఆతఁ డైయారితనమందు మిక్కిలి పేరుప్రఖ్యాతులను బడసియుండెను. తత్కారణంబున వాని నట్టి స్థితియందు విడచి గదాధరసింహుఁ డొంటరిగ నచటినుండి వెడలి పోఁజాలకుండెను. వేషధారియగు కాంచనసింహుఁడు మాయారాణి సముఖమున నుండిన తరుణమున అసలు కాంచనసింహుఁడు భూతవేషమును దాల్చి యామె సమీపమునకు వచ్చిచేరెను. ఆహా! పాఠకమహాశయులారా! మన కాసమయంబున గలుగు నానందమునకు మేరగలిగియుండునా?

కాంచనసింహుని వెంటఁదోడ్కొని గదాధరసింహుఁడు జుమేలియా వైపునకు బయలుదేరెను. మాయారాణియే యారాజ్యమున కధీశ్వరి. ఆమె ప్రపితామహుని కాలమునుండియు వరుసగ నావంశజులే యారాజ్యమును పరిపాలించుచు వచ్చిరి. జుమేలియా నగరమున కెదుట గంగానదీపారమునకుఁ గొంతదవ్వున మిగుల విస్తీర్ణంబగు సుందరోద్యాన మొకటిగలదు. దాని నచటి నివాసులు వసంతోద్యానమను పేరుతో వ్యవహరించుచుందురు. రాజు, రాజకర్మచారులు దక్క నితరులెవ్వరు నాపూఁదోఁటలోని కేగఁ

జాలరు. మఱియు నాయుద్యానవనమునుగూర్చి ప్రజలు పెక్కురూపములగు కథలను జెప్పుకొనుచుందురు. కాని, దాని నిజవృత్తాంతమచట వారికెవ్వరికిని దెలియదు. ఆయుద్యానవనపు గుప్తరహస్యములు రాజకుటుంబములోని వారును బ్రధానియు నైయారులును దక్క నితరులెవ్వరు నెఱుంగరు. మఱియు నారహస్యముల నెఱుంగుట కెవ్వరును బ్రయత్నింపరు. ఆయుద్యానవనమందేయితరమనుజుఁడేనియుఁ జూపట్టిన నతఁడాక్షణముననే చంపఁబడును. ఈనియమము ప్రాచీనకాలమునుండియు వెడలివచ్చుచుండెను. మాయారాణి నివసించుచుండిన నగరదుర్గమునుండి యొకసురంగమార్గము గంగానదీ జలముల కడుగు తట్టుగా నాయుద్యానవనములోనికిఁ గలదు. ఆ మార్గమున మాయారాణి యావనంతోద్యానము లోనికిఁబోయి వచ్చుచుండు సమాచారము ముఖ్యులగు వారికిఁ గొందఱకుఁదక్క నితరులకుఁ దెలియదు. ఆదుర్గోద్యానముల సవిస్తరవృత్తాంతము మాపాఠకమహాశయులు క్రమముగఁ దెలిసికొనఁగలరు. కావున నిచట నావిషయములను విశేషరూపంబున వర్ణించుట కెట్టి యావశ్యకమును గలుగదు. కాని, రమాసుందరిపై మరులుగొని యుండిన జైమినీప్రసాదును, మాధవియు, నాయుద్యానమందలి మాయారాణి దర్బారును బరికించి యుండిరని మాత్రము దెలుపకఁదీరదు.

కాంచనసింహుని వెంటఁదోడ్కొని గదాధరసింహుఁడు జమేలియా చేరువఱకుఁ వాని పిచ్చిచేష్టల వలన నెటులఁ జకితుఁడయ్యెనో, యెన్ని యిక్కట్టులకు బాలయ్యెనో దానిని వర్ణింపనలవిగాదు. మఱియుఁ జదువనేర్చినవారెట్టి పిచ్చివాండ్రగుదురో, దాని యుదాహరణమును గాంచనసింహునివలన నతఁడు బాగుగఁ దెలిసికొనియుండెను. పాప మా గదాధరసింహునకు మాయారాణి భీతియే లేకుండిన కాంచనసింహుఁడు దన్ను జెట్టు

చుండిన యంగదములకు విసువుంజెంది వానిని మార్గమందెచటనో విడచి యుండును.

ఆమఱునాఁడు రాత్రికాలంబున గదాధరసింహుఁడు గాంచనసింహుని వెంటఁదోడ్కొని జుమేలియాదుర్గమందు మాయారాణిని సందర్శించు నభిలాష నచటికేగెను. ఆసమయంబున మాయారాణి వసంతోద్యానమందుండుటఁ దెలిసికొని నిరుపాయుఁడై యతఁడు మరలఁ గాంచనసింహుని వెంటఁదోడ్కొని యాయుద్యానవనము లోనికిఁ బోవలసినవాఁడాయెను. తత్కారణంబునఁ గాంచనసింహుఁ (అభయసింహుఁడు) డుద్యానసురంగమార్గమును బాగుగఁ జూడ గలిగెను. ఆసురంగమం దాయిరువురుఁ బదునైదడుగులదూరము వెడలినపిదపఁ గాంచనసింహుఁడు గదాధరసింహునితో, "మన మీసురంగమార్గమున ననేకమారులు పోయివచ్చితిమి. నేఁడు నీకారణమున నేగవలసివచ్చినది. కాని మరల నెన్నఁడు నన్నీ సురంగములోనికిఁ దోడ్కొని పోరాదు. కానిచో, నిన్ను నమిలి మ్రింగివైచెదను. ఈసురంగమును విధ్వంసము గావించెదను. మంచిది! నీవు నన్నిపుడెచటికిఁ దోడ్కొని పోవుచుంటి"వనెను.

"మాయారాణి సమక్షమునకు."

"అగుచో" నీవు పొమ్ము. నేనచటికి రాఁజాలను. ఈమధ్య నారాణి మనుజులను జంపి తినుచున్నదనువార్తను వినియుంటిని. నీవుగూడ నిన్నటిదినమున మూఁడు గార్దభములను మెసవియుంటి వఁట. మంచిది. నన్ను మాయారాణిచెంతకుఁ బోనిమ్ము. నేనచట నిన్నెటులఁ జకితునిగనొనరింతునో పరికింపఁగలవు. హి, హి, హి, బిడ్డా! నిన్ను జకితునిగ నొనరించిన ప్రయోజనమేమి! మాయారాణినే చకితురాలను నొనరించెదను. హి, హి, హి, హి, ఎంత యానందము. ఎంతయానందము! (చేతిలో కోశము వైచుచు)

"రాముని భజియింపవె మనసా! సీతారాముని భజియింపవె మనసా"యని పాడును.

గదాధరసింహుఁడు గాంచనసింహుని వెంటఁదోడ్కొని మెట్టులో నానురంగమును దాఁటి యాయుద్యానమందుఁ బ్రవేశించెను. ఆసురంగవు రెండవముఖద్వార మాతోఁటయందలి యొక గదిలోనికిఁ గలదు. కాంచన గదాధరసింహులిరువు రాగదినుండి వెడలి తిలస్మరాణియగు మాయారాణి కొలువుకూటములోనికిఁ బోయి చేరిరి. ఆసమయంబున మాయారాణి తన కొలువుమంటపమున నొక యమూల్యరత్నకంబళముపై సుఖాసీనయై తన చెలిమికత్తియలతో సరససల్లాపంబులఁ బ్రొద్దుపుచ్చుచుండెను. ఇపుడా దర్బారు మున్నువోలె యలంకరింపఁబడియుండలేదు. ఇపుడా రత్నఖచితస్వర్ణసింహాసనములేదు. ఆబంగరు కుర్చీలు లేవు. ఆయువతీసిపాయిలచట లేరు. కాంచనసింహునిదృష్టి మాయారాణిపైఁ బ్రసరించుటతోడనే యామె ధరించియుండిన చారుతర యమూల్యరుచిరాంబరములను గాంభీరభావమును గాంచి యా సరసిజాననయే యాయువతీబృందమునకు నాయికామణియని యతఁడు నిశ్చయించుకొనెను.

"కాంచనగదాధరసింహులిరువురను గాంచినతోడనే మాయారాణి కొకవిధంబగు సంతసము చేకూరెను. మఱియు నామె ప్రఫుల్లముఖియై కాంచనసింహునిదెసఁ బరికించి, "ఐయ్యారశిఖామణీ! సమాచారమేమి?" యని ప్రశ్నించెను.

కాంచన:-ఇది యంధకారబంధురంబగు రాత్రిసమయము......

వర్షము హోరున గుఱియుచున్నది. .........మలినమంతయు విచ్ఛిన్నంబగుచున్నది. వగతులు శిరము పైకెత్తుచున్నారు......దొంగ యిలుజొచ్చినాఁడు. ఆఁకలిబాధచేఁ

గడుపు మండుచున్నది. మూఁడుదినములనుండి యాఁకొని యుంటిని......నిన్నటిభోజనమింకను బచనముగాదయ్యెను. నాశిరముపై గొప్ప యంధకారశిల విఱిగిపడినది. తప్పింపుము. అయ్యో! తప్పింపుము. చచ్చితి. చచ్చితి.

తుది మొదలులేని యవ్యక్తంబగు కాంచనసింహుని ప్రత్యుత్తరము నాలించి మాయారాణి కలఁతనొందుచు, "పాపము! వీనికిట్టి స్థితి యేల కలుగుచున్నదని యోజించుచు మరల వానివైపునకుఁ బరికించి, "కాంచనసింహా! నీ వేమిపలుకుచుంటివో నా కిసుమంతయుఁ దెలియకున్న"దనెను.

కాంచన:—అహహా! ఇది యెట్టివింత! కొట్టి చేయి సాచితివి. కత్తి చేతఁబూని కైజారుదెబ్బ తింటివి. పులులకు జగడముకల్పించి గార్దభమును దింటివి. ఉరి తగిలించి దానియందుఁజిక్కుకొంటివి. కొట్టుతోఁ దలగోఁకి నెత్తురు ప్రవహింపఁజేయ దలంచుచుంటివి. రక్షకురాలా! గ్రహింపుము. పుత్రీ! అహహా తుంటరీ! గ్రహించుకొనుము.

ఇవ్వచనంబుల నాలించి మాయారాణి మిక్కిలి కలఁతనొందుచుఁ దదేకదృష్టి కాంచనసింహుని మోమువైపునకుఁ బరికింపఁ దొడంగెను. అంత గదాధరసింహుఁడల్లన మాయారాణి సమీపమునకేగి నెమ్మదిగ నామెతో" మహారాణీ! వీనికి బిచ్చమెత్తి యున్నదని ఖేదపూర్వకంబుగ మీతో విన్నవింపవలసి వచ్చినది. అయినను వీనిపిచ్చి యంత తీవ్రమైనదికాదు. కరపాదములకు సంకెళ్లను దగిలించునట్టి యావశ్యకమెద్దియుఁ గలుగదు. ఈతఁడెవరికెట్టి బాధను గలిగించుటలేదు. ఊరక వదరుచుండును. తనవారు పెరవారను వివక్షత వీని కించుకేనియులేదు. అప్పుడప్పుడు బాగుగఁ దెలివిగలిగి మాట్లాడుచుండును. విజయేంద్రసింహుని

వైద్యులలో నెవ్వఁడో వీనిని వంచించి యేదియో మందుఁ దిని పించియుండు" ననెను.

మాయారాణి:—మీయిరువుర కెచట నెటుల నెడబాటు సంభవించినది! ఏమి తొందరియున్నది. ఆవృత్తాంతము సవిస్తరముగ నెఱింగించిన నేమైనను దెలియఁగలదేమో! వేగమె వచియింపుము!

గదాధర:—మొదట వీని విషయమున దగు నేర్పాటులను గావింపవలసి యున్నది. పిదప సర్వమును దేటతెల్లముగ వివరించి తెలిపెదను. వెంటనే భిషగ్వరుని పిలిపించి వీనికిఁ దగు చికిత్సను జేయించు టావశ్యకము.

కాంచన:—మీరిరువు రేమి గుసగుస లాడుచుంటిరి! ఆఁ. తెలిసినది గదాధరసింహుడు నాపై నేవియో కొండెములను బలుకుచుండనోపు. (గట్టిగానఱచుచు) మహారాణీ! రక్షింపుము. రక్షింపుము. ఈతులువ గదాధరసింహుఁడే నన్నుజంపి యున్నాఁడు. ఈతఁడే విషము ద్రావించి నాయుసురులను దీసియున్నాఁడు. నేనిపుడు జీవించియుండలేదు. నేను మరణించి భూతమునై యిటకువచ్చితిని. నేను కాంచనసింహుఁడనుగాను. వేతాళుకండను. నీపై నొట్టు బెట్టుకొనుచుంటిని. అహో! ఎంతటి అన్యాయము-ఎంతటి దారుణము-ఎంతటి యమానుషము. ఎవరు సదాచార సంపన్నులనుబట్టి బాధింతురో యట్టి వారిని భగవంతుఁడు ......... నీవేగ్రహించుకొనుము.

మాయారాణి:—పాపము. వీనికెట్టిదుర్దశ సంభవించినది! గదాధర సింహా! నీవే తనకు విషము ద్రావించితివని నీపై రెత్తియితఁడుపలుకుచున్నాఁడు గదా! ఇది యేమిటి?

గదాధర:—తిలస్నరాణీ! వీని యవస్థయే యిపుడు చూచియున్నది. పాపము. వీని వచనములు నాకించుకేనియుఁ గ్రోధము జనింపఁజేయఁ జాలవు.

మాయారాణి:—మనము వీనిని గడుజాగ్రత్తగఁ గాపాడవలసి యున్నది. నీవు వెడలి వెంటనే మన భిషగ్వరుని తోడ్కొనిరమ్ము.

గదాధర:—చిత్తము. అటులనే కావించెదను.

మాయారాణి:—(కాంచనసింహునితో) ఓయీ! నీవు నా సమీపమునకు వచ్చి కూర్చుండుము. నీదేహారోగ్య మెటులున్నది?

కాంచన:—(మాయారాణిని సమీపించి కూర్చుండి) ఆరోగ్యము. ఆరోగ్యము. ఉన్నది. చాలావున్నది. మంచిది. ఔను సరియె!

మాయారాణి:—నీవెవ్వరవో నీవెఱుంగుదువా?

కాంచన:—ఆఁ. బాగుగ నెఱుంగుదును. నేను మహారాజరాజశ్రీ రాజకంఠీరవ శ్రీవిజయేంద్రసింహ మహీపాలు (కొంచెము యోజించి) కాదుకాదు. అతఁడిపుడు వృద్ధుఁడయియున్నాఁడు. నేను కుమార మహేంద్రసింహుఁడ నయ్యెదను. అహహా! అతఁడెంతటి సుందరాకారుఁడు! వానిరూపురేఖా విలాసంబుల బరికించిన యేమత్తకాశిని వానిపై మరులు గొనకుండును? కావున నేనిపుడు కుమార మహేంద్రసింహుఁడ నయ్యెదను. (కొంచెము యోజించి) ఇదియును సరికాదు. అతఁడింకను బాలుఁడు. వానికైయూరితనమే తెలియదు. ఐయారితనము లేనిదే నాకొక క్షణకాలమైనను దోచదు. ఆఁ. ఔను. నేనభయసింహుఁడ నయ్యెదను

బాగు బాగు. ఇదిమిక్కిలి బాగుగనున్నది. ఇదియే స్థిరము. నిశ్చయము మహారాణీ! ప్రిలు నన్నభయసింహుఁడని పిలుచుచుండుటకు వెంటనే డండోరా వేయింపుము. ఆలసింపకుము.

మాయారాణి:—(నవ్వుచు) అటులనే కానిమ్ము. నేనుకూడ నిన్న భయసింహుఁడని పిలుచుచుందును.

కాంచన:—ఇదియే సరి. ఇదియే సమంజసము. దినమంతయు నాఁకటిబాధ పీడింపఁబడుచుండిన వాని కెట్టి యానందము చేకూరఁగలదో యట్టి యానందమే నిన్ను గొలుచువానికిఁ గలుగుచున్నది. మొలబంటిలోఁతు నీటియందు మునిఁగి చచ్చుటవలన నెట్టిముదము చేకూరఁగలదో యట్టి ప్రమోదమే నిన్నుఁ గొలుచువానికి లభించుచున్నది.

మాయారాణి:— (నివ్వెరపడుచు) కాంచనసింహా! ఇది యేమిటి?

కాంచన:—(శిరము మోదుకొనుచు) నాకర్మము. కర్మము. కట కటా! నేనెట్టి యవివేకిని, యజ్ఞానురాలిని కొలుచుచుంటిని? అట్టిజీవితము సరియైనదికాదు. అట్టి రక్తమాంసములవలని బ్రయోజనమేమి? నామాటల నెంతవఱకు గ్రహింపఁజా లవో, యెంతదనుక నాయభిలాష దీరదో, యంతదనుక నే నెవ్వరితోడను మాటలాడను. పలుకరింపను. నిద్రింపను. ఒకటిగాదు, రెండుగాదు, నాలుగుగాదు. వేయి. అయిదు పండలు. పెద్దనున్న-ప్రమైననేమి? నేను చూడక మానను. చూచెదను. చూ చెదను.

మాయారాణి:—నీవేమి చూచెదవు?

కాంచన:—నేను చెప్పను. నీవే గ్రహించుకొనుము. లేక యూర కుండుము. అభ్యంతరమేమియు లేదు. ఎట్టియడ్డంకియుఁ

గలుగదు.

మాయారాణి:— కాంచనసింహా! పోనిమ్ము! అదియెట్టిదో కొం
చెము వచియింపరాదా!

కాంచన:—(గహింంచుకొనుము. ఊహింంచుకొనుము.

మాయారాణి:—నీవు చూడని పదార్థమెట్టిది?

కాంచన:—చూచితిని. కాని, బాగుగఁ జూడవలెను.

మాయారాణి:— ఏమిచూడవలెను?

కాంచన:—గ్రహింంచుకొనుము.

మాయారాణి:—(కొంచెముగోపముతో) అదియేదియో కొంచెము
చెప్పెదవా? లేక యిటులనే వదరుచుండెదవా?

కాంచన:—మంచిది. ఒకయక్షరము మాత్రము చెప్పెదను.
గ్రహింంచుకొనుము.

మాయారాణి:—మంచిది. వచియింపుము.

కాంచన:—బం, బం, బం, బం, బ, బ, బ, ......"

మాయారాణి:—(నవ్వుచు) బంధితులను గాంచెదవా?

కాంచన:—అదియే! అదియే!!

మాయారాణి:—నీవు వారినిఁ జూచియుంటివి. మీరలేకదా వారిని
పట్టి బంధించినది!

కాంచన:—మరలఁ గాంచెదను. నమస్కరించెదను. నృత్యమాడిం
చెదను. తే, త్తై, త్తై, తోం,తోం,(లేచి గంతులువైచును.)

మాయారాణి కాంచనసింహు నధికముగ మన్నించుచుం
డెను. అతఁడే మాయారాణి మైయారులందఱిపైనను సర్దారుఁడు.
మఱియు వాస్తవమం దతఁడు మిగులఁ జులుకరియగుటయే కాక
మైయారితనమునం దసమానపండితుఁడు. ఈసమయంబున నతఁ
డున్మత్తుఁడై యుండినను మాయారాణికి వానిపై విశేష దయాదృ

ష్టిగలదు. మాయారాణి నవ్వుచు లేచి నిలిచి కాంచనసింహుని
కరమును బట్టుకొని సురంగమార్గముగల గదిసమీపమునకు వానిని
దోడ్కొనిపోయెను. మఱియు దాని ద్వారమును దెఱచి కాంచనసిం
హునితో దానియందుఁ బ్రవేశించెను. ఆసురంగమందుఁగల కొన్ని
కాఁచగోళములయందు సుగంధతైలపుదివ్వెలు వెలుగొందుచుం
డెను. ప్రకాశము నలుగడల వ్యాపించియుండెను. మాయారాణి
యాసురంగమం దేబదియడుగులదూరము నడచినపిదప నచట
నిలచెను. ఆస్థానమందలి గోడ యందొక యలమారు గలదు.
మాయారాణి మొలయందలి బంగరు గొలుసునం దొక తాళపుఁ
జెవులగుత్తి వ్రేలాడుచుండెను. మాయారాణి యాగుచ్ఛమును
మొలనుండి వెడలించి దానియందలి యొక తాళపుఁజెవితో నా
యలమారు తలుపులను దెఱచెను. దానిలోనికిఁ గాంచుటవలన
గ్రిందికి దిగిపోవుటకుఁ గొన్ని తంతియలు నిర్మింపఁబడియుండుటఁ
గాంచనసింహుఁడు కనుగొనెను. దానిలోపలను నొక గాజుకుప్పె
యందు దివ్వె యొకటి వెలుగొందుచు నాస్థానమంతయుఁ బ్రకాశ
వంతముగ నొనర్చుచుండెను. మాయారాణి కాంచనసింహుని వెం
టఁదోడ్కొని యామెట్లమార్గమున గ్రిందికి దిగెను.

కాంచనసింహుఁడిపు డినుపగజములతో ద్వారము లమర్చఁ
బడియుండిన పెక్కుగదులుగల స్థానముయెదుటఁ దాను నిలచియుం
డుటఁ దెలిసికొనెను. ఆగదుల ద్వారములన్నియు దృఢంబగు బీగ
ములవలన బంధింపఁబడియుండెను. వాటియందు శృంఖలములవలన
వివశులై దుఃఖోదాసీనలతోఁ గూర్చుండియుఁ బరుండియునున్న
బంధితులు కొందఱు చూపట్టుచుండిరి. ఆగదులన్నియు గోళాకార
ముగ నిర్మింపఁబడి యుండుటచే వేర్వేఱు గదులయందు బంధింపఁ
బడియుండినను బంధితు లొండొరులతో సంభాషించుట కనువు

గలిగియుండెను.

కాంచనసింహుని తొలిచూ పజితసింహునిపైఁ బడెను. వానిని గాంచుటతోడనే కాంచనసింహుఁడు వికటాట్టహాసమొన రించి నలుదెసలఁ బరికించుచు నేమేమియో వదర నారంభించెను. కాని, యవి మాయారాణి కించుకైనను దెలియవాయెను. కాంచ నసింహుఁడు మాయారాణిదెసఁ బరికించి, "ఛీఁ, ఛీఁ! నన్నీదురా త్ములయెదుటి కేల తోడ్కొనివచ్చితివి? నేను వీరి రూపములఁజూడ నొల్లను. నేను 'బం' మాత్రము చూచెదను. 'బం' చాలును. మఱే మియు నవసరములేదు. నీవిచట నెంతసేపు నిలచినను నేనొక క్షణ కాలమైనను నిలువఁజాలను. 'బం' చూచెదను. 'బం' చాలును.

కాంచనసింహుఁడు 'బం' 'బమ్మ'ని వదరుచు నచటినుండి పారిపోయెను. మఱియుఁ దాను మాయారాణిని మొదట గలిసికొ నిన స్థానమునకుఁబోయి కూర్చుండెను. కాంచనసింహుని యా కా ర్యాచరణమునుగాంచి మాయారాణి మిక్కిలి తొట్రుపడుచు వడి వడి మెట్లపై నెక్కి కారాగృహద్వారమును బంధించి తనస్థానము నకుఁబోయి చేరెను. మఱియు నచ్చోటఁ గాంచనసింహుఁడు పెద్ద పెద్ద నిట్టూర్పులఁబుచ్చుచుఁ గూర్చుండియుండుట నామె కనుగొ నెను. మాయారాణి చెలిమికత్తెలును నచటఁ గలరు. వారినెల్లర నచట విడచియే యామె కాంచనసింహుని చేయిపట్టుకొని కారా గృహమునొద్దకుఁ దోడ్కొని పోయియుండెను.

మాయారాణి కాంచనసింహునితో, "నీవటులేల పరుగిడి పోయితి"వని ప్రశ్నించెను. అతఁడామె ప్రశ్నమున కేమియు బదులు పలుకక వెఱ్ఱిచూపుల నలుదెసలఁ బరికింపఁదొడంగెను. మాయా రాణి మరల మరల వానిని ప్రశ్నించెను. కాని యతఁడు మితిలేని మౌనమును దాల్చియుండెను. ఆసమయంబున వాని నెవ్వరేనియుఁ

గాంచిన నతఁడు చెవిటివాఁడనియుఁ బుట్టుమూఁగయనియుఁ దలం పక మానరు. మాయారాణి చెలిమికత్తెయలును బరిచారికలును వానిని పలుకరించుటకుఁ బెక్కుభంగుల బ్రయత్నించి చెక్కుచెదరిరి. కాని, యతఁడెన్నిట నోరు దెఱవఁడయ్యెను. మాయారాణి కాంచనసింహునకు సంభవించిన యాకస్మికదురవస్థను దలపోయుచు నొకగంటకాలమువఱకుఁ గడపెను. అంత నొక భిషగ్వరుని వెంటఁదోడ్కొని గదాధరసింహుఁడచటికి వచ్చిచేరెను. ఆ భిషగ్వరుని వయస్సెనుబదివత్సరములకుఁ బైఁబడియుండెను.

ఆభిషగ్వరుఁడాయపూర్వోన్మాదుని పరీక్షించి, "వీనికేదియో తీవ్రమగు మందొసఁగఁబడియున్నది. దానిప్రభావమువలననే యితఁడిటులఁ బిచ్చివాఁడయ్యెను. వెంటనే వీనికిఁ దగు చికిత్స గావించిన రెండుమూఁడుదినములలో నారోగ్యవంతుఁడు గాఁగలఁ" డని వారికెఱింగించెను. తదనంతర మావృద్ధభిషగ్వరుఁడు మాయారాణివలన నాజ్ఞాపింపఁబడి కాంచనసింహున కౌషధచికిత్సఁ జేయుటకుఁ దన సంచికట్టునుండి యొక మణిమయసంపుటమును వెడలించెను.

ఆ యపూర్వోన్మాదుని పరీక్షించుటయందాభిషగ్వరున కెట్టి కష్టమును గలుగలేదు. కాంచనసింహుఁడును దనచేతి నాడిని జూపుట కెట్టియాటంకమును బెట్టలేదు. తుదకా వెజ్జు స్వయముగ వానినోట నొక వటికను విడువ నతఁడు దానిని మ్రింగివైచెను. ఆ ధూర్తోన్మాదుఁడావటికను మ్రింగెనని యెల్లరు భావించునట్లు లభినయించెను గాని, యతఁడు దానిని తన దంతములక్రింద దాఁచియుంచి కొంతసేపయినపిదప నెవరికెట్టి సందేహ మొదవకుండ దానిని నుమిసివైచెను.

కాంచనసింహుఁ డొక ఘోరగంటకాలముదనుక నిటునటు గంతులువైచి తటాలున భూమిపైఁ గూలఁబడెను. మఱియుఁ దెల్ల వాఱుదనుక నవ్విధంబుననే యచటఁ బడియుండెను. వైద్యరాజు వానినాడి బరీక్షించి, "నేనిపు డొసంగియుండిన యౌషధప్రభావము వలన వీనికిపుడు మూర్ఛగలిగియున్నది. ఇతఁడు స్వయముగ లేచు దనుక వీని నెవ్వరుఁ గదల్పరాదు. ఇతఁడు గన్నులు తెఱచినతో డనే బాగుగ మాట్లాడఁగలఁడని" పలికెను. కాంచనసింహుఁ డేమియు నెఱుంగని వానివిధంబున నాచికిత్సకుని పలుకుల నాలిం చుచుండెను. కాంచనసింహుని కనిపెట్టియుండుటకుఁ గొందఱ పరి చారికలను నియమించి మాయారాణి తన శయ్యాగారములోనికేగి యొక మృదులతల్పముపైఁ బవళించెను.

సూర్యోదయముగాకమున్నె మాయారాణి శయ్యనుండిలేచి కరపదప్రక్షాళణ మొనర్చి కాంచనసింహుఁడు పడియుండిన తావు నకుఁ బోయిచేరెను. గదాధరసింహుఁ డంతకుఁబూర్వమే నచటి కేతెంచియుండెను. మాయారాణి తనసమీపమున కరుదెంచి కూర్చుండిన సమాచారమును గ్రహించి కాంచనసింహుఁడు రెండు మూఁడు మాఱు లిటునటుఁ బక్క పొర్చి లేచికూర్చుండి యబ్బు రముగూడిన చూపులతో నలుదెసలఁ బరికింపసాగెను.

మాయారాణి:—కాంచనసింహా! నీదేహారోగ్య మెటులున్నది?

కాంచన:—నే నేమని వచియింతును! నే నిచటికేల యరుదెంచితి ననియు నాకంఠస్వర మిటులేల రుద్ధమగుచుండెననియు నాశ్చర్యచకితుఁడ నగుచుంటిని. మఱియు నా దేహమంతయు సూదులు గ్రుచ్చినటుల నొచ్చుచు స్వాధీనము తప్పియుం డినటుల మిక్కిలి నిస్సత్తువ దోచుచున్నది.

మాయారాణి:—నీకింతకుఁబూర్వము పిచ్చ యెత్తియున్నది. ఆ

దయామయుండగు పుండరీకాక్షుఁడైనలేని యక్కాటికమూని నీప్రాణములను కాపాడియుండెను. మఱియు నొక్కమాత్ర వలననే యమోఘంబగు గుణము నొసంగెడు దివ్యౌషధ మును నొసంగిన యా భిషగ్వరుఁడు ప్రశంసకుఁ బాత్రుఁ డగుటయేగాక బహూకరింపఁదగినవాఁడు. మంచిది. ఇఁక నీ వృత్తాంతమెఱింగింపుము. నీకిట్టిస్థితి యేలకలిగినది?

కాంచన:—(గదాధరసింహుని వైపునకుఁ బరికించి) నేనొక వైయాడుని మాయావాగుర దగుల్కొంటిని. కాని, నీవు నన్నిచట నెట్టిస్థితియందుఁ బరికించియుంటివో మొదట దాని నెఱింగింపుము.

గదాధర:—మిగతకార్యమును దీర్చుకొని నీవు జుమేలియాకు వెడలిపొమ్మనియు, నేను మృగాంకవతిని గలసికొని సానునయ వచనంబుల నామెను ప్రసన్నురాలినిగ నొనరించి యిటకుఁ దోడ్కొనివత్తుననియు డెలిపి, నీవా నిపాతగృహతక్షానా నుండి వెడలియుంటివిగదా? అనంతరము నేనాకార్యమును దీర్చుకొని సురంగము వెలుపలకు వెడలితిని. మఱియు శివాలయమునకెదుట నొక వృక్షముక్రింద విచిత్రస్థితి నీవు కూర్చుండియుండుటఁ బరికించితిని. (అతఁడు గావించియుండిన పిచ్చిచేష్టలను, వానివచనములను జుమేనియా చేరువ ఱకు జరిగిన యద్భుతవిషయములను సాంగోపాంగముగ వివరించి తెలిపి) నీవు మృగాంకవతిచెంతకుఁ జనియుండలేదని తలంచెదను.

కాంచన:—(మాయారాణితో) నేనిపుడు వంచింపఁబడిన విధంబున నాజీవితమందింతదనుక నెన్నఁ డెవరివలనను బ్రతారింపఁ బడియుండలేదు. గదాధరసింహుఁడు వచియించిన విషయ

ములన్నియుఁ దగ్ధములు. నే నెపుడు సురంగమార్గమున శివాలయము వెలుపల కేగితినో, యపుఁడొక సాధారణుఁ డగు కృషీవలుఁడు నాదృష్టిపథమునకుఁ జిక్కెను. అతఁడు నన్ను గాంచుటతోడనే పాదములపైఁబడి గద్గదికస్వరంబుతో, "మహాశయా! ఎవ్విధంబుననైనయు నాసోదరుని ప్రాణములను గాపాడుఁ"డని ప్రార్థింపసాగెను. "నీసోదరున కెట్టి యాపద సంభవించె"నని నేను వానిని ప్రశ్నించితిని. నా ప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగ నతఁడు "అయ్యా! నాసహోదరుని యొకముదుసలి కొట్టుచు మిక్కుటముగ బాధించుచున్నది. వాని నెవ్విధంబుననైన దాని హస్తగతమునుండి తప్పింపు"డని యతిదీనతతోఁ నన్ను బతిమాలఁదొడఁగెను. నేను వానివచనముల కక్కజపడుచు, "యిది యెట్టివింత! ఆవృద్ధురా లెంతదిట్టరి? ఇట్టి బలసంపన్నులగు నరవరు సోదరులను బీడించుచున్నదని తలపోయఁదొడంగితిని. ఎట్టకేలకు నేను వాని వెంట నేగుట కుద్యుక్తుఁడ నైతిని. అతఁడు నన్ను శివాలయమునకుఁ గొంతదవ్వునఁగల నొక పాడరింటిలోనికిఁ దోడ్కొని పోయెను. ఆచటఁ బెక్కుఁలు మనుజులు దాఁగి కూర్చుండియుండిరి. నన్ను గాంచుట తోడనే వారలచటనుండి లేచి నాలుగువైపులనుండి ముట్టడించి నిలచిరి. వారిలో నొకఁడొక రజిత పాత్రను నాకుఁజూపి, దీనియందు భంగు గలదు, దానిని గ్రోలు"మని పలికెను. నన్నటకుఁ దోడ్కొని పోయినవాఁడు సక్కవముగ నొక కృషీవలుఁడు గాఁడనియు నతఁడొక మైయారుఁడనియు గ్రహించి, నేను దానిని గ్రోలుటకు నిరాకరించితిని. వాటీకము నచటినుండి పారిపోవుటకుఁ దలంచితిని. కాని, వారలు నన్నొక యుదు

గైనను ముందునకుఁ బెట్టనీయరైరి. పగతురు దాదాపిరు వదిమందెనఱకు నుండుటచే వారిని నే నేమియుఁ జేయఁజాలనైతిని. తుదకు వారలందఱుఁ గలసి నన్నుఁ బట్టుకొని భూమిపైఁగూలఁద్రోసి మోదదొరఁకొనిరి. నేనెపుడు వివశుఁడనైతినో యపుడు వారలు బలాత్కారపూర్వకంబుగ, భంగో లేక మఱి యేదైన పదార్థమో నాకుఁ బట్టించిరి. అటుపిమ్మట నేమిజరిగియుండెనో యది నా కిసుమంతయుఁ దెలియదు."

కాంచనసింహుఁడు గొంతసేపటివఱకుఁ బలువిధంబులగు నద్భుతసమాచారములను దన నేర్పుపెంపున వివరించి తెలిపి, మాయారాణి మానసమునకు ముదం బొడఁగూర్చెను. తదుపరి నామెతో, "నా దేహారోగ్యము చెడియున్నది. కొంతసేపటివఱకు నే నీయుద్యానమందు సంచరించు టుచితముగఁ దలంచుచుంటిని. కాని, యేమిసేయుదును? మిగుల నశక్తుఁడనైయుంటిని. స్వయముగ దీనియందుఁ గుఱిమ్మరివచ్చుటకు నాకు సాహసము గలుగ" కున్నదనెను. అంత మాయారాణి వానితో, "భీతిల్లఁ బనిలేదు. నీయనుచరుఁడు గదాధరసింహుఁడు నిన్నీకోటయందుఁ ద్రిప్పి తీసికొని రాఁగలఁడు. ఈసింగారపుఁగోటయందలి నిర్మలవాయువును బుష్పసుగంధమును నీకుఁ గొలఁది గొప్ప లాభమును సమకూర్పఁగల"వని పలికెను.

తుదకుఁ గదాధరసింహుఁడు గాంచనసింహుని చేయిఁబట్టుకొని యాయుద్యానవనమెల్లను వానిని బాగుగఁద్రిప్పెను. ఈనెపంబున నభయసింహుఁడా యుద్యానవనమును నచటి మందిరములను బాగుగఁజూడఁ గలిగెను. కొంత తడవందు విహరించిన పిదప గదాధరసింహుఁడు గాంచనసింహుని మరల మాయారాణిసమీప

మునకుఁ జేర్చెను. అంత నొకప[illegible]చారిక యచటికే తెంచి, కరము లను జోడించి, "తిలకమ్మమహారాణీ [illegible] ఎవ్వఁడో యొకఁడు దమ దర్శనాభిలాషియై యరుదెంచి, ద్వారము[illegible] నిలచియున్నాఁడు. విక్ర తాకారుఁడు. కాటుకకంటె మిగుల [illegible] దేహముగలవాఁడు. అతఁడు దాను కాంచనసింహుఁడననియు [illegible] దన్నొకయైయ్యారుఁడో వంచించి, తన దేహమంతటను రంగుఁ బ్రాసి[illegible]యుండెననియు, నది యెంతప్రయత్నించినను వదలిపోకున్నదనియుఁ బల[illegible]చుండె"నని, విన్నవించెను.

మాయా:——ఏమి! ఆశ్చర్యము! ఐయ్యారునివలనఁ బూయఁబడిన రంగు తొలఁగిపోకున్నదను విషయము నేఁడు క్రొత్తగ విన వచ్చినది. రంగులయందు గాజువాలవిరంగులు గలవు. కాని, వేనినైనను నైయ్యారులు సహజముగఁ దొలఁగింపఁ గలరు. (నవ్వి) తన దేహమందుఁ బూయఁబడినరంగును వెడలింపఁజాలకుండ టకుఁ గాంచనసింహుఁ డంత తెలివి హీనుఁడు గాఁడు.

కాంచన:——తాళుఁడు! తాళుఁడు!! నన్నువంచించి బలాత్కారపూర్వకముగ భుజ ద్రావించిన ఘూర్తుఁడు వాఁడే కావల యును. (పరిచారికవైపునకుఁ బరికించి) వానిమోముపై గాయపుమచ్చ లెవ్వియేనియుఁ బొడగట్టుచున్నవా?

పరిచారిక:——ఔను. కొన్ని గాయపుమచ్చలు గలవు. కాని, యవి చాల పురాతనపుమచ్చలవలెఁ జూపట్టుచున్నవి.

కాంచన:——వాని కనుబొమల సమీపమునగూడ నొకగాయపు మచ్చ యుండెనా?

పరిచారిక:——ఔను. ఒకయడ్డుమచ్చ గలదు. దానివలన నతఁడెన్నఁడో లాటీదెబ్బఁ దినియుండినటులఁ దోఁచుచున్నది.

కాంచన:—చాలును! చాలును!! వాఁడేవీఁడు. చూడుము! వాఁడు పారిపోఁగూడదుసుమా! కాంచనసింహుఁడిచటికి వచ్చి చేరి యుండెనని వాఁడెరుఁగఁడు గాఁబోలు. (మాయారాణి వైపునకుఁ బరికించి) ఇచట నొక తెరనుగట్టించి వానిని బిలిపింపుఁడు. నేనుగూడ తెరచాటున నుండెదను. గదాధరసింహుఁడు దెస వెలుపల నుండఁగలఁడు. వాఁడు వీనినిగాంచి గుర్తించునో లేదో కనుగొందము.

మాయా:—(పరిచారికవైపునకు బరికించి తెరకట్టుట కాజ్ఞాపించి) వానిని నియమానుసారముగ నేత్రములపై వసనమునుగట్టి యిటకుఁ దోడ్కొనిరమ్ము.

పరిచారిక:—అతఁడిచటి హద్గానవాలన్నింటిని పూర్తిగఁ దెలుపుచున్నాఁడు.

కాంచన:—అగుచో, నతఁడొక గజదొంగయై యుండును. అతఁడిచటి కెపుడైన వచ్చియుండిన యాశ్చర్యమేమియుఁ గలదు? మంచిది! మీరు మీనియమమును బాటింపుఁడు.

ఆజ్ఞయైన వెంటనే పరిచారిక లచట నొక తెరనుగట్టిరి. ఎవతె కాంచనసింహుని సమాచారమును గొని తెచ్చియుండెనో యాపరిచారిక వానిని దోడ్కొని వచ్చుటకు మరల సింహద్వారమువైపున కేఁగెను. మఱియు వానిని వెంటఁదోడ్కొని యచటికి శీఘ్రముగ మగుడివచ్చెను.

ఇచట నాయుద్యానముయొక్క కొలఁది వృత్తాంతమును లిఖించుట మావిధ్యుక్త ధర్మముగఁ దలంచుచుంటిమి. అది నూట యిరువది యకరముల వైశాల్యము గలిగి దృఢప్రాకారముల మధ్య గలదు. దానికి నలువైపులఁగల ప్రాకారములు మిగుల సుదృఢములై దాదాపు పుష్పదిహ్మైదడుగుల యెత్తుగలిగి యుండెను.

ఆగోడల పైభాగమందు మిగుల వాఁడిగల యినుప కంటకములును గాజుముక్కలును బొదుగఁబడి యుండెను. ఎంతటి నిపుణుఁడగు వైయ్యారుఁడైనను నాగోడలను దాఁటి యాతోఁటలోనికిఁ బోవుటకు సాహసింపఁజాలఁడు. ఆ ముండ్ల కారణమున నాగోడపై నిత్రంసమును విసరుటకు వీలుగలిగియుండినను నాకంటకములు మిక్కిలి పదనుగలిగి యుండుటచే వాని (తోడ్పాటునఁ బ్రాకారముపై నెక్కుట మిక్కిలి కష్టసాధ్యమే కాక యసంభవము. ఆ నాలుగుప్రాకారములకు మధ్యగలభూమిఁ (మనము దేనిని యుద్యానమని వ్యవహరించుచుంటిమో) నాలుగుభాగములుగ విభజింపఁబడియుండెను. తూర్పువైపున మిగుల రమ్యతరంబగు సింహద్వారముగలదు. ఆ ద్వారములోపల మొదటి భాగ మనందగు నాతోఁట భూమియంతయు నిటికసున్నముతో గప్పఁబడి పాఁగచ్చు చేయఁబడి యుండెను. పశ్చిమదిశయందనఁగా నీభాగమున కంతమం దిరువది మూరలు వెడల్పును నంతకంటె నెత్తునుగల నొకగోడ తోఁట వెడల్పు మేరకుఁ గలదు. సిపాయిల కుపయోగార్థము దానిక్రిందఁ బెక్కుగదులు నిర్మింపఁబడియుండెను. మఱియు నాగోడపై నెక్కుటకు మిక్కిలి సొంపగు సోపానపరంపరలు గలవు. దానిపైకిబోవుటవలన నాతోఁటయొక్క రెండవభాగము బాగుగఁ జూపట్టుచుండును. మఱియు నా సోపానములమీఁదుగనే యాగోడపై నెక్కి యావలివైపునఁగల మెట్లపయినుండి యాతోఁటలోనికిఁ బోవలసియుండును. ఈమార్గముదప్ప యా రెండవభాగపుఁదోఁటలోనికేఁగుటకు వేఱుమార్గమెద్దియును లేదు. ఆసింగారపుఁదోఁటయొక్క రెండవభాగమందే మాయూరాణి కొలువుకూటము గలదు. దానియందుఁ బ్రవేశించి జైమినీప్రసాదు మున్నొకమా ఱామాయా రాణిని పరీక్షించియుండెను. మొదటిభాగపుఁదోఁటకంటె నీతోఁట

మిగుల సొంపుగ నలంకరింపఁబడి కడుమనోజ్ఞముగఁ దనరారుచుం డెను. మఱియు మూఁడవభాగపుఁదోఁటలోని కేగుటకు మార్గము మాయారాణి నివసించు మందిరములోనుండియే కలదు. ఆభాగ పువృత్తాంతమును వివరించుట మిక్కిలి కష్టసాధ్యము. అయి నను దానియందుఁగల మందిరమును గొంత వర్ణింపకఁ దీరదు. దానియందు సరిమధ్య మిగుల నెత్తైన యట్టాలక మొకటి గలదు. ఆబురుజునకు నలుదెసలఁ గొన్నికట్టడములు నిర్మింపఁబడియుండెను. వానియందలి వసారాలు, గదులు, యంతర్భవనములు మున్నగు వాని నిచట వివరింపఁజాలము. కారణంబేమన, వానికిఁ దిలస్మవిష యములతో సంబంధము గలదు. మేమిచ్చోట నాబురుజులోనుండి యే నాల్గవభాగపుఁదోఁటలోనికిఁ బోవుమార్గముగలదని మాత్రము సూచించుచుంటిమి. ఆ నాల్గవభాగపుఁ దోఁటయందలి విషయము లను దలంపుకుఁ దెచ్చినమాత్రమునసే మాహృదయము ప్రకంపిం చుచున్నది. దేహము జలదరించుచున్నది. హస్తము వడవడ వడం కుచున్నది. కావున, గుండె రాయిజేసికొని ధైర్యమును జిక్కఁబట్టి రాఁబోవు సందర్భములయందు సమయోచితముగ నాహృదయ విదారకంబులగు విషయములను వర్ణించుటకుఁ బ్రయత్నించి చూచె దము.

ఆశృంగారవనసింహద్వారము నొద్దకుఁ జేరియుండిన కాంచ నసింహుని దోడ్కొని వచ్చుట కాపరిచారిక యచటినుండి వెడలిన పిదప వేషధారియగు కాంచనసింహుఁడు (అభయసింహుఁడు) మాయారాణితో "బలాత్కారపూర్వకముగ నేదియో ద్రావించి నన్నున్మత్తునిగ నొనరించి యుండిన యాదుష్టమైయారుఁ దప్రయ త్నముగ నిటటికే తెంచుట యాదయామయుండగు పరమేశ్వరుని కరుణావిశేషమనియే తలంపవలె"నని పలికెను.

మాయా:—అతఁడిచటికి కేతెంచి యెట్టిచతురోక్తులను బలుకునో, యెట్టియుక్తిని బ్రయుక్తపఱచునో మన మొకించుక బరికింప వలసి యున్నది.

కాంచన:—అతఁడిచటికిఁ జేరుట తడవుగ, వానికరపాదలకు శృంఖములను దగిలించ వలెను. అందువలన నన్నాతఁడు గాంచి పారిపోవుటకుఁ బ్రయత్నింపఁజాలఁడు.

మాయా:—నీయిచ్చచొప్పున గావింపుము. కాని, యామైయ్యారుఁడు నిన్ను బిచ్చివానిగ నొనరించి, నీయెడలఁ జెడుగా వర్తించియుండియుఁ దనరూపమును మార్చుకొనక నిచటి కేతెంచుట, నన్నధికాశ్చర్యమందుఁ జిక్కఁజేయు చున్నది. ఐయ్యారులవలన నిట్టిప్రమాదము సంభవింపరాదు. అతఁడు నీరూపమును|గాని మన పరిజనులలో నొకరి రూపమునుగాని దాల్చుకొని యరుదెంచుట యెంతయేనియు సమంజసము.

అభయ:—నిక్కవము! కాని, యతఁడిపుడు గావించియుండినదియు సరిమైనదే! కారణంబేమన, నతఁడు నన్నుగాని, మనపరిజనులలో నొకరినిగాని, బంధించి యుంచినపుడే యటులొనరించుట యుక్తము. కాని, యిపుడు రూపమును మార్చుకొనుట యంత యవసర మైనదిగాదు.

మాయా:—పోనిమ్ము! నిన్నుబంధించి యుంచకఁ గేవలము పిచ్చివానిగనొనరించి యుంచుటవలన వానికిఁగలుగు ప్రయోజనమెద్దియో నీవేయోజింపుము. అతఁ డవశ్యము పొరబడి యుండెననియే భావింపవలసియున్నది.

ఇవ్విధంబున బలికి మాయారాణి యెద్దియో యోజించుకొనుచు వేషధారియగు కాంచనసింహునిపై నొక విధంబగు తీక్ష్ణదృష్టిని బ్రసరింప జేసెను. దానిఁగని తనపై నామెకు

శంకజనించె ననియుఁ దన్నామె యేదియో ప్రశ్నింపక మూనద నియు గ్రహించి యభయసింహుఁడించుకేనియుఁ జలింపక గంభీర భావమును దాల్చి కూర్చుండి యుండెను. తత్కారణంబున మాయా రాణికి వానిపైఁగల సందేహము విశేషరూపంబున వృద్ధి పొందదా యెను. కొంతసేపటివఱకు సామాన్యవిషయములను ముచ్చటించుచుఁ గూర్చుండియుండిరి. కొంతవడి కాపరిచారిక యసలు కాంచ నసింహుని వెంటఁదోడ్కొని యచటికి వచ్చిచేరెను. మఱియుఁ దన యేలికసాని యాజ్ఞనుసారము వానిని తెరవెలుపలఁ గూర్చుండఁబెట్టి వాని నేత్రములపై బంధించిన వసనమును తొలఁగించి వైచెను. అతఁడు నలువైపులకు దృష్టిసారించి చూచినపిదప "నేనుప్రాణములతో నాయింటికి వచ్చిచేరుట మిక్కిలి సంతోషవిషయము. (చేతితో చూపుచు) ఈశృంగారవనమును, నా యనుచరులను, నే నెంతయుఁ బ్రియన్న వీక్షణంబులఁ బరికించుచుంటిని. కాని, నా కెన్నఁడు మఱుఁగుపడని తిలస్మమహారాణి నేఁడిటులఁ దెరచాటున గూర్చుండుటవలన నేనబ్బురపడవలసి వచ్చుచున్నది. అకటా! నేనేమని వచియింతును? ఈమహారాణి నా వికృతాకారమును గని సందేహించి యుండును. కాని, నేను నిక్కంపుఁ గాంచనసింహుఁడునని నిశ్చయవఱచుదనుక నన్నామె విశ్వసింపరాదు. (గదాధరసింహునివైపునకు సంకేతించి) నా యపూర్వమిత్రుఁడు గదాధరసింహుని వర్తనము గూడ నాకు మిగుల విచిత్రముగఁ దోచుచున్నది. అతఁడు నాయునికి నరయ నిసుమంతేనియు శ్రమ గొనఁడాయెను. బహుశః దాని కొకకారణ మవశ్యము గలిగియుండెనని నేను భావించుచుంటిని. నన్ను వంచించి నాకిట్టి వికృతరూపమును బ్రసాదించిన ధర్మావతారుఁడగు మైయ్యారుఁడు నారూపమునుదాల్చి వీని ననుసరించి యుండవలెను. కాని, ఆశ్చర్యము! నేను నలువైపులకు దృష్టిఁ బ్రసరించి

రాణి యేదీర్ఘాలోచనయందుఁ జిక్కియుండెనో మనకుఁ దెలియదు. ఆమె యొక యరగడియకాలము దనుక శిరమువంచి కూర్చుండి యుండెను. కొంతవడి కామె చైతన్యమై యొకపరిచారికవైపునకుఁ బరికించి, "గదాధరసింహు నిటకుఁ బుత్తెంపు"మని యాజ్ఞాపించెను.

గదాధరసింహుఁడు డేర లోపల కరుదెంచి మాయారాణి కెట్టెదుట నిలచెను.

మాయా:—ఇపు డేతెంచి యుండిన మైయారుఁడు మిగుల ధూర్తుఁడుగను దుష్టుఁడుగను దోఁచుచున్నాఁడు. మఱియు మంచి వాక్పటిమగలవాఁడు. నేను వానితోఁ గొంత సంభాషింప వలసియున్నది. కాని, నాకుఁ దల నొచ్చుచుండుటచే నిపుడు వానితోఁ బ్రసంగింపఁ జాలను. నీవు వానిని గొనిపోయి నాల్గవనంబరు గదియందుంచి వానికిఁ దగు నేర్పాటులను గావింపుము. నాకుఁ గొంత స్వస్థత చేకూరినపిదపఁ జూడ్త నగును.

గదాధర:—మీపలుకులు మిగుల యుక్తియుక్తములు. కాంచన సింహునికూడ............"

మాయా:—ఔను. కాంచనసింహుఁడు గూడ రెండుమూఁడు దిన ములవఱకు నీతోఁటయందుఁ గడపుట మంచిది. ఇతఁడు మిగుల బలహీనుఁడుగఁ జూపట్టుచున్నాఁడు. ఈసుందరో ద్యానమందలి జలవాయువులు వీని నారోగ్యవంతునిగ నొనరింపఁగలవు. కావున నీతోఁట మూఁడవభాగమందలి రెండవ నంబరుగది వీనికిమిగుల నుపయుక్తమైనదిగఁ దలంచుచుంటిని.

గదాధర:—మొదట నామిత్రుఁడు గాంచనసింహుని విషయమున తగుకట్టుబాటులను గావించి, తదనంతర మీచుట్టమైయా

రని జతనపఱచుటకుఁ గోరుచుంటిని.

మాయా:—మంచిది! అటులనే కావింపుము.

గదాధర:—(వేషధారియగు కాంచనసింహునివైపునకు బరికించి) మిత్రమా! లెమ్ము! నిన్నాతోటలోనికిఁ జేర్చి వచ్చెదను.

తనకౌశలమంతయుఁ జెన్నటిపోయెననియుఁ, దానచటి నుండి తప్పించుకొనిపోవుట కష్టసాధ్యమనియు నభయసింహునకు నిశ్చయముగఁ దోచుచున్నను నతఁడించుకేనియుఁ జలింపఁడాయెను. మఱియు నతఁడు బాగుగ యోజించి, యిపుడు మిన్నక గదాధర సింహునివెంట నేగుటయే శ్రేయంబని నిశ్చయించుకొనెను.

అభయసింహుని వెంటఁదోడ్కొని గదాధరసింహుఁడు సురంగమార్గముగల గదిలోనికిఁ బ్రవేశించెను. ఆగదియందలి గోడలయందుఁ జిన్నయలమారులు గొన్ని కలవు. గదాధరసింహుఁడా యలమారులలో నొకదానిని దెఱచినతోడనే యది రెండవగది లోనికిఁ బోవు మార్గమని అభయసింహుఁకు దెలిసికొనెను. గదాధరసింహుఁ డభయసింహుని వెంటఁదోడ్కొని యారెండవగది యందుఁ బ్రవేశించెను. కాఱుచీఁకటులకిరవగు నాగది యెంతపెద్ద దియో దానిపొడవు వెడల్పులెంతగలవో యువి యభయసింహునకుఁ దెలియకుండెను. ఆగదియందుఁ బదిపదునైదడుగులదూరము వెడలిన పిదప గదాధరసింహుఁడు వానిచేగుత్తెను బట్టుకొని యచటఁ గూర్చుండఁబెట్టెను. అంత నచటి భూమి కదలుచుండెనటుల నొకవిధంబగు ధ్వని వానికి వినిపించెను. తత్కారణంబున గదాధరసింహుఁ డేదియో యొక మరను ద్రిప్పెనని యభయసింహుఁడు గ్రహించుకొనెను.

దేనిపై నాద్వైయారు లిరువురుఁ గూర్చుండి యుండిరో యా భూభాగము సరసర క్రిందివైపునకు దిగుచు కొంతసేపటి కది యచు

వివిధాలోచన నిమగ్నమానసుఁడై యుండెను.

ఇపుడు దాను కాంచనసింహుఁడనని బొంకి మాయారాణిని గాని యామె మైత్ర్యాదులనుగాని నమ్మించు యోగ్యత వానికి లేదు. అతఁడు గదాధరసింహుని వెంట నాతోఁటలోనికేగు సమయంబుననే వాని గుట్టంతయుఁ బట్టబయ లయ్యెను. ఏమి! కాంచనసింహుఁడు గదాధరసింహునివెంట నాస్థానమెరుంగని వాని భంగి నూరక వెడలియుండునా? ఇపుడు వానిని కాంచనసింహుఁడని మాయారాణిగాని యామె పరిజనులుగాని విశ్వసింపగలరా? కాదు కాదు. అటులెన్నటికిని గాదు. ఈవిషయము లన్నింటిని తలఁబోసి యే తన్నాస్థానమున బంధించి యుంచిరని యభయసింహుఁడు నిశ్చయించుకొనెను.

ఇట్టివిధంబులగు పెక్కువిషయములను దలపోయుచుఁ దుదకచటి మందిరములను బరిశీలించి వచ్చుతలంపుతో నభయసింహుఁడానదీతీరము నుండి లేచెను. కాని, ద్వారముపైఁ బెద్దయంకెతో రెండు (౨) యని వ్రాయఁబడియుండిన గదితలుపులుదక్క మిగత యన్నిమందిరములును గదులును బంధింపబడి యుండెను. రెండవ యంకమును గాంచుటతోడనే యభయసింహునకు మాయారాణి యాజ్ఞ జ్ఞప్తికి వచ్చెను. ఆగది కొక ద్వారమును మూఁడు నాలుగు చిన్నచిన్న గవాక్షములును గలవు. దానియందుఁ బరిశుభ్రమగు పక్కయొకటి పఱచఁబడి యుండెను. దానిపైఁ గొన్ని యొఱుఁగు దిండులును గలవు.

అభయసింహున కాకఁటి బాధ మిక్కుటముగ వేధించుచుండెను. అందు ఫలములకుఁ గొఱఁతలేదుగదా! అతఁడు గొన్ని ఫలములను భుజించి యచటి నదీనిర్మలోదకమును ద్రావి కుక్షి నింపుకొనెను. మఱియు రెండవయంకెగల గదియే తన నివాసస్థానముగను చెఱసాలగను భావించుకొనెను.

---

౨

రాత్రిసమయము. అర్ధరాత్రిము గడచియుండెను. అభయ సింహుఁడాగది వెలుపల వసారాయందుఁదలగడపై వ్రాలి పరుండి యుండెను. ఆగదియందు దివ్వెను వెలిగించి,ప్రకాశము గలిగించుట కచటనెట్టి పరికరములును లేవు. మన స్సువిపిపోవుట కెవ్వరితోడనైనను సంభాషించుటకు వానిసమీపమున నొకమనుజుఁడైనను లేఁడు. తానాయద్భుతమగు తోఁటనుండి వెలుపలకేగి, రాకుమారులను బంధవిముక్తులనుగ నొనరించు నాశ వానికిపుడడుగంటి పోవుచుండెను. వివశుఁడై-నిరుపాయుఁడై యభయసింహుఁడు వివిధాలోచనలయందుఁజిక్కి- యావసారాకు నెదుట విస్తారముగను దట్టముగను బెఱిగియుండిన వృక్షములపైఁ దనచూపులను బర్యాప్తించుచుండెను.

అంత నాకస్మికముగ నావృక్షముల సందులనుండి యొకప్రకాశము వానికి గోచరించుటచే నతఁడు సంభ్రమ విస్మయాందోళిత హృదయుడగుచుఁ దదేకదృష్టి నావైపుఁనకుఁ బరికింపఁ దొడంగెను. కొంతవడికొకమనుజుఁడు చేతనొకలాంతరును గొని తనదెనకే తెంచుచుండుట నతఁడు దెలిసికొనెను. మఱియు నామనుజుఁడతి వేగముగా నభయసింహుని డగ్గరించిఁ "మాయాకు జై" యని గంభీర స్వరంబుతోఁబలికెను. ఆమనుజుఁడు సిపాయిదుస్తులను ధరించియుండెను. మిగుల నల్లగను గుఱచగను బెఱిగియుండిన గడ్డము వానిముఖమందలి యధికభాగమును గప్పియుంచెను. సామాన్యమగు కాయము గలవాఁడు. బలిష్ఠదేహుఁడు. అతఁడొకానొక మైయారుఁడు గావలయునని తలంచి యభయసింహుఁడును "మాయాకుజై"యని బదులుపలికెను.

సిపాయి:—ఓచతురుఁడా! నీవు మంచియుక్తినే కావించియుంటివి. కాని, వేగిరించి కార్యమును జెఱచివైచితివి.

అభయ:—యుక్తి యెట్టిది! వేగిర మెయ్యది?

సిపాయి:-మాయారాణి శృంగారవనములోనికి జొరుట కభిలషించు మైయారుఁడు పిచ్చివానిరూపమునగాని మఱియొక తీరున బ్రవేశింపఁ జాలఁడనుట నిర్వివాదాంశము. కాని, నీవు వేగిరపడితివి. ఇంకను రెండుమూఁడు దినములవఱ కట్టి విధంబుననే పిచ్చివాఁడ వైయుండుట సముచితము. దాన,నిక్కంపు కాంచనసింహుని పలుకులకుఁ బ్రత్యుత్తరమొసంగు భాద్యత నీకులేకుండును. మఱియు నీతోఁట నాల్గవభాగపు రహస్యములను నీవుపరిశ్నింపఁ బడకుందువు. ఇపుడు నీవు నిక్కంపు కాంచనసింహుఁడవు గావనియు నొకానొక మైయారుఁడ వనియు నెల్లరకుఁ దెల్లమై యుండెను.

అభయ:—మంచిది! మాయారాణి యెటులఁ దలంచిననేమి? నీవిపుడు నాసమీపమున కేల యరుతెంచితివి?

సిపాయి:—నీవృత్తాంతమును దెలిసికొని సాహ్యమగు విధంబునఁ దోడ్పడుటకు.

అభయ:—నేను నిక్కవముగాఁ గాంచనసింహుఁడ ననుట దక్క నితర మేమి తెలుపఁగలను?

సిపాయి:—(నవ్వుచు) బాగుబాగు! నీదేహారోగ్య మింకను స్థిమితము పడినటులఁ దోచుటలేదు. నీవు నాపై విశ్వాస మునిచి నీనిజవృత్తాంతమును వివరింపుమని మరలఁ దెలుపు చుంటిని.

అభయ:—నేనొక మైయారుఁడనని నీవు దలంచునపుడు, నినుఁబోలు నపరిచితునిపై నయ్యారులొక్కమాఱుగ విశ్వసింపఁజాలరనియు నీవెరింగియుందువు.

సిపాయి:—ఔను! నీపలుకులు నిక్కవములు. ఆయ్యారు లొక్కమారుగ నితరులను నమ్మజాలరు. కాని, నాయొద్దనట్టి పదా

ర్థమొండుగలదు. దానివలన, నీవు విధిలేక నన్ను విశ్వసింప వలసి యుండును.

అభయ:—(ఆశ్చర్యముతో) నీయొద్ద నట్టి ప్రభావ సమన్వితంబగు నపూర్వపదార్థ మేది గలదు? నీవింత దిటవుతో మాట్లాడు చుంటివి?

సిపాయి:—*"నేమచీ రిక్తగంధ"

"నేమచీ రిక్తగంధ" ఈశబ్దమం దెట్టి ప్రభావము గలదో తెలియదు. ఆమాటను వినిన మాత్రముననే వాని దేహము, గగుర్పాటునొందెను. మోము క్రిందివైపునకు వ్రాలెను. కొంతసేపటివఱకు నతండభయసింహుండు గాండనియు నొక శిలావిగ్రహమనియుం దోచుచుండెను. తుద కతండొక దీర్ఘనిశ్వాసమును బరిత్యజించి లేచి నిలచెను. మఱియు నాసిపాయి కరమును బట్టుకొని "నిన్ననా యనుచరులలోని వాండవుగ తలంపవలెనో లేక శత్రుకోటి లోని వాండవుగ భావింపవలెనో యిపుడు వచియింపు" మని పలికెను.

సిపాయి:—నేనారెండు తెగలలోని వాండనుగాను.

అభయ:—ఇది యింకను నద్భుతముగ నున్నది. (కొంచెము యోజించి) ఔను. నిక్కమము! నీవుదొంగవైయుండిన నింతదిటవుగా నాతోసంభాషింపం జాలవు. మఱియు నాయెదుటికి రాంజాలవు. కాని, నీ వెవ్వరవో యవశ్యము దెలిసికొనవలసి యున్నది. ఏమి! * "రిక్తగంధ" నీయొద్దంగలదా?

సిపాయి:—లేదు. అది నాయొద్దనుండిన దానినిప్పటికి విజయేంద్రసింహ మహీపాలునియొద్దకుం జేర్చియే యుందును.

---

*"నేమచీరిక్తగంధ" ఇది యైయ్యారి భాషయందలి శబ్దము
అర్థము:—శత్రువులన వ్రాయంబడిన పుస్తకభాండాగారము

అభయ:—అగుచో, నీవాశబ్దము నెచట వినియుంటివి.

సిపాయి:—మీర లవసరము గలిగినపు డొండొరులతోఁ బలికి మేము విజయేంద్రసింహ మహీపాలుని మిత్రబృందములోని వారమను పరిచయమును గలిగించుకొనునట్టి సంకేతపద మిదియేకదా!

అభయ:—ఔను! నిక్కువముగ నది యాశబ్దమే? అటులయిన నీవు విజయేంద్రసింహమహీపాలుని మిత్రబృందములోనివాఁడవా?

సిపాయి:—కాదు. ఇపుడు కాఁగలను.

అభయ:-(విసువు జెంది) నీవు విచిత్రపరిహాసకుఁడవుగఁ జూపట్టుచుంటివి. నీవెవరవో స్పష్టరూపంబున నేల వచియింపకుంటివి?

సిపాయి:—(నవ్వి) ఏమి! నేనాశబ్దమును బలికియుండినను నీవు నన్ను విశ్వసింపఁ జాలకుంటివా?

అభయ:—(అసూయపడుచు, గంభీరస్వరంబుతో) కటకటా! విశ్వసించితి. విశ్వసించితి. విశ్వసించితినని తెలిపియేయుంటిని. విధిలేక నమ్మితిని. ఇప్పుడైనను తెలిపెదవా లేదా? నీ నామ మెయ్యది?

సిపాయి:—నీవు నన్ను విశ్వసించుచుండిన దాలుత నీపరిచయము నొసంగుము.

అభయ:—నే నభయసింహుఁడను. తెలిసెనా? ఇఁక నీ వెవ్వరవో నీ నివాసమెద్దియో వచియింపుము.

సిపాయి:-మంచిది! కాని, నీవొకమాటకుఁ బ్రత్యుత్తర మొసంగ వలసి యున్నది.

అభయ:—ఇంకను నొకప్రశ్న మిగిలియే యున్నదా? మంచిది. ప్రశ్నింపుము.

సిపాయి:—ఎవ్వరేనియు స్నేహభావముతో మీయెదుటకు వచ్చి

మీ కార్యములందు దేహమనంబులఁ దోడ్పడుచు మీయాక్షే మమునకై ప్రాణములను సహితమర్పించుటకు సంసిద్ధుఁడై యుండునో యట్టివాని, సోదరుఁడుగాని తండ్రిగాని తాత గాని మీకుఁ బగతుఁడయి యుండిన వానియెడల మీ రెటులఁ బ్రివర్తింతురు?

అభయ:—ఎవరు మాశుభమునుగోరునో యట్టివారి తండ్రిగాని, తాతగాని, బంధువుఁడుగాని మాయెడల రిపుభావముగలిగి యుండినను, మేము మా శుభచింతకులయెడల స్నేహభావమును గలిగియే యుందుము.

సిపాయి:—అయ్యదియే సమంజసము. మంచిది. ఆలకింపుము! నన్ను "జైమినీప్రసాద"ని ప్రజలు పిలుచుచుందురు. నా నివాసము, కాశీపురము.

అభయ:—నీనామము జైమినీప్రసాదా?

సిపాయి:—ఔను. నాచారిత్రము మిగుల నపూర్వమైనది. ఆశ్చర్యజనకమైనది.

అభయ:—నే నీనామ మెప్పుడో వినియుంటిని. కాని, యెచట నే సందర్భమున నాలించియుంటినో జ్ఞప్తియందు లేదు. నీ చారిత్ర మధికాశ్చర్యంబగు విషయములతోఁగూడి యుండుననుట కెట్టి సందియమును లేదు. నీకథ నాలించుటకు నాకు మిక్కిలి కుతూహలము జనించుచున్నది. సాధ్యమగునంత శీఘ్రముగ నీ వృత్తాంతమును వివరింపుము.

జైమినీ:—సావధానచిత్తముతో నాలింపుము. నేనరుదెంచినకార్యమందు విలంబమైనను నాచారిత్రమును వినుటవలన మీకార్యముల నతి జాగరూకతతో నిర్వహింపఁగలరు. మఱియు నిచ్చటి పెక్కురహస్యములు మీకు వెల్లడి కాఁగలవు.

## —♦ జైమినీ ప్రసాద చారిత్రము. ♦—

వసితనంబున నేను మిగుల సుఖశాంతులతో నాకాలమును గడపితిని. నాయింట నేపదార్థమునకును గొఱంతలేదు. భుజించుటకు మంచిమంచి పదార్థములను ధరించుట కమూల్యవస్త్రాద్యలంకారములును లభించుచుండెను. ఇంతియె గాక, నేను దేనిని వాంఛించుచుందునో, యయ్యది తక్షణము నా కొసంగఁబడుచుండెను. నాతల్లిపై నాకధిక భక్తివిశ్వాసములు గలవు. కాని, నాతండ్రిపై తక్కువ. కారణంబేమన, నతఁ డేయితరరాజ్యమందో యొకభూపాలుని కొలువునందుఁ జేరియుండెను. ఒకొకప్పుడు నాలుగైదుమాసముల కొకమాఱుగాని సంవత్సరమున కొకమాఱుగాని యింటికరుదెంచి పది పదునైదుదినములుండి వెడలిపోవుచుండెడివాఁడు. ఆ సవిస్తర వృత్తాంతము ముందు సందర్భములయందుఁ దెలియగలదు. నాతండ్రికి నాతల్లిపై నధికానురాగముగలదు. అతఁడు గృహమున కేతెంచిన సమయంబున మాకు విశేషధనమును మంచి మంచి దుస్తులను నొసంగి పోవుచుండెడివాఁడు. తత్కారణమున మేము జమీందారుల విధంబున మిగుల విశ్రాంతితోఁ గాలమును గడుపుచుంటిమి.

నే నొకదాదిలి యొడియందుఁ బెఱిగితిని. ఆమె గడు ముదుసలి, మంచిస్వభావముగలది. ఆమె చెల్లెలును మాపొరుగునందుండిన యొకభాగ్యవంతుని యింట వానిబాలికను సాఁకుచుండెను. నా దాదిలి నన్నుఁ దీసికొని యాభాగ్యవంతునియింటికిఁ బోయి కూర్చుండుచుండును. మఱియు నప్పుడప్పు డామె చెలియలును మాగృహమున కేతెంచి యాబాలిక నాడించుచుండును. తత్కారణమున దఱచుగ నాబాలికయు నేను నొకస్థానమందుఁ గూడియుండుట చేఁ గ్రమముగా మాయిరువురియందు స్నేహభావ మంకురించెను.

మఱియు నయ్యది దినదినము వృద్ధిలాభము నొందుచువచ్చెను. వయస్సునం దాబాలిక నాకంటె రెండుసంవత్సరములు చిన్నది. ఆమె పేరు రమాసుందరి. నానామము జైమినీప్రసాదు. ఆబాలిక మిగుల సౌందర్యసంపన్నురాలు. కాని, పుట్టుమూఁగయుబధిరయు. మేమిరువుర మొండొరులను గాంచుకొనని దే క్షణకాలమైనను నిలువజాలకుంటిమి. ఉపాధ్యాయునొద్ద కూర్చుండి చదువుకొనుట నాకు మిక్కిలి చెడుగా దోఁచుచుండెడిది. మఱియు నాబాలికను గలసికొనుటకుఁ బలువిధములగు సాకులను బలుకుచుండెడివాఁడను.

నాకుఁ బదియేండ్లప్రాయము వచ్చిన పిదప నావారు పెరవారను విషయమును బాగుగ గ్రహింపసాగితిని. నాతండ్రి నామము రణవీరసింహుఁడు. అతఁడు చాలాదినముల కొకమాఱు మాయింటికి వచ్చి పోవుచుండుట నాకు మిక్కిలి చెడుగా దోఁచుచుండెను. నా తండ్రివిషయమున దఱచి తఱచి నాతల్లిని ప్రశ్నింపసాగితిని. కాని, ఆమె వానివృత్తాంతము దాఁచియుంచుచుండెనని నేను తలంచితిని. ఇంతయేల? ఆమెయు నాతండ్రియొక్క సంపూర్ణ వృత్తాంతమెఱుంగదు. అయినను నాతండ్రి యొక నైయారుఁడనియు నెచ్చటనో యొకభూపాలుని గొల్చుచుండెననియు నాకుఁ దెలియవచ్చెను. మఱియు నచట నాకొక చవతితల్లి గలదనియు నామెకొక పుత్త్రుఁడును బుత్త్రికయుఁ గలరనియు నేను వినియుంటిని.

నాతండ్రి యింట నుండు కాలమున నాకైయారీవిద్యను నేర్పుట కధికశ్రద్ధ వహించుచుండెను. నాకును చదువుటకంటె నైయారీతనము నేర్చుకొనుటయందే యధికాభిలాష గలిగియుండెను. కారణంబేమన, రమాసుందరిని గలసికొని నా యభీష్టమును నెఱవేర్చుకొనుట కయ్యది మిగుల సహకారముగాఁ గలదని నాయుద్దేశము. నేను క్రమముగఁ గౌమారావస్థను గడపి యౌవనదశయందుఁ బాద

మిడితిని. అపుడు నేనొక యువకుఁడననియు నైయూరుఁడననియుఁ దలంప సాగితిని.

ఒకనాఁటి రేయి మాయింట నొకగదియందుఁ బర్యంకముపై బరుండి రమాసుందరి విషయమున బెక్కుసంగతులను యోచించు చుంటిని. విరహవేదనము వలనఁ గంటికి నిద్దురపట్టకుండెను. గోడలపై నలంకరింపఁబడియుండిన చిత్రపటముల వైపునకుఁ దదేకదృష్టి బరి కించుచుంటిని. అంత నాకస్మికముగ నామేడ పైయంతస్థునుండి అడు గులచప్పుడు వెడలివచ్చెను. ఏపరిచారికయో యవసరమగు కార్య మునకు లేచి యుండునని నేను తలంచితిని. కాని, కొంతసేపటికి మెట్లపైనుండి యెవ్వరో క్రిందికి దిగుచుండినటుల నాకుఁ దోచెను. అడుగులచప్పుడు మిగుల భారముగ దోఁచుటవలన నది పరిచారిక గాదనియు నెవ్వఁడో పురుషుఁడై యుండుననియు భావించితిని. మఱి యు నిట్టి నిశాసమయంబున నాపురుషుఁ డేమార్గమున నిచటి కేతెం చెనని యబ్బురపాటు నొందసాగితిని. కారణంబేమన, నపుడు నా తండ్రి యింటలేఁడు. అతఁడు కొలువునకు వెడలి దాదాపు రెండు మాసములు గడచియుండెను.

నేనాజాడ నరయు తలంపుతో లేచి కూర్చుంటిని. ఆసవ్వడి నాలించి యామనుజుఁ డతివేగముగ మెట్లనుండి దిగి మండువా లోనికి బ్రవేశించెను. నేను వెంటనే చేతనొక కృపాణమును ధరించి, యింటి వెలుపల కేగి యామనుజుఁడు దక్షిణదిశగాఁ బోవుచుం డుటఁ గనుగొంటిని. ఆసమయంబున మా మందిరద్వారమునొద్ద గావలియుండిన నా సేవకులును, సిపాయిలును, గాఢసుషుప్తియందు మునిఁగియుండిరి. నేను వెంటనే వారిని మేల్కొల్పి యామను జుని వెంటఁ బోఁదొడంగితిని.

ఆమనుజుఁ డసిత వస్త్రముల వలన మేనెల్ల మఱుఁగుపఱచుకొని

యుండెను. అతఁడు నిశ్చింత నడచిపోవుచుండుటవలన దన్ను నే వెంబడించిన సమాచార మతఁ డెరింగియుండెనో లేదో దానిని నే నుడువ జాలను.

కొంతదవ్వు వెడలిన పిదప వాని వీఁపున నొకమూటగలదని తెలిసికొంటిని. కాని, యదియు నొకనల్లని వస్త్రములోపలఁగలదు తత్కారణంబున వాఁడొక దొంగయనియు, మాయింట నేమియో యపహరించి కొనిపోవుచుండెననియు నేను తలంచితిని, కేకలిడి గందరగోళము చేయుటవలన విస్తారముగ జనులు గూడుదురనియు, వానిని బంధింపవచ్చుననియు మొదట దలంచితిని. కాని, మఱి కొన్ని విషయములను దలపోసి మిన్నక వాని వెనువెంట నేగుటయే సముచితమని భావించితిని.

ఒకగంట కాలమువఱకు నేను సరాసరిగా నామనుజుని వెను వెంటఁ బోవుచుంటిని. తుదకుఁ బట్టణము వెలుపలి మైదానములో నొకవైపున నాఱ్లువృక్షములు మిగుల దట్టముగఁ బెఱిగియుండిన స్థానమునకుఁ బోయి చేరితిని. అచట నావృక్షముల కారణంబున సహజమగు చీఁకటికంటె నధికాంధకారము గలిగియుండెను. ఆవృ క్షంబుల మధ్యకుఁ జేరు సరికి యచట దాదాపు పదిమంది మనుజు లొక సమాధి ప్రక్కను గూర్చుండి, నెమ్మది నెమ్మదిగా సంభా షించుచుండుట నాకుఁజూపట్టెను. నేను వెన్నంటి పోవుచుండిన యా మనుజుఁడు వారి సమీపమునకుఁ జేరఁబోవ నచటఁగూర్చుండి యుండిన వారిలో నిరువురు మనుజులు ముందునకెదురేఁగి వాని తో, "నీమా తెవరిని బంధించి తెచ్చితి" వని ప్రశ్నించిరి. దానికిఁ బ్రత్యుత్తరముగ నతఁడు "జైమీనీ ప్రసాదుతల్లి" నని బదులు పలికెను.

నే నామాటను వినిన మాత్రముననే నాహృదయమం డెట్టి

దారుణాఘాతము దగిలియుండెనో దానిని నీవు స్వయముగ నూహింపఁగలవు. నేనంతదనుక వాఁడెవ్వఁడో యొకచోరుఁడనియు మాయింట నేపదార్థములనో ముచ్చిలించి కొనిపోవుచుండెననియుఁ దలంచి యుండుటచే నాకంత కష్టముగ దోఁచియుండలేదు. నేను వాని సకలవృత్తాంతము దెలిసికొను తలంపుతోఁడనే వానిని వెంబడించితిని. ఆదుష్టుడు నాతల్లి నపహరించుకొని తెచ్చినవార్త నాలించుటతోడనే నాకుగలిగిన విచారమునకు మేరలేదు. మఱియు వాని నింతదూరముఁవఱకు వ్యర్థముగ రానిచ్చితినిగదా యని పరితపింపఁ దొడంగితిని. కారణంబేమన, నే నపుడేమి యొనరించినను బ్రయోజనములేదుగదా? నలువైపుల నిస్తబ్ధత వ్యాపించియుండెను ఆస్థానమునకును బట్టణమునకునుఁ జాలదవ్వు గలదు. నేను గొంతు జించి యఱచినను నాయార్తనాద మెవ్వరికిని వినిపింపఁజాలదు. ఇదియుఁగాక నేనొంటరి వాఁడను. వారు పదిమంది వఱకుఁగలరు. నేను వారి నెవ్విధంబునను నెదిరింపఁజాలను. ఆసమయంబున నే నధిక కష్టంబున నామానసోద్వేగమును నడఁచిపట్టి యేమియుఁ బలుకక నొకమాఱ్రిను చాటునదాఁగి వారి కార్యాచరణములను గమనించుచు నిపుడేమిసేయవలయు నని యోజింపఁదొడంగితిని.

ఆసమాధి మందిరము బోరగించి యుంచిన కడవవలె నాకారముగలిగి మిగులఁబెద్దదిగను సుదృఢముగ నుండెను. దాని లోని కేగుట కొకమార్గము గలదనియు నాకపుడు దెల్లమాయెను. కారణంబేమన, నేను కాంచుచుండగనే యామనుజులందఱు నాసమాధి మందిరముఁలోనికిఁ జొచ్చిరి. నేను వెలుపల నెంతకాలము వేచియుండినను వారిలో నొక్కఁడైనను వెలుపలికి మగుడి రాఁడయ్యెను.

నేనటుల నొకగంట కాలమువఱకు వారిమార్గమును బ్రతీక్షించి, తదుపరి నాసమాధి మందిరమునొద్దకు బోయిచేరితిని

మఱియు నలువైపులం దిరిగి బాగుగం బరిశీలింపంసాగితిని. కాని, యె
చ్చటను నొకమనుజుండు లోన బ్రవేశించుటకుం దగిన ద్వారముగాని
రంధ్రముగాని నాకుం జూపట్టదయ్యెను. మఱియు దానియందు ద్వా
రముగల చిహ్నమేమియు గోచరించుటలేదు. నేనాసమాధిని బా
గుగ నెఱింగియుంటిని. దాని విషయమున నెన్నండెట్టి చెడువార్తయు
నెవరి నోటను వెడలి యుండలేదు. జానపదు లాసమాధి మందిరము
నకు మ్రొక్కులు చెల్లించుచుందురు. మఱియుం బూజించుటకుం
బెక్కుఱు జనులా సమాధి మందిరమునొద్దకుం దఱచుగవచ్చి పోవు
చుందురు. కాని, నేఁడు నేను గనియుండిన విషయములను బట్టి
యది నిజముగ నొక మహాత్ముని సమాధి మందిరము గాదనియు
హంతకుల నివాసస్థానమనియు నిశ్చయించు కొంటిని.

నేనా సమాధి మందిర ద్వారమును కనిపెట్టుటకుం బెక్కువిధం
బుల బ్రయత్నించి చూచితిని. కాని, యిసుమంతేనియు బ్రయో
జనము గలుగ లేదు. నిరుపాయుండనై మొదట నీసమాచార
మును బ్రజల కెఱింగించి కొందరను వెంటం దోడ్కొని బోయి
యాసమాధిమందిరమును కుంకటివ్రేళ్ళతోం బెల్లగించి నాతల్లి
జాడయు నామిత్రుల పోంబడియుం గనుగొన దలంచి నిలయాభి
ముఖుండనైతిని.

నేను నామందిరమునకుం జేరుసరికి వేకువ జామయ్యెను.
నే నాయలజడి వృత్తాంతము నాసేవకుల కెఱింగింపం దలంచితిని.
కాని, యచటి సమాచారము వేఱువిధముగ నుండెను. నన్ను
చిన్ననాంటినుండియు నెత్తుకొని పెంచి యుండిన నావృద్ధదాదిలి
ద్వారమునొద్ద కూర్చుండి యిట్టి యంధకార బంధురమగు రాత్రి
సమయంబున బాలు నొంటరిగ నేలపోనిచ్చితిరి? మీలో నొక్కం
డేనియు వాని వెంట నేల వెడలకైతిరి? మున్నగు విషయములను

ప్రశ్నించుచు వారిపై మండిపడుచుండెను. నేను సమీపించినంతనే యాసేవకులు నన్నుఁ గాంచి యామెతో, చూడుఁడు! మీ జైమినీ ప్రసాదు బాబు వచ్చినాఁడు. మాపై స్వహస్తముగ నేల కోపించెద"వని పలుకఁ దొడంగిరి. నేను వారితో, "యీగందరగోళమే" మని ప్రశ్నించితిని.

దాదిలి:—వేఱేమి గలదు! నీవెవరితో నేమియుఁ దెలుపక నెచటి కేగి యుంటివో తెలియదు. నీవు యింట లేని సమాచార మెఱింగి మీతల్లి పరితపించుచుఁ దన ప్రాణములను బాయుటకు సమకట్టియున్నది. నీవొక సేవకునేనియు వెంటఁ దోడ్కొని పోకుండుట మంచిదికాదు. నీవు పైకి వెడలి సీజనని దుస్థితిఁ గొంత యరసి రమ్ము.

నేను:—ఆమె యెచటఁ గలదు?

దాదిలి:—మఱి యెచటనుండును? మేడ పైయంతస్థునందలి శయనాగారమందుఁ గలదు. నీవు పోయిరమ్ము.

దాదిలి పలుకుల నాలించినంతనే నేనధిక సంక్షుభిత మనస్కుఁడ నైతిని. నాకాసమయమున జనించిన యాశ్చర్యమునకు మేర లేకుండెను. నే నాఘాతకుని వెంటఁ బోయి యా సమాధిమందిరమునొద్ద వానినోట నాతల్లిని బంధించిన వార్త నాలించియుంటిని. గృహమునకుఁ జేరినతోడనే నాతల్లి నాకై పరితపించుచుండెనని వింటిని. నా మనోగతవిషయముల నెవరికిని వ్యక్తీకరించక నాతల్లి నివసించు గదిలోనికిఁ బోయి చేరితిని. ఆమె యచట నొక పర్యంకముపైఁ బరుండి విలపించుచుండెను. ఆమె శిరము రెండుమూఁడు స్థానముల యందుఁ జిట్లియుండెను. ఆ గాయములనుండి రక్తము విస్తారముగఁ బ్రవహించుచుండెను. ఆమె సమీపమున నొక పరిచారిక నిలచి, యానెత్తురు నొకవస్త్రముతో నొత్తుచుం

డెను. నేను మిగులఁ దొట్రుపడుచు, "అమ్మా! ఇదియేమి? శిరము నుండి నెత్తు రిటులేల ప్రవహించుచున్న"దని ప్రశ్నించితిని.

తల్లి:—నీవు యింటలేని సమాచారము నాలించి మిగులఁ ద్రొటుప డుచు నిన్ను వెదకుటకు గ్రిందికి దిగి వచ్చుచుంటిని. ఆ కల వరపాటునం దాకస్మికముగ నా పాదము జారుటవలన మెట్ల పైఁ బడితిని. నీవెచటికిఁ బోయితివి?

నేను:-మన యింటనుండి యొక చోరుఁడు గొంత సామగ్రిని దీసికొని వెడలిపోవుచుండుటఁ బరికించి నేను వాని వెనువెంట నేగితిని.

తల్లి:-(తొట్రుపడుచు) ఏమి! మన మందిరమునుండి యొకచోరుఁడు వెడలి పోవుచుండుటఁ గాంచితివా?

నేను:—ఔను. నేను వాని వెనువెంటఁ బోయి యుంటి నని తెలిపి తిని గదా!

తల్లి:—తుదకు నీవు వానివెంట నెంతవఱకు నేగితివి? నీవు వాని యింటిని గుర్తించి వచ్చితివా?

నేను:—లేదు. కొంతదూరమేగిన పిదప నతఁడు సందులయందుఁ దిరిగితిరిగి యెచట మాయమయ్యెనో తెలియదు. నేను చాల సేపటివఱకు వానిని వెదకితిని. కాని వానిజాడ తెలియద య్యెను. తుదకు నిరుపాయుఁడనై యింటికిఁ దిరిగి వచ్చితిని. (పరిచారికవైపునకు బరికించి) మన యింట నేయే వస్తు వులు ముచ్చిలింపఁబడినవో తెలిసెనా?

పరిచారికరి:—(అబ్బురపాటుతో నలుదెసలఁ బరికించి) ఇచట నే వస్తువును ముచ్చిలిపోలేదు.

నే నాప్రత్యుత్తరము నాలించి మాఱుపలుకక నచటి నుండి క్రిందకి దిగి పోయితిని. ఏగదియందు మా మూలధనముండు చుండెనో దాని బీగ మెప్పటియటుల బంధింపఁబడి యుండుటఁ

గనుగొంటిని. సాధారణముగా నలమూరులయందు విడివిడిగాఁ బడి యుండమూల్యములగు నిత్యోపకరణము లెచటవి యచటఁ బడి యుండుటయుఁ గాంచితిని. తదనంతరము నాకేమియుఁ దోచక పర్యంకముపైఁ బరుండి పలువిధంబుల యోజింపసాగితిని. అప్పటికి బాగుగా దెల్లవాఱి యుండెను. ప్రాతఃకాలీన ధవళకాంతులు గృహమందుఁ బ్రవేశించి, శీఘ్రకాలములోనే సూర్యభగవానుఁ డుదయింప నుండెనని హెచ్చరించుచుండెను.

క్రమముగాఁ గొన్నినెలలు గడచిపోయినను, నా మనోగత విషయములను, నాఁ డామైయ్యారుని వెనువెంటనేగి కాంచియుం డిన సంభవములను నెవరితోడను దెలుపలేదు. నేను రహస్యముగ దాని యసలు వృత్తాంతమును దెలిసికొనుటకుఁ బెక్కువిధంబుల బ్రయత్నించుచుంటిని. నాతల్లి ప్రసంగధోరణి-ప్రవర్తనము-స్వా భావికలవైపునకు దృష్టి నిడుటవలన మాయింటనుండిన నామె నా తల్లి గాదనియు, నొకానొక మైయ్యారియనియు నిశ్చయించుకొం టిని. నేను రహస్యముగ నాతల్లి చర్యలను గనిపెట్ట సాగితిని. మఱి యు నొకమైయ్యారి నాతల్లిరూపమును దాల్చి మాయింట నేల నివసించుచుండెననియు, నామె యభిమగం బెట్టెదనియు యోజించు చుంటిని. ఇదియునుగాక నాప్రాణసంరక్షణ విషయమునగూడ తగు శ్రద్ధ వహించి యుంటిని. ఆకాలములో రమాసుందరి నాతో స్నేహము వృద్ధిపఱచు చుండెను. నాకామె నడవడికయందుఁ గొంత వ్యత్యాసము గనిపించు చుండినను నామెయందలి యనురాగము నన్నొక యంధునిగఁ జేసి యుంచెను. నేనామె యందు మిక్కిలి ప్రేమాసక్తుఁడనై యామె మోహజాలమందుఁ జిక్కియుంటిని.

రమాసుందరి పుట్టుమూఁగయు జెవిటియూ నై యుండినను సేవలను సంజ్ఞాపూర్వకముగ బోధించి చదువునేర్పెదనని విధుషీ

మణియు బుద్ధిమతియు నగు నొకస్త్రీ ప్రతిజ్ఞచేసి యుండెను. మఱియు నాస్త్రీ మిగుల చాతుర్యముతో నామెకు విద్యగఱపుచుండెను. ఆస్త్రీయే రమాసుందరి లిఖించిన లేఖలను నాకందఁజేయుచుండెను. నేను నామెచేతనే ప్రత్యుత్తరములను బంపుచుంటిని. ఇవ్విధంబునఁ గొన్ని దినములు గడచిన పిదప రమాసుందరి యొద్దనుండి నాకుఁ జేరుచుండిన జాబుల యందలి యక్షరముల పొందికయు నాకారమును నూతన విధంబున గోచరింప సాగెను. కాని, నేనపుడా విషయము నధిక దృష్టి నిడి యుండలేదు.

పైన లిఖించిన సంభవములకుఁ బిదప నాలుమాసములకుఁ బైగా గడచి యుండెను. ఈయంతర మందు నాతండ్రి కొన్ని మాఱులు మాగృహమున కరుదెంచి కొన్ని దినము లుండుచు మరల వెడలి పోవుచుండెను. సాంసారిక విషయముల యందును నాకుఁ గొంత పరివర్తనము చూపట్టుచుండెను. నాతల్లి దుర్లభము లగు పెక్కు కోరికలను గోరుచు నాతండ్రిని పీడింపఁ దొడంగెను.

నాతండ్రి యింట నుండిన కాలములో నొక నాఁడర్ధరాత్రి సమయంబున నాతలిదండ్రులయందుఁ గలహము జనించెను. నేనాసమయంబున మేల్కొని యుంటిని. ఎత్తెఱంగుననైన వారి కలహకారణమును దెలిసికొన వలెనను దలంపుతో నాపడక నుండి లేచి సద్దుసేయక నెమ్మదిగా నాతల్లిదండ్రులు పరుండియుండిన శయనాగారము చెంతకుఁ బోయిచేరితిని. మఱియు వార లొండొరులపైఁ గటువచన పరంపరలను వర్షించు కొనుచుండుటఁ దెలిసికొంటిని. ఆగదికి మూఁడు ద్వారములు గలవు. దానిలో నొక ద్వారము దెఱవఁబడియుండెను గాని, దానిపై నొక తెరగుడ్డ వ్రేలాడుచుండెను. తక్కిన రెండుద్వారములు బంధింపఁబడి యుండెను. నేనొక బంధించి యుండిన ద్వారము (తెరువఁబడియుండిన ద్వారమునకుఁ దిన్నఁగా

నెదుటనుండిన) నొద్దకుఁబోయి యచట నెమ్మదిగాఁ గూర్చుండి వారిరువుర సంభాషణము నాలింప సాగితిని. నేను వినియుండిన విషయముల నిపుడు వివరించుచుంటిని.

తల్లి:—నీకు నాపై విశ్వాసము లేకుండిన "నీకు దాని నొసంగితిని దీని నొసంగితి" నని, యేనోట వచియించుచుంటివి?

తండ్రి:—ఔను. నీ కారణముననే నాకు ప్రాణ సంకటమును దెచ్చి పెట్టుకొను చుంటిని. మఱియు నాజీవిత కాలమంతయుఁ గళంకమండితుఁడనై యొరులకు మోము సహితము జూపుటకుఁ దగియుండ నటులఁ జేసి కొనుచుంటిని.

తల్లి:-నీకుఁ దోఁచిన రీతిని బలుకుము. ఏమి! నేనాపుస్తకమును నమలి మ్రింగివైచెదనా, లేక యొరులెవ్వరికైన నొసంగెదనా? పోనిమ్ము. నీవాపుస్తకమును గొంపోయి నీవలపులరాణికి గానుకగ నొసంగి యామె దయకుఁ బాత్రుడవు గమ్ము.

తండ్రి:—నీవెవతెను వలపులరాణి యని యెత్తిపొడుచుచుఁ బలుకుచుంటివో యాప్రియురాలు నీవలె మాత్సర్యశీల గాదు. ఆమె నాతో విజయేంద్రసింహుని యింట నేదేనియుఁ దొంగిలించుటకుఁ దెలిపి యుండలేదు. మఱియుఁ దిలస్మ మందలి విచిత్రములను జూడఁ గోరుటయు లేదు.

తల్లి:—ఆదీనురాలి కంతటి సాహస మేల కలుగును? మఱియు నట్టి యుచ్చాభిలాష యామె మానసమం దేల జనింపఁ గలదు?

తండ్రి:—ఔను. నిక్కమముగాఁ దన పతి ప్రాణములను గొను నంతటి గొప్ప కోరిక యామెకెన్నఁడు గలుగదు.

తదనంతరము గొంత సేపటివఱకు వారిరువురు సంభాషించు చుండిరి. కాని, వారు మిక్కిలి నెమ్మదిగాఁ బ్రసంగించుట

వలన నేనావిషయములను బాగుగ తెలిసికొనఁ జాలనైతిని. తుదకు నాతండ్రి యావేశపూరితుఁడై "కానిమ్ము! ఆవిధాత నానుదుట నేమి లిఖించియుండెనో దాని ననుభవించెదను. జైకొనుము. ఇదిగో యారిక్తగంథము (నెత్తురుతో వ్రాయఁబడిన పుస్తకము) నీయాధీన మొనరించు చుంటి" నని పలికి యొక పుస్తకము నామె కొసంగెను. మఱియు నామెతో "నేను నాలుగైదు దినములలో మగుడి వచ్చెదను. అపుడు నీయిచ్ఛానుసారముగఁ దిలస్మములోనికిఁ దోడ్కొనిపోయి యచటి విచిత్రములను నీకుఁ జూపించి, మఱల నీ పుస్తకమును విజయేంద్రసింహ మహీపాలుని మహలులోనికి జేర్చి వచ్చెద" నని పలికి మిన్నకుండెను.

తదుపరి నాజనకుఁడు వెలుపలకు వెడల సంసిద్ధుఁ డగుటఁ గాంచి నేనచ్చోట నుండి లేచి మిన్నకఁ గ్రిందికిఁదిగి నాగదియందుఁ బ్రవేశించితిని. నామానసమున బెక్కుశంకలు తలసూపి నన్ను బాధించు చుండుటచే నాకొక విధంబగు యపూర్వస్థితి యొదవి యుండెను. ఆమె నాతల్లి గాదనియు నాతండ్రి యామాయలాడి వలయందుఁ జిక్కి తన శిరముపై నెద్దియో గురుతర విపత్తిని దెచ్చి పెట్టుకొను చుండె ననియు నేను నిశ్చయించు కొంటిని. మఱియు నాతండ్రి నెవ్విధంబున నేనియు నామోసకత్తె బారినుండి తప్పించుటకును నిజ జనని జాఁబడి గనిపెట్టుటకును నేను చింతింప సాగితిని.

దాదాపు రెండుగంటల కాలము గడచినను నాతండ్రి సౌధోపరి భాగము నుండి క్రిందికి దిగి రాకుండుటచే మరల వారిరువుర యందు జగడము ప్రబలియుండెనను చింత నాకగ్గలమయ్యెను. తుదకు నేనచట నిలువఁ జాలక గది వెడలి నాతండ్రిని కేకలిడి పిలిచితిని. నాకంఠధ్వని నాలించినంతనే గుర్తించి నాతండ్రి యతి రయంబున నాచెంత కేతెంచి "జైమినీ! నన్నేల పిలచితి" వని

ప్రశ్నించెను.

నేను:—ఏకాంతమున మీతోఁగొంత సంభాషింప వలసి యున్నది.

తండ్రి:—వచియింపుము! ఇచట నితరు లెవరును లేరుగదా! పోనిమ్ము! నీకట్టి భీతి గలిగి యుండిన సౌధోపరిభాగమున కేగుదము. నడువుము.

నేను:—(నెమ్మదిగా) మీరు నాతల్లియని తలంచుచుండిన యాదు రాత్మురాలి యెదుట నేనేమియుఁ జెప్పఁ దలంచుటలేదు.

తండ్రి:—(అబ్బురపాటుతో) ఏమి? ఆమె నీజననిగాదా?

నేను:—కాదు.

తండ్రి:—ఏమి! నేఁడు నీవిటులేల పలుకుచుంటివి? ఆమె నీకెట్టి కష్ట మేనియుఁ గలిగించి యుండదుగదా?

నేను:—ఇచట నన్నేమియుఁ బ్రశ్నింప వలదు. ఏకాంతమం దంతయు వివరించెదను. సర్వము దేటతెల్లము గాఁగలదు.

నావలుకుల నాలించి నంతనే నాతండ్రి మిక్కిలి కలఁత నొందుచు నాచేయిఁ బట్టుకొని తన కచ్చేరీ చావడిలోనికిఁ దీసికొని పోయెను. మఱియు ద్వారములను గవాక్షములను బంధించిన పిదప నాదెసఁ గాంచి "సమాచార మేమి?" యని ప్రశ్నించెను.

తదనంతరము నేను గని విని యుండిన సమాచారము లన్నింటిని బూసగ్రుచ్చినట్లు సవిస్తరముగ వివరించి తెలిపితిని. నావచనముల నాలించి నంతనే నాతండ్రి కొక యద్భుతమగు స్థితి యొదవెను. వాని మోము దమ్మియం దుదాసీనతయు సంభ్రమమును దోఁపసాగెను. అతఁడు గొంతసేపటివఱకు నిస్తబ్ధుఁడై కూర్చుండి బాగుగ పర్యాలోచించు కొనిన పిదప నాతో "నిక్కమము! నేను బాగుగ వంచింపఁబడితిని. నీపలుకుల నాలించి చక్కగ యోజించుటవలన నాదురాత్మురాలి నడవడికయందును బ్రసంగ

వైఖరి యందును మిక్కిలి పొరపు నూపట్టు చున్నది. కాని, ఆశ్చ ర్యము! నీవేమి తలంచి యింతదనుక నీరహస్యమును గప్పియుంచి తివో యూహింపఁ జాలకుంటిని. మఱియు నీతల్లి విషయమునగూడ నిశ్చింతఁ గూర్చుండి యుంటివి. పాపమా నిస్సహాయ యిపు డెట్టి సంకటములఁ జిక్కియుండెనో లేక, యీపప్రపంచమునుండి తరలి యుండెనో తెలియదు.

నేను:-నే నిన్నిదినములదనుక నీరహస్యమును వెల్లడింపక నేల దాఁచి యుంచితినో యావిషయమును మీరు బాగుగ యోజించి తెలిసికొనగలరు. మఱియు నాతల్లి విషయము నేను నిశ్చిం తఁ గూర్చుండి యుంటిననియుఁ దలంపకుఁడు. నాకు సాధ్య మగు విధంబున నామె జాడ కనిపెట్టుటకుఁ దగు ప్రయత్న ములను గావించుచునే యుంటిని. కాని, యింత దనుక నెట్టి ప్రయోజనమును జేకూరదయ్యెను. అయినను, నామె యీప్రపంచమందు సజీవియై యుండెననుట కెట్టి సందియ మును లేదు.

తండ్రి:-నీతలంపు మిగుల సరియైనది. ఏమైయూరి తన కార్యసిద్ధికై నీతల్లిరూపమును దాల్చుకొని మనగృహమున కేతెంచి యుండెనో యామె కార్యము సిద్ధలాభము నందుదనుక నీతల్లి ప్రాణముల కెట్టి భీతియుఁ గలుగ జాలదు.దీనికంటె వేఱు తార్కాణ మేమి కావలయును? ఆశ్చర్యము. నేను మిక్కిలి పొరబడితిని. మఱియు వన్నొక పనికిమాలిన వాని గఁ జేసి వైచుకొంటిని. మంచిది! నీవిపు డీవృత్తాంతము నా కెఱింగించుట కేల సంసిద్ధపడితివో దానినిగూడ వచియిం పుము!

నేను:—నాతల్లివిషయమున నాకు గలిగి యుండిన సందేహము

చాల దినములనుండి నన్ను వేధించుచున్నది. కాని, యిపుడు మీరిరువురు జరిపుచుండిన యలికిడి నాలించి నేను సౌధోపరిభాగమునకు వెడలివచ్చితిని. మఱియుఁ గొంత సేపటివఱకు నొక తావున దాఁగి మీయిరువుర సంభాషణము నాలించి యుంటిని. మీసంభాషణ మందలి సమాచారములు నాకధిక మేమియుఁ దెలియవు. కాని, మీరామెను బరితుష్టాంతరంగనుగ నొనరించుటకు విజయేంద్రసింహమహీపాలుని యింట నేదియో పుస్తకమును ముచ్చిలించి తెచ్చియుంటిరనియు, మీ కెద్దియో యొక యనర్థము దప్పక వాటిల్లయుండెననియు నేను గ్రహింపఁ గలిగితిని. తత్కారణంబున నేనిఁక మిన్నకుండుట సముచితముగాదని తలంచి మిమ్ము సావధాన పఱచుటకుఁ దలంచితిని. మంచిది! మీరు ముచ్చిలించి తెచ్చిన పుస్తకమెట్టిదో కొంత వివరింపుఁడు?

తండ్రి:—ఇపు డావృత్తాంతము సమగ్రముగ నెఱింగించుటకుఁ గాలము చాలదు. సంక్షేపముగ వివరించి నిన్ను సావధాన పఱచుటయు నవసరముగఁ దలంచుచుంటిని. కారణంబేమన, నిపుడు నాజీవములు దక్కు మార్గమెద్దియుఁ బొడకట్టుటలేదు. ఆస్త్రీ నిక్కువముగ నీకిల్లయై యుండిన నాకెట్టి భీతియుఁ గలుగకుండును. ఆపుస్తకము ప్రాచీనకాలమందొక నొక మనుజుని రక్తమువలన లిఖింపఁ బడియున్నది. అయ్యది విజయేంద్రసింహమహీపాలునకు విక్రమతిలస్మమందు లభించి యున్నది. ఆతిలస్మ మందుఁ గారుతాళ్ళతో నిర్మింపఁబడియుండిన బారహాదరీయందొక సింహాసనము పైనొక చిన్న తాతి మందసము గలదు. దానిని

దాఁకిన మాత్రమున నే మనుజుఁడు మూర్ఛాగతుఁ డగు చుండెను.

నేను:-ఔను! మీరీకథనంతయుఁ బూర్వమే నాకుఁ దెలిపియుంటిరి. సింహాసనముపైఁ గల జూతిని దాఁకిన మాత్రముననే మనుజుఁడు మూర్ఛాగతుఁడగు చుండెననియు, వాస్తవమం దది యొక మందసమనియు, దానియందేదియో యపూర్వపదార్థములు విజయేంద్రసింహ మహీపాలునకు లభించి యుండెననియు వివరించి యుంటిరి.

తండ్రి:-నిక్కువము! నిక్కువము!! ఇపుడు నాబుద్ధి స్థిరముగ లేదు. తత్కారణంబున ననేక విషయములను మఱచిపోవు చుంటిని. ఒక చిన్న మందస మనఁదగు నాజూతిపలక నుండియే, రక్తముతో వ్రాయఁబడి యుండిన పుస్తకమును నమూల్యమగు పచ్చల తురాయియు వానికి లభించి యుండెను.

నేను:—ఆపుస్తకమం దేమి లిఖింపఁబడి యున్నది.?

తండ్రి:—విజయేంద్రసింహ మహీపాలుని వలన ఖండింపఁ బడక మిగిలియున్న తిలస్మము యొక్క రహస్యములు దానియందు వ్రాయఁబడి యున్నవి. మఱియు నామహీపాలుని తనయులా తిలస్మమును ఖండింతురను ప్రతీతియుఁ గలదు.

నేను:—ఆగొప్ప తిలస్మము యొక్క రహస్యమంతయు నాపుస్తకమందు లిఖింపఁబడి యుండెఁగదా! విజయేంద్రసింహ మహీపాలుఁడు దానిని ఖండింపక నేల విడచివైచెను?

తండ్రి:—కేవల మాపుస్తకము తోడ్పాటుననే తిలస్మము ఖండింపఁబడదు. కాని, యాపుస్తకమెవని యొద్దనుండునో వానికి దానివలన తిలస్మవృత్తాంత మంతయుఁ దెలియఁగలదు. మఱియు నతఁడు గోరిన నాతిలస్మమందుఁ బ్రవేశించి దాని

యందు యథేచ్ఛగ విహరింపఁ గలఁడు. ఆదురాత్మురాలు
తన్నా తిలస్మమందు విహరింపఁజేయుటకు నన్ను బాధించి
యున్నది. ఆమె చేయూనుట వలననే నేనీ యపరాధమును
జేసితిని. మఱియు నామె యాపేక్షితము దీరిన పిదప నాపుస్తక
మును యథాస్థానమున జేర్చి వచ్చుటకుఁ దలంచితిని.
కాని, యామె వేషధారిణియగు కారణంబున నేను వంచిం
పఁబడితినని యిపుడు దెలిసికొంటిని. మఱియు నామె కా
తిలస్మముతో నెట్టి సంబంధమేనియుఁ గలిగియుండుట నిర్ధా
రాదాంశము. ఇదియునుగాక యాపుస్తకము మరలఁ జేజి
క్కుట కష్టసాధ్యము. ఆశ్చర్యము! నేనాపుస్తకమును దొంగి
లించి విజయేంద్రసింహ మహీపాలుని యంతఃపురమునుండి
వెడలు సమయంబున వాని నైయ్యారుఁ డొకఁడు నన్ను
గాంచి యుండెను. నేను వాని దృష్టిపథమునుండి తప్పించు
కొని పాఱిపోవుటకు నాతలప్రాణము దోఁకకువచ్చినది. నేనా
పుస్తకమును మరల నాతావునకుఁ జేర్చినచో, నన్ను వార
లు వెదకకుందురని తలంచి యుంటిని. కాని, అకటా! అది
యిపుడు వేఱొండువిధముగ మాఱియున్నది.

నేను:—మీరాపుస్తకమందలి సంగతులను జదివియుంటిరా?

తండ్రి:—(కన్నులనీరునింపుచు) దాని యందలి మొదటి పుట
మాత్రము చదివితిని. దానియందాపుస్తక మెవనివద్ద
నుండునో వానికి తిలస్మమనుజుల వలన నెట్టి దుఃఖమును
గలుగఁ జాలదని వ్రాసియుండెను. ఏమైన నేమి? ఇపుడా
విషయము లన్నింటిని ముచ్చటించుట కదను గాదు.
ఇపుడు సాధ్యమగు విధంబున నాపుస్తకము నామాయల
మారి యొద్దనుండి తీసుకొనవలసి యున్నది. లెమ్ము!

నా వెంటరమ్ము!

ఇవ్విధంబున బలికి నాతండ్రి యచటనుండి లేచి యాచావడి వెలుపలకు వెడలెను. నేనును వానిని వెంబడించితిని. పిదప నతఁడు నాతో "నీవీ మెట్లయొద్ద నిలచి యుండుము. నేను పైకి వెడలెదను. మఱియు నేను పిలచిన తక్షణమే సౌధోపరిభాగమునకు రావలయు" నని తెలిపి, నాతండ్రి మేడపైకి వెడలెను.

నేనచట నొక గంటకాలము దనుక నిలచి యుంటిని. తదుపరి నాసౌధమందుఁ గొందఱు మనుష్యులు పోరుసల్పు చుండినటుల ధ్వని వినుపించుటచే నేనచట నిలువఁజాలనైతిని. చేతఁ గైదువును ధరించి నాసౌధముపై నెక్కి నిర్భయముగ నాతండ్రియుండిన గదిలోనికిఁ బ్రవేశించితిని. అపు డాసౌధమందు నిస్తబ్ధత బాగుగ వ్యాపించియుండెను. కాని, యచటి హృదయ విదారక దృశ్యమును గాంచి నేను మిగుల భీతిల్లితిని. నాతల్లి యచట లేదు. కాని, నాతండ్రి క్షతగాత్రుఁడై భూమిపైఁ బడి యుండెను. వాని దేహమునుండి రక్తము దోరముగఁ బ్రవహించుచుండెను. నేను మిగుల సంభ్రమచిత్తంబుతో వాని సమీపమున కేగి యతఁడు మూర్ఛగతుఁడై పడియుండుటఁ గనుగొంటిని. వాని శిరముపైనను చేతిపైనను గాఢమగు గాయములు దగిలి యుండెను. ఆగాయములనుండి విస్తారముగ రక్తము ప్రవహించుచుండెను. అంత నాకట్టుపుట్టమును జించి నీటితో నాగాయములను గడిగి కట్టుకట్టినపిదప వానికిఁ జైతన్యము గలిగించుటకుఁ బ్రయత్నింప సాగితిని. కొంత సేపటి కతఁడు దెలివినొంది లేచి కూర్చుండెను.

నేను:—మీరొక స్త్రీ వలన నిటుల గాయపడుట మిక్కిలి విచారకరము.

తండ్రి:—కేవల మొకస్త్రీయే కాగు. నేనిచటి కరుదెంచిన పిదప

నిచటఁ గొందఱు మనుష్యులను గాంచితిని. వారి వలన నాకిట్టి గతి సంభవించినది. ఆశ్చర్యము! నాకాపుస్తకము చేఁజిక్కదయ్యెను. నాజీవిత మూరకయె విధ్వంసముగా నున్నది.

నేను:—ఏమి! యీవింత! వార లీగృహములోని కేమార్గమున నరుదెంచి తమ కార్యమును దీర్చుకొని పోయిరో తెలియదు. ఇట్టి విచిత్రములే మున్ను గూడ కొన్ని మాఱులు చూపట్టి యున్నవి.

తండ్రి:—కానిమ్ము! ఏదియో జరిగినది. ఇపుడు నేనిచటినుండి వెడలి పోవుచున్నాను. నేను గుప్తరూపమున మెలంగుచు నాకృతకార్యఫలము ననుభవించెదను. ఆపుస్తకము చేఁజిక్కి నాశిరమునుండి యీయపరాధ కళంకమును దొలఁగించుకొనఁ గలిగిన మరల నరుదెంచి నిన్నుఁ గలసికొందును. లేనిచో, నిఁక నా హరి కటాక్షము. నీవీ మందిరమును విడువకుము. నీవు కని విని యుండిన విషయముల జాడ నరయు చుండుము. మఱియు నీయింటఁ గల ధనమును గడు జాగరూకతతోఁ గాపాడు చుండుము. ఇంతియెగాక, నీకు సాధ్యమగు విధంబున నీతల్లి పోఁబడియు నరయు చుండుము."

నాతండ్రి పలుకుల నాలించి నాకధికాశ్చర్యమగు స్థితి యొదవెను. హృదయము దడదడకొట్టుకొన సాగెను. కంఠము రుద్ధమయ్యెను. మఱియు నాకన్నుల యెదుట నొక తెరను దిగవైచి నటుల దోఁచెను. నేను వానితో నేమియో పలుక దలంచితిని. కాని, నోట నొక మాట నైనను వెడలదాయెను. నేను చూచు చుండగనే నాతండ్రి యిలువెడలి యేమార్గము ననుసరించి వెడలెనో నాకుఁ దెలియదు. నాకీప్రపంచ మంతయు శూన్యముగ

దోఁచెను. తలిదండ్రుల యెడఁబాటు వలన నన్నొక శవముకంటె హీనముగఁ దలంపసాగితిని. మాయింటఁ దొడరిన యావిచిత్ర సంఘటనము గొలఁదిగొప్ప మాసేవకులకును పరిచారికలకును దెలిసియుండెను. కాని, నేను వారికి బాగుగ బోధించుట వలన వారలావిషయము వెల్లడి చేయక దాఁచి యుంచిరి. నేనధిక కష్టంబున నెటులనో యామందరమున నివసించుచు గడచిన విషయముల జాడ గనుగొన బ్రయత్నించుచుంటిని.

నేనొకనాఁడు రాత్రిసమయంబున నైయారీసామానుల నలంకరించి కొని యాసమాధిమందిరము నొద్దకుఁ బోయి నొక చింత మ్రానిపై నెక్కి కూర్చుండి, నాదురదృష్టమును గూర్చి విచారింప సాగితిని. అట్టి తరుణంబున నాసమాధిమందిరము నుండి యొక మనుజుఁడు వెడలి ప్రాగ్దిశ వైపునకు దారిపట్టెను. నేను వెంటనే యావృక్షము నుండి దిగి సద్దు సేయక వాని వెన్నంటి పోఁదొడంగితిని. కాని, వాని కావిషయము గొంచమైనను దెలియదు. వాని చేతి యందొక గుడ్డసంచిగలదు. ఆసంచి గొప్ప గొప్ప జమీందారులును, పృథ్వీశులును, మహారాజులకు లేఖలను బుత్తెంచు సమయమున నుపయోగించు దాని విధంబున నుండెను. నేనాసంచిని గాంచినంతనే యేయుక్తినైన వాని చేతినుండి దానిని సంగ్రహింప వలయునను గోరిక తటాలున నాహృదయమందుఁ దోఁచెను. దాని వలన నాయుద్దేశ్యము గొంతవఱకు సఫలము గాఁగలదని నేను దలంచితిని. ఆనిశా సమయమున నాకాసంచి బాగుగఁ జూపట్టుటలేదు. కాని, మేము మార్గమున జనుచుండు సమయమున యెదుటివైపున కటకటముల వలన బంధింపఁ బడి యుండిన యొక దుకాణము లోపలి నుండి దీపపు వెలుతురు వెలుపలి రాజమార్గముపైనను, దాని ముందునుండి వెడలు వారిపైనను బడుచుండెను. ఆవెలుతురునందే

వాని చేతి యం దొక సంచియుండుట నేను పరికించితిని. సంచిని లాగుకొను విషయమున నా యుద్దేశ్యము వెంటనే స్థిరపఱచుకొని యతిరయంబున వాని డాసి వీఁపుపై బలపూర్వకముగ నొక తాఁపుఁదన్నితిని. అతఁడా వ్రేటును సంభాళించుకొనలేక తటాలున భూమిపైఁ గూలఁబడెను. ఆసంచి వాని చేతినుండి జారి దవ్వునకు బోయి పడెను. నేనతిరయంబున నాసంచిని దీసికొని నాసామర్థ్యము గొలఁది యతివేగంబుగ నచటినుండి పరుగిడ సాగితిని. కొంతసేపటి కామనుజుడు నన్ను బట్టుటకు నావెనుకఁ బరుగిడి వచ్చుచుండినటుల నాకుఁ దోచెను. కాని, నేను సందు గొందులయందు దూరుచు వానిచేఁ జిక్కక నాగృహమునకుఁ బారిపోయితిని. ఆసమయంబున నా గృహద్వారమునొద్ద రఘునాథసింహుఁడను సేవకుఁడు గావలి గాయుచుండెను. అతఁడు మిగులఁ బొట్టివాఁడు. బలాఢ్యుఁడు. చతు రుఁడు. కొన్ని దినములనుండి నాతండ్రి వానిని మాయింట ద్వారపా లకునిగ నియమించి యుంచెను.

నే నవ్విధంబున బరుగిడి వచ్చుటఁ గాంచి యాసేవకుఁడు దత్కారణమును బ్రశ్నించునని తలంచితిని. కాని, యతఁడేమియుఁ బలుకక గృహద్వారమును దెఱచెను. నేను గృహమందుఁ బ్రవేశించి నా శయనాగారములోని కేగితిని. దానియం దొకదివ్వె బాగుగ వెలుఁగుచుండెను. నే నాసంచిని దెఱచి దానియందలి జాబును వెడ లించి చదువుట కెంతేనియుఁ గుతూహలాయత్తచిత్తుఁడనై యుం టిని. తత్కారణంబున నేను వెంటనే యాదివ్వె సమీపమున కేగి యాసంచి విప్పి చూచితిని. దానియం దొక జాబును నొక తాళపుఁ జెవియుఁ గలవు. ఆతాళపుఁజెవి యతివిచిత్ర విధంబున నిర్మింపఁ బడి యుండెను. దానియందుఁ గొన్ని చిన్నచిన్న బెజ్జములు గలవు. నే నాతాళపుఁజెవి నా కతుపాలయందుఁ బదిలపఱచిన పిదప నాజా

బును జదువ నారంభించితిని. దానియం దీదిగువను లిఖించిన విధం బున వ్రాయఁబడి యుండెను.

శ్రీమతి 108 మోహినీదేవి సన్నిధికి:—

కొన్ని నెలల పరిశ్రమ నేఁడు సఫలంబయ్యెను. మీరు నన్నే కార్యమందు నియోగించి యుంటిరో యయ్యది యీశ్వరుని కృపా తిశయంబునఁ బూర్ణలాభము నొందియున్నది. "రిక్తగంథము" నాచేఁ జిక్కినది. * హారీత వారమున రోహిణీగడ తిలస్మత్ఖానా యందు బలిమండపమునొద్ద నన్ను గలసికొని యాపుస్తకము నా స్వాధీనము చేయుమని మీరు వ్రాసి యుంటిరి. మీ యాజ్ఞానుసార మానాఁడు రోహిణీగడ తిలస్మత్ఖానాలోనికిఁ బోయి యుంటిని. కాని, యచట మీసందర్శన లాభము నాకుఁ గలుగదయ్యెను. నేను మరల నచటి నుండి రిక్తగంథమును దీసికొని పోవుటకు నాకు సాహసము గలుగ దయ్యెను. కారణంబేమన, నాత్ఖానయం దైయార శేఖరుఁడగు నభయసింహుని గుప్త ప్రభుత్వము చెల్లు చుండెను. వాని యనుచరులగు నైయ్యారులు నలువైపుల నుప ద్రవములను గలిగించుచు సంచరించు చుండిరి. నేనచ్చోటునుండి మరలు సమయంబున నేనైయారుని కంటనైన బడుదుననియు నాయొద్ద నుండిన రిక్తగంథము నాతడు బలత్కార పూర్వంబుగ లాగుకొనఁ గలఁడనియు, దాన, నధికానర్థము సంభవింపఁ గల దనియుఁ దలంచి, మీరు నాకొసంగియుండిన తాళపుఁజెవితో నిరువది నాల్గవ నంబరు గదిదెఱచి దానియం దాపుస్తకమును భద్రపరచి రిక్తహస్తంబుల వెలుపలకు వెడలి వచ్చితిని. భగవం తుని కృపాతిశయంబు నన్నేయయ్యారుఁడును గాంచి యుండలేదు. కాని, విషూచికావ్యాధి నన్ను వివశునిగఁ జేసి వైచెను. నేను

* హారీత యనగా దేవీ పూజాదినము.

మిమ్ము సందర్శించి సర్వము విన్నవించు కొనుట కశక్తుఁడను. నిరుపాయుఁడనై యుంటిని. నేఁ డకస్మాత్తుగా నన్నుఁ గలిసి కొనిన యొక మిత్రుని మూలమున మీ కీ తాళపుఁజెవి నందఁ జేయుచుంటిని. ఈ తాళపుఁజెవి లేనిదే యెవ్వరును నా యిరువది నాల్గవ నంబరు గది లోనికిఁ బోఁజాల రని నా సంపూర్ణ విశ్వాసము. మీకుఁ దరుణము చేకూరినపుడా గ్రంథముఁ దీసి కొనియెదరు గాక! మిగత సమాచార మీ వార్తావహుని వలనఁ దెలియఁ గలదు. సవిస్తరముగ వ్రాయుటకు నాకు శక్తి చాలదు. ఇఁక నీకృపారాముఁడు బహుశః మీచరణ కమలంబుల సందర్శింపఁ జాలఁడు. ఒకవేళ భగవంతుని కృపావిశేషంబున నా కారోగ్య లాభ మొదవిన పటనా మీఁదుఁగా నరుదెంచి మీసేవయం దుపస్థితుఁడ నగుదును. అటుకానిచో, నీకృపారాముఁ డీజగతి వీడిపోయెననియే భావింపుఁడు. ఈజాబు మీకుఁ జేరిన వెంటనే జైమినీప్రసాదు తల్లిని తుదముట్టింపుఁడు.

ఇట్లు
మీ సేవకుఁడు,
కృపారాముఁడు.

ఆజాబుఁ జదివినంతనే నాహృదయకళిక వికసించినది. మఱియు నాతల్లి యింకను జీవించియుండెనని నాకు నిశ్చయ మయ్యెను. నేనధిక ప్రమోదభరితమానసుఁడనైతిని. ఆలేఖ గమ్య స్థానమునకుఁ జేరినచో నిస్సహాయయగు నాతల్లి ప్రాణములు దక్కుట మిగుల కష్టతరంబగును. నేనెవ్వరిని వంచించి యాజాబుఁ జేఁజిక్కించుకొంటినో యతఁడు కృపారాముని మిత్రుఁడని యూహించితిని. ఆజాబును తాళపుఁజెవియు నొక నల్లని గుడ్డసంచియం దుఁ గలవు. ఆజాబుపై విలాసము మోహిని పేర వ్రాయఁబడి యుం

డెను. తత్కారణంబున నీవేఁకరము లన్నింటికి ముఖ్యకారకురాలు మోహిని యనియే తేలుచుండెను. నేను మోహినిని బాగుగ నెఱింగియుంటిని. త్రిలోచనేశ్వర మహాదేవుని మందిర సమీపమున మిగుల శోభాయమానంబగు నామె మందిరమును దిలకించిన నామె యొక రాకుమరితయను భావ ముదయింపక మానదు. కాని, యది సరికాదు. ఆమె హద్దుమీఱిన ధనమును వెచ్చించుచుండెను. ఆమె యటు లమిత ధనమును వెచ్చించుట కామెకు రాఁబడి మార్గ మెయ్యదియో యెవరికినిఁ దెలియదు. మఱియొక విషయము గలదు. ఆమె ప్రచలితంబగు నాచరణముల యెడ దృష్టినిడక వెల్లడిగాఁ బాలకీ యందును నప్పుడప్పు డశ్వారోహియయ్యు నతివిభవోపేతంబుగ సంచరించు చుండును. తత్కారణంబునఁ గాశీనగర మందలి యాబాలగోపాల మామె నెఱుంగుదురు. నేనా జాబును జదివిన తోడనే నాతల్లియదృశ్య మయిన సందర్భమున మోహిని కధిక సంబంధము గలదనియు, నాతల్లి యిపు డామె హస్తగతంబునఁ గలదనియు నాకు గట్టి నమ్మకము దోఁచెను. ఏయుపాయాంతరమున నేనియు నాతల్లిని విడిపించి రిక్తగంథమును గూడ చేఁ జిక్కించుకొన వలెనని యోజింపసాగితిని. ఆయాలోచనయందుఁ గొన్ని దినంబులు గడచెను. నాచేఁ జిక్కియుండిన తాళపుఁ జెవిని నాయింట నుంచక వేరొక రహస్య స్థానమందు భద్రపరచి యుంచితిని.

జైమినీప్రసా దింత దనుకఁ దన వృత్తాంతమును వర్ణించి యొక వైపునకుఁ జూడసాగెను.

అభయ:— మంచిది. తరువాయి వృత్తాంతమును వివరింపుము! నీచారిత్రము మిగుల మనోరంజకమైనది! మఱియు నయ్యది మాకు మిక్కిలి సంబంధించి యున్నది.

జైమినీ:—నిక్కువము. నేనిపుడు వచియించి యుండిన విషయము
లను బట్టి నాతండ్రి యపరాధము ........"

అభయ:—నీమనోగతాభిప్రాయమును నేను గుర్తించితిని. భీతిల్లం
బనిలేదు. నీతండ్రి మాయెడల గురుతరాపరాధ మొనరించి
యుండినను, మా భూపాలుండు రిక్తగంథ చోరుని బట్టి
తెచ్చిన వానికిం గోరిన బహుమాన మొసంగెద నని ప్రక
టించి యుండినను, నీవు నిర్మలమానసంబుతో యావద్విష
యములను వక్కాణించు చుంటివి. కావున, నీతండ్రి యప
రాధమును మన్నింపం జేయుదు నని ప్రతినం జేయుచుంటిని.
నీవు మాయెడల నెట్టి యుపకారమును జేయం దలంచుచుం
టివో మఱియుం జేసెదవో తదర్థమై ధన్యవాద పూర్వకం
బుగం దగురీతి బహూకరింపం బడుదువు. ఇంక నీచారిత్ర
మును సాంగముగం జెప్పి వినిపింపుము. దాన, మాకుప
యోగకరములగు ననేక విషయములు వెల్లడిగాంగల వను
ట కెట్టి సందియమును గలుగదు. కాని, ప్రకృతము రిక్త
గంథము నీహస్తగతంబునం గలదా? అది మాకు లభించు
నను నాశ గలిగియుండనగునా? ఈ విషయముల నవశ్యము
వినం గోరుచుంటిని.

అభయసింహుని పలుకులకు జైమినీప్రసాదు ప్రత్యుత్తర
మొసంగుటకుం బూర్వమే "రిక్తగంథ మిపుడు జైమినీప్రసాదు
హస్తగతమందు లేకుండినను, మీరద్దానిని బడయుటకు యోగ్యు
లని యెపుడు స్థిరపడునో, యపుడు దానిని మీరు బడయం జాలు
దు" రని కొంత దవ్వున నుండి యొక ధ్వని వెడలివచ్చెను. మఱియు
నెవ్వరో కిలకిల నవ్వుచుండిన సవ్వడియు వారికి వినిపించెను.

ఆ ధ్వని యభయసింహ జైమినీప్రసాదు లిరువురను జకితుల
నుగ నొనరించెను. అయ్యది పగతుని యాగడమని వారికిం దో

చెను. మాయారాణి యొక్క యేమైయ్యారుడో మఱుఁగుపడి తమ సంభాషణము నాలించు చుండెననియు, నచటి నుండి ప్రాణములను దక్కించుకొని పారిపోవుట కష్టసాధ్య మనియు జైమినీ ప్రసాదు దలంచుచుండెను. జైమినీప్రసాదు మూలమునఁ దమకుఁ గొంత మేలు గలుగఁగల దను నేయాశ యభయసింహునకుఁ గలిగి యుండెనో యయ్యది యిపుడు నిరాశగఁ బరిణమించెను.

అభయసింహ జైమినీప్రసాదు లిరువుర నెవని కంఠధ్వని చకితులనుగ నొనరించి యుండెనో వాని నెఱుకు తలంపుతో నా యిరువురు నచ్చోటువాసి ధ్వని నిర్గమించి యుండిన దెసకు బయలు దేరిరి. కాని, వార లధికముగ బ్రయాసము నొందు నవసరము గలుగలేదు. వారలు ముందునకు రెండు మూఁడడుగులు బెట్టుటకుఁ బూర్వమే, "మీరు వ్యర్థముగ నేల శ్రమగొనియెదరు? అచట నిలువుఁడు. నేను స్వయముగ మీచెంత కేతెంచు చుంటి" నని మరల నొక ధ్వని వారికి వినిపించెను. మఱియు వెంటనే యొక మనుజుఁడు వారి దృష్టిపథమునకుఁ జిక్కెను. అతఁ డాయిరువురను సమీపించిన తోడనే, "అభయసింహ జైమినీప్రసాదులారా! మీ రిరువురు నన్ను బాగుగ గుర్తించుకొనుఁడు. నేను సమయానుసరణి నప్పుడప్పుడు మిమ్ముఁ గలసికొను చుందు" నని పలికెను.

అభయసింహ జైమినీప్రసాదు లిరువురు వాని వైపునకు గాఢదృష్టి నిగుడించి చూడ సాగిరి. అతఁ డొకపొట్టివాఁడు. చామనచాయగల వాఁడు. దట్టమగు నల్లని మీసములు, గడ్డము వాని మోమును సగము భాగము వఱకుఁ గప్పి యుంచెను. నేత్రములు గడు విశాలములు. అవి మెరపుబోఁటి బాగుగ మెఱయుచుండెను. వాని దేహము మిగుల దారుఢ్యముగలదిగఁ బొడకట్టుచుండెను. వాని నుదుట నాలుగంగుళములు వెడల్పుగల పట్టెవర్థన

మొకటి గలదు. చూపఱ దృష్టి యన్నిటికంటె ముందుగ నానామ మాకర్షించు చుండెను. అట్టి యవస్థయందుఁ గూడ వాని మోము దమ్మి మిగుల శోభావంతముగను నపూర్వసౌందర్యగరిమ తోడను విరాజిల్లుచుండెను. అట్టి యగనున జూపఱ మానస మతఁ డాకర్షించుచుండు టొక వింతవిషయముగాదు. అతఁ డమూల్యవస్త్రములను ధరించి యుండెను. నల్లని పాయజామయు నెరసిని యంగరకాయు నతఁడు దొడిఁగి యుండెను. వాని యంగరకా జేబునం దేవస్తువులో నిండియుండెను. అతఁడు దలకుఁ జుట్టుకొని యుండిన యాకువచ్చని పట్టు తలపాగ వైపునకు దృష్టి సారించిన నగవు పుట్టి వచ్చుచుండెను. వాని నడికట్టునం దొకకైదువును జేత నొకకైజారును గలవు. అభయసింహుఁడు గాఢదృష్టి వానివైపునకుఁ బరికించి, "నీనామ మెయ్యది" యని ప్రశ్నించెను. దానికి బ్రత్యుత్తరముగ నాతఁడు "నన్ను 'పిశాచ' మని పిలువనొప్పు" ననెను.

అభయ:-నీవా పేరునకుఁ దగిన వాఁడవు గావని నా యభిప్రాయము.

పిశాచ:-మీాయిష్టము. మీారెవ్విధంబున దలంచినను దలంపుఁడు."

అభయ:—పోనిమ్ము! నీ విచటి కేల యరుదెంచితివో దాని నైనను దెలుపఁ గలవా?

పిశాచ:—ఆఁ! బంధీకృతులైె యీాతోఁటలోని కేతెంచి యుండిన యపరాధులు రేపటి సాయంకాలమున ఖండింపఁ బడుదురనియు, నీతోఁట యందలి నీటి బోదుల యందు వారి రక్తము ప్రవహింపఁ గలదనియుఁ దెలుపుట కేతెంచితిని.

అభయ:—వార లెందఱో, వారి నామము లెవ్వియో వివరింపఁ గలవా?

పిశాచ:—వార లందఱుఁ గలసి యెనమండ్రుగురు. ఒకటి:-విజయేంద్రసింహుఁడు; రెండు:-కరుణాదేవి, మూఁడు:-మహేం

ద్రిసింహుఁడు, నాల్గు:-నరేశసింహుఁడు, అయిదు:-చంద్రకళ, ఆఱు:-మదాలస, ఏడు:-అభయసింహుఁడు, ఎనిమిది:-జైమినీప్రసాదు.

అభయ:—(తొటుపాటుతో) రాకుమారులు మున్నగు వారలు మాయారాణి మాయాజాలమందుఁ జిక్కి యిచట బంధింపఁ బడియుండుట నేనెఱుంగుదును. కాని, విజయేంద్ర మహీపాలుఁడును గరుణాదేవి........."

పిశాచ:—వారిరువురు గూడ బంధింపఁ బడి యిటకుఁ గొనితేబడిరి. ఈవృత్తాంతము జైమినీప్రసాదు గూడ నెఱింగి యుండెను.

జైమినీ:—(అభయసింహునిదెసఁగాంచి) ఔను. నాచారిత్రము పరిసమాప్తి నొందిన పిదప మీకాపమాచార మెఱిఁగింపఁ దలంచుచుంటిని. కాని, వార లెవ్విధంబున మాయారాణి హస్తగతమందుఁ జిక్కిరో యావిషయ మింకను నాకుఁ దెలియదు.

పిశాచ:—(జైమినీప్రసాదుతో) చాలును. ఇఁక సంభాషించుటకు సమయము చాలదు. అభయసింహుఁడు దనకు సాధ్యమగు విధంబున వారిని మృత్యువాఁతనుండి తప్పించుటకుఁ బ్రయత్నింపఁ గలఁడు. నీవు నావెంట రమ్ము. నడువుము.

జైమినీ:—నీపై విశ్వాస మిడి నేను నీ వెంట నేల రావలెను?

పిశాచ:—(కుటిల దృష్టి వాని వైపునకుఁ బరికించి) ఏమంటివి? మూర్ఖుఁడా! ఇటు రమ్ము. నీచెవియం దొక మాటఁ జెప్పెదను.

ఇవ్విధంబున బలికి పిశాచ మచటి నుండి నాలుగైదడుగులు వెనకకుఁ దొలఁగి నిలచెను. వాని మాటల యం దెట్టి

ప్రభావము గలదో మనకుఁ దెలియదు. జైమినీప్రసాదు వాని మాటలకు మాఱు పలుకక వెంటనే వాని సమీపమునకుఁ బోయి నిలచెను. మఱియు నతఁ డన్నివిధంబుల జాగ్రత్త గలిగి యుం డెను. వాని కుడిహస్తము కైజారు పిడితో వియ్యమందుచుండెను. అంతఁ బిశాచి వాని వైపునకుఁ గొంచె మొఱిగి వాని చెవియం దేదియో వచియించెను. ఆవచనముల నాలించినంతనే జైమినీప్ర సాదు గలవరపాటుతో రెండడుగులు వెనుకకుఁ దొలఁగెను. మఱి యుగాఢదృష్టి వానివైపునకుఁ బరికింప సాగెను. అతఁడు గొంత సేపటివఱ కట్టి స్థితియందే నివ్వెరపాటుతో నిలచి యుండి తదు పరి నభయసింహుని వైపునకుఁ గాంచి, "మహాశయా! క్షమిం పుము. నేనిపుడు వీని వెంటఁ బోవకదీరదు. నిరుపాయుఁడను. నేను బాగుగ వీని హస్తగతమందుఁ జిక్కి యుంటిని. వేయేల? తుదకు నాప్రాణములు గూడ వీని కరతలమందుఁ గలవని భావింపవచ్చు" నని పలికి జైమినీప్రసా దాపిశాచము వెంట నేగుటకు సంసిద్ధుఁడ య్యెను. పిశాచమును వానిని వెంటఁ దోడ్కొని యచటి వృక్ష శ్రేణులయందుఁ జొచ్చి చూచుచుండగనే యభయసింహుని దృష్టి పథమునుండి యదృశ్యమయ్యెను.

ఇపుఁ డభయసింహుఁడు శంకాశ్చర్య నిమగ్న మానసుఁ డగుచు నచట నొంటరిగ నిలచి పోయెను. నలువైపుల నుండి యనేక యోజనలు పరుగులు వాఱుచు వచ్చి వానిని చుట్టు డించెను. జైమినీప్రసాదు చారిత్రము వలన వాని కనేక రహస్య ములు వెల్లడి యయ్యెను. ఇంకను గొన్ని మర్మములు దెలియఁ గలవని యాతఁ డాసించు చుండెను. కాని, యతఁడు దన చారిత్ర మును బరిసమాప్తి నొందించుటకు మున్నె యాపిశాచ మరుదెంచి వాని యాశాలతను ద్రెంచి వైచెను. తత్కారణంబున వానికి

గలిగియుండిన శంకాశ్చర్యములు పూర్వముకంటె నగ్గలంబయ్యెను. జైమినీప్రసా దెట్టి వంచనయులేక 'నిర్మలమానసంబుతోఁ దన చారిత్రమును వచియించు చుండెనని, వాని వాగ్ధోరణిని బట్టి యభయసింహునకు విశ్వాసము గలిగి యుండెను. వాని చారిత్రమందీపిశాచమునకు సంబంధించిన విషయ మెద్దియు వెడల కుండుటచే నతఁ డివ్విధంబున యోజింపసాగెను:-

"ఆశ్చర్యము! ఈపిశాచ మెవరు? ఆతఁడు జైమినీప్రసాదు చెవియం దేమి వచియించి యుండెను? దానిని వినిన మాత్రమునే యీతఁ డక్లేల యధీరుఁడయ్యెను? కటకటా! దిగంతయశోవిశాలుఁడగు విజయేంద్రసింహ మహీపాలుఁడు దన యర్ధాంగితోడను పుత్రరత్నంబుల తోడను శేముషీదురంధరులగు నైయారుల తోడను ననతి కాలంబులోనే చంప బడునను విషాదకరంబగు వార్త నాపాడు వీనులకు వినిపించెఁ గదా; ఆసేతు హిమాచల పర్యంతము దన యనుపమ సద్గుణ పుంజములను వెదజల్లి యతులనీయంబగు ప్రఖ్యాతి నార్జించిన నృపాల శేఖరునకా, యిట్టి యకాల మరణము సంభవింపనుండుట! ............కటకటా............ ఆదయామయుండగు పుండరీకాక్షుఁ డిపుడేమి సేయదలంచి యుండెనో తెలియదు. మానవమాత్రుని బుద్ధి సాహసము లిట్టి కుటిల సమయమందే పరీక్షింపఁ బడుచున్నవి. కానిమ్ము! నామైయారీ కక్షపాలయుఁ గైదువు నెచటికిఁ బోయి యుండలేదు గదా? సాధ్యమగునంత శీఘ్రముగ నేయుపాయాంతర మేనియు యోజింపవలసి యున్నది. ఇట్టి విధంబగు యోజన యందును గంభీర చింతయందును నభయసింహుఁడు మునింగి యుండెను. అంత గొంత దవ్వున నుండి తన దెస కేతెంచు చుండిన మాయారాణిపై వాని దృష్టి పడెను. ఆసమయంబున నామె వెంట నిక్రంపుఁ

గాంచనసింహుఁడును (వాని రూప మంతదనుక నభయసింహుఁడు మార్చి యుంచిన విధంబుననే కలడు) గదాధరసింహుఁడును, మఱి కొందఱు పరిచారకులును గలరు. అప్పుడు దెల్లవాఱి యుండెను. కమలబాంధవుని యరుణకాంతులు పాదపాగ్రములకు బంగరు పూఁతఁ బెట్టుచుండెను.

తిలస్మమహారాణియును మాయారాణి గర్వోద్ధతి నడచుచు నభయసింహుని వైపున కేతెంచుచుండెను. కాంచనసింహుఁ డభయసింహుని మిక్కిలి సమీపించి వానితోఁ "గాంచనసింహ ధర్మావతారుఁడా! నీదేహారోగ్య మెటులున్నది? ఉన్మత్తత నిన్ను వీడి యున్నదా?" యని ప్రశ్నించెను.

అభయ:—(సగర్వముతో) ఇఁక నన్నుఁ గాంచనసింహుఁ డని పిలువ నగత్యము లేదు. కారణంబేమన, నాయున్మత్తుఁడు రాజకంఠీరవుండగు విజయేంద్రసింహ మహీపాలుని వైయ్యారులలో నొక్కరని మీకుఁ దెల్లమయి యుండెను. మఱియు నాయున్మాదుఁడు వాస్తవముం దైయ్యార శేఖరుఁ డగు నభయసింహుఁ డని యెఱుంగుటచే మీకు మితిలేని యానంద మలవడి యుండును. ఇంతియగాక, పెంపొందుచుండిన వాని ధైర్య సాహస పరాక్రమములను బ్రతిఘటించుట కీ ప్రపంచమం దొక్కఁడైనను లేఁడనియు, నిట్టి బంధనాస్త్రమందు సహిత మతఁడు గొలఁది గొప్ప చేయ సమర్థుఁడని మీరు బాగుగ నెఱింగి యుందురు.

కాంచన:-కాని, నీవు దైయ్యార శేఖరుఁడను బిరుదమును నిక్కముగ నిలుపఁ గొనఁ జాలవు. కారణంబేమన, బేరెన్నిక గన్న సిద్ధయ్యారితనమిచట మంటి పాలాయెను. మఱియు శీఘ్రముగనే బహుమాన పురస్సరంబుగ నీకరంబులు శృంఖలంబుల నలంకరింపఁ గలవు.

అభయ:—నీవు నాహైమెయూరికతనమును ఙందుపడఁ జేసి యుండిన నాహైమెయారి కక్షపాలయుఁ గైజారును దీసికొని యుందువు. వానిని నొరుల పాలు గాకుండఁ గాపాడుకొనుటయే హైమెయార శేఖరుని ప్రతిజ్ఞా విశేషము. ఇఁక నీవు వచియించిన శృంఖలము లన్ననో, నాచేతఁ గైజారు గలిగియున్నంత కాల మవినాశరములను ముట్టఁజాలవు. (చేతితోఁ దన కైజారును దీసి చూపి) శృంఖలములను నాహస్తముల కలంకరించుటకు వానిని దీసికొని నాయెదుటకు రాఁగలిగిన హస్త మెయ్యది. అట్టి మేటి మగం డెవఁడు గలఁడు

కాంచన:-ఈసమయమున నీ నేత్రద్వయముననొక్కనినే కాంచుచుండెననియు నావెంట నుండిన యనుచరులను గాంచుట లేదనియుఁ దోచుచున్నది. ఇందుచే నీవొక పిచ్చివాఁడవే కాక గ్రుడ్డివాఁడ వనియు స్థిరపడుచున్నది. కానిచో-........"

కాంచనసింహుని పలుకు లింకను దుదముట్టలేదు. అంతఁ బ్రక్కనుండిన నొక గది తలుపులు దెఱవఁబడి మున్నభయసింహ జైమినీప్రసాదులతో సంభాషించి, జైమినీప్రసాదును వెంటఁదోడ్కొని పోయిన యాపిశాచమే మరల నచటఁ బ్రత్యక్షమయ్యెను. వానిని గాంచి నంతనే మాయారాణికిని నామె యనుచరులకును గలిగిన భయ శంకా సంభ్రమాశ్చర్యములకు మేరలేదయ్యెను. మఱియు నాపిశాచము వెడలి వచ్చిన గది యందింకను గొందఱు మనుజు లుండినటుల వారికిఁదోచెను. కారణం బేమన, నాగది తలుపుల నాపిశాచము బాగుగ దెఱచివచ్చెను. అందువలన నాగదియందుఁ గొందఱు మనుజు లుండినటులఁ గొలఁదిగఁ జూపట్టుచుండెను.

పిశాచ:—(మాయారాణివైపునకును నామె యనుచరుల వైపునకును గాంచి) నేనెవ్వరైనదియు వివరించుట కెట్టియుగత్యమును లేదు. కాని, నేనిట కేతెంచిన కారణమును మాత్రము దప్పక మీకెఱింగింప వలసియున్నది. వినుఁడు! నాకొక పరిచారకుఁడును బరిచారికయుఁ గావలసి యున్నది. మీలో నెవరి నెన్నుకొనవలెనో వచియింపుఁడు! వచియింపుఁడు!! (మాయారాణి వైపునకుఁ జూపి) నేనీమెను నాకుఁ బరిచారికగఁ జేసికొందును. (కాంచనసింహుని వైపునకు సంకేతించి) వీనిని నాసేవకునిగ నియమించుకొనియెదను.

కాంచన:—ఏమి! యీపొగరుఁబోతుతనము! కొంచమైనను జంకులేక మాట్లాడు చుంటివి? నీవెవరవు? (మాయారాణి వైపునకుఁ జూపి) ఈమె యెవ్వరో నీవెఱుఁదుగువా?

పిశాచ:—(పక పక నవ్వి) నాపై నెవ రెట్టి పరుషవచనంబులను బలికినను గోపించు వాఁడను గాను. కారణంబేమన, సృష్టిస్థితిలయ కారణభూతుఁడగు భగవంతుఁడు దక్క నాకంటె నితరు లెవరును ఘనులు గారని నేను బాగుగ నెఱిఁగి యుంటిని. నాయెదుట నిలచి సంభాషించుచుండిన నీకు నాబానిస వానికిఁ గల యోగ్యతయైనను లేదనుట నిక్కువము. (మాయారాణి వైపునకు సంకేతించి) ఈమె యెవ్వరైనదియు నేనెఱుంగక బోలేదు! నీవావిషయమును దెలియఁగోరుచుండిన నాసమీపమున కరుదెంచి నేను వచియించుదానిని జెవియొగ్గి యాలింపుము.

కాంచన:—నీవంచన పలుకులకుఁ జిక్కి మోసపోవుటకు నేనంత యవివేకిని గాను.

పిశాచ:—తెలిసినది. నీవు చెవియొగ్గి నాసమీపమున నిలచునపుడు నీపైఁ బ్రహరింతునని తలంచు చుంటివి కాఁబోలు.

కాంచన:—సందేహమేమి?

పిశాచ:—ఓరీ! భీరుఁడా! అటులగాదు. మతియు నయ్యది మముఁ బోలు పరాక్రమవంతుల కార్యమును గాదు. నీకట్టి బెగడు గలిగి యుండిన నేను నీతో వచియింపఁ బోవు సంగతుల నితరు లెవ్వరు వినకుండఁగ నావలకు నడువుము.

కాంచన:—(కొంచము యోజించి) ఓహో! నేను నినుబోలు దుర్బలులకు భీతిల్లువాఁడను గాను. మంచిది! ఏవేమి చెప్పఁదలంచు చుంటివో వచియింపుము.

ఇవ్విధంబునఁ బలికి కాంచనసింహుఁ డాపిశాచము సమీపమునకుఁ బోయి యతఁ డేమి వచియించునో యని కొలఁదిగ వాని వైపున కొఱగి విన సాగెను.

ఆపిశాచము వానిచెవియం దేమి వచియించెనో తెలియదు. ఆవాక్యములయం దెట్టి ప్రభావము గలదో యెఱుంగఁ జాలము. ఆమాటలయం దెట్టి మర్మమిమిడి యుండెనో దురూహ్యము. అవి కాంచనసింహుని దిగ్భ్రమ జెందిన వానిఁగావశ్యఁ జేసినవి చెను. అతఁడతి సంభ్రమముతో నాపిశాచము వైపునకుఁ జూడసాగెను. వాని మోము జేవుఱించెను. దేహము వడవడ వడంకసాగెను.

పిశాచ:—ఏమి! నేను చెప్పిన మాటలు నీకు బాగుగ వినిపించెనా? లేక యందఱకు వినుపించునటుల గట్టిగఁ జెప్పవలయునా!

కాంచన:—(కరములను జోడించి) చాలుఁజాలును. క్షమింపుఁడు. మరల నావాక్యములను శ్రీముఖమునుండి పునరావృత్తి జేయకుందురు గాక. మీ రెవరైననియు నెఱుంగుటకు నాకెట్టి యావశ్యకమును లేదు.

మాయారాణి:—(కాంచనసింహునితో) ఈతఁడు నీచెవియం దేమి వచియించెను. నీవిటులేల తల్లడిల్లుచుంటివి?

కాంచన:— (చేతులను జోడించి) క్షమింపుఁడు. నేనా వాక్యములు నోట నుచ్చరింపఁ జాలను.

మాయారాణి:—(కఠోర స్వరంబుతో) ఏమి! నేనా సమాచారము వినుటకుఁ దగియుంటినా?

కాంచన:—నేనా వాక్యములను నుచ్చరింపఁ జాలనని మొదటనే తెలిపి యుంటినిగదా?

మాయారాణి:— (కన్నులెఱ్ఱఁజేసి) నీవు నీ ధైర్యశాలిత్వమందలి యభిమానమున మత్తుఁడవగుచుంటివి. నన్ను నీవు మఱచి యుంటివా? లేక నాకుఁగల సామర్థ్యమును విస్మృతిజెంది యుంటివా?

కాంచన:—నన్ను నేనెఱుంగుదును. మఱియు మిమ్ములను మీ సామర్థ్యమును గూడ మఱచి యుండలేదు కాని, నేను వినిన మాటలయందలి మొక యక్షరమైనను వచింపఁ జాలను. మీరు వ్యర్థముగ నాపై నేల కోపించెదరు? దానఁ గలుగు ప్రయోజనమేమి?

మాయారాణి:— అట్లో, నీవుగూడ వేషధారివగు కాంచనసింహుఁడ వనియే తలంపవలయును. మంచిది. కానిమ్ము! (పిశాచము వైపునకుఁ గాంచి) నీ వానంగతుల నితరు లెవ్వరికైనను జెప్పఁ గలవా?

పిశాచ:—ఎవ్వరికైనను సరియే! నాసమీపమునకు వచ్చు వారి చెవియందుఁ జెప్పఁగలను. కాని, యెల్లరకు నొకవిషయమునే చెప్పెదనో, లేక, వేఱ్వేఱు సంగతులను నుడివెదనో దానిని మాంత్రికుఁ డూహించి వచియింపఁ జాలఁడు.

మాయారాణి:—పోనిమ్ము! నీవెవరైనదియు, నీవీకోటలోని కే మార్గమున నరుదెంచి యుండినది యుఁ జెప్పఁగలవా?

పిశాచ:—నన్ను "పిశాచ" మని పిలుతురు. ఇఁక నేనిట కేతెం
చిన విషయమున సర్వవ్యాపకుఁడ నని చెప్పినఁ జాలును.
నేను పోదలంచిన స్థానమునకు నిరాటంకముగఁ బోఁజాలు
దును. నీవేనైనను విన దలంచుచుండిన నాసమీపమున
కేతెంచి యాలింపుము.

గదాధ:—(మాయారాణితో) మహారాణి! మొదట నన్ను వాని
యొద్దకుఁ బోనీయుము! (పిశాచమును దగ్గరించి) నీవేమి
చెప్పదలంచితివో యిపుడు నాచెవియందు నుడువుము.

ఆపిశాచము గదాధరసింహుని చెవియందుఁగూడ నేమియో
వచియించెను. ఆసమయంబున గదాధరసింహుఁడు పిశాచమువైపు
నకు వంగి భూమివైపునకుఁ జూచుచుండెను. పిశాచమటుల
వాని చెవియం దేదియో పలికి వెంటనే రెండడుగులు వెనుకకుఁ
దొలఁగి నిలచెను. కాని, గదాధరసింహుఁ డటులనే వంగియుండి
నిర్జీవప్రతిమవలెఁ జేష్టలుడిగి నిలచియుండెను. ఆసమయంబున వాని
నేనూతనముగఁ జేనియుఁ బరికించిన నాతఁ డొక శిలావిగ్రహ
మని తలంపక మానఁడు. ఈస్థితిఁ బరికించి మాయారాణి యధికా
శ్చర్యము నొందసాగెను. కొన్నిక్షణములు గడచినను గదాధరసిం
హుఁ డట్టులే వంగి యుండి యచటి నుండి కదలకుండుటఁ గని
మాయారాణి, "గదాధరసింహా! గదాధరసింహా!! యని వానిని
పిలువసాగెను. అతఁ డామె కంఠస్వరము నాలించినంతనే త్రుళ్ళి
పడి నలుదెసలఁబరికింపసాగెను. ఆసమయంబున వానిజూడ్కి పిశా
చము వైపునకుఁ బ్రసరించుటచే రిచ్చవడిన మోము నావైపునుండి
మరల్చుకొని కాంచనసింహుని సమీపమునకుఁ బోయి శిరమున
జేయిఁజేర్చి కూర్చుండెను.

మాయారాణి:—గదాధరసింహా! నీవు గూడ గాంచనసింహు

ననుసరించితివా? నీవిపుడు వినిన సంగతులను నాకు వివరింపఁ జాలవా?

గదాధర:—తుదకు మీరు కోపావేశులై నాశిరమును ఖండించుట కాజ్ఞాపింతు రని తలంచియే నేనిటకు వచ్చి కూర్చుంటిని. మీ కోపస్వభావము నేనెఱుంగనిది కాదు. కాని, నిరుపాయుఁడను. నేనేమియు వచియింపఁ జాలను.

మాయారాణి:—(పిశాచము వైపునకు సంకేతించి తన యనుచరులతో) ఈతఁడొక రాయెందపుజాలికుఁడుగఁ దోఁచుచున్నాఁడు. ఈతఁడెవ్వరైనను వీని నిపుడు బంధించుట కాజ్ఞాపించుచుంటిని.

పిశాచి:—మీరేమియు శ్రమనొందఁ బనిలేదు. నేను బంధింపఁ బడుటకే స్వయముగ నిచటికేతెంచి యుంటిని. అరదండలు, సంకెళ్లు నెచటఁగలవో తెండు. వేగమే తీసికొనిరండు.

ఇవ్విధంబునఁ బలుకుచుఁ బిశాచ మామాయారాణి సమీపమున కతిరయంబున నేగెను. ఆమె తన్ను సంభాళించుకొను సరికా పిశాచ మామె వైపునకు వంగి చెవిలో నేమియో పలికెను. ఆవచనముల నాలించినంతనే యామె స్థితి మిగులఁ జెడు గొందెను. కాంచన గదాధరసింహులాపిశాచముపలికిన మాటలను వినిన మీఁదటను గూడ నెవ్వరితోడనైనను సంభాషించుటకుఁ దగియుండిరి. కాని, మాయారాణి కట్టి స్థితియైనను గలిగి యుండ లేదు. ఆమె మోముపై మృతచిహ్నములు వ్యాపించెను. ఎవ్విధంబునను నామె నిలువ లేకపోయెను. దేహము గిరగిరఁ దిరుగ భూమిపైఁబడి మూర్ఛాగతురాలయ్యెను. కాంచన గదాధరసింహులు దక్క మాయారాణి వెంట నేతెంచి యుండిన పరిజనులయం దొక విధమగు కలకలము జనించెను. వారలు తమ మనంబుల "నీపిశాచము

మాచెవులయందుఁ గూడ నేఁడెవ్వరు పలికిన మాటలను నిట్టి దురవస్థయే గలిగింపఁడు గదా" యని భీతిల్లఁ దొడంగిరి.

ఒక గంటకాలము గడచి యుండినను మాయారాణికిఁ దెలివి గలుగ దయ్యెను. ఆపిశాచ మభయసింహుని సమీపమునకుఁ బోయి వాని చెవియందుఁ గూడ నేమియో వచియించెను. దానికిఁ బ్రత్యుత్తరముగ నభయసింహుఁడు "నేను సంసిద్ధుఁడనుగ నుంటి" నని పలికెను.

పిశాచము వెంటనే యభయసింహుని చేయిఁ బట్టుకొని తాను వెడలి వచ్చిన గదిలోనికిఁ దోడ్కొని పోయెను. మఱియు లోపల వైపునుండి యాగది తలుపులను మూసి బంధించి వైచెను. అభయసింహుఁ డాపిశాచము వెంట నేగుచుండుటఁ గాంచియు మాయారాణి యనుచరులలో నొక్కఁడేనియును వాని మార్గమును నిరోధించుటకు సాహసింపఁడయ్యెను. ఎప్పు డాపిశాచ మాకస్మికముగ నా గది తలుపులను దెఱచి వెలుపలకు వెడలి వచ్చునో యప్పు డాగది యందింకను గొంగలు మనుజు లుండిరని దోఁచియుండెనుగదా! అభయసింహుని కిప్పు డాగదియందుఁ దానును నాపిశాచమును దక్క నితరు లెవ్వరును జూపట్టలేదు.

ఇట మాయారాణికిఁ జైతన్యము గలిగిన పిదప నామె కాంచన గదాధరసింహులను బిలువఁబంపి వెంటఁదోడ్కొని తన మహలులోనికి వెడలి పోయెను. ఇప్పుడును కాంచన గదాధర సింహు లిరువురు పూర్వమువలెనే యామె కొలువు నందుఁ గలరు. కాని, పిశాచము దమ చెప్పకుండునటుల శపియించి యుండిన మాటలను మాత్రము నోట వెడలింపఁ జాలకుండిరి. మఱియు వారి కాపిశాచము సంగతి జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల దేహము కంపమొందుచుండెను. మాయారాణికిని సరిగా నట్టి విధంబగు స్థితియే

కలిగి యుండెను. పిశాచము దమ్ము బెదిరించి వేషధారియగు కాంచనసింహుని (అభయసింహుని) చెఱ విడిపించుకొని పోయెనని యామె నిశ్చయించుకొనెను.

## 3

సాయంకాలసమయము. సూర్యభగవానుఁ డస్తమించి యుండినను పశ్చిమదిశయం దింకను నరుణకాంతులు వ్యాపించి యుండెను. శీతల సమీరము మందగతిని వీచుచుండెను. వేఁడిమి యంతగఁ దోప కున్నను నాసమయంపుఁ దెమ్మెర దేహముల యందు శీతల బాధను గలిగించుట లేదు. ఇపుడు మీచూడ్కులను విస్తీర్ణమును నిర్ణయింపఁ జాలని యామైదానము వైపునకుఁ బోనీయుఁడు. ఏదెసకు దృష్టిఁ బరుగెత్తించినను, నెల్లెడల నిస్తబ్ధతయే గోచరించుచుండెను. ఆమైదానమం దెచట నేనియుఁ బొంచి యుండుటకు గాని, పై నధిరోహించి దాఁగి యుండుటకుఁ గాని యనువగు వృక్షము లెవ్వియుఁ జూపట్టుటలేదు. కాని, తూర్పుదెసఁ జూపు కొంచెము దూరముగఁ బరుపఁబడినయెడల నల్లని గుట్టవంటి పదార్థము మసకమసకగఁ బొడకట్టుచుండెను. ఆదెసఁ జూపట్టుచుండిన మబ్బువంటి పదార్థమునుగూర్చి దీర్ఘముగ నాలోచించుట వలన నావైపున నొక చిన్న పర్వతము గాని మట్టిదిబ్బగాని యుండు నని మీరు పలుకఁగలరు.

ఆమైదానమందు నిద్దరు యువతు లశ్వారోహులై తూర్పు దెసఁగా నావైపునకుఁ బోవు చుండిరి. ఆయంగనామణులు ధరించి యుండిన యమూల్య వస్త్రాద్యలంకారములు దక్షిణదేశంబున బ్రచలితంబగు వానివలెఁ బొడకట్టుచుండెను. వారి మోములపై నకాబు పోషులు వ్రేలుచుండెను. వారి యంగసౌష్ఠవము వైపునకును గోమలములగు కరపల్లవముల దెసకును దృష్టి సారించిన నాముద్దియ యౌవనవతు లనియుఁ గోమలాంగులనియు సౌందర్యశాలినులని

యుఁ దోపక మానదు. ఆయువతుల విషయమున పూర్వాపరకమహా
శయులను జాలసేపటివఱకు సంశయమందుఁ జిక్కఁ జేయక వారి
పరిచయమును గలిగించుట సముంజసముగఁ దలంచు చుంటిమి.
అటుచూడుఁడు! ధూమ్రవర్ణ సమున్నతాశ్వముపై నధిరోహించి
యుండిన యువతి మాయారాణి. కాటుకరంగు పంచభద్రముపైఁ
గూర్చుండియుండిన నవయౌవన మాయారాణి చిన్న చెల్లెలగు
రాజేశ్వరి. (ఈమెను మే మింత దనుక రమాసుందరి యను నామ
ముతో లిఖించుచు వచ్చితిమి.) తెల్లని అరేబియా గుఱ్ఱముపై
నధిష్ఠించి నలువైపులకుఁ జంచలదృష్టి వీక్షించు చుండిన పడతి
జగపతి. ఈయువతులు మువ్వురు నెమ్మది నెమ్మదిగా నేమియో
సంభాషించుచుఁ దమ తమ తత్తడులను నడుపుచుఁ బోవుచుండిరి.
ఇపుడు మనము వారిసంభాషణము వైపునకుఁ గొంతదృష్టినిడుట
సముచితము.

మాయారాణి:—ఆశ్చర్యము! ఆపిశాచము మన మూఁడవ తరగతి పూఁదోఁటలోని కెటుల రాగలిగెనో తెలియదు. కాని, మనము దఱచుగఁ బోవుమార్గమున గాక నాతఁడే నూతన మార్గముననో, యచటి కేతెంచి యుండెననుట నిర్వివాదాంశము.

రాజేశ్వరి:—తిలస్మనిర్మాత లచటికిఁ బోవుటకుఁ గొన్నిమార్గములను నిర్మించి యుందురు. బహుశః నామార్గములయం దేదియో వానికిఁ దెలిసి యుండవలెను.

జగపతి:—కాని, యారహస్యమార్గ మితరులకుఁ దెలియుట మిక్కిలి యనర్థదాయకము.

మాయారాణి:—తిలస్మరాణినగు నాకా రహస్యమార్గముల మర్మము దెలియకుండిన నితరుల కెవ్విధంబున దెల్లమయ్యెనో

వింతగ నున్నది.

రాజేశ్వరి:—నిక్కమము! తిలస్మసంబంధమగు పెక్కు విషయములు నీకుఁ దెలిసియుండినను తన్నియమానుసారము నీచెలియలనగు నాకుఁ గూడ వానిని వెల్లడింపఁ జాలకుంటివి. మాభావుకున రతిలస్మరహస్యములు నీకంటె విశేషముగఁ దెలిసియున్నవి. అకటా! అతఁడు స్వర్గస్థుఁడై దాదాపైదుసంవత్సరములు గావచ్చినది. అతఁడు జీవించియుండినచో..........."

మాయారాణి:—(తొట్రుపాటుతో) ఆమార్గముల రహస్యము వానికిఁ దెలిసియుండె నని నీవెటులెఱుంగ గలిగితివి?

రాజేశ్వరి:—మాభావుకుఁ డొకనాఁడు ప్రసంగ వశంబున మూఁడవ తరగతి యుద్యానములోని కేరుట కైదు మార్గములు గల వని నాతో వచియించి యుండెను. మఱియు నన్నటకుఁ గొనిపోయి యాశ్చర్యమార్గములను జూపుట కెంతేనియుఁ గుతూహలము పడెను గాని, నేను నీభయకారణంబున వాని వెంటఁ బోఁజాలనైతిని.

మాయారాణి:—నేఁటి దనుక నీవాసమాచారము నాకేల తెలుపవైతివి?

రాజేశ్వరి:—అది యొక యావశ్యకమగు విషయమని నేను దలంపలేదు.

రాజేశ్వరి పలుకుల నాలించి మాయారాణి మిన్నకుండెను. మఱియు దీర్ఘాలోచనా నిమగ్న మానసయయ్యెను. ఆమె యందొప్పుచుండిన తాత్కాలికావస్థా స్వరూపములను గాంచుటవలన రాజేశ్వరి వచియించిన పలుకులామె హృదయమం దెట్టి గాఢాఘాతమునో కలిగించి యుండెనని తోపక మానదు. ఇట్టి సామాన్య విష

యము వలన మాయారాణి హృదయ మట్టి వ్యథకేల పాలయ్యెనో యామె కట్టి యనుకంపనీయస్థితి యేల కలుగుచుండెనో, యాకారణ మామె చెలియ లగు రాజేశ్వరి సహితము గ్రహింపఁ జాలదయ్యెను. బహుశః యామెకుఁ దన పతిదేవుని స్మరణ గలిగిన కారణంబున నట్టి యవస్థ జనించి యుండునా? కాదు కాదు. సుందరాకారుఁడును, సహాస్యవదనుఁడును, సద్గుణోపేతుఁడునగు తన పతిని నామె యెన్నఁడు భక్తి శ్రద్ధలఁ బూజించి యెఱుంగదు. తత్కారణంబున నీమె విషయమున రాజేశ్వరి హృదయమం దొకవిధంబగు సందేహమునకు స్థాన మేర్పడెను. మఱియు నామె సశంకదృష్టి మాయారాణి వైపునకుఁ బరికింప సాగెను. కాని, తన చెలియలగు రాజేశ్వరి తన వైపున కట్టి భావపూరిత దృష్టిఁ బరికించుచుండెనో యావిషయము మాయారాణికిఁ గొంచమైనను దెలియదు. దాదాపేబది గజముల దూరమేగిన పిదప మాయారాణి తుళ్ళిపడి రాజేశ్వరి వైపునకుఁ గొలదిగ మోముఁద్రిప్పి, “అటులనా? వాఁడా మార్గముల నెఱింగియుండెనా!” యని ప్రశ్నించెను.

ఒకానొక నీచ మనుజుని యెడల గాని, సేవకుని యెడల గాని ప్రయోగింపఁ బడు శబ్దంబుల మాయారాణి తన పతిని నిర్దేశించి పలుకుట నాలించి రాజేశ్వరి హృదయమందుఁ బొడసూపి యుండిన శంక మరియు వృద్ధిలాభము నొందెను. ఇంతియె గాక, యామె దృష్టి జగపతి వైపునకును మరలెను. ఆమె మోమునందు వ్యాపించి యుండిన దుఃఖ విచారముల ఛాయ యనుదినముకంటె నేఁడు గొంత ప్రబలి యుండుట నామె గనుగొనెను. జగపతి యధిరోహించి యుండిన యశ్వమును గొన్ని యడుగులు వెనుకకు బడెను. మాయారాణి జగపతుల యందు దీపించుచుండిన యట్టి యవస్థ చాలసేపటి వఱకు స్థిరపడి యుండలేదు. వారలిరువు రతిశీఘ్రముగఁ

దమ్ము సంభాళించుకొని యెప్పటి యట్ల మరల సంభాషింపఁ దొడంగిరి.

జగపతి:—అదిగో! అదిబ్బ సమీపించినది. ఆచట మనకు సాధుపుంగవునితో సమావేశము గలుగునో లేదో చూడవలసి యున్నది.

మాయారాణి:—ఏల కాకుండును! కాని, మనమిపు డచ్చోటున కేగి వానిని గలిసికొనుటకు నామానసం బేలనో యిచ్చగింప కున్నది.

రాజేశ్వరి:—ఇదియేమి? నీవు వానినిఁ గలసికొనుట కతి యుత్సుకతతో బయలు దేరితివి గదా?

మాయారాణి:—పోనిమ్ము! ఆసాధుపుంగవుఁడు నాప్రశ్నములకు సదుత్తరముల నొసంగజాలఁ డని యిపుడు నాకుఁ దోఁచుచున్నది. వ్యర్థముగ నచటి కేల పోవలెను?

రాజేశ్వరి:—మన మింత దవ్వున కేతెంచియు మగుడి పోవుట యుచితము గాదని నా యభిప్రాయము.

మాయారాణి:-కాదు. నేనిపుడు వానిసమీపమున కేగఁ గోరను.

ఇవ్విధంబున బలికి మాయారాణి వెంటనే తన గుఱ్ఱపు కళీయమును లాగి వెనుకవైపునకు మరల్చెను. నిరుపాయులై రాజేశ్వరీ జగపతులును దమ వారువములను మరలింప వలసిన వారైరి. ఈకార్యాచరణము వలన రాజేశ్వరి హృదయమందు నెలకొని యుండిన సందేహ మినుమడించెను. మఱియుఁ దన పలుకుల వలన మాయారాణి హృదయము బాగుగ నొచ్చియుండెననియు నామె నిశ్చయించు కొనెను. కాని, యెంత యోజించినను నాకారణము ను మాత్ర మామె గ్రహింపఁ జాల కుండెను.

మాయారాణి తన గుఱ్ఱము ను మరలించి నంతనే తన వెనుక

నుండి యడుగులు చప్పుడు గాకుండఁగ నెమ్మది నెమ్మదిగా నరుదెంచు చుండిన వగతుఁడగు నభయసింహునిపై నామె దృష్టి పడెను. అతఁడు విల్లును భుజముపై (వేలాడవైచుకొని యుండెను. వీఁపుపై నమ్ములపొదియుఁ గలదు. మాయారాణి యభయసింహుని బాగుగ నెఱింగి యుండెను. ఆసమయంబున గొలఁదిగ యంధకారము వ్యాపించి యుండినను, నామె సతేజలోచనంబులు వెంటనే వానిని గుర్తింపఁగలిగెను. తక్షణ మామె యడిదమును దూసి, తనగుఱ్ఱము నభయసింహునివైపునకు గెంతించెను.

మాయారాణి శస్త్రధారిణియై తనపై లంఘించుటను గాంచి యభయసింహుఁ డుత్తేజిత స్వరంబుతో, "జాగ్రత్త! ముందున కడుగిడరాదు. కానిచో, నొక్కశరంబుననే నీపని సమాప్తినొందగల" దనెను. అభయసింహుని యదలింపు పలుకులకు మాయారాణి దిగ్భ్రమఁజెందిన దానివై కవడి యట్టె నిలచిపోయెను. కాని, జగపతిమాత్రము సహించుకొనఁ జాలదయ్యెను. ఆమె వెంటనే తన ఖడ్గమును దూసి, "నేను నీశరమునకు భీతిల్లుదానను గాను నిలువు" మని పలికి వాని ముందునకుఁ బోయి నిలచెను.

అభయ:—నీకుఁ (బ్రాణములపై మమత లేనటులఁ దోఁచుచున్నది. అభయసింహునిచే విడవబడిన బాణ మెన్నఁటికి వ్యర్థముగ బోఁజాలదని నీవెఱుంగవు గాఁబోలు.

జగపతి:—నీవొక్క బాణముతోడనే మాముప్పురకు భీతిఁగొల్పి నీగార్యమును జక్కనొత్తుకొన దలంచుచుండినటులఁ దోఁచుచున్నది. ఆహా! ఈసమయంబున నాయొద్ద ధనుర్బాణములు లేవయ్యెను. కానిచో, బాణము సంధించుటయని దేనిని వచియింతురో దానిని వెల్లడించి యుందును.

అభయ:—నీవొక యబలవై యుండియు నిస్సెట్టిగా దలంచు చుం

టివో యూహింపఁ జాలకుంటిని. నినుబోలు సుకోమలాంగి
పై బాణములను విడుచుట నన్బోలు వానికిఁదగదు.

ఇవ్విధంబున బలికి యభయసింహుఁడా బాణమునుదన యమ్ములపొది యందుంచి వైచెను. మఱియు విల్లును దన భుజమునకు వ్రేలాడ వైచుకొని కత్తిపాలనుండి యొక యినుపగుండును వెడలించి యెదుట నిలచెను. అతఁడు దానిని జగపతికిఁ జూపుచు, "మీయిర్వుర ప్రాణములను గొనుట కిది యొక్కటియే చాలి యున్నది. నాపైఁ గత్తిదూసి సురక్షితముగ నుండ గల మను నాశను మీహృదయాంతరాళము నుండి తొలగించుకొనుఁ" డని పలికెను.

జగపతి:—(మాయూరాణి వైపునకు సంకేతించి) ఈమె యెవ్వరో నీవెఱుంగుదువా?

అభయ:—మీయిర్వురను నేను బాగుగ నెఱింగి యుంటిని. ఇంతియే కాదు. ఐదువత్సరములకుఁ బూర్వము మాయూరాణి నలుబదియేడవ నంబరు గదిని పవిత్ర మొనరించి నిశ్చింతయై యుండిన సమాచారమునుగూడ నే నెఱుంగుదును.

ఇవ్విధంబున బలికి అభయసింహుఁడు నవ్వుచు, మర్మయుక్తంబగు నొకచూపు మాయూరాణిపైఁ బఱపెను. వెంటనే యామె మోముదమ్మి వెలవెల బోయెను. సలజ్జ నయనంబుల నేల వైపునకుఁ జూచుచు నామె మోము వంచుకొనెను. కాని, మాయూరాణి కట్టి స్థితి చాలసేపటివఱకు స్థిరపడి యుండలేదు. అభయసింహుని నోట పూర్వోక్త వాక్యములు వెడలిన తోడనే రాజేశ్వరి యధిక యబ్బురపాటుతో మాయూరాణి వైపునకుఁ గాంచు నంత నామె దన్ను సంభాళించుకొని జగపతి వైపునకుఁ బరికించెను. ఇపుడు జగపతి సహించుకొన జాలకఁ వెంటనే తన గుప్తము నదలించి యభయసింహునిపై నొక ప్రహారమును గావించెను. అభ

యసింహుఁ డతినేర్పు నావేఁటుఁ దప్పించుకొని తన చేతియందలి యినుప గుండుతో జగపతి యధిరోహించి యుండిన గుఱ్ఱపునొసట బలపూర్వకంబుగ మోదెను. ఆగుఱ్ఱ మొక యడుగుపఱచి శిరము నాడించుచు భూమిపైఁ గూలెను. మఱియు నాయినుపగుండు దవ్వునకుఁ బోయి పడెను. అభయసింహుఁడు దటాలున నాగుండును దీసికొనెను. గుఱ్ఱము క్రిందఁ గూలుట వలన జగపతియు దానితో పాటు క్రిందఁ గూలవలసి యుండెను. కాని, యాచతుర దటాలున నాగుఱ్ఱము నుండి క్రిందకు దుమికి దూరమునకుఁ బోయిపడెను. మఱియు వెంటనే తన్ను సంభాళించుకొని లేచి నిలచెను. అభయసింహుఁడును నాయినుపగుండు నామెకుఁ జూపుచు నెదుటకువచ్చి నిలచెను.

**అభయ:**—(జగపతితో) ఈయినుపగుండు ప్రభావమును నీవు గనుగొనియే యుంటివి. మరల నాపైఁ గత్తి నెత్తుటకు సాహసింతువేనియిది నీకాలిమడమనువిఱగగొట్టక మానదు. నీవు కుంటిదానవై మాయారాణి వెంటఁ బోవలసినదాన వగుదువు. నేనిపుడు మీప్రాణములను గొన దలంచుట లేదు. నే నేకార్యమునకై యరుదెంచి యుంటినో దానిని దీర్చుకొనకయె మగుడి పోవుటయు సముచితముగఁ దలంచుట లేదు.

**మాయారాణి:**-మంచిది! నీవు మావెనువెంట నేల యేతెంచుచుంటివి. నీవేమి కోరుచుంటివి?

**అభయ:**—(రాజేశ్వరి వైపునకు సంకేతించి) నేనీమెతో నొక మాటచెప్పవలసియున్నది. అంతకంటె నధికమేమియులేదు.

**రాజేశ్వరి:**—నీవేమి చెప్పఁ దలంచు చుంటివో వచియింపుము.

**అభయ:**—నేను వచియింపఁ బోవు సంగతులను నీవు దక్క నన్య

లెవ్వరును వినరాదు. వీరిరువురనుండి కొంతదవ్వున కేతెంచి నామాటలను వినుము. పిదప నేను వెడలిపోయెదను. భీతిల్లకుము. నేనొక వంచకుఁడనని తలంపకుము. నేను దలంచినచో మీరువ్వుర నొక త్రుటికాలములో యమసదనమునకుఁ బుత్తెంపఁ గలను. కాని, నేనయ్యది కోరుటలేదు. నేను నీకొక సమాచార మెఱింగించి పోవుటకు మాత్రము వచ్చియుంటిని.

రాజేశ్వరి గొంత తడవు యోజించి, యభయసింహుని మాటలకు సమ్మతించి నటుల వానివైపునకుఁ జూచుచు, మాయారాణీ జగపతులను వీడి యెలదవ్వున కఱిగి యచట నిలచెను. అభయసింహుఁ డామెను సమీపించి తన కఱుపాలనుండి యొక జాబును వెడలించి యది యామెకొసంగెను. మఱియు నతఁడామెతో "దీనిని వేగమె చదువుకొనుము. ఈసమాచార మొరులకుఁ దెలియఁగూడదు సుమా! జాగ్రత్త" యని పలికెను.

రాజేశ్వరియు నాలేఖను వెంటనే చదువుకొని దానిని చిన్న చిన్న తునియలుగఁ జించి భూమిపైఁ బారవైచెను.

అభయ:—ప్రత్యుత్తర మేమి?

రాజేశ్వరి:—'సరియే' యని మాత్రము వచియింపుము.

ఇపు డభయసింహున కచట నిలుచుట కెట్టి యావశ్యకము లేదు. అతఁడు వెంటనే యచటినుండి యుత్తర దిశకు దారి పట్టెను. కాని, తన వెన్వెనుక నెవ్వరేనియు నరుదెంచుచు లేదు గదాయని మాత్ర మతఁడు సారె సారెకు వెనుకకుఁ దిరిగి చూచుచుఁ బోవుచుండెను. అభయసింహుఁ డచటి నుండి వెడలిన పిదప మాయారాణి రాజేశ్వరితో, "నీకాజాబు వ్రాసిన వారెవరు? దానియం దేమి లిఖింపఁబడి యుండె" నని ప్రశ్నించెను. రాజేశ్వరి

యసలువృత్తాంతమును గప్పిపుచ్చి యామెకు సంతృప్తి గలుగు నటుల నేదియో కల్పించి తెలిపెను.

౪

సులోచన జటాశంకరుని నొక గ్రామునకుఁ గట్టి యుంచిన సమాచారము మాపాఠకమహాశయులు విస్మృతిఁ జెందియుండరు. జటాశంకరుఁడు దన చాతుర్యగరిమ వలనను దిలస్మ కైదువు దోడ్పాటునను సులోచనను మూర్ఛాగతురాలినిగ నొనరించియుండెను. కాని, యతఁడెంత కంఠము చించుకొని యఱచినను వానికి దోడ్పడువారెవ్వరును వచ్చి చేరరైరి. తదుపరి గొంత వడికి సులోచన చైతన్యమై లేచి కూర్చుండెను.

సులోచన:—(జటాశంకరునితో) నీయొద్దగూడ నొక యద్భుత పదార్థము గలదని యిపుడు నాకుఁ దెల్లమయ్యెను.

జటాశం:—అది యిపుడు నీ సొత్తు కాఁగలదు.

సులోచన:—కాదు కాదు. దేనిని తాఁకిన మాత్రముననే నేను మూర్ఛావస్థయందు మునింగి పోయితినో యద్దానిని నా యొద్ద నెటు లుంచుకొనఁ గలుగుదును? దేని కారణంబున నాయద్భుత కైదువు నందలి ప్రభావము నీపైఁ బ్రసరింప కుండెనో యట్టి పదార్థమొకటి నీ యొద్దఁ గలదనుట కెట్టి సందియమును లేదు. మంచిది. ఆకైదువు నందలి ప్రభావమును నాటంకపఱుచునట్టి యారెండవ పదార్థముతోఁగూడ నాకైజారు నాకొసంగిన నీమూఁడవ తప్పిదమును గూడ క్షమించెదను.

జటాశం:—నీవు నాయపరాధమును మన్నించితి వను నమ్మకము నాకెటులఁ గలుగఁ గలదు?

## ఏడవ భాగము.

సులోచన:—అగుచో, దేని కారణంబున నాకై జారు పరిభావము నుండి నీవు దప్పి యుంటివో, నిక్కవముగ నావదార్థము నే యొసంగితివను విశ్వాసము నాకు మాత్రి మెటులఁ గలుగఁ గలదు?

జటాశం:—నేను తప్పక నీకావదార్థము నే యొసంగెదను. నేనిపుడు బంధింపఁబడి యుంటిని గదా! నీవు బాగుగఁ బరీక్షించుకొని న పిదపనే నన్ను విడువఁ గలవు.

సులోచన:—నేనటులఁ బరీక్షించు సమయంబున మూర్ఛాగతురాలనైన సందేమి వింత గలుగఁ గలదు. వంచన కృత్యము లయందు నీవెవ్విధంబునను నాకుఁ దీసి పోవని నేను బాగుగ నెఱుంగుదును.

జటాశం:—దానికిఁ బ్రత్యుత్తరమును స్వయముగ నీవే యోజించి తెలిసికొనఁ గలవు.

సులోచన:—ఔను! నిక్కవము నేను గొంత తడవు మూర్ఛావస్థ యందు మునింగియుండినను నీవు నన్నేమియుఁ జేయఁజాలవు. నీవు బంధింపఁ బడి యుంటివి కదా?

జటాశం:—ఇంతియె గాక, నేనెంత బిగ్గఱగ నఱచినను నాకెట్టి సహాయమును గలుగఁ జాలదనియు నీ వెఱింగి యుందువు,

సులోచన:—ఔను. అదియు నొక................."

సులోచన యింకను నేమియో పలుకుచుఁ దటాలున నిలపివైచెను. కారణంబేమన, వృక్షపత్త్రింబుల మురమురధ్వని యామెకు వినుపించుటచే నెవ్వరో యట కేతెంచుచుండిరను శంక యామె హృదయాకాశమున మెఱచెను. తోడనే యామె వెనుకకు మరలి కాంచునంతఁ దానొనంగియుండిన వారువముపైనధిరోహించి తమ వైపున కేతెంచు చుండిన మృగాంకవతిపై దృష్టివడెను. మృగాంకవతి సులోచన యింటి కేరూపంబునఁ బోయి యుండెనో యి

పుడు గూడ నట్టి రూపమందే కలదు, ఆమె మృగాంకవతి యని గు ర్తించుట సులోచనకుఁ గఠిన విషయమై యుండినను జటాశంకరుని వలన నామె సకల వృత్తాంతమును వినియుండిన దగుటచే నామెను వెంటనే గుర్తింపఁ గలిగెను. మఱియు జటాశంకరు నట్టివిధంబుననే విడచి తటాలునఁ దన గుఱ్ఱముపై నెక్కి కూర్చుండెను. అంత మృగాంకవతి సులోచనను సమీపించి నేను నిజముగ మిార్జాపుర మున కేగియుంటి నని తలంచియుందు''వనెను.

"(కనులెఱ్ఱఁజేసి) నీవు నన్ను బాగుగ వంచించి యుంటివి! నీవిపుడు నాచేయిదాఁటి యెచటి కేగఁగలవు? నీవు మాయారాణికిఁ జెలియల వగు కారణంబున నిన్ను మన్నింప వలసియున్నది. ఆమె నీ దుష్ప్రవర్తనమునకుఁ గినిసి నీశిరమును ఖండించి తెచ్చువారికిఁ గో రిన బహుమాన మొసంగెద నని ప్రకటించి యున్నది. తత్కార ణంబున, నేనిపు డెవ్విధంబునను నిన్ను విడువఁ జాలను. నీవు సంతో షపూర్వకముగ నామె చెంత కేతెంచుటయే శ్రేయోదాయకము"

"(నవ్వుచు) నీ వీ సమయమున గూడ నీయింట నుండినటు లను నలువైపులనుండి నీపరిజనులు నిన్నుఁ గాంచుచుండి నటులను దలంచు చుంటి వని దోఁచు చున్నది."

"(కొంచెము సిగ్గు పడి) ఈమైదానమందు నేనొంటరికత్తె ననియు, నావెంటఁ బరిజనులెవ్వరు లేరనియు నేను బాగుగ నెఱిం గియుంటిని. అస్త్రవిద్యయందును బలదార్ఢ్యములయందును నీవు నాకంటె మిన్నగఁ దలంచు చుండినటుల నీదిటవు మాటల వలనఁ దేలుచున్నది. అది మిక్కిలి ప్రమాద కరము. చేతఁ జేయి కలిపిన మాత్రమునసే యంతయు వెల్లడి గాఁగలదు. (చేయిఁజాపి) రమ్ము! నాతోఁ గదియుము."

"(నవ్వుచు) నీచేతియందలి యంగుళీయక వృత్తాంతము

నాకుఁ దెలియ దని భావించు చుంటివి గాఁబోలు, మంచిది. నంసి ద్ధవు గమ్ము."

ఇవ్విధంబున బలికి మృగాంకవతి దన చాకచక్యమును వెల్ల డించుచు గుఱ్ఱమును ముందునకు నడిపించెను. మఱియుఁ దన నడి కట్టు నుండి తిలస్మకై జారును వెడలించి, నేర్పు మెఱయ సులోచన హస్తమునకు దాఁకించెను. సులోచన దన కరము నాకై జారునుండి తప్పించు కొన లేకపోవుటచే వెంటనే మూర్ఛాగతయై భూమిపైఁ గూలెను.

మృగాంకవతి దనగుఱ్ఱము డిగ్గి జటాశంకరుని సమీపమున కుఁబోయి బంధములను విప్పి వానితో, "వహ్వా! నీవు మిగులఁ జతు రుఁడవైయుండియుఁ దుదకు నీమెచేఁ జిక్కితివి గదా"? యనెను.

"నేనామె వ్రేలియందలి యంగుళీయక ప్రభావము నెఱింగి యుండిన నామె వలయం దెన్నఁడును జిక్కి యుండను. ఆయుంగ రము మిగుల ననర్ఘమైనది. అద్భుతప్రభావము గలది. మఱియుఁ గుటిల సమయంబున నది యొక మహోపకారి విధంబునఁ దోడ్ప డఁ గలదు."

"ఆమె యొద్ద నట్టి యద్భుత మహిమోపేతంబగు పదార్థ ముండుట వలననే మాయారాణి దయాదృష్టి యామెపై విశేష ముగఁ గలదు. మఱియు నాయుంగరపు విషమువలన మృత్యువాత నుండి యెవ్వరును దప్పిపోఁ జాలరు. కాని, యామె యిచ్ఛగించు నెడల నావిషమును నుపసంహరింపఁ గలదు. ఆయుంగరమును దాని విషము నుపసంహరించు విధానమును మోహిని కెవ్విధంబున లభిం చియుండెనో తెలియదు."

"మాయారాణికిని నామెకు నెట్టి సంబంధము గలదు"?

"మాయారాణి చెలికత్తియలలో మోహిని యగ్రస్థాన

మును బడసి యున్నది. మఱియు నారాణి యామెను దోఁబుట్టువు కన్న మిన్నగఁ బ్రేమించు చున్నది. సులోచన వ్రేలియందలి యుంగర మామోహినిదే!"

"అది మిగుల నుపయోగకరంబగు పదార్థమనుట కెట్టి సందియమును లేదు. కాని, మాయారాణి దాని నేల తీసికొనకుండెనో తెలియదు."

"మోహిని యామెకుఁ గూడ నట్టి విధంబగు నుంగర మొకటి నిర్మించి యొసంగియున్నది. కాని, దాని విషమును మరలింపఁ జేయు మందును మాత్రి మామె కెఱింగించి యుండలేదు."

"మంచిది. మీరు సులోచన వ్రేలి యందలి యుంగరమును దీసికొని మీయొద్ద నుంచు కొనుఁడు."

"అది నాకంతగ నుపయోగకరమైనది గాదు. మఱియు దానిని నాయొద్ద నుంచుకొనుటయు మహాపాతకంబుగఁ దలంచుచుంటిని. అయినను, మాయారాణితో మన జగడము దీరుదనుక దానిని నాయొద్ద నుంచుకొనుటయే యత్యవసరముగఁ దలంచుచుంటిని. తిలస్మ ఖైజారు వైపునకు సంకేతించి) దీనియెదుట నాయుంగర మెట్టి పదార్థమును గాదు."

"నిక్కవము. ఎవరియొద్ద నీఖైజారు గలిగి యుండెనో వానికేయితర పదార్థములవలన గాని యెట్టి పరాక్రమ ధౌరేయులగు శత్రువుల వలన గాని భీతియే కలుగదు. మీరు నాపై నవ్యాజ్య కరుణఁ బూని యిట్టి యపూర్వ మహిమోపేతమగు ఖైజారును గొన్ని దినముల దనుక నాయొద్ద నుంచుకొనుట కనుగ్రహించి యుంటిరి. ఆహా! ఇట్టి యద్భుత ప్రభావ సమన్వితంబగు ఖైజారు నిరంతరము నాయొద్దనుంచికొనుట కెపుడు మీరనుమతింతురో యానాఁడే నాకు సుదినము."

"(నవ్వుచు) మంచిది. అనుదినము నేఁడేయని భావింపుము! నే నాకైజారును నీకు శాశ్వతముగ నిచ్చి వైచితిని. కాని, జైమినీ ప్రసాదు విషయమున గూడ నిట్టి కోరికను గోరరాదు సుమా!"

జటాశంకరుఁ డమిత సంతోష పారవశ్యుఁడై మృగాంకవతికి నమస్కరించెను. తదనంతరము మృగాంకవతి సులోచన వ్రేలినుండి యా యుంగరమును దీసి భద్రపఱచెను. మఱియు నామె కక్షపాల యందు వెదకి క్షణకాలములో నాయుంగరపు విషమును నుపసంహరించు మందుసీసానుగూడ దీసికొనెను. పిమ్మట మృగాంకవతి జటాశంకరుని వైపునకుఁ దిలకించి, "నీవీ సులోచనను నాతిలస్మాద్భుత సరోవర మందిరమునకుఁ గొనిపోయి నీరద కొప్పగించి మరల వచ్చి నన్నుఁ గలసికొనుము. నేనిపుడు మోహిని గృహమున కేగుచుంటిని. మఱచితిని! నీ కాగితములుగూడ నీకక్షపాలయందుఁ గలవు. నీవు వానిని వెడలించి బస్మీపటలము గావించి నిశ్చింతుఁడవు గమ్మి.

౫

మాయారాణి యింత దనుకఁ దన యుద్యానమందలి (తిలస్మతోఁట) మహాలు నందే నివసించుచుండెను. అర్ధరాత్రముఁ గడచియుండెను. కావలివాండ్రు దక్క నెల్లరు నిద్రాదేవి యంకపాళి యందు శిరములను జేర్చి గాఢ సుషుప్తియందు మునింగి యుండిరి. కాని, యాతోఁట యందలి యిరువురు స్త్రీలకు మాత్రము నిద్ర యనువది నామ మాత్రమైనను లేకుండెను. అయిరువురు స్త్రీలలో నొకతె--మాయారాణికిఁ జిన్నచెల్లెలగు రాజేశ్వరి. ఆమె దన శయ నాగారమందలి పర్యంకముపై మేనువాల్చి యెట్టియోజనాపరంపర లఁ జిక్కి యుండెనో మనకుఁ దెలియదు. ఆమె మాటి మాటికిఁ బర్యంకమునుండి లేచి వెలుపలకుఁ బోయి నిస్తబ్ధత వైపునకు దృష్టి

నిగుడించి మరల గది లోనికిఁ బోయి పరుండుచుండెను. ఆమహా లులోని మఱియొక స్థానమునకుఁ గాని యాయుద్యానము వెలుపలకుఁ గాని వెడలి యొవరితోడనో కలసికొనుట కామె దరుణమును గనిపెట్టు చుండి నటులఁ దోఁచుచున్నది. ఇఁకను రెండవస్త్రీ మాయారాణియే! ఆమె కంటికిఁ గునుకు రాకుండుటచేఁ దన శయనాగారమందుఁ బచారు చేయుచుండెను. ఆమెను బలువిధంబులగు విచారము లొక్కుమ్మడి ముట్టడించి వేదించుచుండెను. ఆమె యప్పు డప్పుడు తన శిరము నల్లార్చుచుండుటచే, నామె హృదయమందు మెండుకొనియున్న దురంతచింత లామె నున్మత్తప్రాయనుగఁ జేయుచుండినటులఁ దోఁచుచుండెను. ఆయువతియధరోష్ఠములప్పు డప్పుడు వేఱువడి యామె హృదయ ద్వారమును దెఱచివైచుచుండెను. తత్కారణమున నామె హృదయమందు బంధీకృతంబై యుండిన గొన్ని రహస్యములు శబ్దరూపమును దాల్చి నెమ్మదినెమ్మదిగా వెలుపలకు వెడలి వచ్చుచుండెను.

ఇట రాజేశ్వరి నలుదెసల పూర్ణరూపంబున నిస్తబ్ధత వ్యాపించి యుండుటఁ గనుగొనిన తోడనే కాటుక రంగు దుస్తులను ధరించి మైయ్యారీ కఱపాలను కటిప్రదేశమందు బంధించు కొని నెమ్మది నెమ్మదిగాఁ దన గది నుండి బయలుదేరెను. మఱియు నిటు నటుఁ దిరుగాడుచు భయశంకాసంభ్రమచిత్తయై తల్లడ మందుచు నిద్రరామి తన గదియందుఁ బచారు చేయుచుండిన మాయారాణి శయనాగారము నొద్దకు బోయి చేరెను. అమె యచట మఱుఁగువడి మాయారాణి యేమి చేయుచుండెనని పరికింపసాగెను. కొంతసేపైన పిదప మాయారాణి నోట వెడలి వచ్చిన కొన్నిశబ్దములను రాజేశ్వరి వినగలిగెను. ఆశబ్దములివి:—వాఁ డామార్గ మెఱింగి యుండెనా?.........ఏరహస్యమును రాజేశ్వరి యెఱుంగదో......ఆహా! జగపతి యందలి ప్రణయము........."

ఈశబ్దముల నాలించినంతనే సంభ్రమాయత్త చిత్తయై యచటినుండి తన గదిలోనికి మరలి పోవుటకుఁ దలంచెను గాని, యామె హృదయ మచటినుండి యామెను గదలనీయ కుండెను. మాయారాణి నోట నింకను నేశబ్దములైన వెడలిన వానిని గూడ వినవలయునను గోరిక యామెకు వృద్ధినొందెను మాయారాణి మిగుల బరిశ్రాంతయై యుండుట వలనఁ దన పర్యంకముంజేరి దానిపైఁ బరుండెను. ఒక యరగడియ కాలము కంటె నధికముగ గడచి యుండదు. అంత మాయారాణి విడచుచుండిన శ్వాసోచ్ఛ్వాసముల వలన నామె నిదురించు చుండినటుల రాజేశ్వరికిఁ దెల్లమయ్యెను. తదనంతర మామె యిటునటుఁ బచారు చేయుచు నెమ్మదిని నెమ్మదిగాఁ జెట్లచాటున దన్ను మఱుగు పఱచుకొనుచు నాతోఁటకు వెనుక వైపునకుఁ బోయి చేరెను. అచట మిగుల దృఢమగు నట్టాలిక యొకటి గలదు. దాని లోపలికి పోవుట కొక చిన్న యిరుపద్వారము నిర్మింపఁబడి యుండెను. రాజేశ్వరి నెమ్మదిగా నాద్వారమును దెఱచి దానియందుఁ బ్రవేశించి మరల నాద్వారమును లోపలనుండి బంధించి వైచెను. ఆబురుజులోపల నొక గది గలదు. దానియందుఁ జీఁకటి దట్టముగ వ్యాపించి యుండుటచే రాజేశ్వరి తన కక్షపాలనుండి మైనపువత్తి నొకదానిని వెడలించి వెలిగించెను. మఱియు దాని ప్రకాశమున నాగదియొక్క స్థితిగతులను బాగుగ నవలోకింప సాగెను. ఆ యట్టాలికయందలి యాగది యనేక వత్సరములనుండి బంధింపఁబడి యుండుటచే సాలెపురుగులు దాని యందుఁ దమ గృహములను నిర్మించుకొని, యందు సుఖపూర్వకముగఁ గాపురము జేయుచుండెను. ఆగదియందలి నేల నలుచదరములగు నల్లని రాళ్ళతో నిర్మింపఁబడి యుండెను. దాని మిద్దెయందు రెండు మూఁడు చిన్న రంధ్రములు చూపట్టు చుండెను. ఆరంధ్రముల

గాని, యితరులు దాని నూహింపఁజాలరు. నోట వచింపరాని భయంకర కృత్యములయందు నన్నామె నియోగించుచున్నది. వేయుగతి దోషమి యామె యాజ్ఞానుసరణి నేనన్నింటిని జేయవలసిన దాననగుచుంటిని. నిరుపాయను. కారణంబేమన, మాయారాణి కోపమునకు గుఱియై భరతఖండమందలి మేఘనారణ్యమందు దాఁగి తలదాఁచు కొన్నను బ్రాణములు దక్కుట కల్ల యని నేను బాగుగ నెఱింగి యుంటిని."

"పాపము. నీకుఁ దిలస్మ రహస్యములు గొంచెమైనను తెలియవు. అమాయకురాలవు. మఱియు నిక్కువముగ రమాసుందరివి."

"(తుళ్లిపడి) అక్కా! ఏమి? నేను రమాసుందరి నగుటకు బలాత్కరింపఁ బడిన విషయము గూడ నీకుఁ దెలిసి యుండెనా!

"ఔను! నేను బాగుగ నెఱింగి యుంటిని. నేఁటి దనుక జైమినీప్రసాదు నావెంట నుండి నాకార్యములను జక్కఁబెట్టుచున్నాడు.

"అయ్యో! అతఁడు నీవెంట నుండిన నే నేనాఁడో వాని కంటఁ బడక మానను. ఆసమయంబున లజ్జా భరమ్మున నానేత్రములు పైకిఁ జూడఁ జాలవు. పాపము! నేను వానిని బాగుగ వంచించి యుంటిని.

"అందు నీదోష మావంతయును లేదని నేను బాగుగ నెఱుంగుదును. మంచిది! ఆవిషయ మటుంచుము. నీయందలి ప్రేమయే నన్నిటకుఁ దోడ్తెచ్చినది. ఇపు డీతిలస్మమున కాయువు పరిసమాప్తి నొందినదని తలంపుము. మాయారాణి దన చేఁతలకుఁ దగిన ఫలము శీఘ్రకాలములోనే యనుభవింప నున్నది. ఇపుడు నీ యభిప్రాయ మేమి!"

"(కరములను జోడించి) నాకు వేఱేమి యభిప్రాయము గలదు! నిన్ననుసరించి యుండుటయే! దాన నాదుష్కరాలగు

మాయారాణి మోము దిలకించు నవసరము నాకుఁ మరల గలుగ కుండును. తిలస్మము శీఘ్రకాలములోనే ఖండింపఁబడు ననియు నేనె ఱింగి యుంటిని. ఇచటఁ గొన్ని దినముల నుండి యనేక యద్భుత విషయములు బొడగట్టు చున్నవి. అందుచే స్వయముగ మాయా రాణి బుద్ధియే చకితమగు చున్నది. కాని, యెవ్వ రీతిలస్మమును ఖండింతురను ప్రతీతి గలదో, యారాకుమారులు మహేంద్ర నరే శసింహు లిపుడు మాయారాణి వలన బంధింపఁబడి యుండుటచే నా విషయమున కొలఁది గొప్ప సందేహించుటకుఁ దావేర్పడు చున్నది. రేపటి దినమున నారాకుమారు లిరువుర శిరములు దప్పక ఖండింపఁ బడును.

"నే నీసమాచారమును గూడ నెఱింగి యుంటిని. మఱియుఁ దెల్లవాఱుటకుఁ బూర్వమే యారాకుమారులను బంధవిముక్తులనుగ నొనరించి వెంటఁ దోడ్కొని పోయెదను.

"అగుచో, నీకుఁ గావలసిన దేదిగలదు. వారిరువురు మిగుల సుందరాకారులు. సకల సద్గుణ సంపన్నులు. నేనెపుడు నరేశసిం హుని గాంచితినో.............................

ఇవ్విధంబునఁ బలికి రాజేశ్వరి లజ్జావశీభూతయై మిన్నక భూమివైపునకుఁ బరికింపసాగెను. ఆమెచెక్కిలిలపై లేఁగులాబిరంగు దీపించుటచే నామె నరేశసింహుని ప్రేమించి యుండె నని మృగాం కవతి వెంటనే తెలిసికొనెను.

"కాని, వారిరువురను బంధవిముక్తులనుగ నొనరించుట యందు నీవు నాకుఁ దోడ్పడ వలసియున్నది."

"అక్కా! నీయాజ్ఞ నొదల దాల్చెదను. నే నన్నివిధంబుల నంసిద్ధముగ నుంటిని"

గునంత దనుక హత్యాకాండము జరగకుండగనే కార్యసా-
ఫల్యమును జేసికొనుట యుత్తమ మార్గముగదా!

రాజేశ్వరి:—నిక్కవము. అటులయిన నిఁక నాలసింపరాదు.

మృగాంక:—మంచిది. నీవు పోయిరమ్ము. నే నిచ్చోటనే నీరాకకుఁ
ప్రతీక్షించుచుఁ గూర్చుండి యుండెదను.

ఇవ్విధంబున బలికి మృగాంకవతి యొక తిలస్మకైజారు నామె గొసంగెను. దాని జంటవస్తువగు సంగరము నింతకుఁ బూర్వమే రాజేశ్వరి వ్రేలియందామె తొడగి యుండెనుగదా! "ఇఁక నాకెట్టి భీతియుఁ గలుగఁజాల" దని తలంచి రాజేశ్వరి యా తిలస్మకైజారును జేతఁగొని యట్టాలిక ద్వారమును దెఱచి యచటి నుండి బయలుదేరెను. మృగాంకవతి కచట నొక యరగంటకంటె నధిక కాలము వేచియుండు నవసరము గలుగలేదు. అనతికాలములోనే రాజేశ్వరి యా తాళపుఁజెవులను దీసికొని యచటికి వచ్చి చేరెను. మఱియు వానిని మృగాంకవతి యెదుట నుంచి, "సోదరీ! వీనిని సంపాదించుటకు నాకు విశేషముగ శ్రమ యెద్దియుఁ గలుగ లేదు. నన్నెవ్వరును బరికించి యుండలేరు. పలుదెసల బాగుగ నిస్తబ్ధత వ్యాపించియున్నది. మాయారాణి గాఢసుషుప్తియందు మునింగి యీ సంసారప్రపంచమును మఱచి యున్నది. నే నీతాళపుఁజెవులను దీసికొను సమయంబున నామెకు మెలకువ గలుగకుంటకు మాత్రము దిలస్మకైజారు నామె దేహమునకుఁ దాఁకించితిని. వెంటనే యామె దేహము గంపించినది. కాని, నేత్రములుమాత్రము మూతలువడియే యుండెను. అపుడామెకు మూర్ఛావస్థ గలిగ నని నేను భావించితిని. వెంటనే యీ తాళపుఁజెవులను దీసికొని వెడలి వచ్చితిని. ఇఁక మన మిచటఁ దడయరా" దనెను.

"ఔను. మన మిచటినుండి వేగమే పోయి బంధితులను విడిపింపవలెను."

"మన మిాతోటనుండియే యీ కారాగారము చెంతకుఁ బోవలసియున్నది."

"కాదు! వేఱొండు కారణంబున నాకచటి యనేక రహస్యములు దెలిసియున్నవి. నీవావృత్తాంతము వాలించి పరిమోదభరితమానసవు గాఁగలవు. భావుకుఁడు మనయొద్దనుండి తొలఁగింపఁబడనిచో మనమిచటి యనేక యద్భుతవిషయములను బరికించి యధికానందమును బొంది యుందుము. మాయారాణికిఁ గూడ నీతిలస్మరహస్యములు పూర్తిగాఁ దెలియవు."

"భావుకుఁడు మనయొద్దనుండి తొలఁగింపఁబడనిచో" యను దానికి నీయభిప్రాయమేమి? నేనావిషయమును గొంచెమైనను గ్రహింపఁ జాలకుంటిని!"

"మన బావయగు ముకుందసింహుఁ డాయువు దీరయే మృతినొంది యుండెనని నీవు దలంచుచుంటివా!"

"(కొంచెము యోజించి) వానికి విష మొసఁగబడెనని నా యభిప్రాయము. అవసానకాలమున వాని దేహము నల్లబాఱియుండెను. మోము వికృతిఁ జెందియుండుటచే నేను వానిని బొత్తిగా గుర్తింపఁ జాలనైతిని. అకటా! మన యెడ వాని కధిక దయ కలిగి యుండెడిదికదా!"

"ఆ మహాభాగున కెవండిట్టి దయ లేకుండెను? (కొంచెము యోజించి) "మంచిది. నేఁడు నిన్ను నాల్గవభాగపు టుద్యానవనములోనికిఁ దోడ్కొని పోయి యచటి విచిత్రములను నీకు జూపింతును."

"(ఆశ్చర్యముతో) ఏమి! నీ వ్వాతోఁటలోనికేగఁ గలవా?"

"ఔను. నేనచటి యనేక రహస్యముల నిపుడు దెలిసికొనియుంటిని. మఱియుఁ దానియందు యథేచ్ఛగ సంచరింపగలను."

"అగుచో నేను తప్పక నీవెంట నేతెంచెదను. ఆనాగ్లవభాగపు దిలస్మతో టలోనికిఁ బోవువారి కీపరిపంచమునఁగా నెట్టిదో తెలియఁగలదనియు, నీశ్వరుని దృష్టియందెట్టివిచిత్ర సంభవములు గలుగ గలవో యవివారు దెలిసికొనఁ జాలుదురనియు మన భావు కుఁడు మాటిమాటికిఁ బలుకుచుండెడివాఁడు."

"మంచిది! మనమిపుడు ముందుగ బంధితులను విడిపింపవలసి యున్నది లెమ్ము"

ఇవ్విధంబున పలికి మృగాంకవతి యచటినుండి లేచి నిల చెను. మఱియు నొక మైనపువత్తిని వెలిగించి తాను వెడలివచ్చిన (చతురపుఱాయి దెఱువఁబడి మార్గ మేర్పడినస్థానము) సురంగ ముఖద్వారమునొద్దకు బోయి నిలచెను. దానిలోనికి దిగి పోవుటకు సోపానములు నిర్మింపఁబడి యుండెను. ఆమార్గమున మృగాంకవతీ రాజేశ్వరులిరువురు నా సురంగములోనికి దిగిరి. తుదిమెట్టుపై పాద మిడినతోడనే యా చతురపురాయి కొలఁది ధ్వనితో మూఁతవడి యెప్పటియటుల నాసురంగ ముఖమును బంధించివైచెను.

౬

రాజేశ్వరి తాళపుఁజెవులను దీసికొని చనిన నొక గంటకా లమునకుఁ బిదప మాయారాణికిఁ జైతన్యము గలిగి లేచి కూర్చుం డెను. దేహము కొంచెము భారముగ నామెకుఁ దోచుచుండెను. కాని, తత్కారణమునుమాత్ర మామె దెలిసికొనఁ జాలకుండెను. రెండు గంటలకుఁ బూర్వ మామె ఏయేసంగతులను దలంచి భయ శంకా సంభ్రమాయత్త చిత్త యగుచుండెనో యవియే మరల నేతెంచి యామెను ముట్టడించెను. ఎవ్విధంబునను నామె యచటఁ గూర్చుండి విశ్రాంతి బడయఁజాలకుండెను. ఆమె యలమూరుసుండి

యొక నాటకపుస్తకమును వెడలించి దివ్వెసమీపమునఁ గూర్చుండి చదువ నారంభించెను. నాందిమాత్రము చదువునంత నామె కనులు మూఁతలుపడసాగెను. ఆమె మరల నొక యరగంటకాలము దనుక గంభీర చింతయందు మునిఁగి పోయెను. అంత నెవ్వరి పాదముల సవ్వడియో యామెను దొట్రుపఱచుటచే మోముద్రిప్పి ద్వారము వైపునకుఁ బరికించెను. అంత జగపతి యామె సమ్ముఖమున కేతెంచి యిటులఁ బలుకఁ దొడంగెను:—

"నా ప్రియరాణీ! నీవీసమయంబున మిగుల నుదాసీనత నేదియో గంభీరచింతయందు మునిఁగి యుండినటులఁ దోఁచుచున్నది. బహుశః నీకింత దనుక నిద్దుర పట్టకుండెనని తలంచెదను."

"నిశ్చయము. కాని, నీమోముగూడ నిటులఁ గాంతి దఱిఁగి..........."

"నాకుఁ గలిగియుండిన దురంతచింతకు మేర లేకున్నది. ఇపు డాసమాచారము పౌరులెల్లరకు శీఘ్రముగనె తెలియఁగలదు. ప్రజల వానిని దమ ప్రాణములకన్న మిన్నగఁ దలంచు......"

"చాలును! చాలును!! ఇఁక ముందుసంగతులను వచియింప నగత్యములేదు. ఆయోజనయే నన్నొక బనికిమాలిన దానినిగఁ జేసి వైచుచున్నది."

"నేను గొన్నిదినములు దనుక నిన్నెడఁబాసి యుండుటకుఁ దలంచు చుంటిని. నే నీసమాచార మెఱింగించుటకే యిపు డిచటి కేతెంచితిని."

"(సంభ్రమముతో) ఏమీ! నీకుఁ బిచ్చి పట్టియుండదు గదా? నిన్ను సంభాళించుకొని యైనను మాట్లాడకుంటివి!"

"ఔను. గొప్పప్రమాదమే! నన్నీసమయంబున భయశోకా సంభ్రమములు మతిమాలిన దానినిగఁ జేసి యుంచినవి"

"మంచిది నీవు నన్ను వీడి యెచటికి కేగఁదలంచుచుంటివి?"

"నీవెచటికిఁ బోవునని నచ్చోటునకుఁ బోయెదను."

(కొంచెము యోజించి) ఇఁక నను వేగిరింపఁ బనిలేదు. మహేంద్రి నరేశసింహులు మనచేఁ జిక్కియుండిరి కదా? అరుణోదయము గాక మున్నె వారినపుడు గుదముట్టించెదను.

"నీచెవియందా పిశాచము చెప్పియుండిన విషయమునగూడ విశేషముగ శ్రద్ధవహింపవలసి యున్నది."

"అకటా! ఆవిషయమున గూర్చి నాకిపుడు నిరాశ జనించుచున్నది. వాఁడు మిగుల మాశ్చర్యశీలుఁడు."

"అగుచో, వానిని తుదముట్టించి మనమేల నిశ్చింతలముగాఁ గూడదు?"

"ఇపు డయ్యదియే కాఁగలదు.

"ఆలస్యమెందులకు?"

"నేనిపుడే యచ్చోటున కేగనుంటిని. నీవును నావెంట రమ్ము!"

"నేను సంసిద్ధముగ నుంటిని. కాని, యాపిశాచమున కీసమాచార మెటులఁ దెల్లమయ్యెనో తెలియదు."

"మంచిది. నడువుము."

ఇపుడు మాయారాణి దృష్టి కారాగారపుఁ దాళపుఁజెవి వైపునకుఁ మరలెను. ఆమె తన మొలయందుఁ దాళపుఁజెవులు లేకుండుటఁ గాంచి, సంభ్రమాయత్త చిత్తయగుచుఁ గొంత సేపటివఱకుఁ దన్ను దామఱచి యుండెను. తుదకామె యొకనిట్టూర్పుఁ బుచ్చి జగపతితో నిటులఁ బలికెను:—

"మన మాపదలయందుఁ జిక్కి నుండుట కిది రెండవ నిదర్శనము."

"అదియేమి? ఒక్క మాటుగ నీయవస్థ యిటు లేల మార్పు నొందినది? ఏనూతన విచార మేనియు నిన్ను ముట్టడించి యుండదు గదా? నాకేమియు బోధపడకున్నది."

"నామొలయందు బంధించుకొని యుండిన కారాగారపు తాళపుఁ జెవులు మాయమైనవి."

"(తొట్రుపాటుతో) ఎచటనేనియుఁ బరాకున బెట్టి యుండవుగదా!

"కాదుకాదు. వానిని నామొలయందే భద్రపఱచి యుంటిని. నడువుము. రాజేశ్వరి కీవిషయమున నేమైనను దెలియునేమో ప్రశ్నింతము"

మాయారాణి జగపతిని వెంటఁదోడ్కొని రాజేశ్వరి శయనాగారములోని కేగెను. కాని, యచట నామె యుండినగదా వారికిఁ జూపట్టుట! ఇపుడు మాయారాణికి జనించిన భయసంభ్రమాశంకలకు మేర లేకుండెను. మఱియుఁ దప్పక రాజేశ్వరియే యీకార్య మొనరించి యుండెనని యామె దృఢస్వరంబుతోఁ బలికెను.

జగపతి:—ఆమెను వెదక వలయును.

మాయారాణి:—(ఆకసము వంకఁ బరికించి యొక దీర్ఘనిశ్వాసను బరిత్యజించి) అయ్యో! ఇఁక నొక జామురాత్రి మాత్రమే కలదు. ఇది నాకు మిగుల నమూల్యమగు సమయము. రాజేశ్వరిని వెదకుటయందు దీనిని వ్యర్థముగ గడపఁ జాలను. ఈకొంచెపాటి కాలములోనే యామాత్సర్యశీలుని సమీపమున కేగి వాని శిరమును ఛేదించి మగుడి రావలసియున్నది. బంధితుల విషయమునకంటె వాని చింతయే నాకు విశేషముగ గలదు. ఆపిశాచము పలికి యుండిన వాక్యములింకను నాచెవియందుఁ బ్రతిధ్వనించుచునే యున్నవి. మంచిది.

వానిసమీపమునకుఁబోవుచుఁ గారాగారపు స్థితియుఁ గొంత యరసి పోవుదము. (ఆవేశపూరితయై) కానిమ్ము! బంధితులు కారాగారమునుండి బయటఁబడినను నీతోఁట చుట్టు ప్రాకారములను దాఁటి యెచటకేఁగఁ గలరు? మంచిది. పొమ్ము! వేగమె కాంచన గదాధరసింహుల నిటకుఁ దోడ్కొని రమ్ము.

జగపతి పరుగులిడుచుఁ బోయి వెంటనే కాంచన గదాధరులను వెంటఁదోడ్కొని మరల నచటికి వచ్చిచేరెను. కాంచనసింహుని మోముపై నభయసింహుడు పూసియుంచిన రంగు పూర్తిగ వెడలకుండినను నధికప్రయత్నములవలన వాని మోము సగమునకుఁ బైగా శుభ్రపడియుండెను. ఒకటి రెండు నాళ్లలో దన నిజస్వరూపమును నద్దమందుఁ జూడఁగలుగుదునను నాశ వానికిఁ గలిగియుండెను.

కారాగారపు మార్గము మాపాతకమహాశయులకుఁ దెలిసియే యున్నది. కారణంబేమన, నభయసింహుఁ డెపుడు గాంచనసింహుని రూపమున నిచటికిఁ జేరియుండెనో యపుడు బంధితులనుఁ జూచుటకు మాయారాణి వెంట నాతావునకుఁ బోయి యుండెను.

మాయారాణి రాజేశ్వరి శయనాగారము నుండి కొన్ని యమ్ములను విల్లును దీసికొని నైఋూను లిగవురను జగపతిని వెంటఁదోడ్కొని యొక సురంగమందుఁ జొచ్చెను. మఱియుఁ గారాగారమును సమీపించి దాని బీగ మెప్పటి యటుల బంధింపఁబడి యుండుటఁ గాంచెను. తన మొలయందలి తాళపుఁజెవులు మాయమగుటయు రాజేశ్వరి యదృశ్యమగుటయుఁ గాంచన గదాధరసింహులకు వివరించి తెలిపి తాను మగుడి వచ్చుదనుక నచట మిగుల జాగరూకతతోఁ గావలిగాయుచుండుటకు శాసించెను. మఱియు

దాను జగపతిని వెంటదోడ్కొని యున్నభయసింహుని బంధించు టకు గదాధరసింహుఁడు వానిని దోడ్కొనిపోయి యుంచిన మార్గ మున మూఁడవ తరగతి తోఁటలోనికిఁ బోయెను.

ఆతోఁటయందొక బురుజు గలదనియు దానికి నలుదెసలఁ గొన్ని మందిరములును గట్టడములును గలవనియు, దానియందొక చిన్న ప్రవాహము ప్రవహించుచుండెననియు మేము పైన లిఖించి యుంటిమి. మాయారాణి జగపతిని వెంటఁదోడ్కొని యాప్రవా హతీరమునఁ జాలదూరము వఱకు నేగిన పిదప నచటి వకుళవృక్ష ముల క్రిందకుఁ బోయి నిలచెను. అచ్చోటఁ జంద్రకాంత శిలలతో నిర్మింపఁ బడియుండిన చక్కని వేదిక యొకటి గలదు. మఱియు నొక ఱాతి విగ్రహము దానిపైఁ గూర్చుండి యుండెను. మాయా రాణి యావిగ్రహపుఁ జేయెత్తిఁ బట్టుకొని వెనుకవైపునకు మడఁచుట తోడనే యది నోరు దెఱచెను. ఆమె యావిగ్రహపు నోటఁ జేయిఁ జొనిపి, దాని యందలి యొక మరను ద్రిప్ప నారంభించెను. కొంత సేపటి కాతిన్నె కెదుటి భాగమునఁ గల నొక పెద్ద ఱాతిపలక సన్ననిధ్వనితోఁ దలుపు తెక్కువలెఁ దెఱువఁబడి భూమితోఁ దాఁ కెను. మఱియుఁ దానిలోనికిఁ దిగి పోవుటకుఁ గొన్ని మెట్లు నిర్మించి యుండుటఁ జూపట్టుచుండెను. జగపతికి దనవెంట నేతెంచుటకు సన్నఁజేసి మాయారాణి యాతఖానాలోనికి దిగెను. దాని యందు గాడాంధకారము వ్యాపించి యుండెను. మాయారాణి యందుఁ దడుములాడుచు నొక గూటినుండి లాంతరును దానిని వెలిగించు సామానులనుదీసి వెలిగించి నలువైపులకుఁ బరికింపసాగెను. దాని లో దూర్పువైపున నొక చిన్న ద్వారముగలదు. అది యిపుడు దెఱవఁబడి యుండెను. అది యొక సురంగమునకు ముఖద్వారము. మాయారాణీజగపతు లిరువు రాసురంగమందుఁ జొచ్చి దాదాపు

నూరడుగుల దూరము వెడలిన పిదప నాసురంగము దుది గాంచెను. మఱియు నచ్చోటునుండి పైభాగమున కేగుటకుఁ గొన్నితంతియలు నిర్మింపఁ బడి యుండెను. ఆయువతు లిరువు రామెట్లపయి నెక్కి పోవుచుఁ బెక్కు మందిరములతోఁ జుట్టుకొని యుండిన నొకబురుజు దిగువ భాగమునకుఁ బోయి చేరిరి. ఆతావునందునను నట్టివిధంబు ననే చంద్రకాంత శిలావినిర్మిత వేదికయు దానిపై నొక శిలావిగ్రహమును గలవు. అయ్యదియు నొకసురంగమునకు ముఖద్వారము. మాయారాణి వెనుకటివిధంబున దానినిఁ గూడఁ దెఱచెను. ఆసురంగమే నాల్గవ భాగపుఁ దోఁటలోనికిఁ బోవు మార్గము.

మాయారాణీ జగపతు లిరువురు దానియందుఁ బ్రవేశించి దాదాపు రెండువందల యడుగుల దూరము వెడలిన పిదప నాసురంగము సమాప్తి నొందెను. మఱియు నచటినుండి పైభాగమున కేగుటకుఁ గొన్ని సోపానములు గట్టఁబడియుండెను. ఆపడతు లిరువురు నామెట్ల మార్గమున బైకిఁ బోయి యొక గదియందుఁ బ్రవేశించిరి. దానిద్వారము దెఱువఁబడి యుండెను. మాయారాణీ జగపతు లిరువురా గదినుండి వెలుపల కేగి నాల్గవభాగపుఁ దోఁటయందుఁ బ్రవేశించిరి. ఆతోఁటయొక్క సంపూర్ణ చిత్రపటమిచటఁ జిత్రింపక మాయారాణి కార్యాచరణములను మాత్రము లిఖించుచుంటిమి.

ఆగదికి వెలుపల తొమ్మిది పది గజముల దూరమున నొక దృఢమగు బావికలదు. దాని యందు జలము నాయు మాత్రమైనను లేదు. వెలుపలి నుండి దాని లోని కొక దృఢమగు నినుప గొలుసు వ్రేలాడు చుండెను. నూతిపై నొక త్రాడును బొక్కెనయుఁ గలవు. ఆచేదయందు లాంతరు నునిచి దాని నానూతియందు వైచి యది యడుగునట్టమునకుఁ బోయి చేరిన పిదప నాయువతు

లిరువురు నాయినుపగోలుసును బట్టుకొని దాని యవలంబమున నాబావిలోనికి దిగిరి. ఆనూతియందడుగు భాగమున గోడయం దొక చిన్న ద్వారము గలదు. ఆద్వారమును దెఱచి లాంతరు జేతఁ గొని, తన వెంట నేతెంచుటకు జగపతికిఁ దెలిపి మాయా రాణి యాద్వారమందుఁ బ్రవేశించెను. దాని లోపలి భాగమున గొన్ని చిన్న చిన్న గదులు గలవు. ఎదుటి భాగమున నినుప గజ ములతో నమర్పఁబడి యుండిన గదియం దొక మనుజుఁడు చేత నొక డాలును ధరించి దాని యందుఁ దిరుగాడు చుండెను. ఆస్థాన మున జీఁకటి దట్టముగ నావరించి యుండెను. కాని, మాయారాణి చేతి యందలి లాంతరు వెలుతురు వలన నాగది యందలి సకల పదార్థములును దాని యందు సంచరించు చుండిన మనుజుని స్వరూ పమును బాగుగఁ జూపట్టు చుండెను. ఆమనుజుని వయోరూపము లను వర్ణించి తెలుపుట కియ్యది తఱిగాదు. కారణంబేమన, దురంత దుఃఖ సంతాపములు వాని నొక యెండు కట్టెవలెఁ జేసి యుంచెను. వాని విశాలనేత్రములకుఁ జుట్టు నల్లని రేఖ లేర్పడి యుండెను. మోమునందు ముడుతలేర్పడి యున్నను వాని దేహఘటనము వై పునకు దృష్టిఁ బోనిచ్చిన నతఁడు మిగుల సుందరాకారుండనియు సుకుమారగాత్రుఁడనియు బోధపడకమానదు. కాని, యిపుడు చెఱ సాల వెంపరలు వానిని మృతప్రాయునిగ నొనరించి యుంచెను. వాని దేహమందలి పుట్టంబులు చినిఁగి మలిన భూయిష్టముగ నుం డెను. ఆగదియం దొక వైపున నిత్తడి బిందెయు నొక చెంబును గొలఁదిగ భోజన పదార్థములును గలవు. అతఁడు దేహాచ్ఛాదిత మొనరించు కొనుటకును బరుండుటకును రెండు కంబళములుమాత్ర మచటఁ గలవు. ఆగదికి వెనుక తట్టు గోడయందుఁ జిన్న గవాక్షు మొకటి గలదు. దానినుండి యమితంబగు దుర్గంధము వెడలి యా గదులయందు వ్యాపించు చుండెను.

మాయారాణీజగపతులను గాంచి నంతనే యాబంధితుఁడచట నిలచి పోయెను. మఱియు నట్టి దురంత దురవస్థయందుఁ గూడఁ గన్ను లెత్తి జేసి వారి వైపునకుఁ బరికింప సాగెను.

మాయారాణి:—(బంధితునితో) నేను నీచెంత కేతెంచుట కిదియే కడసారి యని తలంపుము.

బంధితుఁడు:—పరమేశ్వరుఁ డటులనే కావించు గాక! నీపాపిష్టి రూపము మఱల నాకుఁ జూపకుండుగాక!

మాయారాణి:—ఇప్పుడేనియు నీవు దాని మర్మములను వివరించిన జీవములతో వీడి పుచ్చుదును.

బంధితుఁడు:—ఓసీ! పాపాత్మురాలా! నీవు నాయెదుట నుండి వేగమె తొలఁగి పొమ్ము.

మాయారాణి:—ఆరహస్యము లన్నింటిని నీవెంటఁ గొనిపోవుదు వని తలంచెదను.

బంధితుఁడు:—ఔను! అటులనే తలంపుము.

మాయారాణి:—నీకుఁ బ్రాణములయందుఁ దీపి తక్కువయనియు మృత్యువాతఁ బడుటకుఁ గోరుచుంటివనియు దోఁచు చున్నది.

బంధితుఁడు:—ఔను! నాకుఁ బ్రాణములపైఁ బ్రీతి యించు కేనియు లేదు. ఇట్టి విధంబున నైదు దినముల కొక మాఱు భుజించుటకును గోరను. నీపాపస్వరూపమును గాంచుటకంటె మరణమే యెన్నిమడుంగులో శ్రేష్టతరం బని యింత దనుక దలంచుచుంటిని. కాని, యిపుడు నాకాకోరికయు లేదు.

మాయారాణి:—(నవ్వి) నాహస్తగతము నుండి నిన్నెవ్వరు తప్పింపఁ గలరు?

బంధితుఁడు:—(తనచేతియందలి తాలును జూపి) ఇయ్యదియే!

జగపతి:—(మాయూరాణి చెవిలో) ఈడాలు వీని కెవరొనంగి పోయిరో తెలియకున్నది. ఆపిశాచ మిచటివఱకు వచ్చి చేరి యుండదు గదా?

మాయూరాణి:—(జగపతితో) నాకేమియుఁ దోపకున్నది. మన భావిపరిణామము మిగులఁ జెడ్డదైనదని యీడాలు సూచించుచున్నది.

జగపతి:—అయ్యో! భయాతిరేకంబున నాహృదయము గంపించుచున్నది.

మాయూరాణి:—(బంధితునితో) అది నిన్నెవ్విధంబునను గాపాడఁజాలదు. మఱియు నేఁడు నీప్రాణములను గొనక యే యిచటినుండి మరలుదానను గాను.

జగపతి:—నీయిచ్ఛ చొప్పున గావింపుము.

మాయూరాణి:—నీవు మిగుల మాత్సర్యశీలుఁడవు.

బంధితుఁడు:—నీవు మిగుల దుర్మార్గురాలవు. పాపాత్మురాలవు. అవివేకివి. క్రూరాత్మవు. నీవు మాటి మాటికి నాయెదుట కేల యరుదెంచు చుంటివి.

బంధితుని వచనములకుఁ బ్రత్యుత్తరముగ మాయూరాణి వాని వైపున కొక యమ్మును విడచి పెట్టెను. అతఁడతినేర్పున నాబాణమును దన డాలుపై నిలపివైచెను. మాయూరాణి రెండవ బాణమును విడచెను. అదియు వ్యర్థ మయ్యెను. మూఁడవ శరమును బ్రయోగించెను. అదియు నిరుపయోగ మయ్యెను. ఇఁక మాయూరాణి సేయునది లేక వాని వైపునకుఁ గ్రోధ భయ శంకావిస్మయ దృష్టిఁ బరికింప సాగెను.

బంధితుఁడు:—నీవలన నేమియుఁ గాఁజాల దని మొదటనే తెల్పి యుంటిని గదా!

మాయారాణి:— నీవెంతదనుకఁ బ్రాణములను గాపాడు కొన జాలుదువో పరికించెదను.

బంధితుఁడు:— నన్నెవ్వరు దుద ముట్టింపఁ జాలరు. కాని, నీకు మృత్యువు దాపించి యున్నదని మాత్రము నమ్మి యుండుము.

దానికిఁ బ్రత్యుత్తరముగ మాయారాణి యేమియో పలుకఁ దలంచుచుండెను. అంత నొకగంభీర ధ్వని యామెను జకితురాలనుగ నొనరించెను. బంధితుఁడు వచియించు చుండిన వాక్యము దుదిగొనకపూర్వమే "ఔను! మాయారాణికి మృత్యువు దాపించి యుంట నిక్కువ" మని యొక ధ్వని వారికి వినిపించెను.

౭

కారాగారపు వృత్తాంతమును మేము పైన లిఖించియుండినను నిచటఁ గొంత వ్రాయు టవశ్యముగఁ దలంచుచుంటిమి. ఆచెఱసాలయందుఁ బదిగదులు గలవు. వాని యందు, మన వరాక్రమశాలురగు బంధితులు చెఱఁబెట్టఁ బడియుండిరి. తక్కినగదులు నిరర్థకముగ నుండెను. ఇపుడు మా పాఠకమహాశయు లావరాక్రమోపేతులనామములను మఱచియుండిన నది యొక వింతగాదు. కావున, మరల మే మొకమాఱు వారి నామములను జ్ఞప్తికిఁ దెచ్చుచుంటిమి. ఆ కారాగృహమందలి గదులయందు మహేంద్ర నరేశాజిత రజితేంద్రమోహనదిలేరుసింహులును మఱియు నొక సుకోమలాంగియగు బాలికయు బంధింపఁబడి యుండిరి. ఆ పువ్వుఁబోఁడి సుందర ముఖకాంతి యా కారాగారమును బ్రకాశవంతముగఁ నొనర్చుచుండెను. మేమిపుడు మదాలసనుగూర్చి సూచించుచుంటిమని గ్రహణశక్తి సంపన్నులగు మా పాఠకమహాశయులు గ్రహిం

చియుందురు. పురుషుల చూడ్కులు ప్రసరింపఁ జాలని యొక గది యం దామె బంధింపఁబడి యుండినను కుమార నరేశసింహునకుఁ దన ప్రియురాలగు మదాలస సమీపమున గలదను దిటవు గలిగి యుండెను. కాని, కుమార మహేంద్రసింహుని విచారమునకు మాత్రము మేర లేకుండెను. తన బహిః ప్రాణమగు ప్రియంవద చంద్రికళ యెచట నెట్టి దురవస్థకుఁ బాల్పడి యుండెనో, యాన మాచారము వాని కిసుమంతయుఁ దెలియకుండెను.

ఆబందిగవు మిద్దెనుండి యొక గాజుకుప్పె వ్రేలాడు చుండెను, దానియం దహోరాత్రములు గాఢాంధకారము వ్యాపించి యుండు కారణంబున మాయారాణి సేవకుఁ డొకఁ డనుదిన మచటికేతెంచి యాగాజుకుప్పెను శుభ్రపఱచి దానిని వెలిగించి వెడలిపోవు చుండెను. ఆబంధితులకు దినమున కొక్కమాఱు మాత్రమే యన్నోదకము లొసంగఁబడు చుండెను. ఆకారాగారపు భయంకర దుస్థితిని సవిస్తరముగ వర్ణించి యమూల్యంబగు కాలమును వృథావుచ్చుటకు మేము గోరము. ఇద్దియునుఁగాక నిచట కథాభాగము విపులముగ లిఖింపవలసి యుండుటచే స్థానాభావ భీతియుఁ గలదు.

ఏదినంబున మాయారాణి యాపిశాచములో సంభాషించి యుండెనో, మఱియు నేనాఁడు మృగాంకవతీరాజేశ్వరులు గలసికొని యుండిరో, యానాఁటి సాయంకాలపు వృత్తాంతమును మేమిపుడు లిఖించుచుంటిమి.

ఆచెఱసాలయందుఁ బగలును రేయియు నొక్కవిధంబుగఁ దోఁచుచుండెను. ఎపుడు సూర్యు డుదయించు చుండెనో, యెపు డస్తమించుచుండెనో యను విషయ మెవ్వరికిని తెలియదు. కాబట్టి మేము వెలుపలి స్థితిని బట్టియే కాలమును సూచించు చుంటిమి. సంధ్యాసమయమునకుఁ బిదప నొక మనుజుఁడు మన పరాక్రమశా

లురు బంధింపఁబడి యుండిన కారాగారములోని కరుదెంచి బంధి
తులను గలయఁగని యివ్విధంబునఁ బలుకఁదొడంగెను:—

"రేపటి దిన మరుణోదయ మగుటతోడనే మీరెల్లరు వధిం
పఁబడుదు రని తిలస్మ రాణియగు మాయారాణి యాజ్ఞానుసారముగ
మీకుఁ దెలుపు చుంటిని. మఱియు నామె విజయేంద్రసింహ మహీ
పాలుని, వాని యర్ధాంగియగు కరుణాదేవితో సహితముగ బం
ధించి యున్నదనియు, మీరు వారి కన్నుల యెదుటఁ దోరింపఁ
బడుదురని యుఁ దదనంతరము వారిరువురుగూడఁ జంపబడుదురనియు
నేను స్వయముగ మీకుఁ వివరించు చుంటిని."

ఆమనుజుఁ డచటి కేతెంచుటకుఁ బూర్వము బంధితులెల్లరు
మిగుల నుదాసీనతతోఁ గూర్చుండి యుండిరి. కాని, యతఁడెపుడు
పూర్వోక్త వాక్యములను బలికి యుండెనో, యప్పు డెల్లర స్థితి పరి
వర్తనము నొందెను. క్రోధావేశంబున వారి మోములు జేవురించె
ను. దేహములు గంపింపఁ దొడంగెను. కాని, యామనుజుని మా
టల కెవ్వరును బదులు పలుక లేదు. తదనంతర మామనుజుఁడు
కరపాదంబులు బంధింపఁబడి వివశయై పడియుండిన మదాలస గది
లోనికిఁ బోయి యాయబలను బలాత్కారముగ వెంటఁదోడ్కొని
వెలుపలకు వెడలిపోయెను. ఆసమయంబున మన బంధితులెల్లర
చూడ్కులా నిస్సహాయవైపునకుఁ బ్రసరించెను. దురంతదుఃఖ ప్రపీ
డనంబున నామె మిక్కిలి శుష్కించి కాష్ఠము వపువునఁ జూపట్టు
చుండెను. మఱియు నామె కొన్ని వత్సరములనుండి రుగ్ణతావస్థ
యందుఁ జిక్కియుండినటులను గోచరించు చుండెను. అట్టి స్థితియం
దుఁ గూడ సౌందర్య సౌకుమార్య సాధుత్వము లామెను వీడియుండ
లేదు. కరపాదములు శృంఖలాబద్ధములై యుండుటచే నామె బాగు
గ నడవఁ జాలకుండెను.

మాయారాణి మనుజుఁడటు లామదాలసను దోడ్కొని పోయిన పిదప నాకారాగారపు ద్వారమును బంధించి బీగము వైచుచున్న సవ్వడియు మనపరాక్రమశాలురగు బంధితులకు వినిపించెను. ఇట నరేశసింహుని స్థితి విపరీతముగ మాఱియుండెను. మొదట నతఁడు దన జననీజనకులు మాయారాణివలన బంధింపఁబడి యుండిన సమాచారము నాలించి క్రోధావేశుఁడయి యుండెను. ఇపుడవ్విధంబున వివశయైయుండిన మదాలసను బలాత్కారపూర్వకంబుగఁ గారాగృహమునుండి తోడ్కొని పోవుటను బరికించుటచే వాని యావేశము ద్విగుణీకృతంబయ్యెను. అతఁడు దన క్రోధావేశమును మరలించుకొనజాలక లేచి నిలచి తాను బంధింపఁబడి యుండిన గదియందుఁ బిచ్చివాని విధంబున నిటు నటు దిరుగాడుచు వివిధాలోచన నిమగ్నమానసుఁ డగుచుండెను. ఏగదియందు నరేశసింహుఁడు చెఱఁబెట్టఁబడి యుండెనో దాని కెట్టయెదుటి గదియందుఁ గుమార మహేంద్రసింహుఁడు బంధింపఁబడి యుండెను. మఱియు నైయూరులు దమ గదులలోనుండి యొండొరులను బాగుగఁ జూడఁగలరు. నరేశసింహుఁడు లేచి పచారు చేయుటకు నారంభించుటచే వాని పాదములకుఁ దగిలి యుండిన శృంఖలముల ధ్వని మెల్లరను దొట్రుపఱచెను. మఱియు వారలు నరేశసింహుని వైపునకుఁ బరికింపసాగిరి.

మహేంద్ర:—సోదరా! నరేశా!

నరేశ:—అన్నయ్యా! ఏమిసెలవు?

మహేంద్ర:—మనల నీవివశత్వము వీడిపోకుండునా?

నరేశ:—ఏల విడువకుండును? ఇఁక నిట్టి యవస్థయందుఁ గాలమును వెళ్ళఁబుచ్చు టశక్యము. మఱియు నీయినుప యూసల బోనులయందు బంధింపఁబడి యుండుటకు మనము దూడవి జంతువులము గాము.

మహేంద్ర:—(లేచి నిలచి) ఔను! మనల నీయినుపగజములు నిరోధింపఁ జాలవు.

ఇవ్విధంబునఁ బలికి నిరుపమాన బాహుబల పరాక్రమోపేతుఁడగు కుమార మహేంద్రసింహుఁ డావేశపూరితుఁడయి బలపూర్వకంబుగఁ దన కరములను విదల్చి యాయినుప సంకెళ్ళను విరచి వైచెను. తన సహోదరుని యనుపమ ధైర్య సాహసములను దిలకించి నరేశసింహుఁడు నట్టులే ప్రియత్నించి తన సంకెళ్ళను గూడ ఖండించివైచెను. తదనంతర మాసోదరు లిరువురుఁ దమతమ పాదలములకు బంధించి యుంచిన శృంఖలములను వదల్చుకొని యాయినుప గజములనుగూడ నూడఁ బెఱుకుటకుఁ బ్రయత్నింప సాగిరి. ఆరాకుమారు లిరువురు ధైర్యసాహస బలదార్ఢ్యములందు సాటిలేని వారనుట కెట్టి సందియమును లేదు. వారి యవిరామ పరిశ్రమవలన నాయినుపగజములు వంగి చట్రిపురంధ్రములలోనుండి తొలఁగి పోయెను. బోనునుండి విడివడు గొదుమ సింగముల మాడ్కి నా రాకుమారు లిరువురు దమ చెఱగదులనుండి వెలుపలఁకుఁ దుమికి సంతోషాతిశయంబున నొండొరులను గట్టిగ కౌగలించుకొనిరి. మఱియుఁ గ్రమముగఁ దక్కిన గదుల యెనుటి యినుపగజముల నట్టులే తొలఁగించివైచి తమ మైయారులందఱను బంధవిముక్తుల నుగ నొనరించిరి. మఱియు మిగుల నుత్తేజతులగుచు "చూడుఁడు! ప్రియత్నమునకు మించిన నుత్తమసాధన మీజగతి వేఱొకటి లే"దని పలికిరి.

నరేశ:—మనపై నాదయయామయుండగు పరమేశ్వరుని కృపాకటాక్షము గలిగియుండిన శీఘ్రకాలములోనే యీ కారాగృహమును వీడిపోగలము.

చిరి. రజితేంద్రసింహుఁడజితసింహుని భుజములపై నధిరోహించి యాదివ్వెను మిద్దెనుండి వెడలించెను. మఱియు దానిఁ జేతఁగొని యారంధ్రమందుఁ జొచ్చి యావలి వైపునకు వెడలెను. వాని వెనుక రాకుమారు లిరువురును నైయారులును న్నా వైపునకుఁ బోయిరి. ఆస్థానము దాదాపు ముప్పది గజములు పొడవును బదునైదు గజములు వెడల్పును గలిగియుండుట వార లాదివ్వె వెలుతురునందుఁ గనుగొనిరి. ఆదివ్వెను జేతఁ దీసికొనక రాకుమారులు గాని నైయారులు గాని దానిలోనికిఁ బోయి యుండిన నెంతేనియు నన ర్థము వాటిల్లి యుండును. కారణంబేమన, దానియంచలి భూమి సమమట్టముగ లేక మధ్య నొకపెద్ద బావిని గలిగియుండెను. ఆబావికి నలుదెసలఁ గల భూమియందు నాలుగు ద్వారములు గలవు. వానిని గాంచుటవలన నచటఁ గొన్ని యంతర్భవనములు గలవనియు నవియ వానిలోనికిఁ బోవు మార్గములనియు బోధపడుచుండెను. దారుఫలకములతో సమర్చఁబడి యుండిన యాద్వారకవాటములిపుడు తెఱవఁబడి యుండెను. బాగుగ నిదానించుటవలన వానిలోనికిఁ దిగి పోవుటకు సోపానములు గట్టఁబడి యుండుటఁ జూపట్టుచుండెను. మఱియు నాబావియం దొక యినుపగొలుసు వ్రేలాడుచుండెను. ఆస్థానమునకు నలువైపులఁ గల దృఢ ప్రాకారముల యందు ద్వారములుగాని గవాక్షములుగాని యెవ్వియును లేవు.

మహేంద్ర:—ఎవ్వరేనియు నిటకు రాఁదలంచిన గాని, వెలుపలకేగఁ దలంచినగాని, నీయంతర్భవనములు దక్క వేఱు మార్గము లేకుండెనని తోఁచుచున్నది.

నరేశ:—ఔను. నాకు నటులనే తోఁచుచున్నది.

మహేంద్ర:—ఈయంతర్భవనముల యందుఁ బ్రవేశించినగాని, మనకార్య మెద్దియు నెరవేఱఁజాలదు.

అజిత:—(మహేంద్రసింహునితో) అనుమతింతురేని, నేనీదివ్వెను జేతఁగొని యీయంతర్భవనములలో నొక దానిలోనికిఁ బోయి యచట నేమికలదో పరికించి వచ్చెదను.

మహేంద్ర:—మంచిది. అటులనే కావింపుము.

కుమార మహేంద్రసింహుని యాజ్ఞానుసార మజితసింహుఁ డాదివ్వెను దీసికొని యొక యంతర్భవనము చెంతకుఁ బోయి నిలచెను. మఱియు దానిలోనికి దిగుట కుద్యమించియు దానియం దేదియో కాంచి మరల నిలచిపోయెను. అంత మహేంద్రసింహుఁడు వానితో, "అజితసింహా! నీవటు లేల సందేహించుచుంటి" వని ప్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరముగ నజితసింహుఁడు వానితో, "యీయంతర్భవనమందుఁ గొంత ప్రకాశము జూపట్టుచున్నది. మఱియు నయ్యది క్రమముగ వృద్ధిపొందు చుండుటచే నిది యొక సురంగమార్గమనియు దీనియం దెవ్వరో చేత దివ్వెఁ గొని యీదెస కేతెంచు చుండిరనియు దోఁచుచున్న"దని వలికెను. రాకుమారు లిరువురును నైయారులును నాసురంగ సమీపమున కేగి దానిలోనికిఁ దొంగి చూడఁదొడంగిరి. కొంతవడికి నిరుపమాన సౌందర్యగరిమ జెన్నొందుచుండిన నిరువురు మత్తకాశినులు తమదెస కేతెంచుచుండుట వారు కనుగొనిరి. ఆబిబ్బోకవతులు క్రమముగ ముందున కేతెంచి మెట్లపై నెక్కుటకుఁ దలంచుచుండిరి. వారిలో నొక యంగనామణి చేతియం దొక మైనపువత్తి వెలుగొందు చుండెను. దాని ప్రకాశమం దాయన్నులమిన్న స్వరూపమును గాంచినంతనే మహేంద్రసింహుఁ డామెలనాఁగ మృగాంకవతియని సహజముగ గుర్తింపఁ గలిగెను. ఆమె వెంట రాజేశ్వరియుఁ గలదు. కాని, యతఁ డామెను వెంటనే గుర్తింపఁ జాలఁడాయెను. మున్నొకనాఁడతఁ డవరాధుని విధంబున మాయా

రాణి కొలువు కూటమునకుఁ గొనిపోఁబడి నప్పుడామె మాయా రాణి ప్రక్కను గూర్చుండి యుండుటను గాంచి యుండెను. మఱియు నామె తనకుఁ బగతురాలనియు భావించి యుండెను. ఇప్పుడామె మృగాంకవతి వెంట నుండుటఁ గాంచి మహేంద్రసింహుని కమితశంకాశ్చర్యములు గలుగుచుండెను. బాగు! తనకు హితురాలని తలంచి యుండిన నామె వెంట నొక పగతురాలుండుటఁ గని యెవరికి శంక జనింప కుండును?

మృగాంకవతి యిట్టులా మెట్లపయి నెక్కఁబోవుచుఁ బైతట్టున వెలుతురు గనిపించుచుండుటచేఁ దటాలున నచట నిలచి పోయెను. అంత మహేంద్రసింహుఁ డది గని "భీతిల్ల వలదు! పైకి వెడలి ర"మ్మని బిగ్గఱగాఁ గేకలిడెను. కుమార మహేంద్రసింహుని కంఠధ్వని నాలించుటతోడనే యామె గుర్తించి రాజేశ్వరిని వెంటఁ దోడ్కొని యామెట్లను వెనుక్కవేమము వడివడి పైతట్టునకుఁ జోయిచేరెను. మఱియు నచట రాకుమారు లిరువురు నైయారులతో నిలచియుండుటఁ గాంచి యాశ్చర్యచకితయయ్యెను.

మృగాంక:—ఆశ్చర్యము! మీ రిచటి కెట్టుల రాఁగలిగితిరి?

మహేంద్ర:—నేనును దీనినే ప్రశ్నింపఁ దలచుచుంటిని.

మృగాంక:—మిమ్ములను బంధవిముక్తులనుగ నొనరించు తలంపుతో నిట కేతెంచుచుంటిని. కాని, నాకుఁ బూర్వమే యెవ్వరో యిచటి కేతెంచి మిమ్ములను చెఱ విడిపించినటులఁ దోఁచుచున్నది.

మోహన:—ఇచటి కెవ్వరును నేతెంచి యుండ లేదు. స్వయముగ రాకుమారు లిరువురు నతిసాహసంబుతో, దమ కరములకుఁ దగిలియుండిన సంకెళ్ళను విఱిచివైచి యినుప గజముల నూడఁదీసికి మమ్మెల్లరను బంధవిముక్తులనుగ నొనరించి

యుండిరి. తదనంతర మా కారాగారపు గోడను ద్రవ్వి యిపుడే మేమిచటికి వచ్చి చేరితిమి.

మృగాంక:—(నవ్వుచు) వహ్వా! ఇట్టి పరాక్రమధౌరేయులు గాక యింతటి సాహసకార్య మెవ్వ రొనరింపఁ గలరు?

మహేంద్ర:—నిన్నొక విషయమును బ్రశ్నింప వలసి యున్నది.

మృగాంక:—అది నేనెరుంగుదును. (రాజేశ్వరి వైపునకు సంకేతించి) బహుశః యీమెను గూర్చి ప్రశ్నింపఁ దలంచుచుందురు.

మహేంద్ర:—నిశ్చయము! కారణంబేమన, నేదురాత్మురాలి కారణంబున మాకిట్టి వెతసేకుఱి యుండెనో, యీమె చెక్కియ సీపాటలాధరి కూర్చుండి యుండుట నేనొకపరి కాంచి యుంటిని. ఆమె నామము మాయారాణి యని పరిసంగ ధోరణి యందుఁ దెలిసికొని యుంటిని గాని, యీయన్నులమిన్న నామము మాత్రము నాకుఁ దెలియదు.

మృగాంక:—చాలాకాలము నుండి మిమ్ముఁగలసి సంచరించుచున్నను నాయాసలు వృత్తాంతమును గొంచెమైనను మీకు వివరించి యుండలేదు. ఇపుడీ సుందరీమణి నాచెలియలని వచియించు టెంతేనియు సముచితముగఁ దలంచుచుంటిని. మాయారాణి మాకు సహోదరి. ఆమె నాకంటె జ్యేష్ఠురాలు. మేము మువ్వుర మొక తల్లి సంతతివారమై యుండినను మాయందు సఖ్యత లేశమయినను గుదరకుండుటచే నేనామెను విడచి స్వతంత్రురాలనైతిని. నేఁడీమెయు నామెను విడచి నాపజ్జకుఁ జేరి యున్నది. ఈమె పేరు రాజేశ్వరి. ఇంతకుఁ బూర్వము మాయారాణి నాప్రాణములను గొనుటకు [illegible]మే ప్రయత్నించుచున్నది. ఇపుడీమె యునురులను

గొనటకుగూడ క్షుధార్త్తయై యున్నది. నాయసలు వృత్తాంతమును విని యిపుడు నన్ను మీాపగతురాలినిగ భావింప కుందురని విశ్వసించు చుంటిని.

మహేంద్ర:—కాదుకాదు. అటులెన్నఁడు దలంపఁ జాలను. నీవు నాకనేక మహోపకారములను గావించియుంటివి. కావున, నీవు నాకు హితురాలవు గావని యెటులఁ దలంపఁ గలను.

మృగాంక:—చెఱనుండి మిమ్ము విడిపించుట కభయసింహుఁ డిచటికి వచ్చియుండెను. కాని, తుద కతఁడుగూడ బగతులచేఁ బట్టువడెను.

మహేంద్ర:-ఏమి! అభయసింహుఁకును బంధింపఁబడెనా? అగుచో, వానిని మాకారాగృహములోని కేల జేర్పరైరి?

మృగాంక:—అతఁడు మఱియొక స్థానమందు బంధింపబడి యుండెను. నేను వానిని బంధవిముక్తునిగ నొనరించి యుంటిని. కొంతసేపటికి వానిని మనము గలసికొన గలము.

నరేశసింహుఁడు మిన్నక నాయిరువుర సంభాషణము నాలించు చుండెను. మఱియు వాలుఁజూపుల రాజేశ్వరియం దొప్పు చుండిన యలౌకికరూప సంపదను జూఱ గొనుచుండెను. రాజేశ్వరియుఁ ప్రేమంపు వీక్షణంబుల వానివైపునకుఁ గాంచుచు నానందాబ్ధి నోలలాడు చుండెను. మృగాంకవతి వారి భావములను గుర్తించియు నేమియు నెఱుఁగని దాని వోలె మిన్నకుండెను. అభయసింహుని సమాచార మాలించినంతనే నరేశసింహుఁడు సంభ్రమ చిత్తుఁడగుచు మృగాంకవతి వైపునకుఁ బరికించి, మజ్జననీ జనకులు బంధింపఁ బడినటుల......................."

మృగాంక:—నిక్కువము. వారలిరువురను గూడ దురాత్మురాలగు మాయారాణి బంధించి యుండెననియు వార లిపు డధిక

సంకటమందుఁ జిక్కి యుండిరనియు వినియుంటిని. వారిని చెఱనుండి విడిపించుటొక సహజమైన కార్యము గాకుండి నను బ్రయత్నములయం దెట్టి లోటును గలిగింప రాదు. ఇఁక నేమియుఁ బ్రశ్నింపక నావెంట విచ్చేయుఁడు.

కరుణాదేవీవిజయేంద్రసింహు లిరువురు నధిక సంకట మందుఁ జిక్కియుండిరను సమాచారము నాలించినంతనె యెల్లర హృదయములు దురంత దుఃఖసంతాపంబుల నిండియుండుటచే వార లామె నేమియుఁ బ్రశ్నింపఁ జాలరైరి. రాకుమారులు మృగాంక వతి వెంట నేగుటకు సంసిద్ధులయిరి. ఆమె వారలను వెంటఁ దోడ్కొని యాయంతర్భవనములోనికి దిగి దామరుదెంచియుండిన మార్గమున వెనుకకు బయలుదేరెను. కుమారమహేంద్రసింహుఁడు చంద్రకళ వృత్తాంతమును, నరేశసింహుఁడు మదాలస సమాచార మును బ్రశ్నించి తెలిసికొనుటకు మిక్కిలి కలఁతనొందుచుండిరి. కాని, యది దరుణముగాదని తలంచి మిన్నకుండిరి.

ఆమెట్లపైనుండి క్రిందకు దిగినపిదపనదియొక సురంగమార్గ మని వారికి నిశ్చయ మయ్యెను. దానియం దొక్కమాఱుగ నిరువు రు మనుజులు నడచిపోవుటకు దగిన నెరవు మాత్రము గలిగియుండె ను. దాని పైభాగము విస్తారముగ నెత్తు గలిగియుండలేదు. ఒకమను జుఁడు దాని యందు నిలచి చేయిపైకెత్తి దాని మిద్దెను సులువుగ దాఁక గలఁడు. ఆసురంగమునకిరుపార్శ్వంబుల కుడ్యములు మిక్కిలి దృఢమగు గారుతాళ్ళతో నిర్మింపబడి యుండెను. ఆగోడలపై బలు విధంబులగు రంగులతో నానం దదాయకమగు నట్టియు భీభత్సభ యానకాది భావంబుల నుదయింపఁ జేయునట్టియుఁ బెక్కుచిత్రపట ములు చిత్రింపబడియుండెను. మఱియుఁ జిత్రకారుఁ డప్పుడే యాచి త్రములను జిత్రించి చనినటు లవి మిగులఁ దేటగఁ జూపట్టుచుండె

ను. మన రామాకురులును నైషూవులును మిగుల సబ్బురపాటుతో నాచిత్రములవైపునకుఁ బరికింపసాగిరి.

మృగాంక:—(మహేంద్ర సింహునితో) మీరీచిత్రపటములను సావధానముగఁ బరికించుటకుఁ గుతూహల పడుచుండిన ట్లుఁ దోఁచుచున్నది.

మహేంద్ర:—నిక్కమము. కాని, యిపుడీ చిత్రపటములను దిల కించు నానందము మాకుఁ గొంచెమేనియుఁ జేకూరఁజాలదు ఇచటి చిత్రములన్నియు బాగుగ నవలోకించుటకుఁ దగి యున్నవి. కాని, నిరుపాయులము. మజ్జననీజనకులు బంధీ కృతులయి యుండినవార్త నాలించి మామానసము లెంతే నియుఁ గొందలపాటు నొందు చున్నవి. మఱియు సాధ్యమ గురీతిని శీఘ్రముగ వారిని బందిగమునుండి విడిపింప వలసి యున్నది. వార లధిక సంకటమునందుఁ జిక్కియుండిరని కదా నీవిపుడు దెలిపి యుంటివి! అకటా! పూజనీయులగు మాత లితండ్రు లెట్టి యిక్కట్టులకుఁ బాల్పడి యుండిరో యెవ రెఱుంగుదురు?

మృగాంక:—మీపలుకు లెంతేనియు సమంజసములు. ఈచిత్రపట ములను బాగుగ దిలకించి యానందించుటకుఁ గొలఁదిపాటి సమయము చాలదు. మఱియు వాని భావములను దెలిసికొను టకుఁ గొన్నిదినములైనను పట్టును. మనమిచట నిలుచుటకుఁ దఱిగాదు. అయినను మన మైనాలు గంటల కాలములో గమ్యస్థానమునకుఁ జేరి మీతలిదండ్రులను విడిపింపఁజాలము. కారణంబేమన, వార లేకారాగృహమందు బంధింపఁబడి యుండిరో నాకుఁ దెలియదు. ఆజాడ గనిపెట్టుటకుఁ గొన్ని దినములు గాకపోయినను గొన్నిగంటల కాలమైనను పట్టక మానదు.

మహేంద్ర:—నీవు వారిని కన్నులారఁ గాంచి యుంటివా?

మృగాంక:—లేదు. కాని, వారి నీతిలస్మమునయొక్క భాగపుఁ దోఁటయందు బంధించి యుంచిరనిమాత్ర మెఱిఁగి యుంటిని.

మహేంద్ర:—మేము మూర్ఛాగతులము గావింపఁబడ మునకుఁ గొని పోఁబడితిమో, మఱియు దేనియందు మాయారాణి నివసించుచుండెనో యా యుద్యానవనమం దెన్ని భాగములుగూడఁ గలవా?

మృగాంక:—ఔను. ఈతోఁట నాల్గుభాగములుగ విభజింపఁబడి యున్నది. మొదటిభాగపుఁ దోఁట సైనికులును బరిచారకులును నివసించు స్థానము. రెండవతరగతి తోఁటయందు మాయారాణి స్వయముగ నివసించుచున్నది. ఇఁక నెవ్వరి నేనియు గుప్తరూపమున బంధింపవలసియున్న నట్టి కార్యములకు మూఁడు నాల్గు భాగపుఁదోఁట లుపయోగింపఁబడుచున్నవి. ఆరెండుభాగములను దిలస్మ మనవలెను. నాల్గవ తరగతి తోఁట (వణఁకుచు) గొప్పగొప్ప భయంకర ఘటనలతో నిండియున్నది.

మహేంద్ర:—అగుచో, నాల్గవతరగతి తోఁటయందే మా తలిదండ్రులు బంధింపఁబడి యుందురు.

మృగాంక:—ఔను.

నరేశ:—మీచెలియల కీవిషయమున నేమేని యుఁ దెలిసియుండ వచ్చును. ఆమెను బ్రశ్నించి చూడుము!

రాజేశ్వరి:—మూఁడు నాల్గుతరగతుల సంపూర్ణవృత్తాంతము స్వయముగ మాయారాణికే తెలియదు. కాని, మూఁడు నాలుగు మానములకుఁ బూర్వము గొన్నిరహస్యము లామె

కెటులఁ దెల్లమయ్యెనో తెలియదు. మహారాజా! మనమిపు
డీసురంగమందుఁ బోవుచుంటిమో, దానివృత్తాంత మింత
కనుక మాయారాణికిఁ దెలియదు. మఱియు నీస్థానమం
దొక సురంగమార్గము గలదను సందేహమైనను నామెకు
లిగి యుండదు.

మృగాంకవతి చేతియందు వెలుఁగుచుండిన మైనపువత్తి
త్రిగఁ గాలిపోవుటచే దానిని గ్రిందఁ బాఱవైచెను. ఇపుడు
మహేంద్రసింహుఁడు మున్నగు వారలు కారాగృహమునుండి
గొనితెచ్చిన గాజుకుప్పె వెలుఁగుమాత్రము గలదు. అజితసిం
హుఁడాదివ్వెను జేతఁగొని యందఱకు వెన్వెనుక నేతెంచుచుం
డెను. ఇపుడు మృగాంకవతి కథనానుసార మందఱకు ముందుగ
దివ్వెను దీసికొని నడువసాగెను. అచటినుండి దాదాపిరువది గజ
ములు నడచిన పిదప వారి కొక చతుష్పథము చూపట్టెను. అచటి
నుండి నలువైపులకు నాలుగు మార్గములు గలవు. మృగాంకవతి
యచ్చోటున నిలచి మహేంద్రసింహునితో, "మన మిచ్చగించు నె
డల నిచటినుంచి తిలస్మము వెలుపలకు బోఁజాలుదు"మని పలికెను.

మహేంద్ర:— మన యెట్టయెదుటిమార్గ మెచటికిఁ బోయియున్నది?

మృగాంక:— తిలస్మోద్యానమందలి మూఁడు నాల్గు తరగతులలో
నికి బోవుట కిదియే మార్గము. ఎడమచేతివైపు మార్గము
మాయారాణి నివసించు రెండవతరగతి తోఁటలోనికిఁ
బోయి యున్నది.

నరేశ:— మన మీకుడిచేతివైపు మార్గము ననుసరించి వెడలిన నె
చటి కేగఁగలము?

మృగాంక:— ఇది యీతిలస్మమందిరమునుండియుఁ దోఁటనుండియు
వెలుపలికిఁ బోవు మార్గము.

నరేశ:—అగుచో, నీవిపుడు మమ్మెచటికిఁ దోడ్కొని పోవుటకుఁ దలంచు చుంటివి?

మృగాంక:—మీ యిష్టము!

నరేశ:—మమ్ము మాయారాణి నివసించు తోఁటలోనికిఁ గొనిపొమ్ము. మేమా దురాత్మురాలి నిపుడే బంధించి తెచ్చెదము. పిదప నన్ని కార్యములు సునాయాసముగ నెరవేఱఁ గలవు.

మృగాంక:—ఆ కార్యము మీరు దలంచినట్లు లంత తేలికయైనది కాదు. ఇదియును గాక నీసమయంబున మాయారాణి తన మందిరమున నుండునని నాకుఁ దోఁచదు. ఒకవేళ నచట నుండినను నామె యన్ని తెఱంగుల జాగ్రత్త గలిగియే యుండును. మఱియు నచట నింకను గొన్ని యిబ్బందులు గలవు. అందొకటి:- ఉద్యానవనపు జుట్టుప్రాకారముల వెలుపలకు దుమికిగాని వితంసము దోడ్పాటున గాని వెలుపలకుఁ బోవుట యసంభవము. రెండవది:- ఈయుద్యానవన సంరక్షణమునకై నిరంతర మాయుధపాణుల సిపాయిలు మొదటి భాగపుఁ దోఁటయందు నివసించి యుందురు. వారు మాటలాడునంతలో మాయారాణి సమీపమునకుఁ బోయి చేరుట కాయుధపాణులై నిరంతరము సంసిద్ధులుగనుందురు. తత్కారణంబున మాయారాణిని బంధించి వెలుపలికిఁ గొనిపోవుట సాధ్యమగు కార్యము గాదు. మన మిపుడిచటి నుండి వెలుపలకు వెడలి పోవుటయే శ్రేయస్కరముగఁ దలంచు చుంటిని.

మహేంద్ర:—నాయభిప్రాయ మది కాదు.

మృగాంక:—మీయుద్దేశ మేమి?

మహేంద్ర:—నీవలన గాఁజాలిన మూఁడు నాల్గుదినములు దనుక

నీతిలస్మపు నరిహద్దులలోపలనే మనము రహస్యముగ నిలచి యుండుటకుఁ దగిన స్థానము నాలోచింపుము.

మృగాంక:—మంచిది. అటులనే! మీయభిప్రాయము సముచితమై నదనియే నాకును దోఁచుచున్నది.

రాజేశ్వరి:—(మృగాంకవతితో) నీవట్టి రహస్యస్థాన మెచటఁ గల దని తలంచు చుంటివి?

మృగాంక:—మూఁడు నాలుగు తరగతుల తోఁటల యందు మాత్రమే కలదు.

రాజేశ్వరి:—నాల్గవతోఁట లోని కేగి మూఁడు నాల్గుదినముల వఱకు నచట నిలచి యుండుట శ్రేయోదాయకము గాదు. కారణంబేమున, నది మిగుల భయంకరస్థానము. అచటి మర్మములను నీవు బాగుగ నెఱింగి యుంటివా?

మృగాంక:—అయ్యో! భగవంతుఁడా! అచటి రహస్యముల నెఱుంగు టొక సామాన్య కార్య మను కొంటివా? దాని యందలి యొక మందిరము లోనికిఁ బోవుమార్గము మాత్ర మెఱింగి యుంటిని. మఱియు నచ్చోటున కితరులెవ్వరును బోఁజాలరు.

మహేంద్ర:-అగుచో, మమ్మానస్థానమున కేల దోడ్కొని పోఁగూడదు?

మృగాంక:—(కొంచెము యోజించి) ఔను! నాకిపుడు జ్ఞప్తికి వచ్చినది. ఇంతసేపటి నుండియు వ్యర్థముగఁ దల్లడిల్లు చుంటిని మంచిది. నడువుఁడు. నా వెంట నిచ్చేయుఁడు.

మృగాంకవతి వారలందఱను వెంటఁదోడ్కొని తిన్నఁగా నచటినుండి బయలుదేరెను. కొంతదూరమేగిన పిదప బంధింపఁబడి యుండిన లోహనిర్మిత ద్వార మొకటి వారికిఁ జూపట్టెను. ఆద్వార మెవ్విధంబున రెఱచి బంధింపఁబడుచుండెనో యది యెవ్వ

రికిని దెలియకుండెను. కాని, యాద్వారమున కిరువైపుల గోడల యందు మూఁడుమూర తెత్తుగల రెండేనుఁగులు నిర్మింపఁబడి యుండెను. వాని కళేబరములందలి యెదుటిభాగమాగోడలనుండి కొంత ముందునకుఁ బెఱిగి యుండెను. మఱియు నవి రెండును దమశ్వుండముల నొండొంటితోఁ బెనువైచికొని ముందున నొకయడుగుఁ బెట్టి భూమివైపునకు వంగి యుండెను. వానిని గాంచుటవలన రెండు మత్తేభములు క్రోధావేశులై తమ తొండములను గలిపి పోరుటకు సంసిద్ధముగ నుండినటులఁ దోఁచు చుండెను.

మృగాంక:— ఈద్వారమొక మీటువలన దెఱచి బంధింపఁబడుచున్నదని నేనొక గ్రంథమందుఁ జదివి యుంటిని. ఆ మీటీ యేనుఁగుల యుదరములయందుఁ గలదు. మఱియు నీరెండు తొండములను బలపూర్వకముగ నొక్కి ద్వారమునకుఁ దాఁకించుటవలన నీద్వారము దెఱువఁ బడును. మంచిది! మీ మైయ్యారు లెంతబలాఢ్యులో చూడవలసి యున్నది. ఇది మిక్కిలి సామర్థ్యముతోఁగూడిన పని.

మోహన:—ఇది యేమానవమాత్రుని వలన నేనియుఁ గాఁజాలిన కార్యమగుచో, మొదట నన్నుఁ బ్రయత్నించి చూడనిండు.

మృగాంక:—మంచిది! ఇటురమ్ము! నేను తొలఁగి పోవుచుంటిని. ద్వారమునకుఁ దాఁకునటుల నీతొండములు రెండింటిని గెంటుము.

మోహనసింహుఁ డాయేనుఁగు తొండములపైఁ జేతుల నునిచి దనయొమ్ముత్తన నదిమి పట్టి బలమంతయు నుపయోగించి చూచెను. కాని, వాని నొకయంగుళముకంటె నధికముగ వంచఁ జాలఁడయ్యెను. ద్వారమున కవి దాదాపు రెండుమూరల యెడము గలిగియుండెను. తత్కారణమున, నాతొండముల రెంటిని చేతులతోఁ నదిమి పట్టియొమ్ము సాయమున వానిని ద్వారము వఱకు

నెట్టవలసియుండెను. మోహనసింహుఁడు మరల మరల బ్రయత్నించి చూచెను. కాని, ప్రయోజనము గలుగదాయెను. అంత నతఁడిది రాక్షసకృత్యముగాని, మానవమాత్రునివలన గాఁజాలునది కాదని పలుకుచు నచటినుండి తొలఁగి పోయెను.

తదనంతరము క్రమక్రమముగ నయ్యారు లందఱు బ్రయత్నించి చూచిరి. కాని, యెవ్వరును మోహనసింహునికంటె నధికముగ నాతొండములను వెనుకను నెట్టఁ జాలకైరి. పిదప మృగాంకవతి రాకుమారులవంకఁ బరికించి, "మీయిరువురుఁ దక్క నితరు లెవ్వరు నీకార్యమును జేయఁజాల" రని పలికెను.

నరేశ:—(మహేంద్రసింహుని వైపునకుఁ బరికించి) సోదరా! అనుజ్ఞనొసంగుఁడు. నేను బ్రయత్నించి చూచెదను.

మహేంద్ర:—సందియమేల! నీవీకార్య మవలీలఁ జేయఁజాలుదువు.

అంతఁ గుమార నరేశసింహుఁ డాయేనుఁగు తొండముల రెండింటిపైనను జేతులనునిచి వానిని బలపూర్వకముగఁ దనఱొమ్మున నదిమి పట్టి ముందునకు గెంటెను. మఱియు నతఁడు దొలిప్రయత్నమందే యాతొండములను ద్వారమునకు దాఁకునటుల గెంట గలిగెను. అంత రాజేశ్వరి యావేశపూరితయై "ఆహా! ఏమి! కారాగృహ క్లేశంబుల వసఁ జెడి యుండినను నింతటి సామర్థ్యము!" అని పలికెను. ఆతొండములు రెండును ద్వారమునకుఁ దాఁకిన మాత్రముననే సన్నని మెలుంగుతో నాయేనుఁగులు రెండును ఘీంకరింప సాగెను. మఱియు నొక లోహ కవాటమున సర సర భూమిలోనికి దిగిపోయెను. తదనంతరము మృగాంకవతి నరేశసింహునితో, "రాకుమారా! ఇపు డాతొండములను యెప్పటి యటుల వెనుకకు లాగుఁడు. మఱియు నాతొండములకుఁ గ్రిందనుండిగాని పైనుండి గాని ద్వారమున కావలివైపునకు వెడలుఁ" డనెను. చేతగాజుకుప్పె

నగొని తొలుత నజితసింహుఁడు ద్వారమును దాఁటి యావలి వైపునకుఁ బోయి నిలచెను. తరువాత మహేంద్రసింహుఁడును బోయిచేరెను. తదనంతరము నరేశసింహుఁడు వెడలుటకు నుంకించు చుండెను. అంతనొక నూతనాద్భుత ఘటనము వారి యాటను జెఱచి వైచెను. ద్వారమున కావలితట్టున నొకమనుజు డెప్పటినుండి దాఁగి యుండెనో మనకుఁ దెలియదు. అతఁ డతిరయంబున ముందునకుఁ దుమికి యజితసింహుని చేతిపై నొక తాపుఁ దన్నెను. దానివలన నాదివ్వె గనుమయ్యెను గాని, వాని చేతినుండి యాగాజుకుప్పె జారి క్రింద పడదయ్యెను. మఱియు నొక్కుమ్మాఱుగ నాస్థానమం దెల్లడల ఘోరాంధకారము వ్యాపించెను. అచట దాఁగి యుండిన మనుజుఁ డీకార్యము నెంతశీఘ్రముగ జేసియుండినను వాని నెల్లరును జూడఁ గలిగిరి. కాని, వాని నిజస్వరూపమును గాంచఁ జాలరైరి. కారణం బేమన, నతఁడు కాటుకరంగు పచ్ఛడమును గప్పుకొని మోముపై నకాబుపోషును ధరించి యుండెను.

ఆయంధకార మందా మనుజుఁ డొక ఘోరకార్యమును గూడఁ గావించి యుండెను. అతఁడు దనయొద్ద దాఁచియుంచిన గండ్రగొడ్డలితో సత్తువ కొలఁది మహేంద్రసింహుని శిరముపై మోదెను. ఆచీఁకటియందు వానిగుఱి తప్పి యుండినను మహేంద్రసింహుని వామభుజముపై గాఢమగుగాయమొకటి తగిలెను. ఆవ్రేటు మీఁద బడుటతోడనే మహేంద్రసింహుడు బిగ్గఱ నఱచుచు జాగ్రత్త! జాగ్రత్త!! పగతుని చేతియం దాయుధముగూడ గలదు. అతఁడు నన్ను గాయపఱచియుండె" నని కేకలిడెను.

అట్టి పరిస్థితిఁ జూచియు వినియుఁ జతురోపాయయగు మృగాంకవతి వెంటనే తనతిలస్మ కైజారు నుపయోగించెను. ఆమెమొలయందు రెండు తిలస్మకైజారులు గలవని మేము పైకొక ప్రకరణ

మందు లిఖించి యుంటిమి. ఆమె దానిలో నొకకైజారు వెడలించి
వెంటనే దానిపిడి నొక్కెను. దానినుండి యొకవిధమగు యద్భుత
ప్రకాశము వెడలివచ్చుటచే మృగాంకవతి దక్క దక్కిన వారలం
దఱు నాప్రకాశమును జూడఁజాలకఁ దమతమ నేత్రములను మూసి
కొనిరి.

ఆద్వారమున కావలివైపున గూడ నట్టి విధంబగు సురంగ
మే యొకటి గలదు. మృగాంకవతి యాకైజారు ప్రకాశమందు
ఘాతకుఁడు దన కార్యమును దీర్చుకొని యాసురంగమందుఁ బారి
పోవుచుండుటఁ గనుగొనెను. కాని, యాతిలస్మి కైజారునుండి వెడ
లిన ప్రకాశమువలన నావగతుని దృష్టియందు మిఱుమిట్లు గలుగు
చుండుటచే నతఁడు దలంచినంతవేగముగఁ బరుగెత్తఁ జాలకుండెను.
మృగాంకవతియు వెంటనే వాని వెన్నంటి పరుగిడి వానిని సమీ
పించి తన చేతియందలి కైజారును వాని దేహమునకుఁ దాకించెను.
తోడనే యాఘాతకుఁడు మూర్ఛాగతుఁడై భూమిపైఁ గూలెను.
మృగాంకవతి యాకైజారును దన మొలయందుఁ జొనిపి యచటి
నుండి మఱలెను. మఱియుఁ దన కక్షపాలనుండి మైనపువత్తి నొక
దానిని వెడలించి వెలిగించెను. అప్పటి కైయ్యారులుగూడ ద్వార
మును దాఁటి యావలివైపునకు బోయి చేరి యుండిరి. కుమార
మహేంద్రసింహుని భుజమునుండి నెత్తురు గాఱుచున్నను నతఁడు
దానిని లెక్కసేయకుండెను. మఱియు వానిమోమునం దెట్టి విధం
బగు చింతయుఁ జూపట్టుట లేదు. మోహనసింహుఁడు వానిగాయ
ముపైఁ గట్టు కట్టుటకుఁ బ్రయత్నించెను గాని, యంత మృగాంక
వతి వారిని సమీపించి, మోహనసింహుని వారించి, తన కక్షపా
లనుండి యొకతైలపుడబ్బాను వెడలించి తన కోమలకరంబులతో
మహేంద్రసింహుని గాయముపై దానిని రాచి నిమురసాగెను.

ఆతైలము గాయముపైఁ బడుటతోడనే దానినుండి రక్తము స్రవిం చుట నిలచిపోయెను. తదనంతరము మృగాంకవతి దన పైటచెఱఁ గును జించి యా గుడ్డపీలికతో వాని గాయముపైఁ గట్టు కట్టెను. ఆమె యుపకారచింతపూర్వమే కుమార మహేంద్రసింహుని దన వశముఁ జేసికొని యుండెను. నేఁడామె గావించియుండిన మహోప కారము వాని నింకను బాగుగఁ దనస్వాధీన పఱచుకొనెను.

మహేంద్ర:—(మృగాంకవతితో) నీయుపకార భరము వలన నేన డఁగి పోవుచుంటిని. (నవ్వి నెమ్మదిగ) నాశిరముపైకెత్తఁగల దిన మెపుడరుదెంచునో పరికింప వలసియున్నది.

మృగాంక:—(నవ్వుచు) చాలును! మీపలుకులచే నాకు లజ్జఁ గొల్పకుఁడు.

నరేశ:—అదురాత్ముఁడు పారిపోయినటులఁ దోఁచుచున్నది!

మృగాంక:—నాకంటఁ బడి పారిపోవుటొక సామాన్య విషయము గాదు. మనమిచటినుండి తరలు సమయంబున మార్గమధ్య మందతఁడు మూర్ఛాగతుఁడై పడియుండుటఁ గనుగొన గలము.

మహేంద్ర:—నీవిపుడు ప్రశంసార్హమైన కార్యమును గావించి యుంటివి.

మృగాంక:—అబలను. నేనేమిసేయ గలను? (కైజారువైపునకు జూపి) ఇపు డిది యొక గొప్ప కార్యమును గావించియుండె ననుట కెట్టి సందియమును లేదు.

మహేంద్ర:—ఇది మిగుల నద్భుత పదార్థము. దీని తేజము వలన నానేత్రములు మూఁతలు వడుటచే నీవేమి కావించియుండిన దియుఁ జూడఁ జాలనైతిని.

మృగాంక:—ఇది యొక తిలస్మ కైజారు. దీని యందుఁ గొన్నిఁ యద్భుత గుణములు గలవు.

మహేంద్ర:—దీని గుణవిశేషములను దెలియఁ గోరుటయే కాక మఱికొన్ని విషయములను నిన్నుఁ బ్రశ్నింపఁ దలచుచుంటిని. కాని, యాకస్మికముగ బగతుఁడు వచ్చి చేరుట వలన..............................."

మృగాంక:—నిక్కువము. అంతయు భగవదేచ్ఛ. ఈస్థానమున కాదురాత్ముఁడు దక్క నితరు లెవ్వరును రాఁజాలరని నే నెఱుంగుదును. అయినను నీద్వారము దెఱచు సామర్థ్య మాతనికి లేదు. కాని, బాగుగ యోజించుట వలన నితఁ డిచటికి వచ్చిచేరుటయు నాకాశ్చర్యమును గలిగించు చున్నది.

మహేంద్ర:—నీవాదురాత్ము నెఱింగి యుంటివా?

మృగాంక:—ఔను. కాని, కొంచెము సందేహముగ నున్నది. నేనీవిషయమున బాగుగ యోజించిన పిదప గాని నిశ్చయముగఁ జెప్పఁ జాలను.

మహేంద్ర:—ఏది యెటులుండినను మన మిచటి నుండి వెడలి పోవుటకు వేగిరింప వలెను.

ఆద్వారమున కీవలివైపున గూడ నట్టి విధంబుననే రెండేనుఁగులు నిర్మింపఁ బడియుండెను. మృగాంకవతి కథనానుసారము నరేశసింహుఁడు వాని తొండములను బలపూర్వకముగ ద్వారము వైపునకుఁ ద్రోసెను. దాని వలన నావలివైపున తొండములు యథాస్థానమునకుఁ జేరి యాలోహకవాటము పైకెగసి వచ్చి యాద్వారమును బంధించి వైచెను.

మహేంద్ర:—ఈతట్టుననుండి యెవ్వరేనియు నీద్వారమును దెఱువఁ దలంచిన నీతొండములను దన వైపునకు లాగుకొన వలయునని తలంచెదను. అవ్విధంబున గావించినచో నావలివైపు తొండములు ద్వారమునకు దాఁకవచ్చును.

మృగాంక:—నిశ్చయము. మీయూహ మిగుల సరియైనది.

మహేంద్ర:—మంచిది. మన మిపు డిచటి నుండి బయలుదేర వలెను. మఱియు మార్గమం దీయద్భుత కైజారు గుణవిశేషములను గూడ వివరింపుము.

మృగాంక:—మార్గమున నేగుచు దీని యనుపమ గుణవిశేషములను వర్ణించుట కెట్టి యావశ్యకమును లేదు. నేనిపుడే దీని మహిమను వర్ణించి యొక కైజారును మీకొసంగుచుంటిని.

ఆతిలస్మకైజారు యొక్క యద్భుత గుణవిశేషములను మేము పైన లిఖించి యుండిన తెఱంగున మహేంద్రసింహునకు వివరించి తెలిపి దాని జంట పదార్థమగు నుంగరమును వానివే్రలికి దొడిగి పిదప నామె యొక కైజారును వాని కొసంగెను మహేంద్రసింహుఁ డాకైజారును గైకొని యమితానంద భరితుఁడై మృగాంకవతిని మిగుల నగ్గింపసాగెను.

రాజేశ్వరి:—మఱియొక కైజారును రెండవ రాకుమారునికిఁగూడ నొసంగుట ధర్మము.

మృగాంక:—(నవ్వుచు) నీ వీవిషయమున వేఱుగ నుపదేశింప నవసరములేదు. నేను స్వయముగ వీరికిని నొక తిలస్మకైదువు నొసంగనుంటిని.

నరేశ:—ఎప్పుడు?

మృగాంక:—ఇట్టి విధంబగు మఱియొక కైజారు నాయొద్దఁ గలదు. దానిని మీకిపుడే యొసంగఁ గలను. కాని, దాని తోడ్పాటున నీమందిరమందు మీకొఱ కనేక కార్యములను గావింప వలసియున్నది. బహుశః పగతుల యొక్క........."

నరేశ:—వలదు! వలదు!! నీయొద్దనుండి యాయద్భుత మహిమోపేతమగు కైజారును దీసికొని నిస్సాపదయందుఁ జిక్కఁజే

యఁగోరను. కాని, తరుణమునుగని పది పదునైదుదినము లలో దానిని నా కొసంగవలెను.

మృగాంక:—తప్ప కటులనే కావించెదను. మంచిది. నడువుఁడు. మనము ప్రయాణము సాగింతము.

రాకుమారు లిరువురను, సైయారులను వెంటఁదోడ్కొని మృగాంకవతి యచటనుండి బయలుదేరెను. మఱియు గాజుకుప్పె దివ్వెను నార్పివైచి, కుమార మహేంద్రసింహుని గాయపఱచిన యాదురాత్ముఁడు మూర్ఛాగతుఁడై పడియుండిన తావునకుఁ బోయి చేరెను. తదనంతరము మృగాంకవతి వాని మోముపైనుండి నకాబును దొలఁగించి చూచి, ఆశ్చర్యపడి, "అహా! ఈతఁ డెవ్వరో క్రొత్తవాఁడుగఁ దోఁచుచున్నాఁడు. ఇతఁ డీతిలస్మాధ్యక్షుఁడనియు నెవ్విధంబుననో విజయేంద్రసింహ మహీపాలుని బందిగమునుండి తప్పించుకొని వెడలి వచ్చి యుండుననియుఁ దలంచితిని. కాని, నేను వీనిని బొత్తిగా నెఱుంగను. (కొంచెము యోజించి) అతఁడు నాకెట్టి హానియుఁ గలిగించియుండలేదు. అయిన నావిషయ మిప్పు డెటుల సిద్ధీకరింపఁగలము! అట్టి వానిని విశ్వసించుటయుఁ గూడని పని. కాని, నేను వానితో................"

పూర్వోక్తవిధంబున బలికి మృగాంకవతి మిన్నకుండెను. మఱియుఁ జాలసేపటివఱకు గంభీరచింతయందుఁ జిక్కియుండిన దానివలెఁ జూపట్టెను. తుదకుఁ గుమార మహేంద్రసింహుఁడు దాళఁజాలక మృగాంకవతి యంగుష్ఠమును బట్టుకొని యిటులఁ బలికెను:—

మహేంద్ర:—నిన్నిట్టి స్థితియందుఁ గాంచుటవలన నేదియో యొక నూతన విపత్తు రానుండెననియు నీ వావిషయమున నెద్దియో యోజించుచుంటివనియు దోఁచుచున్నది.

మృగాంక:—మన కార్యమందు విఘ్నము ఘటిల్లఁ గలదని దోఁచు చున్నది. కానిండు! ఆదయామయుండగు పరాత్పరుఁడే కలఁడు. మీకై యెట్టి దారుణకష్టములనైన ననుభవించెదను. మఱియు ప్రాణములను సహిత మర్పించుటకు సంసిద్ధముగ నుంటిని. (కొంచెము యోజించి) ఇఁక దడయరాదు. శీఘ్రముగ నిచటినుండి వెడల వలెను.

మహేంద్ర:—ఏమి! నీవు మాయారాణి తిలస్మతోఁటనుండి బయటకు వెడల దలంచు చుంటివా?

మృగాంక:—ఔను.

మహేంద్ర:-మొదట మాతలిదండ్రులను బంధవిముక్తులనుగ నొనరించి యావల వెలుపలకు వెడలుటకుఁ దలంచుచుం[illegible].

మృగాంక:—మీపలుకు లెంతేనియు సమంజసములు. కాని, యేమిసేయుదును? అన్నిటికంటె ముందుగ మిమ్ము గాపాడుటత్యావశ్యకముగఁ దలంచు చుంటిని. కారణంబేమన, మీరలుగూడ నాపదయందుఁ జిక్కియుండిన పాప మాదంపతుల నెవరు విడిపింపఁగలరు?

మహేంద్ర:—నేనిచటి యద్భుతరహస్యములను కొంచెమేనియు నెఱుంగను. కావున, నీయభిప్రాయ ప్రకారము నడవకఁ దీరదు. కానిచో, నిచటనుండి పారిపోవుట నాయభిమతము గాదు. నాకరపాదములు బంధింపఁబడక నిటుల స్వచ్ఛందముగ నుండిన నొక్కనినే కాదు, వందలకొలఁది శత్రువులొక్కుమ్మడి నన్ను ముట్టడించి నిలచినను సరకుసేయను. అందుపై భవదీయప్రదత్తంబగు యీతిలస్మకైదువు సాయమున మృత్యుదేవతతోఁ దలపడుటకు సహితము వెనుదీయువాఁడను గాను.

మృగాంక:—మీపలుకు లెంతేనియు సమంజసములు. మీయవక్ర పరాక్రమము నేనెఱుంగనిది కాదు. కాని, యీసమయ మున నిచటినుండి వెలుపలకు వెడలిపోవుటయే శ్రేయో దాయక మని నావివేకము బోధించు చున్నది.

మహేంద్ర:—అగుచో, నడువుము. నేను సంసిద్ధముగ నుంటిని. (చెవిలో నెమ్మదిగా) నీబుద్ధి విశేష మెంతేనియుఁ గొని యాడఁ దగినది.

మృగాంక:—(నెమ్మదిగా) అదియేమి?

మహేంద్ర:—(ఆమెను రెండడుగులు ముందునకుఁ గొనిపోయి నెమ్మదిగా) నీవెవని పాలయ్యెదవో వాని భాగ్యవిశేషము నిరుపమానమైనదిసుమా!

మహేంద్రసింహుని పలుకుల నాలించి చిరునగవు మోమున చెంగలింప మృగాంకవతి వాని కరము నెమ్మదిగా గిల్లుచు మృదు మధుర నిస్వనంబుతో నిటులఁ బదులు పలికెను:-

"మీకంటె భాగ్యశాలు లెవ్వరును నాకుఁజూపట్టుట లేదు. కాని...................."!

ఆహా! ఈవచన మెంత మధుర మైనది! ఎంత గుంభిత మైనది! అవి కుమారమహేంద్రసింహు నొక్కమాఱుగ నానంద పరవశునిగ నొనరించియు ండినను 'కాని' యనుశబ్దము వాని కన్ను లయెదుట గాఢాంధకారమును వ్యాపింపఁ జేసెను. మృగాంకవతికి నిలయంబగు సరోవరాద్భుత మందిరమందు వెడలియుండిన మృ గాంకవతీ మహేంద్రసింహుల సరసవాక్య కలాపమును రసికాగ్ర గణ్యులగు మాపాఠకమహాశయు లింకను విస్మృతిజెంది యుండరు. కావున స్వయముగ దానిని గ్రహింపఁగలరు.

మృగాంక:—(మోహనసింహుని దెసఁ బరికించి) మహాభాగ! తుఁ

డయి పడియుండిన నీదురాత్మని మన వెంటఁగొని పోవలసి యున్నది.

మోహన:—మంచిది! నేను వీనిని నావెన్నున వైచుకొని తెచ్చెదను.

మహేంద్ర:—అయ్యో! జ్ఞప్తికి వచ్చినది. మనము వెలుపలకుఁ బోవు సురంగమార్గమును దాఁటి వచ్చితిమి. మరల మనమిపుడు వెనుకకు మగుడి పోవలసి యుండునా!

మృగాంక:—సులభమైన మార్గ మయ్యదియే! కాని, యిపుడా మార్గమున బోవుట నాయభిమతము గాదు. కారణంబేమన, నాయేనుఁగుల ద్వారము వెలుపలఁ బగతులు గూడి యుండుటొక వింతకాదు. మీరలు కారాగారపు గోడను దవ్వియుండిరి. మఱియు నిట సురంగ ముఖద్వారము దెఱవఁబడియుండుటచేఁ బగతు లెవ్వరేనియు నేతెంచుటొక కఠిన కార్యము గాదు.

మహేంద్ర:—అగుచో, నిఁక రెండవ మార్గ మేది గలదు? ఇపుడీ పగతుఁ డేతెంచియుండిన మార్గముననే మనమును బోవలసి యుండెనా?

మృగాంక:—కాదుకాదు. అచటఁ గూడ శత్రువుల భీతి గలదు నడువుఁడు. నేను మఱియొక మార్గమున మిమ్ముఁ దోడ్కొని పోయెదను.

మున్ముందు మృగాంకవతియు నామె వెనుక రాకుమారు లిరువురును నైయారులును బయలుదేరిరి.

ఈసురంగ మందుఁగూడ నిరుప్రక్కల గోడలయందుఁ బలు విధంబులగు చిత్రములు చిత్రింపఁ బడియుండెను. పదునైదడుగులు ముందునకుఁ బోయిన పిదప నొక ప్రక్క, గోడయం దొక చిన్న

ద్వారము దెఱవఁబడి యుండెను. దానినిఁ గాంచిమృగాంకవతి మహేంద్రసింహునితో "యిటుచూడుడు! ఈమార్గముననే యీ దుష్టుఁ డరుదెంచియుండెను. కాని, నేను మిమ్ముల వేఱుమార్గమున దోడ్కొని పోయెదను. ఇదియుఁ గొంచెము చిక్కుదారియే!

మహేంద్ర:—అయినను భీతియేమి? మన మీమార్గమున నేల వెడలరాదు? అచటఁ బది పదునైదుగురు పగతు లుండినను నేమాయె.

మృగాంక:—మంచిది. నడువుఁడు.

పిదప వారలా ద్వారమును దాఁటి రెండవ వైపునకుఁ బోయి చేరిరి. మృగాంకవతి యచట నొక మీటును నొక్కి యాద్వారమును బంధించి వైచెను. అదియు నొకసురంగమార్గము. ఆసురంగమునకుఁ దుదను పైభాగమునకు నెక్కిపోవుటకుఁ గొన్ని చిన్న చిన్న మెట్లు కట్టఁబడి యుండెను. మృగాంకవతి పైదెసకుఁ గాంచి "యాద్వారము బంధింపఁ బడియుండి నటులఁ దోఁచుచున్నది? అయిననేమి? నావెంటరం"డని పలికి యామెట్లపై నెక్కెను. ఆమె వెనుక నందఱును బోఁదొడంగిరి. ఆమెట్లు మెలికలు మెలికలుగఁ దిరిగియుండుటచే దా మొక బురుజుపైకిఁ బోవుచుండినటుల వారికిఁ దోఁచెను. ఆసోపానములు తుదిగొనిన పిదప నచట నొక చక్రము చూపట్టెను. మృగాంకవతియాచక్రమునుబట్టి నాలుగైదు మాఱులు గిరగిర ద్రిప్పెను. తోడనే ఘోరధ్వనితో నొక శిలాఫలకము వేఱుపడి భూమిలో దాఁగుటచే నచట నొక మార్గమేర్పడెను. ఆమార్గమున నెల్లరు వెలుపలకు వెడలి యొకమైదానమందుఁ బ్రవేశించిరి.

అచట బాగుగ నిస్తబ్ధత వ్యాపించియుండుటఁ గాంచి "మృగాంకవతి తక్కిన వారితో "మేలయ్యెను. ఇచట మన పగతులెవ్వరుఁ బొడకట్ట కుండిరి" యనెను.

ఏమార్గమున మృగాంకవతి మున్నగువారలు మైదానము లోనికి వెడలివచ్చిరో యాబారి యొక తిన్నెలోనుండి కలదు. ఆవేదికపై నొక శివలింగము స్థాపింపఁబడి యుండెను. ఆమునుపు యెదుటి భాగమందలి శిలాఫలకము దొలఁగి మన మృగాంకవతి మున్నగు వారికి దారి నొసంగెను. ఆశివలింగమున కెదురుగ రాగితో నిర్మింపఁబడిన నంది యొకటి గలదు. దాని భుజముపై లోహనిర్మితంబగు సర్ప మొకటి చుట్టలు చుట్టుకొని పడగ విప్పి కూర్చుండి యుండెను. మృగాంకవతి యాఫణిని తన రెండుచేతులతోఁ బట్టుకొని బలపూర్వకముగఁ బైకి లాగెను. తోడనే యానంది నోరు దెఱచెను. మృగాంకవతి దాని నోటియందుఁ జేయిఁ జొనిపి దానియందలి మరను ద్రిప్పెను. వెంటనే కొంత ధ్వనితో నాశిలాఫలకము యథాస్థానమునకుఁ జేరి యాసురంగ మార్గమును బంధించి వైచెను. తదనంతరము మృగాంకవతి యాఫణిని క్రిందికి నొక్కి వైచెను. నందియుఁ నోరును మూసికొనెను.

మహేంద్ర:—(మృగాంకవతితో) ఈద్వారము గూడ విచిత్ర రీతిని దెరువఁబడుచు బంధింపఁబడుచున్నది.

మృగాంక:—ఔను. దీనినిర్మాణమం దాశిల్పకారుఁడు దన నేర్పంతయు వెచ్చించి యుండెను.

మహేంద్ర:—దీనిని దెఱచి బంధించు విధానము మాయారాణికిఁ గూడ దెలిసి యుండెనా?

మృగాంక:—ఔను! మఱియు (రాజేశ్వరివైపునకుఁ జూపి) నీమెయు నెఱుంగును. కారణంబేమన, నీమార్గము మూఁడవతరగతి కోటలోనికిఁ బోవు మార్గముతో నంటి యున్నది. దీనిని మాయక్క చెల్లెండ్రము ముగ్గురము నెరింగి యుంటిమి కాని, యిపుడు మీరు దెఱచియుండిన యొకఁటల ద్వారమును మాత్రము నేను దక్క నితరులెవ్వరు నెఱుంగరు.

నరేశ:—ఈస్థానము మిగుల భయంకరముగ దోఁచుచున్నది!

మృగాంక:— ఔను. ఇది యొక పురాతన శ్మశానవాటిక. ఇచటికిఁ గొలఁది దూరమందు గంగానది ప్రవహించుచున్నది. మున్ని స్థానము ప్రేతభూమిగ నుపయోగింపఁబడు కాలమం దాజాహ్నవి దీనియందు ప్రవహించు చుండెడిది. కాలక్రమంబున నీవైపున మెట్టవైచి కొంత యావలకు దొలఁగి యిపుడది ప్రవహించుచున్నది.

నరేశ:—మనకిపుడు కర్తవ్యమేమి? మన మిపు డెచటి కేగవలసి యున్నది.

మృగాంక:—మన మాగంగానదిని దాఁటి జుమేలియాకుఁ (మాయారాణి రాజధాని) బోవలయును. అచట మిగుల రహస్యమగు స్థానమం దొక మందిరమును బాడుగకుఁ గుదిర్చి యుంచితిని. దానియందు రెండు మూఁడుదినములు నివసించి మనము గొన్ని కార్యములను నెరవేర్చుకొనఁ గలము.

మహేంద్ర:—మన మాగంగానది నెవ్విధంబున దాఁటఁగలము?

మృగాంక:—ఆనదీతీరమందుఁ గొంత దవ్వున నొక నావ బంధింపఁబడి యున్నది. నేను దానిపై నిచటి కేతెంచి యుంటిని. అది యింతదనుక నచటనుండు నని తలంచుచుంటిని.

తెల్లవాఱవచ్చెను. దక్షిణ వాతపోత మల్లనల్లన వీతెంచుచుండెను. ఆకసమందు నాలుగైదు తారకలుమాత్రము మినుకు మినుకు మనుచుఁ జూపట్టుచుండెను. అవి ద్యుతిఁజెడి పృథ్వీతలము వైపున కుదాసీన భావంబుతోఁ జూచుచుండెను. మృగాంకవతి రాకుమారులు మున్నగువారలను వెంటఁదోడ్కొని యచటినుండి బయలుదేరెను. మఱియు నచట బంధింపఁబడి యుండిన నావపై నెక్కి యాగంగానదిని దాఁటి యావలితట్టునకు బోయి చేరెను.

౮

మాయారాణి నిస్సహాయుఁడును దైవోపహతుఁడునగు బంధితుని వైపునకు భయశంకావిచారసంభ్రమ సూచకదృష్టిఁ బరికించుచుండెను. ఆసమయంబుననే "మాయారాణికి మృత్యువు దాపించియుండె" నను ధ్వని వెడలివచ్చి యామెను మితిమీఱిన భయవిహ్వలచిత్తనుగఁ జేసివైచెను. ఆమె కలవరపాటుతో నలుదెసలఁ బరికింపసాగెను. కాని, యాధ్వని యెచటనుండి వెడలివచ్చెనో యెవరు పలికియుండిరో యావిషయము లామె కిసుమంతయుఁ దెలియవయ్యెను. తుద కామె సేయునది లేక నిరుపాయయై జగపతిని వెంటఁదోడ్కొని తానరుదెంచియుండిన మార్గముననే మూఁడవతరగతి తోఁటయందుఁ దనయైయారులగు కాంచన గదాధరసింహులను విడచిపోయిన కారాగృహద్వారము నొద్దకుఁ బోయి చేరెను.

కాంచన:—(మాయారాణితో) మమ్మిచట వ్యర్థముగ విడచిపోయితిరి.

మాయా:—ఔను! నేనటులనే తలంచుచుంటిని. కారణంబేమన, మీరిరువురను నావెంటఁ దోడ్కొనిపోయియుండిన నిప్పటికి నావీడ దొలఁగి యుండును. ఈజగపతి నావెంటఁ గలఁడు. మఱియు నీమె మిగులఁ బరాక్రమశాలినియనియు మీరలెఱింగి యుంటిరి. కాని, వానిని వెలుపలకు వెడలించి తెచ్చుట కీమెకు ధైర్యము చాలదయ్యెను.

కాంచన:—(తుళ్ళిపడి) ఏమి! మీరాబంధితుని గాంచి వచ్చుటకు నాల్గవతరగతి తోఁటలోని కేగియుంటిరా? లేక మీరు వచియించు సంగతి వేఱొకనిని గూర్చియా?

మాయా:—ఔను. ఎవని విషయమున నాపిశాచము మనలకు భీతిగొల్పి యుండెనో వాని సమీపమునకుఁ బోయి యుంటిమి.

కాని, మమ్మిచట వ్యర్థముగ విడచి పోయితిరని పలికితివి గదా? దానియభిప్రాయమేమి?

కాంచన:—మేమిచటఁ గాపలియుండ నీకారాగృహములోనుండి కొంత చప్పుడు వినవచ్చినది. కాని, యది యెట్టిదో మేము ప్రత్యక్షముగఁ జూడఁ జాలకైతిమి.

మాయా:—ఆధ్వని యెటులుండెను?

కాంచన:-కారాగృహమందలి గోడ నెవ్వరో త్రవ్వుచుండినటుల మాకుఁ దోచెను. ఆబంధితుల శృంఖలముల నెవరు వెడలించియుండిరో తెలియదు.

మాయా:-నీసంభాషణమునుబట్టి బంధితులింక నీకారాగృహమందే యుండినటులఁ దేలుచున్నది. రాజేశ్వరి దాళపుఁజెవులను తీసికొని యదృశ్యమయిన సమయంబుననే యామె బంధితులను విడిపించుకొని పోవుగదా యని సందేహించితిని.

కాంచన:—కాదు కాదు. మీరు మమ్మిచట విడచి వెడలిన పిదప బంధితుల సంభాషణము కొలఁది కొలఁదిగ మాకు వినుపించుచుండెను. పిదపఁ గొంతసేపటికి గోడను ద్రవ్వుచుండిన సవ్వడియు మాకు వినివించినది. కాని, యిపు డాబంధితులు దీనియందుఁ గలరో లేక వెడలిపోయియుండిరో దానిని నిశ్చయ పూర్వకముగఁ జెప్పఁజాలము. కొంతసేపటినుండి గోడను ద్రవ్వు సవ్వడిగాని, సంభాషణధ్వనిగాని, వినిపించుటలేదు. లోపల నిశ్శబ్దముగ నున్నటులఁ దోఁచుచున్నది.

మాయా:—(కొంచెము యోజించి) కానిండు! ఆబంధితులు గోడను ద్రవ్వి వెలుపలకు వెడలియున్నను దృఢనమున్నత ప్రాకారావృతంబగు నీశిలసోమోద్యానమును దాఁటి యెచటకేనియుఁ బోవుట యొక సామాన్యవిషయముగాదు. కాని,

బంధితులకు వైచియున్న సంకెళ్ళ నెవరు తొలఁగించి యుం
డిరో మఱియు వారికి గోడను ద్రవ్వ పరికరములెవ్విధంబున
జేఁ జిక్కియుండెనో, మిగుల వింతగ నున్నది. బహుశః
మీరు పొరపడి యుండరు గదా?

గదాధర:—బాగు! ఆధ్వని గోడను దొ్రవ్వుటవలన గలిగినదో లేక
వేఱొకటియో దానినైన మేము గుర్తింపఁ జాలమా?

మాయా:—(నిట్టూర్పుఁబుచ్చి) అకటా! నాకెట్టి దుర్దశ గలుగ
నున్నదో తెలియదు. మంచిది. ఆబంధితుల విషయమును
పిదప యోజింప వచ్చును. ఇపుడు మఱియొకకార్యమందు
మీసహాయమును వాంఛించుచుంటిని.

కాంచన:—ఆకార్యమెట్టిది?

మాయా:—నే నెట్టియభిప్రాయముతో వానిని బంధించి యుంచి
తినో యది యింతదనుక నెరవేఱదయ్యెను. అతఁడా మర్మ
ములను వివరించు నను నాశ నాకు లేశమైనను లేదు. మం
చిది! ఇపుడు వానిని తుదముట్టించి రాఁగల యాపదలను
దొలఁగించుకొనుటకుఁ దలంచుచుంటిని.

కాంచన:—మీరు గుడుపుచుండిన పెనుబాములను సహించుచు
జీవించి యుండుటకంటె నామహాభాగుఁడు మరణించుటయే
మేలు. అకటా! మీకారణంబున మేమిహపరంబులు రెం
డింటికిని జెడిలిమి. మేము మీతియ్యనిమాటల కలరి, సత్ప్ర
వర్తనుండును, న్యాయవిశారదుండును, బరోపకారపారీణుం
డును, నిరుపమాన బాహువీర్య విజితశాత్రవుండును, సకల
సద్గుణగరిష్ఠుండును, సహాస్యవదనుండును, సుందరాకారుం
డునునగు మాప్రభు నెడల విశ్వాసఘాతుక మొనరించి
యామహాపాతక మొడి గట్టుకొంటిమి. మఱియు మాజీవిత

కాలమంతయుఁ దజ్జనిత దుఃఖానలమందు మ్రగ్గుచుండు నట్లొనరించు కొంటిమి.

మాయా:—అగుచో, నేను మీకొనరించి యుండిన మహోపకారములను మఱచి యుండినటుల దోఁచుచున్నది.

కాంచన:—ఇపు డీవిషయమునఁ జలమూనుట వ్యర్థము. మే మజ్ఞానవశులమై యుచితానుచితములను గుర్తింపఁజాలక మందమతులమై ధనాకాంక్షా పిశాచాపీడితులమై యేయనర్థదాయకంబగు ఘోరకృత్యమును గావించి యుంటిమో దానికై యిపుడు వగచిన నేమి ప్రయోజనము?

గదాధర:—ఆవిషయమున నాకుఁ గలిగియుండిన చింతకు మేర లేదు. ఇపుడు మనము గని వినుచుండిన విచిత్రఘటనల పరిణామము విపరీతము గఁ దేలక మానదు.

మాయా:—(నిట్టూర్పుఁబుచ్చి) మంచిది. ఏమి కానున్నదో కాంచెదము గదా? ఇపు డాలసించిన నాకుఁ బ్రాణహాని వాటిల్లుటయే కాక మీప్రాణంబులు నెవ్విధంబునను దక్కఁజాలవు.

కాంచన:—మన మొనరించియుండిన దారుణకృత్యములకుఁ దగిన ఫలము శీఘ్రకాలములోనే యనుభవింప నుంటిమని నేనిది వఱకే తెలిసికొని యుంటిని. కాని, నేనిపుడేమి కావింపవలయునో వచియింపుఁడు. మనప్రాణములను గాపాడుకొనునుపాయాంతర మేదియైనను బొడకట్టుచున్నదా?

మాయా:—మొదట నావెంట నాల్గవతరగతి తోఁటలోనికేతెంచి యాబంధితుని తుదముట్టింపుఁడు. పిదప రెండవయుపాయమును దెలిపెదను.

గదాధర:—కాదు కాదు. ఆకార్యము నావలన గాఁజాలదు. కాంచనసింహుని వలనగాఁజాలిన వానిని మీవెంటఁదోడ్కొని

పొందు. నే నామహాభాగునిపైఁ గత్తి నెత్తఁజాలను. హారి! హారీ!! ఈమె గావించుచుండిన దారుణకృత్యములకు మేర లేకుండెఁ గదా!

మాయారాణి:—(అసూయతతో) గదాధరసింహా! నీమతి భ్రమసి యుండదు గదా! నాయెదుట నిట్టి బెడిదంపు మాటలను బలుకుచుంటివి! నీవినయ విధేయతల నొక్కుమాఱుగ మంటఁగలిపి నైచితివా? లేక నాసామర్థ్యమును మఱచి యుంటివా?

గదాధర:—లేదు. నేను మఱచియుండలేదు. కాని, యాసామర్థ్యమే యిపుడు మిమ్ము వీడిపోవుచున్నది.

కాంచన గదాధరసింహుల వచనంబుల నాలించినంతనే యామె యరకాలిమంట తలకుఁ దట్టెను. కాని, యది సమయము గాదని తలంచి తనకోపమును జల్లార్చుకొని యూరకుండెను.

మాయారాణి మిగుల ధూర్తురాలు. చాకచక్యము గలది. కఠినహృదయ. తనకగత్యముగలుగుచో నెంతటిహీనునైనను దన్నుఁ గన్న తండ్రివలె మన్నించుచుండును. తనయక్కఱ దీరెనేని యతఁ డెంతటి యోగ్యుఁడైనను దృణప్రాయముగఁ దలంచును. ఆమె దనపై నాపద రానుండుట నెఱింగి యయ్యారు లిరువురను బ్రసన్నచిత్తులనుగ నొనరించి లోపఱచుకొను టత్యావశ్యకముగఁ దలంచుచుండెను.

మాయారాణి:—(మృదుమధురోక్తుల) ఏమి! గదాధరసింహా! నాసామర్థ్యము నన్ను వీడిపోవుచున్న దని పలికితివి గదా! దానిని నీవెటుల వచియించుచుంటివి?

గదాధర:—వివశుఁడగు నొక బంధితుని జంపుటకు మాసహాయము నర్థించుటయే! పాపమా నిస్సహాయు నొక పసిబాలుఁ జేనియు దొరింపఁ గలఁడనుట కెట్టి సందియమునులేదు.

కాంచన:—గదాధరుని పలుకు లెంతయు సమంజసములు. మీరు వెలుపలినుండి యొక్క బాణముచే వానిని జంపఁగలరు.

మాయారాణి:—కాదు కాదు. అటులఁ గాఁజాలినచో నేను వానిని తుదముట్టింపక నేల మరలుదానను? నేను వానిపై విడచిన బాణములన్నియు నిరర్థకము లయ్యెను గాని, యిసుమంతయు లాభము గలుగదయ్యెను.

కాంచన:—(త్రుళ్ళిపడి) అదియేమి?

మాయారాణి:—వానిచేతియందొక డాలు గలదు. అది వాని కెటుల లభించియున్నదో తెలియకున్నది. అతఁడు దానిపై నా బాణముల నాపుచు నన్నెవ్వరును జంపఁజాలరని వచియించుచున్నాఁడు.

కాంచన:—ఇపు డనర్థము వాటిల్లుట కెట్టి సంశయమును లేదు. ఆకార్యాచరణము దప్ప కాపిశాచ మొనరించి యుండును. అదురాత్ముఁడెవ్వఁడో మనకుఁగొంచెమైనను దెలియకున్నది.

మాయారాణి:—మన మిట్టి సంభాషములయందుఁ జక్కయాలసించుట యుక్తిసంగతము గాదు. సరియే, ఏదియో జరిగినది. ఇపుడు ప్రాణములనుఁ గాపాడుకొనుటకుఁ బ్రయత్నింపవలెను గదా!

కాంచన—అగుచో, మీయభిప్రాయమేమి?

మాయారాణి:—మీరు నాకిపుడు దోడ్పడనిచో ప్రాణములు దక్కుట యసంభవము. నాతోపాటు మీరును నంత మొందగలరు.

కాంచన:—మన ప్రాణసంరక్షణార్థ మేదియో యొక యుపాయాంతరమునునాలోచింపుఁడు.

మాయారాణి:—అటులయిన, మీరు నావెంట రండు. మఱియు

సాధ్యమగురీతి నాబంధితుని యమసదనమునకుఁ బుత్తెం
పుదుం. అతఁడీలోకము నువీడి పోయిన తోడనే మన శిర
ముపై నర్తనము గావించుచుండిన యనర్థములన్నియుఁ
దొలఁగి పోఁగలవు. దీనికిఁ బ్రతిఫలముగ మీరిరువురకుఁ
జెఱియొక లక్షరూప్యములను బసదన మొసంగెదను.

గదాధర:—ఈకార్యము సామాన్యమైనదిగాదు.

కాంచన గదాధరసింహులాబంధితుని తమచేతులారఁ
జంపఁజాలకుండినను మాయారాణి నచ్చిగఁ బలుకు నిచ్చకంపు
మాటలకు మఱిమెచ్చిరో, ధనాకాంక్షచేతనో లేక తమప్రాణము
లను గాపాడుకొను చింతతోడనో వారలట్టి దారుణకృత్యమున
కొడికట్టుటకు సిద్ధపడిరి. తదనంతరము మాయారాణి జగపతిని,
సైయ్యారులిరువురను, వెంటఁదోడ్కొని మరల నాల్గవతరగతి
తోఁట లోనికి బయలుదేరెను. అప్పటికి దినకరుఁ డుదయింప
కుండినను నలుదెసల నరుణకాంతులు బాగుగ వ్యాపించియుండెను
మాయారాణి పరిజనులు నిద్రనుండి లేచి తమ తమ కార్యముల
యందుఁ బ్రవృత్తులగుచుండిరి. కాని, మాయారాణి దృష్టియావై
పునకుఁ గొంచెమైనను లేదు. ఆవివశుఁడగు బంధితుని ప్రాణముల
గొనుటయే యత్యావశ్యకమగు కార్యముగ నామె దలపోయుచుం
డెను.

కొంతసేపటికి మాయా రాణీజగపతి కాంచన గదాధరసింహు
లానాల్గవతరగతి దోఁటయందుఁ బ్రవేశించి యాబంధితునిఁ జెఱఁ
బెట్టియున్న కారాగృహము చెంతకుఁ బోయి చేరిరి. ఆబంధితుని
తాను మరల వెనుకటి రీతుననే చేతి డాలును ధరించి యుండుటఁ
గాంతుమని యామెకు సంపూర్ణ విశ్వాసము గలిగి యుండెను.
కాని, యచ్చటి స్థితియే వేఱుగ నుండెను. ఇపుడా యినుపగజము

లతో నమర్చఁబడియుండిన నా కారాగారపు ద్వారము దెఱువఁబడి యుండెను. మఱియు నాబంధితుఁడు దానియందుఁ జూపట్టుచుండెను. దీనిఁ గనినతోడనే వెగ్గలంబగు భయదుఃఖసంతాపములు మాయారాణిని మల్లడిగొనుటచే నిరాశాయత్తచిత్తయై యొక్కమాఱుగ "హా" యని యఱచి మూర్ఛాగతయై భూమిపైఁ గూలెను. జగవతి కాంచన గదాధరసింహులకుఁ గూడ ప్రాణము లొక్కమాఱుగ మింటి కెగసినట్లయ్యెను. వారి మోములు భయాతిరేకంబున వెలవెల బాఱెను. ఇపుడు దమప్రాణములను రక్షించుకొనుట మిక్కిలి కష్టసాధ్యమని వారికిఁ దోపఁదొడంగెను. ఇంతియుగాక, దురంతభయాతిరేకంబున నచట నిలుచుటకుగూడ వారి కశక్యముగ దోఁపసాగెను. కాని, వారలు మూర్ఛితయై పడియుండిన మాయారాణిని దీసికొని రెండవతరగతి తోఁటలోని కేగుట మిగుల గష్టసాధ్యమని యెఱింగియుండుటచే నిరుపాయులై యచట నిలువవలసిన వారలైరి.

కాంచనసింహుఁడు దనకఱుపాలనుండి యొకయరకు సీసాను వెడలించి మాయారాణికి వాసన జూపించెను. మఱియుఁ గొన్నిమాఱు లామె నోటియం దాయరకు చుక్కలను గొన్నింటిని విడచెను. కొంతసేపటికి మాయారాణికిఁ జైతన్యము గలిగెను గాని, వెంటనే లేచి కూర్చుండఁ జాలక యటులనే పడియుండి యీదిగువను వివరించిన విధంబున బ్రలాపింపఁ దొడంగెను.

"అకటా! నేఁటితో నాయాయుః పరిమాణము దీరిపోయినది. నేను శీఘ్రకాలములోనే మృత్యుదేవత కరాళ దంష్ట్రలఁ జిక్కనుంటిని. కటకటా! నెత్తురుచే వ్రాయఁబడియుండిన పుస్తకమేగదియందు భద్రపఱచఁబడి యుండెనో దాని తాళపుఁజెవి తన యొద్దఁ గలదని యాదురాత్ముఁడగు జైమినీప్రసా దెప్పుడు

సభాంతరమున బలికి యుండెనో యప్పుడే నాప్రాణములకు ముప్పు
వాటిల్లనుండె నని తెలిసికొంటిని. మఱియు నిప్పుడుగూడ నన్నా
పుస్తకమే వంచించుచున్నది. ఆహా! నేను దానినిగుఱిల సంపాదించు
నాకై జైమినీపరిపాదును ప్రాణములతో వీడిపుచ్చి మిగుల ప్రయాస
మొనరించియుంటిని. ఈకార్య మాతనిదే కావలయును. రాజేశ్వరీ
జగపతులవలన నేమియుఁ గాఁజాలదయ్యెను. (జగపతి దైవప్రేరణ గాంచి)
నీయందలి మోహమే నన్నిట్టి స్థితికిఁ గొనితెచ్చినది. నీ [illegible]
ప్రణయమే నాశిరమ్ముపై నీపాపభారము మోపినది. నీకారణంబుననే
యమూల్యమగు నాశీలమును గోల్పోయియుంటిని. నీసహవాసదో
షంబుననే చెడుకార్యములయందుఁ బ్రవృత్తురాలనైతిని. నీమూల
ముననే దైవసముండగు పతిని పలుబాధలకుఁ బాల్పఱచితిని
నీకతననే నాసర్వస్వమును గోల్పోయితిని. నీయందలి మక్కువయే
విజయేంద్రసింహుని పుత్రరత్నముల నశింపఁ జేయుటకుఁ గటిబద్ధు
రాలినిగ నొనరించి యున్నది. నీకారణంబుననే నేఁడిట్టి దశకుఁ
బాల్పడితిని. ఆహా! చెడుకార్యములకుఁ జెడుఫలమే లభించునను
నార్యుల పలుకులు చెన్నఁటివోవునే! ఆ దయామయుండగు భగ
వంతుఁడు నాకన్ని తెఱంగుల ధనసంపద్యాధికారంబులఁ బ్రసాదించి
యుండినను ననుఁజోలు పడఁతి నేఁడు దుష్ప్రవర్తనా విశేషంబుల
నిట్టి దుర్గతికిఁ జిక్కనాయెఁగదా? కటకటా! నేనేమని తలపోసి
యుంటిని? ఇపుడేమాయెను? ఏమి! దుష్పథగాము లెన్నఁడేనియు
సుఖయాపనగరంబునఁ బ్రవేశింపఁ జాలుదురా! కల్లకల్ల. అటు
లెన్నటికిఁ గాఁజాలదు. అంగులకుఁ బ్రబలనిదర్శనము నేన! నేన!!
అయ్యో! ఏమిసేయుదును. ఏదిశరణ్యము. హా! హతవిధీ! నన్నెంత
కుఁ గాఱియపెట్టుచుంటివి?

మాయారాణి యిఁక నేమి పలుకదలంచుచుండెనో తెలియ

దు. అంత నొకధ్వని యామె వాగ్ధోరణియందు విఘ్నము నాపా దించెను. మఱియు నది యామెకు జ్ఞానము గలుగునట్లు లొనర్చె ను. ఏదెసనుండియో "యిపుడు పరితపించుటవలన బ్రయోజన మేమి? ఎంతటివారికిని గాల మొక్కరీతిగఁ గడువదు గదా! నీయనుచిత కృత్యములకుఁ దదనుగుణ్యంబగు ఫలమును నీవు గాక వేఱొక రేల యనుభవించెద"రని వినిపించెను.

ఏవైపునకు దృష్టి సారించినను, నెంత యోజించినను, నావా క్యములను బలికినవా రెవ్వరో యెచటినుండి పలికియుండిరో వారికిఁ దెలియఁదయ్యెను. భయాతిరేకంబున నెల్లర హృదయములు తడ తడ కొట్టుకొనసాగెను. దేహములు కంపింపఁదొడంగెను. మాయా రాణి యచటినుండి లేచి జగపతి కాంచన గదాధరసింహులను వెంటఁదోడ్కొని కంపితహృదయము నొకచేత వడఁచిపట్టి మానస్సం తాపంబున వెతనొందుచు రెండవతరగతి కోటయందలి తనయం తఃపురము వైపునకుఁ బారిపోయెను.

౫

జటాశంకరుఁడు మృగాంకవతి యాజ్ఞానుసారము సులోచ నను బంధించి యుంచిన మూటను వెన్నున నిడుకొని మృగాంకవతి సరోవరాద్భుత తిలస్మ మందిరమువైపునకుఁ దారివట్టెను. ఆసమ యంబున నతఁడు సంతోషాతిశయంబునఁ బెల్లుబ్బుచు నిశ్చింత నడుగులు వైచుచు వెడలుచుండెను. వానికి రెండు విధంబులగు యానందము సేకూరి యుండెను. అందొకటి:—దేనికారణంబున దానంతవ్రిజ్ఞావంతుఁడును, ధీశాలియును నై యుండియు మోహినీ సులోచనల కధీనుఁడగుచుండెనో, మఱియు దేనిమూలమునఁ దన యద్భుతరహస్యములు లోకమునకు వెల్లడియగు భీతి దన్నొక మృత

ప్రియునిగఁ దలంచుచుండెనో యారహస్యములతో నిండియుండిన
కాగితములను దనచేతులతో బస్మీపటలము గావించి యుండెను.
ఇఁక రెండవది:-మృగాంకవతి దనను విశ్వాసపాత్రునిగఁ దలంచి పారి
తోషిక రూపంబున నొసంగియుండిన తిలస్మకైజారు వాని కోరిక
లను మిన్నంటఁ జేయుచుండెను. ఇట్టివిధంబగు నానందము వానికి
మృగాంకవతి వలనఁ జేకూరియుండెను. జటాశంకరుఁడు గొలుతనుం
డియుఁ జతురోపాయుఁడును చాకచక్యముగలవాఁడును ధూర్తుఁడు
నైయుండెననుట కెట్టి సందియమును లేదు. అందుపై నతఁ డిపుఁడు
మృగాంకవతి వలన నొసంగఁబడిన యద్భుత మహిమోపేతమగు
తిలస్మకైజారున కధికారియై యెట్టి భీతియు లేకుండెను.

ఏనాఁడు జటాశంకరుఁడు సులోచన బంధింపఁబడి యుండిన
మూటను వెన్నున నైచుకొని మృగాంకవతి మందిరము వైపున
కేగుచుండెనో యామఱుచటి దిన వృత్తాంతమును మేమిపుడు లిఖిం
చుచుంటిమి. జటాశంకరుఁ డొరులకంటబడకుండగ జానపదములకు
దాదవ్వులనుండి యరణ్యములయందును మైదానములయందును
జిక్కుత్రోవలఁ బడి తనప్రయాణమును సాగించుచుండెను. మిట్టమ
ధ్యాహ్నమగునంత నతఁడొక చిన్న పర్వతము గ్రిందకుఁ బోయి
చేరెను. ఆపర్వతమునకు దిగువతట్టున నలువైపుల చిన్నచిన్న కంట
కవృక్షములును బొదలును విస్తారముగ బెఱిగి దానినొక చిన్న
యడవిగ నొనరించియుండెను. అచట నొకసెలయేఱు నిర్మలవారి
పూరితంబై ప్రవహించుచుండెను. ఆనదీతీరంబునఁ జల్లనినీడ నొసంగు
కొన్ని భూరుహంబులు గుబురుగఁ బెఱిగి యుండెను. మధ్యంగత
భానుని తీక్ష్ణప్రఖరమయూఖతతి విహ్వలచిత్తుఁడై జటాశంకరుఁడు
కొంతవడి మార్గాయాసమును దీర్చుకొను తలంపుతో నావృక్షముల
క్రిందకుఁ బోయి నిలచెను. మఱియుఁ దన వెన్నున నుండి యామూట్టి

యను దింపి క్రిందనిడి యచ్చోట నొకపచ్చడమును బఱచి దానిపై నొరగిల్లెను. మఱియు నించుకసేపు సేదదీర్చుకొనిన పిదప నతఁడు లేచి కూర్చుండెను. తదనంతర మా సెలయేటి జలంబుల ముఖకరపద ప్రక్షాళన మొనరించుకొని కక్షపాల నుండి కొన్ని ఫలములను వెడలించి మెసవెను. తరువాత నామూటనువిప్పి సులోచన కొక యగరు సీసాను వాసనజూపి యామె మూర్ఛఁ బాఱఁ ద్రోలెను.

సులోచన వెంటనే యొకటి రెండు తుమ్ములను తుమ్మి చైతన్యయై లేచి కూర్చుండెను. మఱియు నలుదెసలఁ గలయఁగని తన ప్రక్కనుండిన జటాశంకరుని గాంచెను. ఆనేర్పుకత్తె తన్నాతఁడు మృగాంకవతి యానతి నెచ్చటికో కొనిపోవు చుండెనని వెంటనే గ్రహించుకొనెను.

సులోచన:—(జటాశంకరునితో) మృగాంకవతి నన్ను బంధించి యుండెననియు, నామె యాజ్ఞానుసారముగ నీవు నన్నెచ్చటికో తీసికొనిపోవుచుంటి వనియు నేనెఱింగితిని. నేనొక బంధితురాలనై యుండినను నాకరపాదములు శృంఖలాబద్ధములు గాకుండుట కడుంగడు శోచనీయము. నీవు నాకుఁ జైతన్యమును గలిగించుటను గాంచియు నాకమితాశ్చర్యము జనించుచున్నది.

జటాశం:—నీవు గూడ నీసునాక్షిత పర్వతోపత్యక యందలి ప్రకృతి శోభను గాంచి-గాంచి, నిచటి నిర్మల వాయువును సేవించియు ముదమందఁ గల వని తలంచితిని ఇక కరపాదములను బంధించియుంచుట కెట్టి యావశ్యకమును లేదు. కారణంబేమన, నేను నీయెడల నన్నివిధంబుల జాగ్రత్త గలిగి యుంటిని. నీవు నాకిపు డెట్టి కీడును గలిగింపఁ జాలవు. మఱియు దేని యందలి విశ్వాసమున నీవు పొంగి పొరలు

చుంటివో యాప్రభావ సమన్వితంబగు నుంగర మిపుడు నీయొద్ద లేదు. ఇదియుఁగాక (కైజారు వైపునకుఁజూపి) అత్యద్భుత మహిమోపేతమగు కైజారు నాయొద్దఁ గలదు. నాకిపుడెవరి భీతియుఁ గలుగదు. మఱియు నేకారణంబున మీకు నేనధీనుఁడనగు చుంటినో, యట్టి రహస్య కాగితములనుగూడ నిపుడు భస్మీపటలము గావించి యుంటిని.

సులోచన:—నిక్కువము. నీకిపు డెవరి భీతియుఁ గలుగదు. కాని, నీవు మాయెడల వైరభావ మూనియు నెట్టి లాభమును బడయఁ జాలవని విశ్వసింపుము. మఱియు విజయేంద్రసింహుఁడు నీయపరాధములను క్షమించునని కలనేనియుఁ దలంపకుము.

జటాశం:—ఇవి యేటి మాటలు! విజయేంద్రసింహ మహీపాలుఁడు దప్పక నాతప్పిదములను మన్నింపఁగలఁడు. మఱియు నిపుడా రహస్యకాగితములు భస్మము గావింపఁబడియుండుటచే నాతప్పిదము లెవ్విధంబునను స్థిరపడఁ జాలవు.

సులోచన:—ఒకవేళ నతఁడు నీయపరాధములను క్షమించినను, నీవీప్రపంచమందు నిక్కంపు సౌఖ్యమును బడయఁ జాలవు.

జటాశం:-అదియేమి? నాకుఁ జేకూరని వాస్తవంబగు సుఖ మెయ్యది?

సులోచన:—ఒకజమీందారుని విధంబున సకల సుఖోపభోగముల ననుభవించుటకు నీయొద్ద నంత ధనములేదు. ధనముండినను నీ మోహంపుసతి నీచెక్కియ లేనిదే యది యొక సుఖముగఁ బరిగణింపఁ బడదు. నీప్రియురాలు—జైమినీప్రసాదు తల్లి కాశీనగరమందు బంధింపఁబడి నీకై పరితపించు చున్నది.

జటాశం:—(తుళ్ళిపడి) ఆమె నాసతి యని నీవెటుల వచియించు చుంటివి?

సులోచన:—బాగు! నేనెఱుంగని విషయము వేఱొకటి గలదా?

నీవు గృహమును వీడి చనిన పిదప నెత్తురుచే వ్రాయఁబడిన పుస్తకము భద్రపఱచఁబడి యుండిన స్థానము జైమినీవ్రిసా దెట్లు తెలిసికొన గలిగెనో, యావిషయము నీకు వివరించి యుండెనా?

జటాశం:—లేదు. నాకేమియుఁ దెలిపి యుండలేదు. మఱియు నేను తన తండ్రిననియు నతఁ డెఱుంగఁడు.

సులోచన:—బహుశః ఆపుస్తక మింతదనుక వానిస్వాధీనమందే యుండవచ్చును.

జటాశం:—నీ కాసమాచార మేల చెప్పవలెను?

సులోచన:—పోనిమ్ము! నాకు వానితో నెట్టి జోక్యమును లేదు.

జటాశం:—నిక్కవముగ నాభార్య సమాచారము నీకుఁ దెలిసి యుండెనా?

సులోచన:—ఔను. నేనెఱింగి యుంటిని.

జటాశం:—ఆమె యింతదనుక జీవించియుండెనా?

సులోచన:—ఔను. బ్రతికి యున్నది. కాని, యిఁక మూఁడు నాలుగు దినములకంటె నధిక కాలము జీవింపఁజాలదు.

జటా:—అదియేమి? ఆమె కెట్టి రుగ్ణతయేనియుఁ గలిగియుండెనా?

సులోచన:—లేదు. ఆమె నిపు డెవ్వరు బంధించియుండిరో వారలే యామెను తుదముట్టించుటకుఁ దలంచుచున్నారు.

జటాశం:—ఆనిస్సహాయురాలను బంధించిన వారెవ్వరు?

సులోచన:—నీవు నాకుఁ బగతుఁడవు. మఱియు నన్ను బంధించి యెచటికో కొనిపోవుచుంటివి. ఆసంగతులు నీకేల చెప్పవలయును?

జటాశం:—దానికి బదులుగ నీకుఁ గొంత మేలు చేకూర్పఁగలను.

సులోచన:—నీవన్ని తెఱంగుల నాకు శుభమును గలిగించెద వనుట

రించుకొని యున్నది. మఱియు నామె కారణంబున నేనన్ని తెఱంగుల సుఖసంతోషముల గాలమును వెళ్ళబుచ్చు చుంటిని.

జటాశం:—అగుచో, నీవిచ్ఛగించిన నాభార్యను నాకు స్వాధీన పఱచఁగల వని యూహించెదను.

సులోచన:—ఔను. దానికిఁ బ్రత్యుపకారముగ నీవు నాకేమి యొసంగఁబోయెదవు?

జటాశం— (కైజారువైపునకుఁ జూపి) ఈతిలస్మ కైజారు దక్క నీవు దేనిని గోరినను నొసంగఁ గలను.

సులోచన:-నే నీకైజారును వాంఛించుటలేదు. నీవు విజయేంద్రసింహునిపక్షమును వీడి మాతోఁ జేరుటకుమాత్రము గోరుచుంటిని. నీకన్ని తెఱంగుల సుఖసంపత్తి చేకూరఁగలదు. నీవు కోట్లగొలఁది ధనమునకధికారివి గాఁగలవు. మఱియు నధిక సంతోషమున నీవీప్రపంచ యాత్రను గడపఁగలవు.

జటాశం:—అసంభవము. నేనట్లుఁ గావించిన నపయశమునకుఁ బాలగుటయే కాక, మిగుల హీనముగఁ జంపఁబడుదును.

సులోచన:—భీతి యెందులకు? నీకెవరెట్టి హానియుఁ గలిగింపఁ జాలరు. నీవిపుడే రూపముతోఁ జంచరించుచుంటివో, యది నీ నిజస్వరూపము గాదని నేను బాగుగ నెఱింగియుంటిని. ఇద్దియుఁగాక, మృగాంకవతికిని నీకును గొప్ప పరిచయము. ఆమె నీనిజస్వరూప మెన్నఁడు గాంచి యెఱుంగదు. కావున, నీవు మరల రూపమును మార్చుకొని యీప్రపంచమందు యథేచ్ఛగా సుఖోపభోగంబుల ననుభవింపఁ జాలుదువు. మఱియు మృగాంకవతి నీసిగపూవైనను గదల్పఁ జాలదు.

జటాశం:—(నవ్వి) మృగాంకవతికిఁ దెలియని రహస్య మొక్కటే

నియుఁ గలుగదు. ఆమెను మోసగించుట తనముప్పునుగోరి
పిలుచుకొనుటయే యగును. ఆమె యొక సామాన్యురాలు
యూఁడుది కాదు. ఆపడఁతి యెంత రూపవతియో, సర్వసద్గు
ణసంపన్నయో, దయాంతరంగయో, యటులనే చతురను
తియు ధూర్తురాలును విదుషీమణియు. అట్టి సమర్థురాలిని
మోసగించు టొక సామాన్య విషయముగాదు. నేనామెను
వంచింపఁ గలిగినను పరులకు నామోమెటులఁ జూపఁ
గలను. అందరికంటె నాపుత్రుఁడు జైమినీప్రసాదునకే నా
యెడలఁ దిరస్కారభావ ముదయింపక మానదు.

సులోచన:—ఇది యట్టి పిచ్చియూహ. జైమినీప్రసాదేవుడు తన
తల్లిని వీడిపుచ్చిన సమాచారమెఱుంగఁ గలఁడో, యప్పుడే
నన్నెంతయో మహోపకారిణిగఁ దలంపక మానఁడు. నీవు
మృగాంకవతికి భీతిల్లుట మిక్కిలి ప్రమాదకరము. ఒకటి
రెండు నెలలలో మృగాంకవతి యీప్రపంచమును విడచి
పోయిన వార్తను నీవు వినగలవు. నీవు మాకుఁ దోడ్పడిన
చో వారము దినముల లోపలనే యామె రూపు మాసిపోఁ
గలదు. ఇఁక నీకెవరి భీతియు లేకుండును. మృగాంకవతి
శీఘ్రకాలములోనే చంపఁబడుట వాస్తవము. నీవట్టి హతభా
గ్యురాలను నాశ్రయించి వ్యర్థముగఁ జెడకుము. మాకుఁ
తోడ్పడుము. అనతికాలములోనే మృగాంకవతిని, విజయేం
ద్రసింహుని, వానిపుత్రు లిరువురును మరణశయ్యయందుఁ
జూడఁగలవు. మఱియు నతులనీయ సౌందర్యరాశియగు
నీమోహంపు పడఁతియు నీచెక్కియఁ జేరఁగలదు. కోట్లఁ
గొలఁది రూప్యముల సంపత్తికధికారివి గాఁగలవు. నేను
నీయుంపుడు కత్తెనై నీపక్కను వెచ్చనేయుచుందును. నేను

నిన్నెంతయో కామించి యుంటిని. ఇదియుఁగాక కుమారి గడ రాజ్యసింహాసనము నీకుఁ దక్కులుపఱచినను నది యొక యబ్బురమగు విషయము గాఁజాలదు. నీవు మాయారాణియొక్క యద్భుతసామర్థ్యము నెఱింగియే యుందువు. ఆదిగంత విశ్రాంత లోకోచ్ఛిశాలయగు తిలస్మమహారాణి నెఱుంగని వారీపుడమిఁ జూపట్టరు!

జటాశం:—నేనా సుప్రసిద్ధురాలగు మాయారాణి నెఱింగియుంటిని. మఱియు నామె రహస్యములు గొన్నింటిని మృగాంకవతి వలన నాలించియుంటిని. కాని, సంపూర్ణముగ నాకుఁ దెలియదు.

సులోచన:—సామాన్యవృత్తాంతమును నీకు వివరించి తెలిపెదను. ఆమె రెండవవాని కంటఁబడక లక్షలకొలఁది మనుజులను జంపు సామర్థ్యమును గలిగియున్నది. చూడుము! ఆమె కనుసన్న మాత్రముననే నీవీప్రపంచమందు వ్యర్థుఁడవైపోయితివి. నీమోహంపు సతితో నీకెడబాటుఁ గలిగినది. మఱియు నీమోము పరులకుఁ జూపఁటకుఁ దగియుండ వైతివి. నేను వచియించు మాటలు నిక్కములగునో కావో నీవే యోజించుకొనుము.

జటాశం:—కాని, యామె లక్షలకొలఁది జనుల నతిరహస్యంబుగఁ జంపఁగలదను విషయమును మాత్రము నేను విశ్వసింపఁజాలను. అట్టి సామర్థ్య మామెకుఁ గలిగియుండిన నిప్పటికి విజయేంద్రసింహ మహీపాలుఁడు మున్నగు వారలను విగతజీవులనుగ నొనరించియే యుండును.

సులోచన:—ఆమె కది యొక కఠిన కార్యము గాదు. ఇపు డామె విజయేంద్రసింహుని, వానిపుత్రులిరువురను, నభయసింహుడు

మున్నగు మైమారులను జెఱఁబెట్టి యున్నది. ఆమె దలంచిన
నిరాటంకముగ వారిని జంపఁగలదు ఇఁక నిన్నామె తృణ
ప్రాయముగఁ దలంచుచున్నది ఆమె మైమారు లప్పు
డప్పుడు వంచింపఁ బడు చున్న నది వేఱువిషయము.
అకటా! "రక్తగంధము" మాచేఁజిక్కియు సుళువుగ దాఁటి
పోయినది. అయిన నేమి! నేఁడో రేపో యాపుస్తకము
మాయారాణి చేతియందుఁ జూపట్టఁ గలదు. నీవు నామా
టల కియ్యకొనిన మొదట మృగాంకవతి, విజయేంద్రసిం
హుఁడు, వానిపుత్రులు మున్నగువారలు ద్రోలింపఁబడుదురు.
నీవలన మాకార్యములు కొన్ని తీరఁగలవను నాశ గలదు
కావున, నిన్నింతదనుక జీవములతో విడచి యుంటిమి.
నీవు మాకొనరింపఁబోవు సాయమునకు నీకెట్టి యమూల్య
పారితోషక మొసఁగఁబడునో దానిని కొంత యాలోచిం
చుకొమ్ము. మృగాంకవతి నన్నను మోహినిని బంధించి
యెద్దియో ఘనకార్యము జేసి యుండెనని తలంప రాదు.
మమ్మిరువురను బంధించిన మాత్రమున మామారాణి కెట్టి
హానియుఁ గలుగఁజాలదు. మఱియు మేమధికకాలము దను
కఁ జెఱయందుఁ బడియుండు నగత్యము గలుగదు. నావచ
నములను బాగుగ యోజించుకొనుము. మఱియు మృగాం
కవతి పక్షమును విడచిపెట్టుము. కానిచో, బశ్చాత్తాపము
నొందఁ గలవు. మఱియు నీప్రియపత్ని దురపిల్లుచు దురపిల్లు
చు మరణింపఁగలదు. వినుము! ఈసంసార ప్రపంచమందు
స్వేచ్ఛావిహారముకంటె మించిన యానందదాయకమగు
సుఖము వేఱొకటిలేదు. అట్టి సుఖానందములు నీకిపు డొసం
గఁబడు చున్నవి. నావచనములు నీకు విశ్వసనీయములుగఁ

దోపకుండిన నీవు ప్రశ్నించు దానికి ప్రత్యుత్తర మొసంగి నీ మానసమునకుఁ దృప్తి గలిగింపఁ జాలుదును. నీవు నావలుకుల నాలించి "ఔను! నీమాటలయెడ నాకెట్టి సందేహమును జనించుటలే"దని పలుకక మానవు. (సస్మిత హాసభావంబుల ప్రదర్శించుచు) నేను నిన్నెంతయో ప్రేమించు చుంటిని. నేను నీచెంతనే నివసించుచు నీప్రపంచసుఖముల ననుభవించెదను.

సులోచన వచనంబుల నాలించి జటాశంకరుఁ డాలోచనా నిమగ్నమానసుఁ డాయెను. మఱియుఁ గొంతసేపటి వఱకు నేమియో యోజించుచు నట్టులే కూర్చుండి యుండెను. తదుపరి సులోచన వైపునకుఁ బలికించి "మంచిది! నీయిష్టానుసారముగఁ బ్రవర్తించెదను. మఱియు నాయిల్లాలి తోపాటు నిన్నును ప్రేమించుచుందు" ననెను.

ఈ వచనంబుల నాలించి నంతనే సులోచన యమితానంద భరితయై వాని నాలింగనము చేసికొనెను. మఱియు నాప్రేమికాజను లిరువురు సరస సంభాషణములను గావించుచు నచటి పర్వతము పైకి వెడలి చనిరి.

## ౧౦

మధ్యాహ్న కాలము మీఱియుండినను మాయారాణికి భోజన భాజనంబుల చింత గొంచెమైనను లేకుండెను. క్షణక్షణంబున నామెకు భయ విచార సంభ్రమములు పెంపొందుచుండెను. కాంచన గదాధరసింహులును జగపతియు నామె సమక్షమందుఁ గలరు. కాని, స్వాంతనవచనంబుఁ బలికి యామెకు శాంతిఁ గూర్చు నాలోచన వారిలో నొక్కరికిని లేకుండెను. "మేమైయారితనమందుఁ బ్రాపి

ణ్యులము గదా! ఏవెరవు నైనను నీప్రాణములను గాపాడెద"
మను వచనమైన నెవరి నోట వెడలకుండెను. మాయారాణి కార
ణంబునఁ గాంచన గదాధరసింహులును జగపతియు నెట్టి కలుషిత
కార్యమును గావించి యుండిరో దానిని మాపాఠక మహాశయు
లొక పరికరణమందుఁ జదివి గ్రహించి యుందురు. అట్టి గురుతర
దురితభరమ్మూన శిరములను వంచి మాయారాణి వలెనే వారలును
దురంతదుఃఖమునఁ గొట్టువడుచుండ నెవ్విధంబున నామెకు ధైర్యవ
చనంబులను బలికి యూరటఁ గూర్పఁగలరు? ఆసమయంబున మా
యారాణి సమీపమున నాముప్పురుఁ దక్క నాల్గవ వారెవ్వరును
లేరు. ఇదియుఁగాక నాల్గవవారెవ్వరు నీరహస్య మెఱుంగరు.
మఱియు వారలు తమ రహస్యము నింకొకరికిఁ దెలుపుటకు
సాహసింపరు. అట్టితరుణంబున హృదికిఁ దగురీతి ధైర్యవచనములను
బలికి యోదార్చు వారెవరుందురు? మాయారాణియం దుదాసీనత
వ్యాపించి యుండుటచే నలుదెసల నుదాసీనతయే గోచరించుచుం
డెను. దాసదాసీజనంబులయందును సైనికులయందును గూడ విషా
దానిలము వ్యాపించి యుండెను. కాని, యిపుడేమి జరిగెను?
మఱియు నిపుడేమి కానున్నదను విషయ మెవ్వరికినిఁ దెలియదు.
అచట నిస్తబ్ధత బాగుగ వ్యాపించి యుండెను. కొంతసేపటికిఁ
గాంచనసింహుఁడు శిరము పైకెత్తి మాయారాణి వైపునకుఁ గాం
చి యిటులఁ బలుకఁదొడంగెను:—

కాంచన:—విజయేంద్రసింహుని మైయారులు మిగుల ధురంధరుల
నుట కెట్టి సందియమును లేదు. వారి నెదిర్చి యెంతటి ధీశా
లియు విజయముం బడయఁజాలఁడు. మఱియు వహ్నికి వాయు
వుదోడ్పడిన చందంబున మృగాంకవతి తోడ్పాటువలన
వారిసాహస మింకను నతిశయిల్లు చున్నది.

జగపతి:—ఇక్కాలంబున నిచట సంభవించు చుండిన యనర్థము లన్నింటికి ముఖ్యకారకురాలు మృడ్యాంకపతి యనుట కెట్టి యాటంకమును గలుగదు. కాని, మన మామె కెట్టిహాని యుఁ గలిగింపఁ జాలకుంటిమి.

మాయారాణి:—ఆదురాత్మురాలు మన తిలస్మోద్యానమందుఁ జొచ్చి తన కార్యమును నెఱవేర్చుకొని పోవుటయు, నెవరి కంటఁబడకుండుటయు మిగుల శోచనీయము. అకటా! మన మెట్టిదుర్దశకుఁ బాల్పడ నుంటిమో తెలియదు. నేనిపుడేమి సేయుదును? ఎచటికిఁ బారిపోవుదును? శరణ్య మెయ్యది?

జగపతి:—ఇటుల లొక్కమాటుగ నిరాశ నొంద పాడికాదు. మన చాటింపు ప్రజల మానసంబుల నెట్టి పరిభావమును బొందు పరచఁగలదో యొకింత బరికింప వలసి యున్నది.

మాయారాణి:—మనమేమని చాటించుట కాజ్ఞాపించి యుంటిమి? నాకుఁ గొంచమైనను జ్ఞప్తియందు లేదు! నేనపుడు నాదేహ మును మఱచి పరాధీనన్నై యుంటిని.

జగపతి:—మీయాదేశానుసారము ప్రధానామాత్యుఁడు జాంఘి కులను రావించి యివ్విధంబున నాజ్ఞాపించెను:—

"తంత్రజ్ఞులగు విజయేంద్రసింహ మహీపాలుని నైయ్యా రులలో నొక, డైదువత్సరములకుఁ బూర్వము పరమపదమునకు వేంచేసి యుండిన మన యేలిక యగు ముకుందసింహ నృపాలుని రూపమును దాల్చుకొని, ప్రజలను నుత్తేజితులను గ నొనరించు తలం పుతో నీనగరమందుఁ బ్రవేశించి యుండె నని, మన చతుర శిఖామ ణులగు నైయ్యారులు గనిపెట్టి యుండిరి. కావున, నాదురాత్ముని శిరమును ఖండించి తెచ్చు వారికి లక్షహొన్నులు బహుమాన మొసంగఁ బడునని చాటింపుఁడు"

మాయారాణి:—మంచిది! దాని పరిణామ మెవ్విధంబుగఁ దేలఁ
గలదో మనమిపుడు పరికింప వలసి యున్నది.

కాంచన:—రెండు మూఁడు దినములలో నెట్టి ప్రయోజనమేనియుఁ
జేకూరకుండిన మనఘోషణము వ్యర్థంబయ్యెననియే తలంప
వలెను.

మాయారాణి:—మంచిది! నుదుట నేమి వ్రాయంబడియుండెనో
దాని ననుభవింపకఁ దీరదు గదా! ఇపుడు వగచిన బ్రయో
జనమేమి! ఇపు డిట్టి శోచనీయావస్థయందు నాకైయీయూరు
లిరువురు నాకెవ్విధంబునఁ దోడ్పడఁగలరో పరికింప వలసి
యున్నది.

కాంచన:—నావలన నేమియుఁ గాఁజాలదు. మృగాంకవతీ విజయేం
ద్రసింహుల స్నేహముల నెరిగ్గి నిలచు వారొక్కరును
నీపృథ్వీతలమందుఁ గానరారని నేను బాగుగ నెఱింగి యుం
టిని. చూడుఁడు! అభయసింహుఁడు నామోముపై నలఁది
యుండిన రంగింకను బూర్తముగ వెడలిపోకుండెను. వాని
కింక నెట్టి యపూర్వక్రియలు దెలిసి యుండెనో యూహింపఁ
జాలము. మీ కెట్టి దురాశయేనియు నుండిన నుండవచ్చును
గాని, నేను బొత్తిగా నిరాశా చిత్తుఁడనై యుంటిని. ఇపు
డిచట నొక క్షణకాలమైనను నిలువఁజాలను.

మాయారాణి:—ఏమి! నీకోచ్చితాభిప్రాయ మిదియేనా!

కాంచన:—ఔను. నేనిటులనే స్థిరపఱచుకొని యుంటిని. మరల
నాజాడ మీకెవ్వరకును దెలియకుండును.

మాయారాణి:—(గదాధరసింహుని వైపునకుఁ గాంచి) ఇఁక నీ
యభిప్రాయమేమి?

గదాధర:—నాయుద్దేశ్యము గూడ నదియే!

మాయారాణి:—బాగుగ నాలోచించి ప్రత్యుత్తర మొసంగుము.

గదాధర:—నేను సర్వము బాగుగ నాలోచించుకొనియే యుంటిని.

మాయారాణి:—(కొంచెము యోజించి) మంచిది! నేనొక యుపాయాంతరము నెఱింగించెద నాలింపుఁడు. దానివలన నెట్టి ప్రయోజనమేనియుఁ జేకూరకుండిన మీకిష్టము గలిగిన తావునకు వెడలిపోవచ్చును.

కాంచన:—ఇపుడెట్టి ప్రయత్నము వలనను ప్రయోజనములేదు. మావలన నేమియుఁ గాఁజాలదు.

మాయారాణి:—కాదు కాదు. సంభ్రమచిత్తులరు గాకుఁడు. నేనీతిల న్నమునకు మహారాణిననియు, నీతిలన్నమం దనేక యద్భుత పదార్థములు గలవనియు మీర లెఱింగి యుంటిరి. మీరిరువురకు నేనొక యద్భుతపదార్థము నొసంగెదను. దానిని గాంచియు, దాని యుపయోగ మెఱింగియు "నీక మాకెట్టి భీతియు లేదు మాటలాడు నంతలో లక్షలకొలఁది పగతుఱను మడియింపఁ గల"మని పలుకక మానరు.

గదాధర:—ఔను. మీరీతిలన్నమునకు యజమానురాలురు. మఱియు మీయధికారమం దనేక యమూల్యపదార్థములు గలవు. కాని, యాపదార్థములను కన్నులారఁ గాంచినఁ గాని మేమెట్టి ప్రతినయుఁ జేయఁజాలము.

మాయారాణి:—నేను దానినే కదా తెలుపుచుంటిని! మీరిరువురు నావెంట రండు. మీరలాయద్భుత పదార్థములను గాంచి సంతుష్టచిత్తులగుచో నన్ననుసరించి యుండుఁడు. కానిచో, మీయిష్టము గలిగిన తావునకు వెడలిపొండు.

గదాధర:—ఏయద్భుతపదార్థముపై మీకింతటి విశ్వాసము గలిగి యున్నదో దానినే మొదట మాకుఁ జూపింపుఁడు.

మాయారాణి:—మంచిది. నావెంటరండు. నేనిపుడే యాపదార్థ
　　మును మీస్వాధీన మొనరించెదను.

ఇవ్విధంబున బలికి మాయారాణి తన స్థానమునుండి లేచి నిలచెను. మఱియు జగపతిని నైయ్యారులిరువురను వెంటఁదోడ్కొని యచటినుండి బయలుదేరెను. తదనంతర మాతోఁటయందు సంచరించుచు, దేనియందు మృగాంకవతీరాజేశ్వరులకు సమావేశము గలిగియుండెనో యాబురుజుసమీపమునకుఁ బోయి చేరెను. ఆబురుజు ప్రక్కనే మఱియొక కట్టడము గాఱురాళ్ళతో నిర్మింపఁబడి యుండెను. కాని, దానిలోనికిఁ బ్రవేశించుట కేదైనను నుండి ద్వారము గలదో యది మాయారాణికి దక్క జగపతీకాంచన గదాధరసింహులలో నొక్కరికిని తెలియదు. దాని వెనుక వైపున నాతిలస్వోద్యానపు ప్రాకారము గలదు. తక్కిన మూఁడువైపుల కాఱురాళ్ళతో నిర్మింపఁబడిన దృఢమైన గోడలు గలవు. మాయారాణి కాంచనసింహునితో, "వితంసమును దీనిపైకి విసరి వేయుము. మనముదానిసాహాయ్యంబున మిద్దెపైకిఁ బోవలసియున్న" దనెను. కాంచనసింహుఁడు వెంటనే యటులొనరించెను. అంకరికంటె ముందుగ మాయారాణి యావితంసము దోడ్పాటున నామిద్దెపైకిఁ బోయెను. అటు పిమ్మట జగపతియు నైయారులు నామిద్దెమీఁదకుఁ బోయి చేరిరి.

దానిపై నెక్కిన పిదప నామిద్దెకు నట్టనడుమ సాధారణముగ నంతర్భవన ముఖద్వారముల యందుఁ జూపట్టునట్టి ద్వార మొకటి గలదు. ఆద్వారము దారు ఫలకములవలన నిర్మింపఁబడి యుండెను. మఱియు నది యొక సామాన్యమగు బీగమువలన బంధింపఁబడి యుండెను. మాయారాణి కాంచనసింహుని దెసఁ బరికించి, "యిది యొకసామాన్యమగు బీగము దీనిని దెఱువు"మని యాజ్ఞాపించెను.

కాంచనసింహుఁడు దన సైయ్యారికపుపాలనుండి యొక యినుప శలాకను వెడలించి దానితో నాబీగమును విప్పి యాకవాటమును దెఱచెను. మాయారాణి యాసైయ్యారు లిరువురకు, "దీనిలోనికి దిగిపొండ"ని యాజ్ఞాపించెను. కాని, కాంచనసింహుఁ డామెపలుకులను నిరాకరించుచు "మొదట మీరు దీనిలోనికిఁ బొండు. పిదప మేమును వచ్చెదము. ఇచ్చటి యద్భుతవిషయములను గాంచి మేమెంతయో భీతిల్లుచుంటి" మనెను. నిరుపాయయై మాయారాణి వితంస సాహాయ్యంబున దానిలోనికిఁ దిగెను. అటుపిమ్మట జగపతియు సైయారులిరువురును దానిలోనికిఁ బోయి చేరిరి.

పైన ద్వారము తెఱువఁబడి యుండుటచే నాగదిలోనికి వెలుతురు బాగుగ వ్యాపించి యుండెను. ఆగది దాదాపిరువది మూరలు వెడదయు నంతకంటెఁ గొంత యధికముగఁ బొడవును గలిగి యుండెను. దానియందలి భూమి దారుఫలకములవలన నమర్పఁబడి యుండెను. మఱియు నా ఫలకముపై నొక విధమగు రంగు బూఁత బెట్టఁబడి యుండెను. ఆగదికి మధ్యభాగమున నొక చిన్న మందసము గలదు. మాయారాణి జగపతి చేయిపట్టుకొని యొక వైపున నిలచి యాసైయారులిరువురతో, "మీరిరువురు నా మందసమునిటకుఁ గొని తెండ"ని పలికెను.

మాయారాణి యాజ్ఞానుసార మాయిరువు రైయారు లా మందసము చెంతకుఁ బోయి దానిని పైకెత్తఁ బోయిరి. అంత నాసైయారులు నిలచియుండిన స్థానము గోళాకారముగ నొకవైపున కొఱఁగి దటాలున దానిలోనికి దిగిపోయెను. ఆయాకస్మిక ఘటనము వలన నాసైయారు లిరువురు దానినుండి జారి క్రిందఁబడిరి. తోడనే యొక విధంబగు ధ్వని వెడలివచ్చెను. ఆధ్వని నాలించుటవలన సైయారు లిరువురు నొక జలకూపమునంగుఁ బడినటుల జగపతి వెంటనే గ్రహించుకొనెను.

తదనంతర మాందారు నిర్మితంబగు భూభాగము యథాస్థానమునకు వచ్చిచేరెను. మఱియు నానందనము యథావిధి నాస్థానమందుఁ జూపట్టసాగెను.

జగపతి యాఘోరఘటనమును గాంచి భీతచేతస్కుఁడై కంపింపఁ దొడంగెను. మఱియు నాతఁడు మాయారాణి దెసఁ బరికించి "దీని క్రింద బావి గలదా?" యని ప్రశ్నించెను.

మాయారాణి:—ఔను! దీని దిగువున నొక కూపము గలదు. ఇట్టి విశ్వాసఘాతుకులను దండించుకొఱకే యిది నిర్మింపఁబడియున్నది. ఈకృతఘ్నులు నన్ను విడచి తమ ప్రాణములను గాపాడుకొనుటకుఁ దలంచుచుండిరి. ఈదుర్మార్గులిపుడు దగిన శిక్షకుఁ బాత్రులైరి.

జగపతి:—నేనింతకాలము నుండి నిన్ననుసరించి యుండినను నింతదనుక నాకీ బావిసంగతియే తెలియకుండెను.

మాయారాణి:—ఇచటి యనేక రహస్యములు నీకింకను దెలియవు. మంచిది! మన మింక వెడలి పోవుదము.

ఇవ్విధంబునఁ బలికి మాయారాణి జగపతిని వెంటఁదోడ్కొని యాగదినుండి మిద్దెపైకి వెడలివచ్చెను. మఱియు దాని ద్వారమును మూసి వైచిన పిదప వితంపము దోడ్పాటునఁ గ్రిందికి దిగి తన శయనాగారము లోనికిఁ జోయిచేరెను. మాయారాణి పరిచారిక లామె జగపతిఁ గాంచన గదాధరసింహులను వెంటఁదోడ్కొని తిలసోద్యానమునకు వెనుక తట్టున నున్న బురుజువైపునకుఁ బోవుటఁ గాంచి యుండిరి. ఇపుడామె జగపతిని మాత్రము వెంటఁదోడ్కొని వచ్చుచుండుటఁ గాంచి మిగుల నబ్బురపాటు నొందసాగిరి. కాని, యావిషయ మామెను ప్రశ్నించి తెలిసికొనుట కెవ్వరికి సామర్థ్యము గలదు?

సాయంకాలమయ్యెను. మాయారాణి తన శయ్యాగారమునకే తెంచి పర్యంకముపై మేను వాల్చెను. అనుయంబున జాల మంది పరిచారిక లామె యెదుట నుండిరి. కాని, వార లామె సన్నసెఱింగి యచటి నుండి వెలుపలకు వెడలిపోయిరి. జగపతి మాత్రమచట నిలచి యుండెను.

జగపతి:—నీవేగిరపాటువలన నాయెయ్యారులిరువుర ప్రాణములు వ్యర్థములై పోయి యున్నవి.

మాయారాణి:—అవిశ్వాసఘాతుకు లుచితంబగు శిక్షనే యనుభవించి యున్నారు. ఇందుచేతనే, మీయభిప్రాయమును వెల్లడింపుఁడని పలుమారులు ప్రశ్నించియుంటిని. వార లట్టి విధంబునఁ గృతనిశ్చయులై యుండిన కారణంబున నిరుపాయురాలనై............................"

జగపతి:—కానిమ్ము! గతమునకై యోజనయేల? ఇట్టి సందిగ్ధ సమయమందు మోహిని మన చెంత లేకుండుట శోచనీయము.

మాయారాణి:—(దీర్ఘనిశ్వాసను పరిత్యజించి) మోహిని మిగుల విశ్వాసపాత్రురాలు. ఆమెకు నాపై నెంతయో వాత్సల్యము గలదు. అకటా! ఆమెను గూడ నాకిరాతకుండగు నభయసింహుఁడు బంధించి యుండె ననియు, నామెను విడపించి తెచ్చుటకు జటాశంకరుని రహస్య కాగితములను వెంటఁదీసికొని పోవుచుంటిననియు సులోచన నాకొక లేఖను వ్రాసియున్నది. కాని, యిప్పటికిఁ జాలదినములు గడచి యుండెను. సులోచన వెడలుట వలన నెట్టి ప్రయోజనము చేకూరి యుండెనో యింతదనుకఁ దెలియదాయెను. అభయసింహుఁడా సులోచనను గూడ బంధించి యుండెనేమో యెవ్వ రెఱుంగుదురు? మోహిని వేగిరించి జటాశంకరుని చంపి యున్నది.

జగపతి:—అది యొక గొప్పప్రమాదమే! వాని వలన మనకార్యము లనేకములు సిద్ధించు నాశ గలదు.

అంత వెలుపలనుండి "లేదు, కల్ల, ఔ" నను ధ్వని వారికి వినిపించెను. మాయారాణి ద్వారమువైపునకుఁ గాంచినంతనె యామె దృష్టి సులోచనపైఁ బడెను.

మాయారాణి:—నీవిపు డిచటికే తెంచుట మిగుల మేలయ్యెను. ఇటురమ్ము. నాసమీపమునకువచ్చి కూర్చుండుము!

సులోచన:—(మాయారాణిని సమీపించి కూర్చుండి) మహారాణీ! నీ మోమిటుల వన్నె దఱిఁగి యుండఁ గతంబేమి? ఇట్టులేల యుదాసీనత జూపట్టుచుంటిరి! మీ కారోగ్య మందెట్టి కొఱంతయుఁ గలిగి యుండదుగదా?

మాయారాణి:—కొఱఁతయే కాదు. ఇపు డూపిరి సహితము వెడలిపోవుటకు సంసిద్ధముగ నున్నది.

సులోచన:—(తొట్రుపాటునొందుచు) అదియేమి?

మాయారాణి:—నీవిపుడు వచ్చి చేరితివి గదా? సకలవృత్తాంతములను వినగలవు. మొదట నీసమాచార మెఱింగింపుము. నాప్రియసఖి మోహినిని విడిపించి తెచ్చితివా? గడపలోపలఁ బాదమిడిన తోడనే "లేదు, కల్ల, ఔ" నని పలికియుంటివిగదా? నీయభిప్రాయమేమి! మోహినివలన జటాశంకరుఁడు చంపఁబడుట యసత్యమా?

సులోచన:—ఆవార్త వట్టి బూటకము. మోహిని జటాశంకరుని మట్టుపెట్టి యుండలేదు. మఱియు నామెను నభయసింహుఁడు బంధించుటయుఁ గల్ల. కాని, యామెను మృగాంకవతి చెఱఁగొని యున్నది.

మాయారాణి:—మృగాంకవతి సమాచారమును గొని తెచ్చిన యాస్త్రీ యెవ్వరు?

సులోచన:—ఆమెస్వయముగ మృగాంకవతియే! ఆమె మోహినిని బంధించి యున్నది. మఱియు నన్నుఁగూడ బంధించుటకుఁ దలంచుచున్నది. ఆమె యీకార్యమంతయు ముఖ్యముగ జటాశంకరుని కాగితములను దీసికొనుటకుఁ గావించియున్నది. నేనామె వంచనపలుకులకుఁ జిక్కి మోసపోవుటయే కాక నామెవలన బంధింపఁ బడితిని. ఇంతియె కాక నాయొద్దనుండి జటాశంకరుని కాగితములను దీసికొనియామె భస్మీపటలము గావించి యున్నది.

మాయారాణి:—చెడువార్తయే విననయ్యెను. మంచిది! జటాశంకరు డిపుడు పూర్తిగ మన హస్తగతము నుండి దాఁటిపోయెను. కానిమ్ము! అతఁడు జీవించియున్నాఁడు గదా? నీవెటుల విడిపించుకొని రాఁగలిగితివో వచియింపుము!

తదనంతరము సులోచన తన యావద్వృత్తాంతమును సాంగోపాంగముగ వివరింపసాగెను. మాయారాణియు మిగుల శ్రద్ధ నాలించుచుండెను. పిదప సులోచన మాయారాణితో “నిపుడు జటాశంకరుని నావెంటఁ దోడ్కొని వచ్చితిని. అతఁడు మనోవాక్కాయ కర్మంబుల మనకుఁ దోడ్పడుటకుఁ గృతనిశ్చయుఁడై యుండె”నని తెలిపెను.

జటాశంకరుఁ డిపుడు తమ పక్షమందుఁ జేరి యుండుటయు సులోచన దనవెంటఁ వానిని దోడ్కొని వచ్చుటయు నాలించి మాయారాణి కధిక సంతసము చేకూరెను. ఇపుడామె మానసంబున నొకనూతన యాశ యంకురించెను. మఱియు జగపతి వైపునకుఁ గాంచి“యనివార్యంబగు నీమహాయాపద నాశిరము నుండి తొలఁగిపోయెననుట కెట్టి సందియమును లే”దని పలికెను.

సులోచన:—లేలమ్మమహారాణి! ఇఁక మీవృత్తాంతము నాకెఱిం

గింపుఁడు. మీ రిటు లేల యుదాసీనత దల్లడిల్లుచుంటిరో మీ కిప్పుడుఁ గలిగి యుండిన మహాయాపద యెట్టిదో వేగమే వ్యక్తీకరింపుఁడు. నాప్రాణము లెంతేనియు వెత నొందు చున్నవి.

మాయారాణి:—కొంత సేపటికి నీకంతయు సుబోధము గాఁగలదు. మొదట నీవు వెడలి జటాశంకరుని నాసమీపమునకుఁ దోడ్కొని రమ్ము. నేను వానితో స్వయముగ సంభాషింప వలసియున్నది.

సులోచన:—తొలుత మీవృత్తాంతమును నాకు వివరింపుఁడు. నామానస మెంతేనియుఁ దల్లడిల్లుచున్నది.

మాయారాణి,యభయసింహుఁడు వచ్చి వాని వేషమునఁ దనచెంత కేతెంచుటయు, వానిని తిలస్మిస్థానమందలి మూఁడవ తరగతి తోఁటయందుఁ బంధించుటయు, నాకస్మికముగ నచటికిఁ బిశాచ మరుదెంచి మర్మపూరిత వాక్యంబుల నెల్లరను జకితులనుగ నొనరించుటయు, రాజేశ్వరి దన్ను వంచించి వెడలిపోవుటయు మున్నగు విషయము లన్నింటిని సులోచన కాద్యోపాంతముగ వివరించి తెలిపెను. కాని, పురాతనబంధితుని విషయమునను దన మైయ్యారు లిరువురను తుదముట్టించి యుండిన సమాచారమును నామెకుఁ జెప్పక దాఁచి యుంచెను. వానికి బదులుగ విజయేంద్రసింహుని మైయారు లైదువత్సరములకుఁ బూర్వము పరలోక గతుండయి యుండిన తన పతి రూపంబును దాల్చి యిట కేతెంచి యుండెననియు, వానిని బంధించి తెచ్చుటకుఁ గాంచన గదాధరసింహు లిరువురు వెడలి యుండి రనియుఁ గల్పించి చెప్పెను.

సులోచన:—ఆపిశాచము మీచెవి యందును కాంచన గదాధర సింహుల వీనులయందును నేమి వచియించి యుండెను?

మాయారాణి:— నేనెన్నివిధంబులఁ బ్రశ్నించి చూచి నను వారిరువురు దానిని వివరింప కుండిరి.

సులోచన:— పోనిండు. మీచెవియందాపిశాచ మేమి వచియించి యున్నది?

మాయారాణి:— వారముదినముల లోపల నీజుమేలియా రాజ్యము మహేంద్రసింహుని యధికారములోనికి రాఁగలదనియు, నీవు దుర్దశ చంపఁబడుదువనియు నాపిశాచము నాచెవియందుఁ జెప్పియున్నది. కానిమ్ము! ఏమి కానున్నదో పరికించెదము గదా? నీవు వెడలి వేగమె జటాశంకరు నిటకుఁ దోడ్కొని రమ్ము. వానిని గలసికొని సంభాషించు టత్యావశ్యకముగఁ దలంచుచుంటిని.

సులోచన:— వాని నిచ్చోటునకుఁ దోడ్కొని రమ్మందురా?

మాయారాణి:— ఔను. అతఁడైయారుఁడు గదా! వాని యెదుట నెట్టి మఱుఁగుబాటు నగత్యములేదు.

సులోచన యేమియో యోజించుకొనుచు నచట నుండి బయలు దేరెను. మఱియు సింహద్వారము నొద్దకుఁబోయి తానచట విడచి వచ్చిన జటాశంకరుని వెంటఁదోడ్కొని మరల నాతిలస్మోద్యానమందుఁ బ్రవేశించెను. మాయారాణి పరిజనులు దమ యేలికసానికి సులోచన యెడలఁ గలిగియుండిన మానమాన్యతల నెఱింగియుండిన వారలగుటచే, నామె దన వెంట నొక పరపురుషుని తోడ్కొని పోవుచుండుటఁ గాంచియు నెట్టి యాటంకమును బలుకక మిన్నకుండిరి. జటాశంకరుఁ డాతిలస్మోద్యాన మందలి ప్రతిష్ఠానము ను ప్రతిపస్తువును బాగుగ నవలోకించుచు వాని నిర్మాణ వైఖరికిచ్చెరువొందుచు మాయారాణి గూర్చుండి యుండిన మహాలులోనికిఁ బోయి చేరెను. అంత సులోచన మాయారాణి వైపునకు

సంకేతించి "యీమెయే మాయారాణి"యని పలికెను. "నేనీమెను బాగుగ నెఱింగియుంటి" నని పలుకుచు జటాశంకరుఁడు, మాయారాణికిఁ జేమోడ్చి నిలచెను.

స్వార్థపరాయణులు దమకార్యసిద్ధి కెదుటి వారి నెటుల గారవించు చుందురో యాతీరుననే మాయారాణియు జటాశంకరుని మిక్కిలి మర్యాదతోఁ గూర్చుండఁబెట్టెను.

మాయారాణి:—(జటాశంకరునితో) నీభార్య నీచెంతకుఁ జేరియున్నదా?

జటాశం:—చిత్తము. నేను తమ కొలువునందుఁ బ్రవేశించి పొందిన మొదటి పారితోషిక మయ్యదియే!

మాయారాణి:—సులోచన నీతోఁ బ్రీతిన చేసియుండిన వానిలో నొక్క యక్కరమేనియుఁ బొల్లువోకుండఁగ నన్నింటిని నేను బూర్తి పఱచెదను. ఇంతియేకాక. నీవలన నెఱవేఱు ప్రతి కార్యమునకు వేవేలు బహుమానములను బడయఁగలవు.

జటాశం:—నాశక్తివంచన లేకుండఁగఁ దనుప్రాణ మనంబుల మీకార్యంబుల నిర్వహించు చుందును. మృగాంకవతిని వంచించి తెచ్చి మీయధీన మొనరింతును. ఆమె నన్నెంతగ విశ్వసించు చున్నదో యంతకంటె నధికముగ పశ్చాత్తాపము నొందఁగలదు. కాని, రెండు విషయముల యందు మాత్రము మీరు దృష్టి నిలిపియుంచు టత్యావశ్యకము

మాయారాణి:—అవి యెట్టివి?

జటాశం:—మృగాంకవతికి నాపైనెట్టి సందేహమును జనింపకుండు నటుల నేనామె హితునిగ నటించు చుందును. మీగూఢచారులలో నెవ్వరేనియు నేను మృగాంకవతి పక్షమందుఁ జేరియుంటినని నిర్ధారణ మొనరించినను మీరెట్టి చింతయు

నొందరాదు.

మాయారాణి:—కాదు కాదు! ఇట్టి స్వల్పవిషయములను నీవునాకు బోధింప నవసరము లేదు. నీవా మితో( గూడియుండిన(గాని యిట్టి కార్యములు సఫలీకృతంబులు గా(జాలవని నేను బాగుగ నెరింగియుంటిని.

జటాశం:—నిక్కువము. మఱియు( దత్కారణంబున నతిగుప్త భావంబుతో మీచెంత కేతెంచు చుందును.

మాయారాణి:—మంచిది. అటులనే కానిమ్ము. ఇందు( జెఱువేమి గలదు? ఇ(క రెండవ విషయ మెట్టిది?

జటాశం:—మీరు నాయెదుట నెట్టి రహస్యమును దా(చియుంచ రాదు. కారణంబేమున, సంపూర్ణరహస్య మెఱుంగక( జేయుకార్యము చెన్నటిపోవుటయే కాక సాటివారి యెదుట( దలవంపులకు( గారణ భూతమగును.

మాయారాణి:—నీపై నాకు సంపూర్ణ విశ్వాసము గలదు. నేనెట్టి రహస్యమైనను నీకు(దెలుపక దా(చి యుంచు దానను గాను.

జటాశం:—అగుచో, మిమ్మొకటి ప్రశ్నింప వలసి యున్నది.

మాయారాణి:—నిస్సంశయముగ నడుగవచ్చును.

జటాశం:—కాశీనగరమందలి మోహిని మందిరమున( జంద్రికళ బంధింప(బడి యుండిన సమాచారము మృగాంకవతికి( దెల్ల మైయుండె నని సులోచన వలన మీరు వినియుంటిరా?

మాయారాణి:—ఔను. ఆసమాచార మంతయు నాకీ సులోచన వివరించి యున్నది.

జటాశం:—అగుచో, నిపుడా చంద్రికళ నచటినుండి తొల(గించి మఱియొక స్థానమున బంధించి యుంచుటకు( దలంచు చుందురు.

మాయారాణి:—ఔను. నాయభిప్రాయ మదియే!

జటాశం:—కాదు కాదు. అది సరియైనది కాదు. చంద్రికళ నామం దిరమందే యుండనిండు. నేనామె వక్షపాతుల కీవృత్తాంత మెరింగించెదను. ఈసమాచారము నాలించినంతనే వారలా మెను విడిపించుకొనిపోవు తలంపుతో నామందిరమునకుఁ దప్పక పోవుదురు. నేనాతరుణమును గనిపెట్టి నెవరికెట్టి శంకయు జనింపనీయక నందఱ నొక్కమాఱుగ బంధించి వైచెదను. మఱియు నేను మీపక్షమునఁ జేరియుండిన సమాచార మెవ్వరికిని తెలియకుండును.

మాయారాణి:—నీపలుకులు మిగుల యుక్తములు. మంచిది. నీయిచ్ఛానుసార మవ్విధంబుననే కావింపఁబడును.

జటాశం:—మఱియొకమాట! మీవలన బంధింపఁబడి యుండిన మహేంద్రసింహుఁడు మున్నగువారి యెడల నెటుల ప్రవర్తించి యుంటిరి?

మాయారాణి:—(ఒకదీర్ఘనిశ్వాసను బరిత్యజించి) ఆశ్చర్యము! ఆపాపాత్మురాలగు మృగాంకవతి వారి నెల్లరను చెఱనుండి విడిపించికొని పోయియున్నది. తుదకు నాయనుంగు చెల్లెలు రాజేశ్వరియు నన్ను వంచించి వెడలిపోయినది. ఆవృత్తాంత మంతయు నివుడు సవిస్తరముగ నెఱింగింపఁదలంచుచుంటిని.

తదనంతరము మాయారాణి తన వృత్తాంత మంతయు సులోచనకు వివరించి తెలిపిన విధంబున జటాశంకరునకును జెప్పి వినిపించెను. కాని, యాపురాతన బంధితుని వృత్తాంతమును నాపిశాచము దమచెవియందు వచియించియుండిన మాటలను వివరింపక దాఁచి యుంచెను. మఱియు వానికి బదులుగ సులోచనకుఁ జెప్పి యుండిన విధంబుననే వానికిని చెప్పి వినిపించెను. అతఁడి సమాచా

రము నాలించుట తోడనే జటాశంకరుఁడు గొలఁదిగ నవ్వుకొనెను. దానింగని వానికి దన వచనములపై సందేహము జనించెనని మాయారాణి గ్రహించుకొనెను.

మాయారాణి:— కాని, నేను వచియించి యుండిన సంగతులలో నొకటి యబద్ధమును బలికి యుంటిని. మఱియు నింకొకటి దాఁచి యుంచితిని.

కటాశం:—(నవ్వుచు) ఆసంగతులు నాకుఁ జెప్పరానివై యుండ వచ్చును.

మాయారాణి:—అయినను, నీయెదుట నెట్టి రహస్యమును దాఁచి యుంచనని ప్రతిన జేసి యుంటిని. కావున నీకవశ్య మెఱింగించెదను. ఇంతదనుక నీరహస్యములను సులోచనకు సహితముంజెప్పక దాఁచి యుంచితిని. నేనారహస్యములను వెల్లడించుటకుఁ బూర్వము నిన్నొక విషయమును బ్రశ్నింప వలసి యున్నది. నేనెప్పటినుండియో దానిని బ్రశ్నించి తెలిసికొనుటకుఁ దలంచు చుంటిని. కాని, ప్రసంగధోరణి మఱియొక వైపునకు వెడలుటఁగాంచి నిరుపాయ రాలనైతిని.

జటాశం:—అగుచో, నిపుడు బ్రశ్నింపుఁడు.

మాయారాణి:—నానెచ్చెలి మోహినిని మృగాంకవతి బందిగము నుండి విడివించు విషయమున నేమి యోజించుచుంటివి?

జటాశం:—మోహినిని నేనతి సులభంబుగ విడపింపఁ జాలుదును. కాని, మృగాంకవతికి నాపై నెట్టి సందేహమును గలుగ కుండు రీతి నామెను విడిపింపవలసియున్నది. ఆమె కాజాడ యేమాత్రము దెలిసి నను జాగరూకత నొంద గలదు. ఆమె యొక పెనుభూతము వంటిది. మఱియు

ధూర్తురాలు.

మాయారాణి:—నిక్కువము. కాని, మోహినిని విడిపించుటకుఁ దగు ప్రయత్నములను ముఖ్యముగఁ గావింప వలసి యున్నది.

జటాశం:—శీఘ్రముగనే యామెను విడిపించుటకుఁ దగు నేర్పాటులను గావించెదను.

మాయారాణి:—మంచిది. ఇపు డారహస్య విషయములను గూడ వివరించు చుంటిని. నేను వాని నింతదనుక దాఁచి యుంచి తిని. తుదకు నాప్రియసఖికైన నారహస్యములను దెలిపియుం డలేదు. (సులోచనవైపునకుఁగాంచి) ఇపుడు నీవు గూడ శ్రద్ధతో నాలింపుము.

మాయారాణి దన గుప్తరహస్యములను రెండు గంటల కాలము దనుక వివరించి చెప్పుచుండెను. సులోచనాజటాశంకరు లిరువురు గడుశ్రద్ధ నాలించు చుండిరి. తదనంతరము జటాశంక రుఁడు మాయారాణికిఁ దగురీతి బోధించి యామె వలనఁ బచ్చల హారమొకటి పసదనముగఁ బడసి, వీడ్కోల్పొఁబడి యచటినుండి బయలుదేరెను.

౧౧

అర్ధరాత్రిము గడచి యుండెను. నలుదెసల నిస్తబ్ధత వ్యాపించి యుండెను. వాయు సంచలనము గూడ నొక్కమాఱుగ నిల చిపోయెను. తుదకు వృక్ష పత్త్రిములు సహితము గదలకుండెను. ఆకసమందుఁ జందురుఁడు నూపట్టకుండినను నరణ్య మైదానముల యందుఁ బ్రయాణము సాగించు పాంథులకు నేఁడధిక తేజోవంత ముగఁ బ్రకాశించు చుండిన తారకముల ప్రకాశము చాలియుఁ

డెను. అట్టి యదనున గంగానదీ తీరము ననుసరించి యిరువురు బాటసారు లతివేగంబుగ జూమేలియా నగరము వైపునకు నడచి పోవు చుండిరి. ఇవు డానగర మెంతయో దూరమున లేదు. కొంత వడికి మన బాటసారు లిరువు రాజుమేలియా నగరబాహ్యప్రదేశ మునకుఁ బోయి చేరిరి.

వారిరువురు నగరము లోని కేగక వెలుపలి మైదానము నుండి దారి పట్టి యానగరమునకుఁ జేరియుండిన పురాతన నగరము వైపునకుఁ బోఁదొడంగిరి. అచట విస్తారముగ శిథిలమై నామావశిష్టముగ నున్న పెక్కుమందిరములు గలవు. వాని యందు స్వల్పభాగము లిప్పటివఱకు నిలచి హంతకులకును చోరులకును దుష్టజనాళికిని మిక్కిలి యుపకరించుచుండెను. అచ్చోటునకు దుర్బల హృదయులును భీతచిత్తులునగు పురజనులు పగటివేళనే నియుఁ బోవెఱతురు. మఱియు నచటి సంభవములను గూర్చి పలువురు పలు తెఱంగులఁ జెప్పుకొనుచుందురు. పూర్వకాలంబున నొకానొక సమయమందచట విస్తారముగ జనులు చంపఁబడియుండిరనియు నాజీవములు ప్రేతరూపములనుదాల్చి యచ్చోట నివాసముచేయుచున్నవనియు, నవి యామార్గమునఁ బోవు జనులను బీడించుచుండె ననియుఁ గొందఱును, మఱికొంద ఱాస్థానమందు * జిన్నులు నివాస మేర్పఱచుకొని యున్నవనియు, నాతావునకుఁ బోవువారిని చంపి తమజాతియందుఁ గలుపుకొనుచున్నవనియు,నిట్టివిధంబులగు పెక్కుసంగతులను గల్పించి చెప్పుకొనుచుందురు. కాని, యాదెస కేగుచుండిన మన బాటసారు లిరువురు నట్టి తుచ్ఛవిషయములను బాటించు వారలుగారు.

కొంతసేపటి కాపాంథు లిరువురు నాస్థానమునకుఁ బోయి

---

* దేవయోని విశేషము.

చేరిరి. ఆయిరువురలో నొక వ్యక్తి మిగుల దుర్బలుఁడుగను బరి
శ్రాంతుఁడుగను జూపట్టుచుండెను. వార లాపాటువడిన యింగ్ల
సమీపమున నిలచి నలుదెసలఁ బరికింప సాగిరి. వారు నిలచినస్థాన
మున కెల దక్షిణ ముష్పావుభాగము కూలియుండిన పురాతన
మందిర మొకటి వారికిఁ జూపట్టెను. దానికి నలువైపుల గుబురుగఁ
బెఱిగియుండిన యడవిమ్రానులు, ముండ్లపొదలు, నాస్థానము నొక
భయంకర దృశ్యముగఁ జేసియుంచెను. ఆమందిరపు వాకిలియం
దటునటుఁ బచారుచేయుచుండిన యొక మనుజుఁడు మనబాటసారు
లిరువు రచటి కేతెంచి నిలచుటఁగాంచి సరసర వారి సమీపము
నకు నడచిపోయి వారితో "మన యనుచరు లిచట నిలచుటుచితము
గాదని తలంచి, కాశీనగరమునకుఁ బోవు తలంపుతో నొకనావపై
నెక్కి కూర్చుండి యుండిరి. మఱియు నచటినుండియే మన కార్యా
చరణములను బ్రారంభించుటకుఁ దలంచుచుండిరి. అభయసింహుఁ
డు ముకుందసింహనరపాలుని వెంటఁదోడ్కొని వచ్చుననియు, వారి
రువురను వెంటఁదీసికొని రావలయుననియుఁ దెలిపి మృగాంకవతి
నన్నిచ్చోటున విడచిపోయిన" దని పలికెను.

మాపాఠకమహాశయు లాబాటసారు లిరువు రభయముకుంద
(మాయారాణి పురాతన బంధితుఁడు) సింహులని గ్రహించి యుం
దురు. కాని, యట్టి భయంకర స్థానమున నిలచి వారిరువురతోఁ
గలసికొనిన యాతఁ డెవ్వరో నెఱుంగుటకుఁ గొలఁదిగ నాతురము
నొందుచుందురు. కావున, మేము మాపాఠకమహాశయుల నధికకా
లము దనుక సంశయమందుఁ జిక్కఁజేయక నతఁ డభయసింహుని
మేనమఱందియు, మిత్రుండును, శిష్యుండునగు మోహనసింహుఁ
డని తెలుపుటుచితముగఁ దలంచుచుంటిమి.

మోహనసింహుని వచనముల నాలించి యభయసింహుఁడు

వానిని ముకుందసింహుని సమేతముగ వెంటఁదోడ్కొని కొంతసేప టికి మహేంద్రనరేశాజిత రణశేంద్ర దిలేరుసింహులు, మృగాంకవతీ రాజేశ్వరులతో నావయందుఁ గూర్చుండి యుండిన గంగానదీ తీర మునకుఁ బోయిచేరెను. ఆనావ యంత చిన్నదిగాదు. మఱియు నది మిగుల తేలికగలదియై మిక్కిలి చుఱుకుగ నడచునది. దానిపై నావికుఁడొక్కఁడేనియుఁ జూపట్టకుండుటచే నానావను వార లద్దెకుఁ దీసికొని నటులను సైయ్యారులే దానిని నడిపించుకొని పోవుటకు సంసిద్ధముగ నుండినటులఁ దోఁచుచున్నది. అభయముకుందసింహులను గాంచి నంతనే యధిక ప్రమోదభరితమానసులగుచు నానావలోనివారెల్లరు లేచి నిలచిరి. కుమారమహేంద్రసింహుఁడు ముకుందసింహనరపాలుని యధిక సన్మానపూర్వకంబుగఁ దనసమీపమునఁ గూర్చుండఁబెట్టుకొని నావను విడువుఁ డని తనసైయ్యారుల కాజ్ఞాపించెను. మాటలాడు నంతలో నాతరణి తీరమును విడచి యాగంగానదీతరంగ మాలికలయం దుయ్యెలలూఁగుచుఁ జూపట్టసాగెను.

మహేంద్ర:—భూపాలాగ్రణీ! మీరిపుడు చెంతఁ గూర్చుండి యుండుటఁ గాంచి నాకమితానందము గలుగుచున్నది. దయామయుండగు నప్పుండరీకాక్షుఁడు మీప్రాణములను గాపాడినందుల కామహామహుని కనేక ధన్యవాదములను గావించుచుంటిని.

ముకుంద:—సోదరా! నాకాచెఱనుండి విముక్తి లాభము గలుగు నను నాశయే లేకుండెను. కాని, మీకారణంబున మృగాంకవతి యా తిలస్మోద్యానము లోని కేగుటయు, నామికెటులనో యాకస్మికముగ నాచెఱవృత్తాంతము దెలియుటయు సంభవించినది. అది మీచరణ ప్రభావము.

మృగాంక:—మిమ్ములను వెంటఁదోడ్కొని యరుణోదయముగాక

ము న్నె యభయసింహులఁ డిచటికి వచ్చి చేరఁగలఁడని యాసించి యుంటిమి. కాని, రెండుదినము లింకను గడువ ప్టైను. మీమిాదివద్వయ మెంతయో ప్రయాసముతో నిచట గడపితిమి. ఇటులేల తడవయ్యెనను విచారము మాకగ్గల ముగాఁ దొడంగెను. ఇవుడా విలంబ కారణంబును ముందుగ వివరించి మా సంశయమును నివారింపుఁడు!

ముకుంద:—అభయసింహుఁడు నన్ను బంధ విముక్తునిగ నొనరించిన పిదప మేమిరువురము దిలప్మోద్యానము వెలుపలకుఁ బోయి చేరితిమి. అవు డభయసింహుఁడు కటకటఁబడుచు నాతో "అకటా! మీాతో నొక సమాచారముం జెప్ప మఱచితిని. ఈదురాత్మురాలు మాయారాణి విజయేంద్రసింహమహీపాలుని వశ్మినమేకముగ నీతిలప్మోద్యానముం దెచటనో బంధించి యుంచెనఁట. మాకాజాడ యిసుమంతేనియు దెలియకున్న" దని పలికెను. నేనాసమాచారము నాలించుటతోడనే వానిని వెంటఁదోడ్కొని మరల నాతిలప్మోద్యానమందుఁ బ్రవేశించితిని. మఱియు నాకుఁ దెలిసి యుండిన రహస్యస్థానములన్నియు గాలించి వెచితిని. కారణంబేమన, చెఱనుండి విముక్తిఁబడసినతోడనే నేను మిగుల స్వాతంత్ర్యుఁడను నిర్భయుఁడను నైతిని.

మహేంద్ర:—మంచి కార్యమును గావించితిరి. పిదప నేమిజరిగెను? మాతలిదండ్రుల జాడ యెందేనియుఁ బొడకట్టియుండెనా?

ముకుంద:—లేదు. అదియొక కల్లవార్త. ఆదురాత్మురాలు మాయారాణి మిమ్ము వంచించుటకు గావించిన వన్నుగడలలో నదియొకటి! తన పరిజనులలో నిరువురకుఁ గరుణాదేవి విజయేంద్రసింహుల రూపములను దాల్పించి వారిని చెఱయందు బంధించి యున్నది.

మృగాంక:—అది మీ రెట్లుల గ్రహించఁ గలిగితిరి?

ముకుంద:—నేను స్వయముగ వారిని పరీక్షించి యుంటిని.

మహేంద్ర:—ఈశుభసంవాదము నాలించుటచే మాకు మితిలేని యానంద మలవడు చున్నది. ఇపుడు మాప్రాణములు కుదుటఁ బడినవి. నిశ్చింతులమైతిమి. ఇఁకఁ జంద్రకళామదాలసల చింతమాత్రము మమ్ము వేధించుచున్నది.

అభయ:—నిక్కవము. మన మావిషయమున నిశ్చింతులమైతిమి. (ముకుందసింహమహీపాలుని వైపునకు సంకేతించి) నేను వీరివెంట రెండుదినము లాస్థానమందు నిలచి రహస్యస్థానముల యందుఁ గ్రమ్మరుచు నచటియద్భుత పదార్థములను దిలకించుట వలన నాబుద్ధి చకితమయి యున్నది. నేను విజయేంద్రసింహ మహీపాలుని వెంట విక్రమతిలస్మమందు సంచరించుచు ననేక యద్భుతవిషయములను గాంచి యుంటిని. కాని, యీతిలస్మము ముందది యెంతకుఁ గొఱగాదని వచియింపవలసి వచ్చుచున్నది.

మృగాంక:—(ముకుందసింహుని వైపునకు సంకేతించి) వీరాతిలస్మమున కధీశ్వరులు. దాని రహస్యములు వీరికంటె నధికముగఁ దదితరుల కేల తెలియఁ గలవు! పరులకంటఁ బడకుండగ రెండు దినము లాతిలస్మోద్యానమందు సంచరించు సామర్థ్య మెవరికి గలదు? ఆతిలస్మరహస్యములను వీరెఱింగిన దానిలోఁ బదునాఱవ భాగమైనను మాయారాణికిఁ దెలిసియుండదు. వీరు మిగుల ధర్మ చింతనపరులు. దయార్ద్రహృదయులు. ఈమహాభాగుఁ డెట్లు లామాయులమారి వంచనకుఁ జిక్కువడిరో తెలియకున్నది.

నరేశ:—ఈభూరమణుని చారిత్రము మిగుల మనోరంజకముగ నుండుననుట నిక్కవము.

ముకుంద:-నాయపూర్వకథను మీకు వివరించి తెలిపెదను. దానిని
విన్నట వలన మీరధికాశ్చర్యచకితులు గాక మానరు.
(రాజేశ్వరివైపునకుఁగాంచి) నీకు కుశలంబేకదా?
రాజేశ్వరి:—(గద్గదిక స్వరంబుతో) భావుకా! ఇపుడు మిమ్ము సం
దర్శించుట వలన నాకుఁ గలిగిన యానందమునకు మేర
లేకున్నది. నాజీవితమందు మిమ్ము మరల సందర్శింతునను
నాశ లేశమైనను నాకు లేదు. నాయక్కయగు మృగాంకవతి
కారణంబున నేఁడిట్టి సుదినమును గాంచఁగల్గితిని.
ముకుంద:—నిక్కవము. నేనీనైదువత్సరములనుండి యెట్టి వెతల
కుఁ బాల్పడి యుంటినో దానిని వచియింపఁ జాలను.
(మృగాంకవతివైపునకుఁగాంచి) నీకాతిలస్మములోని కేగు
సాహస మెవ్విధంబునఁ గలిగెను?
మృగాంక:—రిక్తగంధము నాచేఁ జిక్కియున్నది. దాని తోడ్పా
టున నేనింత సేయఁగలిగితిని.
ముకుంద:-అగుచో, నా తిలస్మవృత్తాంతములను నాకంటె నీవుగొంత
విశేషముగ నెఱింగియుంటి వనుట కట్టి సందియమునులేదు.
మహేంద్ర:—(తుళ్ళిపడిమృగాంకవతివైపునకుఁగాంచి) ఏమి! రిక్త
గంధము నీచేఁ జిక్కి యుండెనా?
మృగాంక:-(నవ్వుచు) ఔను. కాని, నేను దానిని మీమహాలునుండి
ముచ్చిలించి తెచ్చితి నని మాత్రము భావింపకుఁడు.
అభయ:—కాదుకాదు. ఆరిక్తగంధమును దొంగిలించిన వారు
వేఱొకరనియు, మీకా పుస్తకము జైమినీప్రసాదువలన
లభించియుండెననియు నేను బాగుగ నెఱింగియుంటిని.
మృగాంక:—ఔను. ఆనాఁడు తిలస్మోద్యానమందలి మూఁడవభా
గవుతోఁటయందు జైమినీప్రసాదు దన చారిత్రమును

మీతో వక్కాణించు సమయంబున నేనొక మఱుఁగు తావుననుండి యంతయు నాలించి యుంటిని.

మహేంద్ర:—జైమినీప్రసాదు వృత్తాంత మెట్టిది?

అభయ:-నేను దానిని వివరించి తెలిపెదను. కొంతసేపు తాళుఁడు.

ఇపు డానావయందుఁ గల వారెల్లరు సంతోషపారవశ్యులయి యుండిరి. కాని, మహేంద్ర నరేశసింహులకు మాత్రము చంద్రకళా మదాలసల చింత వృద్ధి నొందియుండుటచే వారి కట్టి యానందము సంపూర్ణముగ లభింపకుండెను. అభయసింహుఁడు దాను మాయారాణి మైయూరులలో నొకనిని వంచించి వాని రూపములను దాల్చుకొని పిచ్చివానివిధంబున నటించుటయు, దిలస్కోద్యానమందు జైమినీప్రసాదు వలన వినియుండిన కథనంతయు మేము పైన లిఖించియుండిన తెఱంగున వారికి విశదీకరించి తెలిపెను. అభయసింహుఁ డున్మాదుఁడై కావించి యుండిన చేష్టితములన్నింటిని నాలించి యెల్లరు గడుపులు పగులు నటుల నవ్వ దొడంగిరి. కుమారమహేంద్ర నరేశసింహు లిరువురు జైమినీప్రసాదు యొక్క తక్కిన వృత్తాంతము గూడ నాలింపఁ గుతూహలాయత్త చిత్తులగుచు వివరింపు మని మృగాంకవతి నడిగిరి. దానికిఁ బ్రత్యుత్తరముగ నామె వారితో జైమినీప్రసాదు వృత్తాంత మింకను గొంతవఱకు నాకుఁ దెలిసియున్నది. కాని, నేనిపుడు వచియింపఁ దలంచుటలేదు. కారణంబేమన, వానివృత్తాంతము వాని నోట వినుటవలన మీకమితానందము చేకూరఁగలదు. మఱియు వానికథ నాలించ కుండుటచే మనకార్యములం దిపు డెట్టి యాటంకమును గలుగదు. నావృత్తాంత మొకించుక మీకిపుడు వివరింపఁదలంచుచుంటిని. కావున నాలింపుఁడు.

మృగాంకవతి మొదట మోహినీసులోచనా జటాశంకరుల

వృత్తాంతములను మేముపైన లిఖించియుండిన విధంబున వారికి వివ
రించి తెలిపి, తదుపరి దన వృత్తాంతమును జెప్పనారంభించెను.
ఎపుడామె మోహినీమందిరమందలి యద్భుత విషయములను వర్ణిం
చుటకు నారంభించెనో యపు డెల్లరు నధికాశ్చర్యనిమగ్నమానసు
లయి చిత్రప్రతిమలవలెఁ జేష్టలుడిగి యాలించుచుండిరి. చంద్రకళ
యొక్క దురంతావస్థ నాలించి కుమారమహేంద్రసింహుఁడు
గన్నులనీరు నింపసాగెను. వానిహృదయమందు సహస్ర వృశ్చికము
లొక్కమాఱుగ దంశన మొనరించినటుల ఘోరవేదనగలుగఁ
దొడంగెను. కాని, పితృవ్యునివలె భావించుచుండిన యభయసింహు
నియందలి గౌరవచింతచేఁ దన్నుదా సంభాళించుకొని మిన్నకుండె
ను. వాని విపరీతావస్థను దిలకించి ముకుందసింహనరపాలుఁడు వాని
తో "చింతనొందఁబనిలేదు. నేనా మోహిని మందిరమందలి సమస్త
రహస్యముల నెఱింగి యుంటిని. శీఘ్రకాలములో నాచంద్రకళను
బంధవిముక్తురాలనుగ నొనరింతు"నని పలికి వానికూరటఁగూర్చెను.

రాజేశ్వరి:—మదాలసయు నామందిరములోనికిఁ బుత్తెంపఁబడి
యున్నది.

ముకుంద:—మఱియు మేలయ్యె! ఏకక్రియాద్వ్యర్థకరీ యను వచ
నము సార్థక మొందఁగలదు.

మహేంద్ర:—(మృగాంకవతితో) నాకారిక్తగంథ మెపుడు చేఁజి
క్కఁగలదు?

మృగాంక:—ఆదినాయొద్దఁగలదు. దానిసాహాయ్యంబుననే మిమ్మా
తిలస్మమునుండి వెడలింపఁ గలిగితిని. మఱియు నయ్యదియే
కొన్ని తిలస్మములను ఖండించుటయందు మీకుఁదోడ్పడఁ
గలదు. ఆపుస్తకమును మీకొసంగెదను.

ముకుంద:—(నలుదెసలఁబరికించి మృగాంకవతితో) ఆహా! మాట

లసందడి మనము చాలదూరము వఱకు వెడలివచ్చితిమి. ఇపుడు మీయభిప్రాయ మేమి? కాశీనగరమున కేగ దలంచుచుంటిరా?

మృగాంక:—ఔను! కాశీనగరమం దొక రహస్యస్థానమున నివసించుచు మన కార్యములను జక్కపఱచుకొనుటకుఁ దలంచుచుంటిని.

ముకుంద:—కాని, నాయభిప్రాయ మది గాదు.

మృగాంక:—వచియింపుఁడు. మీరు నాకంటె మంచి యాలోచనను దెలుపఁ గల రని నావిశ్వాసము.

ముకుంద:—నేనిజుమేలియా రాజ్యమున కధీశ్వరుఁడనై యుండినను, మరల నారాజ్యమును స్వాధీనము చేసికొను నంతటి సామర్థ్యము నాకు గలిగి యుండినను, నేను మృతినొంది యుంటి నను బూటకపు సమాచారము ప్రజల యందు బాగుగ వ్యాపించి యున్నది. కావున, వెంటనే నన్ను వెల్లడించుకొనుటకు నేను తలంచుట లేదు. ఇదియుఁ గాక యానురాత్మురాలు మాయారాణి నొక్కమాఱుగ వధించుటకును గోరను. కారణం బేమన, నాపాపాత్మురాలిని తుదముట్టించినచో నారక్కసి గావించి యుండిన దురంత దుష్కృత్యముల కనురూప ప్రతిదండనఫలము నాకన్నుల యెదుటభోగించు వారెవరు? తత్కారణంబున నాకలుష మతిని గొన్నిదినముల దనుక ఘోరశిక్షకుఁ బాల్పడఁ జేయఁ దలంచుచుంటిని.

మృగాంక:—మీచిత్తము.

ముకుంద:—కుమార మహేంద్రసింహాుడు దన మైదూరులలో నొకనిని నాకొసంగు టకుఁ బ్రార్థించుచుంటిని. నేను వానిని

నా వెంటఁ దోడ్కొని కాశీనగరమున కేగి మోహినీ మంది
రమున బంధింపఁబడి చిలుఁగులఁ బొకులు చుండిన చంద్ర
కళా మదాలసలను విడిపించి తెచ్చెదను. అంతవనుక నీవు
రాజేశ్వరిని రాకుమారు లిరువురను వెంటఁ దోడ్కొని
మాయారాణి తిలస్మోద్యానమందలి నాల్గవతరగతి తోఁట
యందుఁ గల దేవమందిరమున నివసింపుచుండుము. అచట
భోజనభాజనాదికముల కెట్టి చింతయుఁ గలుగదు. దాని
యందు మధురరసప్రపూరిత ఫలవృక్షములు పెక్కు గలవు.
మఱియు స్ఫటికమును గేలిసేయు నిర్మల వారిపూరితంబగు
స్రవంతియు నొకటి దాని యందుఁ బ్రవహించుచుండెను.
మాయారాణి కాస్థాన వృత్తాంతమును నచటి కేగు మార్గ
మును దెలియదు. కావున, మీ రాస్థానమున నుండిన సమా
చార మామెఱుఁ దెలియఁజాలదు. ఆస్థానమందు నివసించుచు
రాకుమారు లిరువురు దుదముట్ట నారిక్తగంథమును
బాగుగఁ జదివి గ్రహింపవలెను. దానియందు గ్రాహ్యము
నకురాని విషయములను విమర్శనా పూర్వకముగ నీవు
వారి కెఱింగించుచుండవలెను. కొలఁదిరోజులలో నచట
ననేక యద్భుతవిషయములు మీ దృష్టి గతమునకు జిక్కఁ
గలవు. మఱియు నా హేతువుచే నీ రాకుమారు లిరువురు నతి
శీఘ్రముగఁ దిలస్మఖండనమందుఁ బ్రవృత్తులగు ప్రసంగము
దానంతటనయే కలుగ గలదు. మా పూర్వులు లిఖించి
యుండిన పుస్తకమును జదువుట వలన నీతిలస్మమున కా
యువు దీరియుండెననియు, నీ రాకుమారు లిరువురే దానిని
ఖండించుట కధికారు లనియుఁ బొడగట్టుచున్నది.

మృగాంక:—తథ్యము! తథ్యము!!

ముకుం:—సోత్రియు నొక దైమూరుని రోహిణీగడమునకుఁ బుత్తెంచి రాకుమారుల కుశలవృత్తాంతము విజయేంద్రసింహమహీపాలున కెఱింగింప వలెను. ఇంతియగాక కొంత సైన్యమును వెంటఁదోడ్కొని వచ్చి జూమేలియా నగరమును ముట్టడించి యుద్ధము నారంభింప వలె ననియు మనము తిరిగి రెండవ యాజ్ఞ నిచ్చుదనుక బవరముయొక్క ఫలాఫలితములు శీఘ్రముగఁ దేలునటులఁ బోరాడ రాదనియుఁ దెలుపవలెను. నేను చంద్రకళాసుదాలసలను విడిపించి తెచ్చిన పిదప నుచితమగురీతి నొనరింపఁ దగును. మీరలు దేవమందిరమందు నివసించుచుఁ దరుణము చేఁజిక్కిన మీకనువగు కార్యాచరణముల వలన నామాయారాణి బుద్ధి చకిత మొనరించు చుండుఁడు.

మృగాంక:—మీపలుకులెంతేనియు యుక్తిసంగతములు. కాని, మీరు చిరకాలము నుండి కారాగృహ క్లేశముల ననుభవించి యుండుటచే మిగులఁ బరిశ్రాంతులును దుర్బలులునై యుంటిరి. మీరిప్పుడే కార్యక్షేత్రమం దడుగిడి శత్రులకెట్లు లోర్వఁగలరు?

ముకుంద:—నీవీవిషయమున నెట్టి చింతయు నొంద నగత్యము లేదు. (మహేంద్రనరేశసింహుల వైపునకుగాంచి) మీయభిప్రాయమేమి?

మహేంద్రనరేశ:—మీ వాక్యములు మిగుల మహోత్తరమైనవి. సందియము లేదు.

మృగాంక:—అగుచో, నేనెద్దాని యపూర్వ మహిమావిశేషములను వర్ణించి తెలిపి యుంటినో, యాతిలస్మికైజారును మీకొసంగుచుంటిని. అది మీకెంతేనియుఁ దోడ్పడఁ గలదు.

ముకుంద:—ఔను. ఇట్టి కుటిలసమయమం దట్టి యాదృచ్ఛికమహిమోపేతమగు తిలస్మకైదువు నాయొద్ద నుంచుకొనఁదగి యుండినను, నది నీయొద్ద నుండునంతకాలము నీకెట్టి హాని యుఁ గలుగఁజాలదు. కావున, దానిని నీయొద్దనుండి తీసికొనుటకు నేను సమ్మతింపను.

మహేంద్ర:—భాగవతా! ఇట్టి విధంబగు వేఱొక కైజారు పృగాంకవతి నాకొసంగియున్నది. నేను దానిని మీకొసంగు చుంటిని. కావున నెట్టి యాటంకము పలుకక నద్దానిని మీయొద్ద నుంచుకొనుఁడు.

ముకుంద:—కాదు కాదు. దాని యగత్యము నాకేమియు లేదు.

మహేంద్ర:—మీరు నావచనమును ద్రోసివేయరాదు.

ఇవ్విధంబున బలికి కుమారమహేంద్రసింహుఁడా కైజారును, దాని జంటయుంగరమును వెడలించి బలత్కారపూర్వకముగ ముకుందసింహుని యధీన మొనరించెను.

ముకుంద:—నావెంట నేమె యూరుని పుత్తెంపఁ దలంచు చుంటిని.

మహేంద్ర:-మీయిష్టము గలిగిన వానిని వెంటఁదోడ్కొనిపొండు మాపినతండ్రి యభయసింహుని మాత్రము మాచెంత నిలుపుకొనుటకుఁ దలంచుచుంటిని. కారణంబేమన, వాని వలన మిమ్మాచెఱనుండి విడిపించు సమయమునఁ దొడరి యుండిన సంభవముల నాలింప వలసి యున్నది.

ముకుంద:—(నవ్వుచు) ఆసమాచారములు ముఖ్యముగ వినఁదగి యున్నవి.

మోహన:—నేను మీవెంట నేతెంతును.

ముకుంద:—మంచిది.

మహేంద్ర:—రజితేంద్రసింహుని రోహిణీగడమునకుఁ బుత్తెంచు చుంటిని.

ముకుంద:—మంచిది. అభయసింహునినే కాక యజిత దిలేరుసింహునిగూడ మీరొద్ద నిలుపుకొనరాదు.

మహేంద్ర:—కాదు కాదు. ఆయిరువురకు మానివాసస్థానమును జూపి పిదప విడిచి పెట్టెదము. వారలు నలువైపుల సంచరించుచు సమాచారములను సంగ్రహించు చుందురు.

అభయ:—నేను కూడ వ్యర్థముగఁ గూర్చుండఁ జాలను.

ముకుంద:—నాయభిప్రాయము నయ్యదియే! (మృగాంకవతి వైపునకుఁ బరికించి) నాల్గవ తరగతి తోఁట యందలి దేవమందిరమునకుఁ బోవుమార్గము నీవు బాగుగ నెఱింగియుంటివా?

మృగాంక:—రిక్తగంధము వలన నే నచటికిఁబోవు మార్గ మెఱింగియుంటిని.

అంత నానావ తీరమునకుఁ జేరుటచే నెల్లరు దాని నుండి క్రిందకు దిగిరి.

## ౧౨

ముకుందసింహమహీపాల మోహనసింహు లిరువురను కాశీనగరము వైపునకును రజతేంద్రసింహుని రోహిణీగడము దెసకును వీడ్కొల్పి మృగాంకవతి తన యనుచరుల సమేతముగ మాయారాణి తిలస్మోద్యానము వైపునకు దారిపట్టెను. ఆసమయమునఁ దెలతెలవాఱుచుండెను. ప్రభాత కాలీన మలయానిలము నద్యోవికసిత కుంద కుట్మముల నుండి యన్నింటికంటె ముందుగఁ దనవంతు సుగంధమును సేకరించి మంద మంద గతిని వీచుచుండెను. మన నిరుపమాన పరాక్రమశాలు రగు రాకుమారు లిరువురును నైయారులు నేడెసకుఁ బోవుచుండిరో, యాచటికి మాయారాణీ తిలస్మోద్యానము చాల దవ్వున నుండినను దేనియందుఁ

దొలుత జైమినీప్రసాదు సాధుపుంగవుని మాయారాణి తిలస్మో
ద్యత్ముఁ(డు) గాంచి యుండెనో, యావిలాస మందిరము మిగుల
సామీప్యమునఁ గలదు. మఱియు దానియాకార మచ్చటికి గొలఁ
దిగఁ జూపట్టుచుండెను.

మాపాఠకమహాశయు లామందిర వృత్తాంతమును మఱచి
యుండరు. ఒకవేళ విస్మృతిఁజెంది యుండినను మేమిపుడు వారికి
జ్ఞప్తి గలిగించు చుంటిమి. జైమినీప్రసాదు రమాసుందరి యందలి
వలపు పెంపున నామె పోఁబడి నరయుచుఁ బ్రవాహతీరమునుబట్టి
పోయి నామందిరమును జేరియుండెను. మఱియు వివశుఁడై యచట
నుండియే మాయారాణి దర్బారులోనికిఁ గొనిపోఁబడి యుండెను.

మహేంద్ర:—(మృగాంకవతితో) సూర్యోదయము గాక మున్నె
మన ప్రయాణమును సమాప్తినొందింపవలెను. మన
మొరుల రాజ్యమందు యథేచ్ఛగ సంచరించుట సముచి
తము గాదు.

మృగాంక:—నిక్కవము. కాని, మన మధికదూర మేగనలసినది
లేదు. (చేతితోఁజూపుచు) అదిగో! మనకుఁ జూపట్టుచుండిన
మందిరము సమీపమునకే పోవలసి యున్నది.

రాజేశ్వరి:—అది తిలస్మోద్యానము విశ్రామమందిరము గదా?

మృగాంక:—అదురితాత్ముఁడు బంధింపఁబడిన నాఁటినుండియు
నామందిరము వ్యర్థముగ నుండుచున్నది.

రాజేశ్వరి:—ఔను. దానియం దిపు డెవ్వరును నివసించుట లేదు
అచటనుండి యొకసురంగమార్గము మాయారాణి తిలస్మో
ద్యానము లోనికిఁ గలదు. కాని, ఆగమాస్యమద్యత్మునకుఁ
దక్క తదితరు లెవ్వరికిఁ దెలియదు. మఱియు నేఁటి దనుక
దాని రహస్య మతఁ డెవ్వరికిని చెప్పియుండలేదు.

మృగాంక:—నిక్కువము. కాని, నాకాసురంగములో నెట్టి ప్రయో
జనమును లేదు. ఆప్రవాహమున కావలియొడ్డున నామందిర
సమీపమున నొక మఱ్ఱిదిబ్బగలదు. నేనచటి కేగుటకుఁ
దలంచుచుంటిని. మఱియు మన మచ్చోటుననే పగటివేళ
యంతయుఁ గడప వలసి యున్నది.

రాజేశ్వరి:—మాయారాణి యనుచరులలో నెవ్వరేనియు నచటఁ
జూపట్టిన మనకుఁ గొంత హాని గలుగఁ గలదు.

మృగాంక:—ఒక్కఁడుగాదు. పదునైదుగురు రేతెంచినను నెట్టి
భీతియుఁ గలుగదు.

కొంతసేపటి కాసమాజము దాదాపు తిలస్మాధ్యక్షుని
విశ్రామ మందిర సమీపమునకుఁ బోయి చేరెను. మృగాంకవతి
యామందిరము ప్రక్కనుండియే ప్రవాహమును దాఁటి యాదిబ్బ
వైపున కేగఁ దలంచుచుండెను. కాని, యామందిర మందలి
వసారాయం దొక దీర్ఘకాయుఁడగు పురుషుఁ డటునిటు బచారుసే
యుచుండుటఁ గనుఁగొని యామె యచట నిలచి యావైపునకు
గాఢదృష్టి నిగుడింపసాగెను. మృగాంకవతి యటుల నిలచి పోవుట
నుగాంచి రాకుమారులును సైయారులుగూడ నచట నిలచి పో
యిరి. మఱియు నంద ఱాపురుషునివైపునకు జూడఁదొడంగిరి.
అపుడు తెల్లవాఱి యుండినను నొకటి రెండు వందల గజముల
దూరమున నుండిన మనుజుని పోల్చుటకుఁ దగిన ప్రకాశము
మాత్రము గలిగియుండెను.

ఆదీర్ఘకాయుఁడు కుమారమహేంద్రసింహుని సమాజమును
గాంచినంతనే యతిరయంబున వారి దెసకు నడచి పోయెను.
అతఁడు గొంత సమీపించిన పిదప మృగాంకవతి వానిని గుర్తించి
"యితఁడు జటాశంకరుఁ"డని తన యనుచరులతో ననెను.

జటాశంకరుని నాను మూలించి నంతనే దిలేగుసింహుండు వడవడ వడంకసాగెను. కాని, వెంటనే తన హృదయమును గట్టిపఱచుకొని మిన్నక నిలచి యుండెను.

మృగాంక:—(జటాశంకరునితో) అహా! నీపై గాఢ విశ్వాసమునిచి నీ కే కార్యమైనను వప్పగించిన, నది శీఘ్రకాలములోనే నెఱవేఱఁగలదు.

జటాశం:—(కరమునులను జోడించి) క్షమింపుఁడు. నావలన నొక గొప్ప యపరాధము దొడరి యున్నది. తత్కారణంబున మీయాజ్ఞాను సరిణి కాశీనగరంబున మిమ్ముఁ గలసి కొనఁ జాలనైతిని.

మృగాంక:—ఆయపరాధ మెట్టిది?

జటాశం:—మీయాజ్ఞనుసారము సులోచనను దీసికొని మీసరో వరమందిరము వైపునకు బయలుదేరితిని. మఱియు నొక దినమంతయు నెచటను విశ్రమింపక సరాసరిగ బ్రయాణ మును సాగించితిని. మఱుచటి దినమున నేను మిక్కిలి బడలియుండుటచే కొంత తడవు విశ్రమించు తలంపుతో నొక పర్వతము క్రిందకుఁ బోయి యచటి సఘనవృక్షముల ఛాయ సులోచనను బంధించి యుంచిన మూటను దించి భూమిపైఁ బరుంటిని. కన్నులు మూసి నంతనే పాడునిద్ర నన్నావహించుటచే మైమఱచి నిద్రించితిని. నాకు మెలఁకువ గలిగి కాంచు నంత నాచెంత సులోచనను బంధించియుం డినమూట లేకుండుట గాంచి భయసంభ్రమాకుల చిత్తుఁ డనై నలుదెసల వెదకి వేసారితిని. కాని, యామె జాడ యెచటను జూపట్ట దయ్యెను.

మృగాంక:—ఆశ్చర్యము!

జటాశం:-కొన్ని దినములవఱకు నేనామెకై పలుతావుల వెదకిచూచి తిని. తుదకు నిరాశాచిత్తుఁడనై నావేషమును మార్చుకొని కాశీనగరమునకుఁ బోయితిని. అచట సులోచన తనమందిరమందుండిన సమాచారము నాకుఁ దెల్లమయ్యెను. తదనంతరము నేను జుమేలియాకు మగుడివచ్చి గుప్తరీతి మాయారాణి తిలసోద్యాన మందు నలువైపుల గ్రుమ్మఱ సాగితిని. అచట మాయారాణివలన బంధింపఁబడియుండిన రాకుమారు లిరువుర నైయారుల సమేతముగ నెవ్వరో విడిపించికొని పోయి యుండిరనువార్త నాలించి యాకార్యాచరణము మీదిగఁ దలంచి మీకైవెదక నారంభించితిని. మఱియు నేఁడాకస్మికముగ నీవైపునకు వెడలి వచ్చితిని.

మృగాంక:—(కొంచము యోజించి) నేనెంతయో ప్రజ్ఞావంతుఁడ ననియు, నైయారశేఖరుఁడ ననియుఁ బలుకుచుందువు గదా! అది యంతయు మిథ్యాభిమానము. మంచిది. మా వెంట విచ్చేయుము.

జటాశంకరుని కూడ వెంటఁ దోడ్కొని తన యనుచరుల సమేత మచట నుండి బయలుదేరెను. మఱియు నాప్రవాహమును దాఁటి తాను పోదలంచిన దిబ్బ సమీపమునకుఁ బోయి నిలచెను. మృగాంకవతి తనవెంట నేతెంచుటకుఁ దనయనుచరులకుఁ దెలిపి యాదిబ్బపై నెక్క నారంభించెను. అంత దిలేరుసింహుఁ డామె మార్గమున కడ్డుగ నిలచి "యెట్టి యడ్డంకియు లేకుండిన మొదట నామాట యొకటి యాలింపుఁ" డని పలికెను.

మృగాంక:—నీవు చెప్పదలంచిన విషయమును నేను గ్రహించితిని నీవెట్టి చింతయు నొందవలదు. నిశ్చింత నావెంట నడువుము.

దిలేరు:—నిక్కమము. కాని, నామనోగత విషయములను మీచె
        వుల వైచినగాని, నాకు సంతృప్తి గలుగఁ జాలదు.

మృగాంక:—(నవ్వుచు) మంచిది. వచియింపుము.

అని పలికి రాకుమారు లిరువుర తోడను, రాజేశ్వరీజటా శంకరాభయాజితసింహులతోడను, నెమ్మదినెమ్మదిగా నీపబ్బపై నెక్కి పోవుచుండుఁడని తెలిపి, తాను దిలేరుసింహుని వెంటఁ దోడ్కొని యాదిబ్బ వెనుక వైపునకుఁ బోయి నిలచెను. దిలేరుసింహుఁ డాయేకాంత స్థానమున దన మనోగతవృత్తాంతమును మృగాంకవతితోఁ జెప్ప నారంభించెను.

దిలేరు:—మీరు జటాశంకరు నెంత విశ్వాసపాత్రునిగను సత్పురుషునిగను దలంచు చుండినను, నతఁడు కృతఘ్నుఁడనియుఁ గాపురుషుఁడనియు, వానిపై విశ్వాసముంచుట మిగులఁ బ్రమాదకర మనియు నుడువక తీరదు.

మృగాంక:—నీవీవిషయమునే తెలుపఁ దలంచు చుంటి వని నేను తొలుతనే గ్రహించి యుంటిని. జటాశంకరుఁ డొనరించి యుండిన కార్యములవలన వాని విశ్వాసఘాతుకత్వమును దుష్ప్రవర్తనమును వానియై యూరితనముంను గళంకము నాపాదించుచున్న దనుట కెట్టి సందియమును లేదు. కాని, నీవెంతమాత్రమును సంభ్రమము నొందఁ బనిలేదు. నేనిట్టి ఘోరవిశ్వాసఘాతుకులవలననే నా కార్యములను సిద్ధింపఁ జేసికొనఁగలను. నన్నతఁ డించుకేనియు వంచింపఁ దలంచిన వానిని నిర్మూలింపక విడువను.

దిలేరు:—మీరు వాని సంపూర్ణ వృత్తాంత మెఱుంగకుండుటచే నిటుల వచియించుచుంటిరి.

మృగాంక:—కాదుకాదు. జటాశంకరుఁడు నీకు సహాయకుఁడైనను

వాని వృత్తాంతము నీకంటె నేనధికముగ నెఱింగియుంటిని. ఇప్పుడు నీకుఁ గలిగి యుండిన భీతియు నేనెఱుంగనిది గాదు. జటాశంకరుఁడు నీసోదరుఁడని రాకుమారులకుఁ దెల్లము గుచో, వారికి నీయెడల గలిగియుండిన దయాదృష్టియందుఁ గొంతపొరపు గలుగఁ గలదనియు, జటాశంకరుఁ డేయను చితకార్యమేనియుఁ గావించి యుండినటుల స్థిరపడుచో వ్యర్థముగ నాయపఖ్యాతి నీశిరమునుఁగూడఁ జుట్టుకొనఁగలదనియు బెగడొందుచుంటివి. ఏమి! నాపలుకులు నిక్కువంబులే కదా?

దిలేరు:—ఔను. నేనీవిషయము లన్నింటిని తలపోసియే మిగుల కలఁతనొందు చుంటిని.

మృగాంక:—అగుచో, నీవు నిశ్చింతగ నుండవచ్చును. నీశిరమున నట్టి యపయశము చుట్టుకొనకుండగ నేను చూచుకొని యెదను.

దిలేరు:—తరువాత మీచిత్తము! నేను చెప్పవలసిన విషయములను విన్నవించు కొంటిని.

రాకుమారులిరువు రనుచరుల సమేతముగ నాడిబ్బపై భాగమునకుఁ బోయి చేరిరి. తదనంతరము మృగాంకవతియు దిలేరుసింహుని వెంటఁదోడ్కొని చని వారినిఁగలసి కొనెను. ఆతిప్ప యందలి పరిస్థితులను గనుగొనుటవలన నచట నేకాలంబుననో నొక సుందరమందిరరాజము గలదనియు నది యిపుడు శిథిలమై యుండెననియు దోఁచు చుండెను. ఇపుడాస్థానమం దొకగది తప్ప నితరము లెవ్వియుఁ జూపట్టుటలేదు. దానియందిరువ దిరువదియైదు గురు మనుజులు గూర్చుండుటకుఁ దగిన వైశాల్యము మాత్రము గలిగి యుండెను. దానియందు నట్టనడుమ నొకఱాతితిన్నె గలదు.

దానిపై శిలావినిర్మితంబగు నొక భయంకరశార్దూలము గూర్చుండి యెదుటి వారిపై దుముక నుంకించుచుండినటులఁ జూపట్టుచుండెను. మృగాంకవతి యచటఁ గూర్చుండుఁడని యెల్లరకుఁ దెలిపి జటాశం కరుని నైపునకుఁ బరికించి "యిచటినుండి యొకమార్గము మాయా రాణి దిలస్మోద్యానములోనికిఁ బోవు యున్నది. నీవు దక్కతక్కి నవారి నందఱను వెంటఁదోడ్కొని నేనచటికిఁ బోవుదును మఱి యుఁ గొన్నిదినము లచట నివసించుచు నాకార్యములను దీర్చుచుం దును. అంతదనుక నిన్నొక కార్యమందు నియోగించు చుంటిని. నీవతి నిపుణత నాకార్యమును నెఱవేర్పఁజాలుదు వని విశ్వసించు చుంటిని.

జటాశం:— మీయాజ్ఞానుసార మెట్టికార్యమైనను గావించుటకు సంసిద్ధముగ నుంటిని. ఇపు డన్నిటి కంటె మునుగ నొక విషయమును మీకువివరింపఁ దలంచు చుంటిని. మీరే కాంతమందు నామాటలను వినవలసి యున్నది.

మృగాంక:— సరియే! వచియింపుము.

అని పలికి మృగాంకవతి జటాశంకరుని వెంటఁదోడ్కొని యాగది వెలుపలకు వెడలిపోయెను. మఱియు నచట నొకశిలాఫల కముపైఁ గూర్చుండి జటాశంకరునితో సంభాషింప నారంభించెను.

దాదాపుమూఁడు గడియల కాలమువఱకు వారిరువురు సం భాషించు చుండిరి. మేము దాని నిచట వివరించి తెలుపుట సము చితముగఁ దలంచుటలేదు. తదనంతరము జటాశంకరుఁడు దనకక్ష పాలనుండి కలమును శిరాబుడ్డియు వెడలించి మఱియు నొకకాగిత మును దీసి మృగాంకవతి యెదుట నుంచెను. మృగాంకవతి తన భా వకుండగు ముకుందసింహానరపాలుని పేర నొకజాబు లిఖించి దానిని ముగించెను. దాని యం దీదిగువను లిఖించిన విధంబున వ్రాయంబడి యుండెను.

"నేనీకమ్మను జటాశంకరున కొసంగి మీతావునకుఁ బుత్తెంచుచుంటిని. ఇతఁడు మిగుల నార్జవ యుక్తుఁడు. విశ్వాసపాత్రుఁడు. మీరు ప్రతికార్యమందు వీని సమ్మతియు సహాయమును గొనుచుండ వలెను. ఇతఁడు మిమ్మెటకేనియుఁ గొని పోఁదలంచిన నిశ్శంక భావముతో వెంటఁబోవచ్చును. మఱియు నే కార్యమేనియుఁ గావించుటకుఁ దెలిపిన నావిషయమున నెట్టిసందేహమును బొందనగత్యములేదు. నేను వీని యెదుట నెట్టి రహస్యమును దాఁచియుంచుటలేదు. మఱియు వీని నొక విశ్వాసపాత్రునిగఁ దలంచి మన్నించుచుంటిని."

అటుపిమ్మట నాలేఖపై సంతకమిడి యొక గుఱుతు గూడ దానిపైఁ బెట్టెను. తదనంతర మాజాబును జటాశంకరున కొసంగి వానితో "చాలును! నీవిప్పుడే మోహిని మందిరము వైపునకు వెడలిపొమ్ము. మఱియు ముకుందసింహనరపాలునితోఁ గలసికొని కార్యమును నిర్వహింపుచుండుము. నీకుచితంబని తోఁచిన యే కార్యమైనను నీయిచ్చచొప్పున గావింపనగును. చూడుము! అతిజాగరూకతతోఁ గార్యములయం దప్రమత్తుఁడవై మెలంగుచుండవలెను జుమా! ఈవ్యాపారము మిగుల నున్నతమైనది. నీవిశ్వాసమం దించుకేనియు వ్యత్యాసము పొడగట్టిన నీయెడల మిగులఁ జెడురీతి వర్తింపవలసి యుండును. జాగ్రత్త" యని పలికెను.

"మీరు నిశ్చింతగనుండుఁ"డని పలికి జటాశంకరుఁడా దిబ్బపైనుండి క్రిందికి దిగి చూచుచుండగనే యచటి యడవియందుఁ బ్రవేశించి యదృశ్యుఁ డయ్యెను.

## ౧౩

మృగాంకవతి తనచెలియలగు రాజేశ్వరిని మైథిల్యాభ్యాయలను రాకుమారు లిరువురను వెంటఁదోడ్కొని ముకుందసింహాసరపాలుని కథనానుసారము మాయారాణి తిలసోమ్మద్యానమండలి నాల్గవతరగతి తోఁటలోనికిఁ బోయి దేవమందిర మందుఁ గొన్ని దినములు నివసింపఁ గోరుచుండెను. కావున, వారలచట నేయేకార్యములను గావింతురో యావృత్తాంతములను పిదప లిఖింపఁదలంచు చుంటిమి. ప్రకృత మిచట జటాశంకరుని వృత్తాంతమును మాత్రము లిఖించి మా పాఠకమహాశయుల హృదయమం దొక విధంబగు శంకాందోళన ముదయింపఁజేయఁ దలంచుచుంటిమి. కావున, మాపైఁగిని యక యీయద్భుతరహస్యములను ముందుగఁ జదివి యానందించెదరుగాక!

జటాశంకరుఁడు మృగాంకవతివలన వీడ్కోల్పఁబడి తిన్నగాఁ గాశీనగరము వైపునకుఁ బోవలసి యుండెను. కాని, యతఁ డటు లొనరింపక మాయారాణితోఁ గలిసికొనుతలంపున నామె తిలసోమ్మద్యానము వైపునకు దారి పట్టెను. మఱియు మధ్యాహ్నసమయముగాక పూర్వమే యాదోఁట సింహద్వారమునొద్దకుఁ బోయి చేరెను. అతఁడచట గావలియుండిన సిపాయిలలో నొకని వైపునకుఁ బరికించి "జటాశంకరుఁ డేతెంచి యుండెనని మహారాణి కెఱింగింపు"మనెను. దానికిఁ బ్రత్యుత్తరముగ నాసిపాయి వానితో "మీకెట్టి యాటంకమును లేదు. మీరులోని కేగవచ్చును. రెండవద్వారము నొద్దకుఁ బోయిన పిదప నచటి పరిచారికలతో మీరాక మహారాణి కెఱుక చేయింపుఁ"డని పలికెను.

జటాశంకరుఁ డాతోఁటయందుఁ బ్రవేశించిన పిదప రెండవ ద్వారమునొద్దకుఁ జేరి యచటఁ గావలియందు నియుక్తలై యుండిన

పరిచారికలతోఁ దన రాక మాయారాణికిఁ దెలియఁ జేసెను. మఱియు నానతి వడసి యాపరిచారికలు జటాశంకరుని యామందిర ములోనికిఁ దోడ్కొనిపోయి తమప్రభ్వి సమ్ముఖమున నిలిపిరి.

మాయారాణి:—(జటాశంకరునితో) కూర్చుండుము! నీకుఁ గుశలమే కదా? నీవు శీఘ్రముగ మగుడి వచ్చుటవలనను, నీమోము నందు సంతోషచిహ్నములు పొడకట్టుచుండుట వలనను నేదియో యొకశుభవార్తను గొనితెచ్చినటులఁ దోఁచు చున్నది. ఎట్టులైనను నీవు తలంచిన దానినిఁ జేసితీరుదు వనుట నిర్వివాదాంశము. మంచిది! ఆసమాచారమెట్టిదో శైఘ్రమ వచియింపుము!

జటాశం:—నేఁడు మీవలన గొండిగొప్ప బహుమానమును బడ యఁగలను. కారణంబేమన, సితరులవలన నెఱవేఱజాలని యొక గురుతర కార్యమును నేనిపుడు గావించివచ్చితిని.

మాయారాణి:—నిశ్చయము. నీవట్టివాఁడవే! సందియములేదు. కాని, నీవట్టి ఘనకార్యమేమి కావించి వచ్చితివో వివ రింపుము.

జటాశం:—అదివెల్లడిగఁ జెప్పఁదగినది కాదు.

మాయారాణి:—(పరిచారికలవైపునకుఁ గాంచి, వెడలిపోవుఁడని సన్నఁజేసి) అందఱియెదుట నాసంతోషవార్త వివరింపుమను ట నా తెలివి హీనతయే! మంచిది. ఇపుడేయేకాంత మందు దానిని వివరింపుము!

జటాశం:—మీరు మీపతివిషయమున గావించి యుండిన ప్రయ త్నంబులన్నియు విఫలంబులగుట మిగుల విచారకరము! చూడుఁడు! నాచాకచక్యము. నేనిపుడు మృగాంకవతి చెంత నుండి యేతెంచుచుంటిని. ఆమెకు నాపై సంపూర్ణవిశ్వాస

ము గలదు. మఱియు నాయెదుట నెట్టి రహస్యము దాఁచి యుంచదు. ఆమెవలన నేను వినియుండినసమాచారములను బట్టి ముకుందసింహుఁడింతలోఁ దన్ను వెల్లడించుకొనఁడని యుఁ బ్రచ్ఛన్నరూపంబున మీ కనేక కష్టములను గల్పించు చుఁ బగసాధింపఁ దలంచుచుండెననియుఁ దెలియుచున్నది.

మాయారాణి:—(కంపించుచు) నిక్కువముగా? నాకతఁ డెట్టియెగ్గు లను దలపెట్టుచుండెనో కదా? కటకటా! నేనీప్రపంచమందలి సుఖసంపదను గొంచెమేనియు ననుభవింపఁ జాలనైతిని. కానిమ్ము! నీ వెట్టిసంతోషవార్తను గొనితెచ్చితివో దానిని వివరింపుము.

జటాశం:—నేనువచియించు చుండగనే మీరు నామాటల కడ్డుత గిలితిరి. మంచిది. మిమ్మిపుడు బాధించుటకై గొప్పప్రయ త్నములు గావింపఁబడుచున్నవి. మఱియు రోహిణీగడము నుండి దండువెడలివచ్చి మీరాజ్యమును ముట్టడింపనున్నది. మీరు కరుణాదేవీ విజయేంద్రసింహులను బంధించియుం చిన సమాచారము వట్టిబూటకమనియు, వంచనబుద్ధి మీ మనుష్యులలో నిరువురకు వారిరూపంబులు దాల్పించి చెఱ యందుఁ బెట్టి యుండిరనియు, ముకుందాభయసింహులవల న రాకుమారు లాలించి మిగులసంతోషభరితస్వాంతులై యుండిరి. ఇపుడు కుమారమహేంద్ర సింహుని మైయ్యా రులలో నొకనిని వెంటఁదోడ్కొని చంద్రకళామదాలసలను విడిపించితెచ్చు తలంపుతో ముకుందసింహుఁడు మోహినీ మందిరమునకుఁ బోయి యుండెను.

మాయారాణి:—వచియింపక దీరదు. నేను కుమార మహేంద్ర నరేశసింహులకుగాని వాని మైయ్యారులకుఁగాని వాని పై

న్యమునకుఁగాని బెగడొందు దానను గాను. నేను కేవలము ముకుందసింహునకు భీతిల్లుచుంటిని. వానినామమును వినిన మాత్రముననే నాగుండె జల్లుమనుచున్నవి. నేను వానియెడల మిక్కిలి చెడుగా వర్తించి యుంటిని. ఇపుఁ డతఁడు నాహస్తగతమునుండి దాఁటిపోయి యున్నాఁడు. అతఁ డిపుడు చంద్రకళామదాలసలను విడిపించుకొని పోవుటకు మోహిని మందిరమున కేగియుండిన వార్త నెఱింగించి నన్ను మేల్కొల్పితివి. నేనిపుడే యిచటినుండి కాశీనగరమునకుఁ దరలి పోయెదను. మఱియు సాధ్యమగురీతి వానిని బంధించి తెచ్చెదను.

జటాశం:—అసంభవము. మీరు వాని నెవ్విధంబునను బంధింపఁ జాలరు. వేలకొలఁదిజను లొక్కటిగఁ గూడి వచ్చినను వాని కెట్టి చెఱుపును గలిగింపఁజాలరు.

మాయారాణి:— (అనూయభావముతో) అదియేమి?

జటాశం:—మృగాంకవతి వాని కొక యద్భుతపదార్థ మొసంగి యున్నది. వాని కెవరు నెట్టికీడును గలిగింపఁజాలరు.

మాయారాణి:—ఆ యద్భుతపదార్థ మెట్టిది?

దానికిఁ బ్రత్యుత్తరముగ జటాశంకరుఁ డాతిలస్మకైజారు యొక్క యనుపమ గుణవిశేషములను నభివర్ణించి తెలిపెను. ఇంతదనుక మాయారాణి కాతిలస్మకైజారు వృత్తాంతము దెలియనే తెలియదు. తత్కారణంబున నామె కధికాశ్చర్యము జనించెను. ఆమె కొంతసేపటివఱకు యోజించి తదుపరి వానితో నిటులఁ బలికెను.

మాయారాణి:-అట్టి యద్భుతమహిమగల కైజారు చేఁజిక్కియుండిన వాని కెవ్వరు నెట్టి కీడును గలిగింపఁజాలరనుట నిక్కువము.

ఇఁక నాజీవితముపై నిరాశనొందవలసినదే! కాని, యట్టి యద్భుత ప్రభావ సమన్వితంబగు తిలస్మాకైజా లేచటినుండియో మృగాంకవతికిఁ జేఁజిక్కెనను మాట విశ్వసనీయముగాదు. మఱియు నట్టి యద్భుతకైజా గైకొనుట యు దుర్లభము. అసంభవము మృగాంకవతి నీతో నసత్యము వచియించి యుండును.

జటాశం:—(నవ్వి) కాదు కాదు. అది యసంభవము గాదు. దుర్లభము గాదు. అట్టివిధంబగు కైజారుచే మృగాంకవతి పారితోషిక రూపంబున నాకొకటి యొసంగి యున్నది. (మొల నుండి కైజారును వెడలించి దాని పిడినొక్కి చూపి) చూడుఁడు. ఆకైజారిదియే?

మాయారాణి:—(ఆశ్చర్యముతో కన్నులనుమూసికొని) చాలును. ఇఁక నాప్రకాశమును దొలగింపుము.

జటాశంకరుఁడా కైజారుపిడిని వదులుగ బట్టుకొని యిఁక మీకన్నులు దెఱవవచ్చు ననెను. తదనంతరము మాయారాణి గన్నులు విప్పిచూచి, "అహా! ఇప్పుడు నాకు జ్ఞప్తికి వచ్చినది. సులోచన తనవృత్తాంతమును వివరించుతఱి నీకైజారు సమాచారమును గూడ వెడలించియున్నది. అగుచో, నెవ్విధంబునను నేను వానిపై విజయమును బడయఁజాల ననెను."

జటాశం:—కాదు కాదు. మీరటుల నిరాశను జెందరాదు. నేనా విషయమున గూడ నొక యుక్తినాలోచించి యుంటిని.

మాయారాణి:—అదియెట్టిది?

జటాశంకరుఁడు మృగాంకవతి లిఖించి తన కొసంగి యుండిన జాబును కక్షపాలనుండి వెడలించి మాయారాణి యెదుట నుంచెను. మాయారాణి దానిని జదువుకొని యధిక ప్రీతో-

చిత్తమై "సెబాసు! సెబాసు!! జటాశంకరా! నీవొక ఘనకార్యమునుగావించి యుంటివి. నీప్రజ్ఞావిశేష మెంతేనియుఁ గొనియాడదగి యున్నది. ఆహా! మృగాంకవతికి నీపై నెట్టి శంకయు జనింపనీయక ముకుందసింహుని నాచేఁజిక్కించఁ గలవు.

జటాశం:—ఔను. అటులనే! కాని, మనము మొదట నూహించిన విధంబున నెవ్వరేనియుఁ జంద్రకళను విడుపించుకొని పోవు తలంపున నచటికి కేతెంచు నెడల వానిని బంధించుచుండవలెనను సంభిప్రాయము నిపుడు మార్చుకొనవలసి యున్నది.

మాయారాణి:—నీయిచ్ఛానుసారము గావింప వచ్చును. నీవు మిక్కిలి ప్రజ్ఞావంతుఁడవు. ధీశాలివి. చతురోపాయుఁడవు. నీపన్నుగడలు సాటిలేనివి. మనము వానినిఁ బట్టఁదలంచిన వానియొద్ద యద్భుతకైజారు గలదు. కావున, నతఁడు కొందఱను చంపి పాఱిపోవుటయేకాక మరలఁ జేఁజిక్కకుండును. మఱియు నీసమాచారము ప్రజలకు వెల్లడియగుచో నధికానర్థము సంభవింపక మానదు.

జటాశం:—నిక్కువము! మీరొక జాబు సులోచన పేర లిఖించి నాకొసంగుఁడు. దానియందుఁ "జంద్రికళామదాలసల నెవ్వరేనియు వెడలించి కొనిపోఁదలంచిన నెట్టియాంటకమును గలిగింప రాదనియు, నీజటాశంకరున కామందిరమందలి యంతర్భవనములను జూపించుటయే కాక, వాని మర్మములన్నింటిని నెఱింగింప వలయుననియు" వ్రాసినఁజాలును ఇఁక నాచాకచక్యమును జూడుఁడు. చంద్రకళామదాలసలను విడిపించుకొని పోయిన పిదప నానేర్పుపెంపున నాముకుందమోహన సింహులను వధించి యధ్యక్షుని మందిరము (వ్రా)

వాహాముపైఁగల మందిరము) లోనికిఁ దోడ్కొనిపోయి
తత్క్షణము వారిని దానియందు బంధించివైచెదను. అచటి
యంతర్భవనముల తాళపుఁజెవులను మీరు నాకొసంగవలె
ను. దానియందలి యంతర్భవనములు మిగుల సపూర్వమైన
వని మృగాంకవతివలన వినియుంటిని. నేను తలంచి యుం
డిన కార్య మామందిరమందే బాగుగ నెఱవేఱఁగలదు.
నేను ముకుందసింహుని దానియందు బంధించి వెంటనే
మీకావార్తను దెలియఁజేయుదును. తదుపరి మీయిష్టాను
సారము వానిని శిక్షింపవచ్చును.

మాయూరాణి:—చాలును. నీయుక్తి కడుంగడు ప్రశంసనీయము. నీవు
తలంచిన కార్యము చేసితీరుదువని నాకిపుడు దృఢవిశ్వా
సము గలుగుచున్నది.

మాయూరాణి తిలస్మాధ్యక్షుని విలాసమందిరపుఁ దాళ
పుఁజెవియు నంతర్భవనముల తాళపుఁజెవులను జటాశంకరుని యధీ
న మొనరించెను. మఱియు నచటి రహస్యములను గూడ బాగుగ
బోధించి వానికిఁ దెలిపెను. మఱియు వాని కథనానుసారము సులో
చన పేర నొక జాబును వ్రాసి వాని కొసంగెను. జటాశంకరుఁడు
వానిని గైకొని యచటినుండి బయలుదేరి కాశీనగరము వైపునకుఁ
జఱుకుగ నడచి పోఁదొడంగెను.

## ౧౪

ఒక జాము రేయి గడచి యుండెను. సులోచన కాశీనగర
మందలి మోహినీ మందిరమం దొక గదిలో రత్నకంబళముపైఁ
గూర్చుండి యుండెను. ఆమె సమీపమున నొక సుందరాకారుఁ
డగు యువకుఁడు మిగుల సొంపుగులుకుచుండిన రొమాలును దిండ్లను
నానుకొని కూర్చుండి భూమివైపునకుఁ బరికించుచు నేదియో

యోజించు చుండెను. అయినపుడుఁ దక్క నాగది యందు
మూఁడవ వారెవ్వరును లేరు.

సులోచన:—మీరు చంద్రకళ యందలి యాశను విడువుఁడని
పెక్కుమాఱులు బోధించి యుంటిని. ఆమెకట్టి కష్టమును
కలుగనీయక విశ్రమింపఁ గలుగు విధంబున నామెకు సాహా
య్యముఁ జేయవలెనని మా మహారాణి యాజ్ఞాపించి యున్నది

యువకుఁడు:—కాని, నేనామె కట్టి వేదన కలిగించుట లేదు
గదా? నన్నామె చెంత కేల పోనీయకుంటివి?

సులోచన:—మీకు మాయారాణి విషయమున గొంచెమైనను
ధ్యానము లేకుండుట మిగుల శోచనీయము. మీరు నాటిరాత్రి
కమాఱు చంద్రకళ సమీపమున కేగినచో, నామె తప్పక
యసువులను బాయఁ గలదు. మీకతంబుననే యామె
దురంత దుఃఖ పరిపీడితయై కాష్ఠమువోలె శుష్కించి
యున్నది. మాటలాడుటకు సహిత మామెకు శక్తిచాలకు
న్నది. ఆబాలిక యొకవేళ మరణించుచో మాయారాణి
యొక్క గురుతర విపత్తియందుఁ జిక్కుట తథ్యము. ఈమంది
రమునుండి మీరు వెడలిపోయిన సమాచార మా చంద్రిక
ళకు నిశ్చయముగఁ దెలియుదనుక నాతోసంభాషించుటకుఁ
గూడ నామె యిచ్ఛగింపదు. ఇట్టి స్థితియందు మాయా
రాణి యాజ్ఞ నేనెటుల నిరాకరింపఁగలను? ఆమె చంద్రకళ
కట్టి బాధ గూర్పఁ గలుగనీయక యథేచ్ఛగనుంచుట కాజ్ఞా
పించి యున్నదని చెప్పియుంటిని గదా? ఇట్టిచేతలకు గుఱిఁ
జేయుచు నామె నెటుల సంతోషచిత్తురాలనుగఁ జేసి యుం
చగలను?

యువకుడు:—(కొంచెము యోజించి) నీవనుదిన మిటులనే తెలుపు
చుంటివి. దాని వలన బ్రయోజన మేమి!

సులోచన:—అగుచో, నిది కడసారి యనుకొనుఁడు. చంద్రకళ యందు మీకుఁ గల కోరిక యెవ్విధంబునను నెఱవేఱఁజాలదు. మఱియు సాధ్యమగునంత శీఘ్రముగ మీరు మాయారాణి చెంత కేగుటయే సముచితము.

యువకుఁడు:—అటులగుచో, నిఁక పాయుఁడనై మాయారాణి యెడల వైరభావ మూనవలసియే యుండును. నాకామె రహస్యములనేకములు తెలిసియున్నవి. నేను వానిని వెల్లడించిన నామెక్కట్టి దుస్థితి చేకూరఁగలదో కొంచెము యోజించుకొనుము.

సులోచన:—ఇట్టితలంపు గలిగి యుండిన మిమ్మిప్పుడే యమసదనమునకుఁ బుత్తెంచెదను.

యువకుఁడు:—(కోపముతో) ఏమంటివి! నన్ను యమసదనమునకుఁ బుత్తెంతువా? కల్లి! నీవు నాకట్టి చెఱుపును గలిగింపఁజాలవు. మఱియు నీవిషపూరితాంగుళీయకమునకు నేను భీతిల్లువాఁడను గాను.

ఇవ్విధంబునఁ బలుకుచు నాయువకుఁడు లేచి నిలచి యాగదినుండి వెడలి పోవుటకుఁ దలంచుచుండెను. అంత నాగది ద్వారమును దెఱచి లోన బాదమిడుచుండిన జటాశంకరునిపై వారి దృష్టి పడెను. సులోచన (యువకుని వైపునకు సంకేతించి) జటాశంకరునితో "చూడుఁడు! నేనీమూర్ఖున కెంతసేపటినుండియో బోధించుచుంటిని. కాని, నాపలుకొక్కటియుఁ జెవిఁబెట్టకుండెను. మఱియు నితఁడు మాయారాణి నాపదలయందుఁ జిక్కఁజేయఁ దలంచుచున్నాఁ" డనెను. దానికి బ్రత్యుత్తరముగ జటాశంకరుఁ డామెతో "అవును! నేను గూడ నీదురాత్మునిసంభాషణమును తలుపువెలుపల నిలచి యాలించుచుంటి" ననెను.

"దురాత్ముఁ"డను శబ్దము నాలించినంతనే యాయువకుఁడు క్రోధావేశుఁడై తన మొలనుండి కైజారును వెడలించి తటాలున వానిపైకి దుమికెను. జటాశంకరుఁ డతినేర్పున వాని మణిబంధమును గట్టిగఁ బట్టుకొని వాని నడికట్టునందు రెండవ కరమును జొనిపి భూమిపైఁ బడు నటుల కాళ్లపైఁ దనపాదములతోఁ దన్నెను. సులోచన వెంటనే వెలుపలకుఁ బరుగిడి యొక దృఢమగు రజ్జువును దెచ్చి జటాశంకరున కొసంగెను. తదనంతరము జటాశంకరుఁ డా యువకుని కరపాదము లా త్రాటితో బాగుగ బంధించి యీడ్చుచు మఱియొక గదిలోనికిఁ దీసికొని పోయెను. సులోచనయు వానిని వెంబడించెను.

ఒకయరగంటకాలము గడచిన పిదప సులోచనాజటాశంకరులు వాగ్గల నాగదిలోనికి వచ్చిచేరిరి. మఱియు నాప్రేమీయుగళము పర్యంకముపైఁ గూర్చుండి కొంత తడవు సరససల్లాపములను గావించుచుఁ దదనంతరము ముఖ్యాంశమందుఁ బ్రవేశించి సంభాషింప నారంభించిరి. సులోచన ప్రశ్నించినమీఁదట జటాశంకరుఁడు దన వృత్తాంతమంతయు నామెకు వివరించి తెలిపి, మృగాంకవతి ముకుందసింహానరపాలుని పేర లిఖించి యొసంగిన జాబు నామెకు మొదట జూపించెను. తదనంతరము దాను మాయారాణి సమీపమున కేగుటయు నచటఁ దనకు జరిగియుండిన సంభాషణములను సాంగోపాంగముగ వివరించి తెలిపి యామె సులోచన పేర వ్రాసి యొసంగిన యుత్తరమును గూడ నామెకుఁ జూపించెను. ఆవృత్తాంతము లన్నింటి నాలించి సులోచన సంతోషపారవశ్యయై "సెబాసు! ఈకార్యములు మీవలనఁ గాక తదితరులవలన గాఁజాలవు. మీప్రజ్ఞావిశేషమునకు నేనెంతయు ముదమందుచుంటిని. మీరు మాయారాణి యొద్ద నుండి జాబుగొని తేకుండినను మీయాజ్ఞానుసారము ప్రవర్తించుదాననే కాని వేఱుకా" దని పలికెను.

జటాశం:— నేనుకూడ నటులనే భావించి యుంటిని. కాని, యూ
రకయే యీజాబు నీపేర వ్రాయించి తెచ్చితిని.

సులోచన:— ముకుందమోహనసింహులు మీకంటె ముందుగ
నీనగరమున కేతెంచియుండిరను సమాచారము నాలించుట
వలన నాకు మిక్కిలి యాశ్చర్యము జనించుచున్నది. వారిరు
వు రింత దనుక నీమందిరములోని కేతెంచిన జాడ చూపట్ట
దు. కానిండు! వారిరువు రెచట నెట్టియోజన యందుఁ జిక్కి
యుండిరో తెలియదు. ఏమి కానున్నదో కనుగొనియెదము
గదా! మంచిది. ఇపుడు యీయభిప్రాయమేమి?

జటాశం:— (కొంచము యోజించి) అగుచో, నేనుస్వయముగ నా
యిరువురను వెదక వలసియున్నది. నాకు వారితో సమావేశ
ము గలిగిన పిదప వారికి బాగుగఁ బ్రబోధించి గుప్తరీతి
నీమందిరములోనికిఁ దోడ్తెచ్చెదను. మఱియుఁ జంద్రకళామ
దాలసల నిచటినుండి వెడలించి వారి వెంట వెడలి పోవుదును.
తదనంతరము వారిని మఱియొక కార్యమందు నియోగించి
చంద్రికళా మదాలసలను రోహిణీగడమునకుఁ జేర్చు నెపం
బున నాచేఁ జిక్కించుకొందును. మఱియు నేను నీకుఁ జూపి
యుండిన నానివాసస్థానమగు గుప్తసురంగమందలి నాపరిజ
నులకు వారిని వప్పగించి మరల ముకుందసింహునియొద్దకుఁ
బోయి వానిని గలసికొందును. తదుపరి నాచతురోపా
యంబుల వానిని బంధించి మాయరాణి చెంతకుఁ బుత్తెం
చెదను. ఆమె దన చేతులతో వాని శిరమును ఖండించి
నిశ్చింతగ నుండఁ గలదు.

సులోచన:— మీయాలోచన మిగుల శ్రేయస్కరమైనది. అహా!
అటులఁ గాఁజాలిన నిఁక మనకుఁ గావలసిన దేది గలదు!

మాయారాణి వలన మనము గోరిన బహుమానమును బడయఁగలము. ఇపుడామె ముకుందసింహుని భీతిచే మిగులఁ దల్లడిల్లుచున్నది. మఱియు మహేంద్రసింహుడు మున్నగు వారిచేతినుండి యాతిలస్మమును గాపాడు తలంపామెకు బొత్తిగా నడుగంటి పోవుచున్నది. ఆమె యటుల ముకుందసింహుని రూపడంచి నిశ్చింతయగుచో నింతకు బూర్వమందఱు దలంచుచుండినటుల నీప్రపంచమందామె కంటె భాగ్యశాలిను లెవ్వరు లేరనుట నిర్వివాదాంశము.

జటాశం:— సందేహమేమి? నేను వచియించి యుండిన విధంబుననే జరుగఁగలదు. మంచిది. ఇవు డీమందిరమందలి సమస్తరహస్యములను నాకెఱింగింపుము. దీని యందలి యంతర్భవనములు గుప్తమార్గములు, మున్నగు వాని వృత్తాంత మేమియు దాఁచి యుంచరాదు.

సులోచన:—మంచిది. నడువుడు! సాధ్యమగు నంత శీఘ్రముగ నీకార్యమునుండి తీరికగనుటయే మేలు.

ఇవ్విధంబున బలికి సులోచన జటాశంకరుని వెంటఁదోడ్కొని పోయి యామందిరమందలి మార్గములను నంతర్భవములను గుప్తమార్గములను సురంగములను జూపి వానిని దెఱచి బంధించు విధమును వానికి బాగుగ బోధించెను. ఈకార్యమునుండి తీరికఁ గనిన పిదప జటాశంకరుఁడు సులోచనవలన వీడ్కొల్పఁబడి ముకుందమోహనసింహులను వెదకుచు నాకాశీనగరమం దెల్లెడల నంచరింపఁ దొడంగెను.

## ౧౫

మఱునాఁ డర్ధరాత్రము గడచిన పిదప జటాశంకరుఁ డామందిరమందు మరలఁ బ్రవేశించి సులోచన సమీపమునకుఁ బోయి

చేరెను. ఆసమయంబున నామె యేయోజనయందుఁ జిక్కినదో యామందిరమునకు వెనుకతట్టునఁ గల పుష్పోద్యానమునఁ దిరుగుచుఁ బచారు చేయుచుండెను. ఆమె జటాశంకరుని గాంచినంతనే సహాస్యవదనయై వానిని డగ్గఱించి యిట్లు సంభాషింపఁదొడంగెను.

సులోచన:—మీ రేకార్యమునైనను నెఱవేర్చుకొని వచ్చితిరా?

జటాశం:—ఆఁ: నేను వారినపుడును గలసికొంటిని. మఱియు నాకథానుసారము ప్రవర్తించుటకు వారలు సమ్మతించియుండిరి. మృగాంకవతి లిఖించి యొసంగిన జాబును ముకుందసింహునకుఁ జూపినంతనే, యాతఁ డద్దానిని జదువుకొని ప్రమోదచిత్తుఁడై "మేము మృగాంకవతి యభిప్రాయమునకు భిన్నముగఁ జరింపఁ జాలము. ఆమెకు నీపై నంత విశ్వాసము గలిగియుండ మేము మాత్రము నిన్నేల విశ్వసింపకుందుము? నీయిష్టానుసారము నడచుటకు సంసిద్ధముగ నుంటి" మని పలికిరి.

సులోచన:—అగుచో, మనకార్యములు గట్టెక్కినవనియే తలంప వచ్చును. సరియే! మన మిపుడేమి కావింప వలసియున్నది.

జటాశం:—ఇపుడు వారిరువురు నిటకే తెంతురు. నీవిచట నుండి వెడలి గది తలుపులను మూసికొని పరుండి హాయిగ నిద్రింపుము. మఱియు సిపాయిలతో నిపుడు గావలి గాయుట కెట్టి యగత్యమును లేదనియు నిశ్చింతగఁ బరుండవచ్చుననియు, నీస్థానమున నెవ్వరేనియుఁ జూపట్టిన వారి నేమియుఁ బ్రశ్నింపక యిచ్చకుండుఁ డనియు నాజ్ఞాపింపుము.

"మంచిది" యని పలికి సులోచన యచటనుండి తన గదిలోనికిఁ బోయి చేరెను. మఱియు జటాశంకరుని కథనానుసారము దన సిపాయిలకు శాసించి ద్వారమును బంధించుకొని పర్యం

కముపైఁ బరుండెను. జటాశంకరుఁ డాపూదోఁటయందు సంచరిం చుచు దానికి వెనుక తట్టునఁ గల గుప్తద్వారము నొద్దకుఁ బోయి చేరెను. మఱియు నచటఁ గూర్చుండి యెవరి రాకకో ప్రతీక్షించు చుండెను.

ఒక యరగంట కాలము దనుక నచట నిస్తబ్ధత వ్యాపించి యుండెను. తదనంతర మెవ్వరో నాద్వారముపై రెండుమూఁడు మాఱులు చేతితోఁ దట్టిన సవ్వడి జటాశంకరునకు వినిపించెను. అతఁడు వెంటనే లేచి యాద్వారమును దెఱచెను. మఱియు నామా ర్గమున నిరువురు మనుజు లాతోఁటయందుఁ బ్రవేశించిరి. వారిసంజ్ఞ లవలన వారిరువురు ముకుందమోహనసింహు లని తోఁచుచున్న ది. జటాశంకరుఁ డాగుప్తద్వారము నెప్పటి యట్టుల బంధించి వారి రువురను వెంటఁదోడ్కొని నెమ్మదినెమ్మదిగా నాపుష్పవాటిక మధ్య నతిరమ్యముగఁ జూపట్టుచుండిన జలయంత్రము సమీపమున కేగి యచట నిలచెను.

ముకుంద:—(జటాశంకరునితో) ఇవు డేవైపునపహరా తిరుగుచుం డెనో యెఱుంగుదువా?

జటాశం:—పహరా నెచ్చటను లేదు. నలుగడల నిస్తబ్ధత వ్యాపిం చియున్నది. ఈమందిరమందు నివసించువారి నందఱను మూర్ఛాగతులనుగ నొనరించి యుంటిని.

ముకుంద:-అగుచో, మనము నిశ్చింత మన కార్యమును నెఱవేర్చు కొనవచ్చును.

జటాశం:—తప్పక.

ముకుంద:—మంచిది. మీరు నావెంట రండు. ఈస్నానాగారము నుండి యంతర్భవనములోని కేగుటకుఁ దలంచుచుంటిని. ఇపుడు చంద్రకళామనాలన లేయంతర్భవనమందు బంధింపఁ

బడి యుండిరో యాజాడ యేమైనను తెలిసికొని యుంటివా?

జటాశం:— ఔను! వారిరువు రిపుడు ‘పవనమండప’ మందు బంధింపఁబడి యుండిరి.

ముకుంద:— అగుచో, మన మీాస్నానాగారము లోనికిఁ బోవు నగత్య మేమియును లేదు. నీవే ముందుగ దారితీయుము.

జటాశంకరుఁడు ముందుగఁ బోవుచుండెను. వాని వెనుక ముకుంద మోహనసింహు లిరువురును బోఁదొడంగిరి. క్రిందుగ నామువ్వురు నామందిరమున కుత్తరవువైపున గల వసారాలోనికిఁ బోయి చేరిరి. ఆవసారా కిరుప్రక్కల రెండుగదులు గలవు. ఇపుడా గదుల రెండింటి ద్వారములు దెఱువఁబడి యుండెను. వారలు కుడివైపునగల గదియందుఁ బ్రవేశించి లోపలినుండి యాద్వారమును బంధించుకొనిరి. మఱియుఁ బ్రకాశముకొఱకొక మైనపువత్తిని వెలుఁగించుకొనిరి. ఆద్వారమునకు నెదుటనుండిన గోడయం దొక యలమారు గలదు. దాని తలుపు లొకమీాటువలనఁ దెఱువఁబడుచున్నవి. జటాశంకరున కాకవాటము దెఱచు విధము దెలిసియుండుటచే వా డొక మీాటును నొక్కి దాని తలుపులను దెఱచెను. దానిలోనుండి క్రిందికి దిగిపోవుటకు సోపానములు నిర్మింపఁబడి యుండెను. జటాశంకర ముకుంద మోహనసింహు లాతంతియుల మార్గమున నొకయంతర్భవనములోనికి దిగి పిదప నొకగదియందుఁ బ్రవేశించిరి. దాని ద్వారము బంధింపఁబడియుండుటచే జటాశంకరుఁడు దానినిగూడఁ దెఱచెను. ఆముఫ్వు రాగదియందుఁ బ్రవేశించి దైవోపహతయగు చంద్రకళ యొకమంచముపైఁ బడియుండుట కనుగొనిరి. ఆమె శిరమువైపున మదాలస కూర్చుండి నెమ్మదినెమ్మదిగా నామెతల నొత్తుచుండెను. మదాలస మోముదమ్మి యరుణరంజితమై యుదాసినతతోఁ గూడియుండెను. కాని, చంద్రికళ

యెన్నివత్సరములనుండియో రుగ్ణతావస్థయందుఁ జిక్కి కొందల
మందుచుండినటులఁ దోఁచుచుండెను. ఆమెపర్యంకముపైఁ బఱచి
యుండిన పక్కయుఁ గడు మాసియుండెను. దానికి సమీపముననే
మఱియొకమంచము గలదు. అది బహుశః మదాలసకొఱ కచటఁ
జేర్చియుంచినటులఁ దోఁచుచున్నది. ఆగదియం దొకమూల జల
ముతో నిండిన మృన్మయపాత్రయు నొకటి రెండు కలశములును
గొన్ని భోజనపదార్థములును గలవు. చంద్రికళామదాలసలు మో
హనసింహుని బాగుగ గుర్తెఱింగి యుండిరి. కాని, జటాశంకరుని
మదాలసమాత్రమే యెఱుంగును. మున్ను మాధవి దిలేరుసింహుని
తోఁ గలసికొనుటకుఁ దిలస్మవిహారగృహములోని కేగిన సమయం
బున మదాలసయు నామె వెంటఁ బోయియుండెను. మఱియు నచట
జటాశంకరుని గాంచుటయేగాక దిలేరుసింహుఁడు వానిని గాంచి
భీతిల్లియుండుటయు నామె యెఱింగియుండెను. ఈసమయంబున
నామె మరల జటాశంకరుని తనసమక్షమందు గాంచి "అక్కటా!
మేమిప్పుడొక యాపదయందు జిక్కియే యుంటిమి. మరల నిపుడు
వేఱొక యాపద సంభవింపనుండెనుగాఁ బోలు" నని తనయుల్లం
బునఁ దలంపసా[illegible] కాని, వాని[illegible] మోహనసింహుఁడుగూడ
నుండుటచే నామెకుఁ గొలఁదిగ ధైర్యము చేకూరుచుండెను. చం
ద్రికళకుమాత్రము వీరలు మమ్ములను విడిపించికొనిపోవుట కేతెం
చియుండిరను గట్టినమ్మకము గలిగెను. ఆమె ముకుంద జటాశంక
రుల నెఱుంగకుండినను, నాయిరువురు గూడ విజయేంద్రసింహ
మహీపాలుని మైయ్యార్కర్ఫులైయుండరని యామె తలంచుచుండెను.
చంద్రికళ మిగుల దుర్బలురాలై మృతప్రాయగనుండినను కుమార
మహేంద్రసింహుని మైయ్యార్గులు దమ్ము విడిపించుకొనిపోవుట
కరుదెంచియుండిరనియు శీఘ్రకాలములోనే కుమార మహేంద్ర

సింహుని సందర్శింపఁ జాలుదుననియు నామెకుఁ దోఁచినంతనే వాడినదై యుండిన నామె యాశాలత మరలఁ బసరించి చిగిర్చెను. ఇపుడు చంద్రకళ కేశకలాపము కబరీబద్ధముగాక నిటునటుఁ జెదరియుండెను. ఆమె కపుడలవడియుండిన సంతోషాతిశయంబుచే నుత్సాహపూరితయై విప్పియుండిన కురులను స్వయముగఁ దనచేతులతో ముడుచుకొని మోహనసింహుని దెసఁబరికించి యిట్లుఁ బలికెను.

చంద్రికళ:—నేఁడా విశ్వజనని జగదాంబకు నాపైఁ గృపజనించెననియు, మమ్ము విడిపించికొనిపోవుటకు మీరలేతెంచి యుంటిరనియుఁ దలంచుచుంటిని.

మోహన:—చిత్తము, కాని, మీరుం దొవ్వుచుండిన యీ కారాగార దురవస్థఁ గని నేమధిక దుఃఖితులమగుచుంటిమి. ఆహా! యీ ప్రపంచమందు సాధువర్తనుల కిట్టి పారితోషికము లభించుట పరిపాటి గాఁబోలు.

చంద్రకళ:—విజయేంద్రసింహ మహీపాలుని పుత్రు లిరువురను నైయారులను మాయారాణి బంధించి యుంచినటుల వినియుంటిని.

మోహన:—ఔను. ఆబంధితులగు నైయారులలో నేనొకఁడను. కాని, భగవంతుని కృపావిశేషంబున నెల్లరము బంధవిముక్తులమయితిమి. మఱియు నిపుడు మిమ్మును (మదాలస వైపునకుఁ జూపి) నీమెను విడిపించుకొనిపోవుటకే తెంచితిమి. మీరనేక విషయములను ప్రశ్నించి తెలిసికొనుటకుఁ దలంచుచుందురు. కాని, యీ సమయమున యెట్టి సంభాషణమందు వృథాప్రొద్దుపుచ్చుట చతురతగాదు. మనమిపుడు సాధ్యమగునంత శీఘ్రముగ నిచటినుండి వెడలుటయే శ్రేయోదాయకము.

"నిక్కువ"మని పలికి చంద్రకళ దనంతటఁ దాను లేచి కూర్చుండెను. ఆమెకు లేచి తిరుగుటకుఁగాని కూర్చుండుటకుఁగాని శక్తి చాలకుండినను తాత్కాలికానంద మామె దేహమందు శేషించియుండిన రక్తమును విజృంభింపఁజేయుటచే నామె సుదాలస భుజమును బట్టుకొని యాంతర్భవనమునుండి యామందిర ప్రాకారము వెలుపలకుఁ బోఁగలిగెను. సుదాలస జటాశంకరుని గాంచి నిష్ప్రహాచిత్తయై యుండినను మోహనసింహుని యందలి విశ్వాసముచే నేమియుఁ బలుకుట సముచితము గాదనియుఁ గారాగారము కంటెఁ గ్లేశదాయకంబగు స్థానము వేఱొకటి లేదనియుఁ దలంచి యచ్చోటనుండి వెడలుటయే శ్రేయోదాయకముగ నామె భావించెను. చంద్రకళా సుదాలసలను వెంటఁదోడ్కొని జటాశంకర ముకుంద మోహనసింహులా యంతర్భవనము వెలుపలకేగి యా మందిరమందును నలువైపులను నిస్తబ్ధతగా నుండుటఁ గనుగొనిరి. మఱియు వారలు నిరాటంకముగ గుప్తద్వారమును దెఱచుకొని వెలుపలకు వెడలి చనిరి. ముకుంద మోహనసింహులా గుప్తద్వారమున నిచటికే తెంచియుండిరో దానికిఁ గొంతదవ్వున [illegible]డశ్వములును నొకరథమును గలవు. అది యన్నివిధంబుల సంసిద్ధము చేయఁబడి యుండెను. ఆ తేరునకుఁ గూడ మేలుజాతి తురంగములు రెండు గట్టఁబడి యుండెను. దానిపైఁ జంద్రకళా సుదాలసల నారూఢలనుగ నొనరించి యామువ్వురు నా ఘోటకములపై నధిరోహించి, రథమును వేగముగఁ దోలుటకు సారథి కాజ్ఞాపించిరి. మాటలాడు నంతలో వారలా నగరమును వీడి చాలదవ్వునకుఁ బోయి చేరిరి. ప్రాతఃకాలీన ధవళకాంతులు దిక్తటంబుల వ్యాపింపకమున్నె దాదాపైదు క్రోశముల దూరమును వెనుకవైచి వారలొక చతుష్పథము నొద్దకుఁ బోయి నిలిచిరి. మఱియు నిపుడే మార్గము ననుసరించి

యేగవలయుననియు, సీరథసారక్షణభార మెవరిపై నిడవలెననియు యోజింప సాగిరి.

## ౧౯

పైఁ బ్రకరణమందు వివరించిన సంభవములు గడచి నేటికిఁ గొన్నిదినము లాయెను. నేఁడు మరల జటాశంకరుఁడు మాయారాణి సముఖమందుఁ గూర్చుండి యుండుట మనము గాంచుచున్నారము. అచ్చటస్థితిఁ బరికించుటవలన జటాశంకరుని కార్యాచరణములవలన మాయారాణి మిగులఁ బ్రసన్నచిత్తయై యుండినటులఁ దోఁచుచున్నది. ఇపుఁ డామె జటాశంకరుని గౌరవోద్ధతదృష్టిఁ బరికించుచున్నది. మాయారాణి సమీపమున నిప్పుడు జటాశంకరుఁడు దక్క రెండవ వారెవ్వరును లేదు.

మాయారాణి:—నీవు నాప్రాణములను గాపాడితివనుట కెట్టి సందియమును లేదు.

జటాశంక:—నే నేమని వచియింపఁగలను? ముకుందసింహుని వంచించి బంధించుటకుఁ దుష్ప్రాణము దోఁకకు వచ్చినది. నే [illegible]ంచిన పెను[illegible]లను వర్ణింప[illegible]గాదు. నేఁటికి రెండుదినములనుండి జలమే యాధారముగ నాప్రాణములను గాపాడుచు వచ్చితిని. మఱియు మృగాంకవతికిఁగాని, యామె పక్షపాతకులకుఁగాని నాయం దెట్టి సందేహమేనియుఁ గలుగునట్టి ప్రసంగ మింతదనుకఁ దటస్థించి యుండలేదు. ముకుందసింహ నగపాలుని వెంట మోహనసింహుఁ డొక్కఁడుమాత్రమే కలఁడు. నేను వానికొక కార్యమును గల్పించి రోహిణీగడమునకుఁ బుత్తెంచి యుంటిని. అతఁడు వెడలిన పిదప ముకుందసింహుని నావాక్పటిమవలన బ్రసం

గమందుఁ దన్మయునిగ నొనరించి తిలస్మాధ్యక్షుని మందిర
ములోనికిఁ దోడ్కొనిపోయి దానియందు వానిని బంధించి
వైచితిని.

మాయారాణి:—ఆశ్చర్యము! నీవు వానిని తుదముట్టింప వైతివి?

జటాశంక:—నేనటు లొనరించియుండిన మీకు నాపలుకులపై
విశ్వాస మెట్లు జనింపఁగలదు? తత్కారణమున, నేను
వానిని జీవములతో విడచి యుంచితిని.

మాయారాణి:—(నవ్వి) వానిశిరమును ఖండించి తెచ్చినమాత్ర
ముననే నాకు విశ్వాసము గలిగెడిది. కానిమ్ము! ఏదియో
జరిగియున్నది. కాని, యిపుడు వాని రూపడంచుటయం
దాలసింపరాదు.

జటాశంక:—నిక్కువము. సాధ్యమగునంత శీఘ్రముగ నా కార్యము
నుండి తీరిగ గనుటయే శ్రేయోదాయకము. అతఁడు
మరల విడిపించుకొని పోయిన నాకధిక దుర్గతి సంభవింపక
మానదు.

మాయారాణి:—అసంభవము. అతఁ డామందిరమునుండి తప్పిం
చుకొని పో[illegible]వుటగాని, [illegible]రు లరుదెంచి వానిని విడిపు
చ్చుటగాని సాధ్యమగు విషయముగాదు. నేను నీవెంట నట
కేతెంచి నాచేతులతో వానిశిరమును ఖండించి నాతల
పై నర్తనము గావించుచుండిన పీడను దొలఁగించుకొందు
ను. మంచిది! ఇఁక నొక గంట కాలము వేఁచియుండుము.
బాగుగ నంధకారము వ్యాపించిన పిదప మనమిచటినుండి
బయలుదేరుట మంచిది. నీవు రెండు దినములనుండి భుజించు
టలేదని గదా పలికియుంటివి. ఈగడవులో భోజనము
గూడఁ జేసికొని నిశ్చింతుఁడవు గాఁగలవు. ఇఁకఁ జంద్రక
ళామంజాలనల వృత్తాంతమేమి? వారినెచట దాఁచివచ్చితివి?

జటాశం:-వారినవుర నొకకొండగుహాయందుంచి వచ్చితిని. ఆరహస్య స్థానమునుండి వారిని నేను తక్క నితరు లెవ్వరును వెడలింపఁ జాలరు. చాలదినములనుండి యారహస్యస్థానమును నాకునికిపట్టుగ నొనరించుకొని యుంటిని. మఱియు నాపరిజనులు గొందఱు దానియందు నిరంతరము నివసించుచుందురు. కాని, యిపుడొక చింతమాత్రము నామానసమును మిక్కుటముగ వేధించుచున్నది.

మాయారాణి:—అది యెట్టిది?

జటాశం:-చంద్రకళామదాలసల నెచటఁ జేర్చి వచ్చితివని మృగాంకవతి ప్రశ్నించిన నే నేమని ప్రత్యుత్తరం బొసంగవలయునో యేమియుఁ దోఁచకున్నది. రోహిణీగడమునకుఁగాని మీసరోవరాద్భుత మందిరమునకుఁగాని చేర్చి వచ్చితినని బొంకినను, నది శీఘ్రకాలములోనే వెల్లడిగాక మానదు. మఱియు నన్నామె యొక కల్లరిగఁ దలంచుటయే కాక మన కౌనలమంతయుఁ జెన్నఁటిపోవును.

మాయారాణి:-నీవు గడు సమర్థుఁడవనుట కెట్టిసందియమును లేదు. నీవు దానికేదియో యొక సమత్తరమును పలికి యామె మానసమునకుఁ దృప్తిని గలిగింపఁ జాలుదువు.

జటాశం:—మంచిది! నేను మీకార్యమును నెఱవేర్చియుంటిని గదా! నాకు బహుమతి నొసంగుఁడు. నేను గోఁన దానిని నొసంగెదనని ప్రతిన జేసియుంటిరి.

మాయారాణి:—ఔను. నిస్సందేహముగ నీవు గోఁన దానిని బడయఁగలవు. కాని, యధ్యక్షుని మందిరమునకేగి వానిని తుదముట్టించిన పిదప నది నీవు లభింపఁగలవు. మంచిది. నీకేమి కావలయునో కోరుకొమ్ము?

జటాశం:—అధ్యక్షుని మందిరము నాకొసంగుఁడు. మఱియు దానియందలి యద్భుతాంతర్భవనవుఁ దాళపుఁజెవియు నా కొసంగుఁడు.

మాయారాణి:—(త్రుళ్ళిపడి) ఆయంతర్భవనవు సమాచారము నీకె ట్లుఁ దెల్లమయ్యెను?

జటాశం:—నాకాసమాచారము మృగాంకవతివలన దెలిసియున్నది. అయ్యదియు నొకశిలస్కమనియు దానియం దనేక యమూల్యపదార్థములు గలవనియుఁ గూడ వినియుంటిని.

మాయారాణి:—నిక్కవము. కాని, నావైరుల కాపదార్థములు చేఁజిక్కిన నత్యధికానర్థము సంభవింపఁగలదు.

జటాశం:—ఆవస్తువులను నాయుపయోగార్థము గోరుచుంటిని కాని, యితరుల కొసంగుటకుగాదు. నామేనునఁ బ్రాణము లుండ నితరు లెవ్వరు నామందిరమువలన నెట్టిలాభమును బడయఁజాలరు.

మాయారాణి:—(చాలసేపు యోజించి) మంచిది! నీకు దాని నొసంగెదను. నీవు నాకమూల్యమగు సహాయమును గావించియుంటివి. కాని, నీవాతాళపుఁజెవిని మిగుల భద్రముగ దాఁచి యుంచవలెను జుమా! దాని సంపూర్ణరహస్యములు నాకుఁ దెలియకుండినను, దాని నొక యనర్ఘపదార్థముగఁ దలంచుచుంటిని. కారణం బేమన, ముకుందసింహుఁడు దానిని గడు జాగరూకతతో నిరంతరము దనయొద్ద దాఁచి యుంచువాఁడు. ఆమందిరమునకు బదులుగ నీవెంతధనమును గోరినను దానిని నీకొసంగుటకు సంసిద్ధముగ నుంటిని.

జటాశం:—మీరిట్టుల సందేహింపవలదు. మీ పగతులెవ్వరు నాయొద్దనుండి దానినిఁ దీసికొనఁజాలరు. మఱియు నెలదినము

లలో మీవైరుల నందఱను నెటుల విధ్వంసనము గావించె దనో మీకన్నులారఁ గాంచఁగలరు. మఱియు నిశ్చింతుఁడనై నాప్రియపత్నీ సమేతముగ నామందిర మందు నివసించుచు సంతోషపూర్వకంబుగ నాజీవితమును గడపుచుందును.

మాయారాణి:—(దీర్ఘనిశ్వాసము బరిత్యజించి) మంచిది. అటులనే యొనంగెదను.

జటాశం:—ఇఁక నాలస్యమెందులకు?

మాయారాణి:—కార్యము తుదముట్టించుటయే తడవు!

జటాశం:—నాయాటంక మేమికలదు?

మాయారాణి:—నీవు భుజించునరికిఁ జీకటి పడునని యు, మన మపు డేగ వచ్చునని యు నిప్పుడే కదా చెప్పియుంటిని.

ఇవ్విధంబునఁ బలికి మాయారాణి యొకగంట మోగించెను. ఆధ్వని నాలించినంతనే కొందఱు పరిచారికలు పరుగున నచటి కేతెంచి కరములను జోడించి యామె కట్టెదుట నిలచిరి. మాయారాణి వారినిఁగని, "భోజనపదార్థముల నాయత్తపఱచి జటాశంకరుని కొసంగుఁ"డని యాజ్ఞాపించెను. జటాశంకరుఁడు భోజనముగావించి వచ్చునరికి బాగుగఁ జీకటిపడి యుండుటచే మాయారాణి వానివెంట నధ్యక్షుని మందిరమున కేగుటకు సిద్ధపడెను. మఱియు జగవతినిగూడ వెంటఁబెట్టుకొనెను. ఆముగ్గురు తమముఖములను నకాబుపోషులవలన మఱుఁగుపఱచుకొని యశ్వారూఢులయి యచటినుండి బయలు దేరిరి. మఱియు మాటలాడునంతలో నధ్యక్షుని మందిర సమీపమునకుఁబోయి చేరిరి. వారలాగుఱ్ఱముల నుండి దిగి వానిని తరుమూలములకు బంధించి యామందిరము వైపునకు బయలు దేరిరి. ఆమందిరముయొక్క తాళపుఁజెవిని మాయారాణి జటాశంకరున కొసంగి దానిరహస్యములనుగూడ వాని

కఱింగించి యుండెనని మేము పైన లిఖించియుంటిమి. జటాశంకరుఁ డందఱకంటె ముందుగ నామందిరమువైపునకు దారిపట్టెను. వాని వెనుక మాయారాణీజగపతులు నేగఁదొడంగిరి. జటాశంకరుఁ డామందిరమునకుఁ గుడివైపునఁ గల వసారాలోనికిఁ బోయి చేరెను. అచటనొకగది కలదు. దానిద్వారము బంధింపఁబడి యుండెను. ఆద్వార మెట్టిధంబునఁ దెఱవఁబడుచున్నదో దానియందు బీగపురంధ్ర మెచటఁ గలదో తెలియకుండెను. జటాశంకరుఁ డాద్వారము సమీపమున కేగి తనకతుపాలనుండి యొక తాళపుఁజెవిని వెడలించెను. మఱియు నాద్వారమునకుఁ బ్రక్కగోడయందు దాపింపఁబడియుండిన దారుపలకముపై సత్తువ కొలఁది చేతితోఁ గొట్టసాగెను. అటుల నాలుగైదు మాఱులు గొట్టిన పిదప నాదారుపలక మొకవైపునకుఁ దొలఁగిపోయెను. మఱియు నాస్థానమందుఁ జేయిపట్టునంతటి రంధ్ర మొకటి చూపట్టసాగెను. జటాశంకరుఁడా రంధ్రమందుఁ దనచేయిఁ జొనిపి యాతాళపుఁజెవితో బీగమందు ద్రిప్పుటతోడనే దాని కవాటము దెఱువఁబడెను. తదనంతరమా ముప్పురాగదియందుఁ బ్రవేశించి లోపలివైపునుండి మఱల నాద్వారమును బంధించివైచిరి. తోడనే యాదారుపలక మెప్పటియటుల యథాస్థానమునకుఁ జేరి యారంధ్రమును మూసివైచెను. ఆగదియందుఁ జీఁకటి దట్టముగ నావరించి యుండుటచే జటాశంకరుఁడు దనకతుపాలనుండి సామానులను వెడలించి యొక మైనపు వత్తిని వెలుఁగించెను. దాని ప్రకాశమం దాగదికి మధ్యభాగమున నైదంగుళములు మందముగల యినపరేకు గోళాకారముగ భూమితో సమమట్టముగ దాపింపఁబడియుండుట చూపట్టెను. దాని పైనలుగురైదుగురు మనుష్యులు యథేచ్ఛగ నిలచియుండఁగలరు. ఆగోళాకారపు టినుపరేకునకు మధ్య మూఁడుగజముల మెత్తుగల

యినుపకంబమొకటి గలదు. దానికొనయం దొక చక్రమమర్పఁబడి
యుండెను. ఆచక్రముపైనుండి భూమిలోనికొక యినుప గొలుసు
వెడలియుండెను. మాయారాణి జగపతీ జటాశంకరులు ముఖ్యరా
కంబమును గట్టిగాఁబట్టుకొని తాయినుపరేకు గల భాగమునందు నిలచి
యుండిరి. జటాశంకరుఁడు తనకుశ్రేణితో నా చక్రమును గిరగిరఁద్రిప్ప
నారంభించెను. వెంటనే కొంతధ్వనితో నాయినుపతగడా స్తంభము
నమేతముగ భూమిలోనికి దిగిపోన నారంభించెను. అవిధంబున ని
రువదిగజములు క్రిందకు దిగిపోయినపిదప నది యొకగుప్తస్థానగల
భూమిలోఁ దాఁకెను. ఇరువురును మిగుల వైశాల్యము
గల యొక గదియందుఁ బ్రవేశించిరి. ఆగదికిఁదూర్పుదెస గోడ
యందు నొకసురంగము నిర్మింపఁబడి యుండెను. పశ్చిమదిశనొక
సామాన్యమగు బావి గలదు. ఉత్తరపుస్థానమున నాలుగుసుంకసములు
చూపట్టుచుండెను. దక్షిణపార్శ్వమున నినుపగజములతో నమర్చిన
ద్వారముగల గదియొకటి గలదు. దానిలోపల భూమిపైనొకమనుజుఁ
డుబోరగిలఁబడియుండెను. మఱియు భూమియంతయు నెత్తుటఁ దోఁగి
యుండెను. జటాశంకరుఁడు వానిని గాంచుటతోడనే త్రుళ్ళిపడి,
"ఆశ్చర్యము! ఈముకుందసింహుఁడు దనశిరమును భూమిపై
మోదుకొని ప్రాణములను త్యజించి యుండినటులఁ దోఁచుచున్న"
దనెను.

మాయారాణి:—అటులనే కావచ్చును. నేనిపుడు వీనిని తుదము
ట్టించుటకేకదా యిచటికే తెంచి యుంటిని. పోనిమ్ము!
పీడ దొలఁగిపోయినది. ఇతఁడు దనప్రాణములను దానేపోగొ
ట్టుకొనియున్నాఁడు. (సందేహించుచు) "కాని, యితఁడు
ప్రాణనొందెనో లేక నింకను జీవించియుండెనో మనకెటుల
నిశ్చయముగఁ దెలియఁగలదు?

జగపతి:—(ముకుందసింహుని వైపునకు గాఢదృష్టినిగుడించి) శ్వాసోశ్వాసల సద్దుయేమియు వినిపించుట లేదు. ఇతఁడు మరణించియుండెనని యే తలంపవచ్చును.

జటాశం:—(మాయారాణివైపునకుఁ గాంచి) మీరీగదిలోనికిఁ బోయి బాగుగఁ బరీక్షింపుఁడు. దీని బీగమును దెఱతునా?

మాయారాణి:—వలదు వలదు. నేనిపుడుగూడ వాని సమీపమున కేగుటకు భీతిల్లుచుంటిని. అతఁడొకవేళ నిటుల నటించుటలేదుగదా! (ముకుందసింహునివైపునకు బాగుగ నిరీక్షించి) తిలస్మకైజారు వీని యొద్దఁ జూపట్టకుండుటకుఁ గతంబేమి?

జటాశం:—మోహనసింహుఁడు దానిని గొన్నిదినములు తనయొద్దనుంచుకొనుటకు వీనిని బ్రార్థించియున్నాఁడు. ఇపుడాతిలస్మకైజారు వానియొద్దఁగలదు.

మాయారాణి:—అగుచో, నిర్భయముగ నీవిపుడీగదిలోనికిఁ బోఁగలవు. ఇతఁడుజీవించి యుండినను వానియొద్ద నెట్టి యాయుధమునులేదుగదా? మఱియు నీయొద్ద తిలస్మకైజారు గలదు కావున నిన్నాతఁడేమియుఁ జేయఁజాలఁడు.

జటాశం:—ఔను. నాకెట్టిభీతియుఁ లేదు.

ఇనుపగజములతో నమర్పబడియుండిన యాద్వారమున నొక బీగము బంధింపఁబడి యుండెను. జటాశంకరుఁడా బీగమును దెఱచి యాగదిలోనికిఁ బ్రవేశించి ముకుందసింహుని శవమును పైకెత్తి మరల దానిని వెలికిఁ బరుండఁబెట్టెను. మఱియు మాయారాణివైపునకుఁ బరికించి, "మీరునిర్భయముగ దీనిలోని కేతెంచి యీశవమును గాంచుఁ" డనెను. మాయాయాణి జగపతిచేయిఁ బట్టుకొని యాగదిలోనికిఁ బ్రవేశించెను. మఱియు నాశవమువైపు

నకుఁ బాగుగ నిదానించిచూచి, " యితఁడు భూమిపై శిరమును మోదుకొనుటవలనఁ ద్రిదల బ్రిద్దలయి విస్తారముగ రక్తము వెడలిపోయి తుదకుఁ బ్రాణములు గూడ వెడలిపోయి యున్నవి. వీని యాకార మెంత భయావహముగఁ జూపట్టుచున్నదో పరికింపుఁ" డని పలికెను.

ఇపుడు ముకుందసింహుఁడు నిశ్చయముగ మరణించి యుండెనని యెఱుంగుటచే మాయారాణికిఁ గలిగిన సంతసమునకు మేర లేకుండెను. మఱియుఁ బ్రసన్నముఖయై జటాశంకరునివైపునకుఁ దిలకించి, "నేనిపుడు కృతార్థురాలనైతిని. ఇఁక నాకెట్టి చింతయులేదు. నే నీప్రపంచమందు హాయిగ జీవయాత్రను గడుపఁగలను. కాని, యీశవమును రూపనామములు లేకుండఁ జేయు టత్యావశ్యక"మనెను.

జటాశం:—ఇది యొక ఘనకార్యము గాదు. అడవినుండి కట్టెలను గొనితెచ్చి దీనిని భస్మీపటలమును గావింపవచ్చును.

మాయారాణి:—కాదు కాదు. రాత్రిసమయంబున నీయడవి యందధిక ప్రకాశము చూపట్టినచో, బ్రజల కెట్టి శంకయేనియు జనింపవచ్చును. లేదా, విజయేంద్రసింహుని మైయారుల లో నెవ్వరేనియు నీదెస కరుదెంచి యీవిషయమును గని పెట్టఁగలరు.

జటాశం:—మంచిది. పోనిండు! దీనికంటెఁ దేలికయగు నుపాయము వేఱొకటి గలదు.

మాయారాణి:—అది యెట్టిది?

జటాశం:—ఈశవమును బైకెఁ దీసికొనిపోయి తుండతుండములుగ నఱికి ప్రవాహమందు విడచినచో, మాటలాడునంతలో వానిని మీనములు భక్షింపఁగలవు.

మాయారాణి:—ఔను. ఈయాలోచన మిగులఁ జక్కఁగ నున్నది. మంచిది. దీనిని వెలుపలకుఁ దీసికొని నడుపుము.

జటాశంకరుఁ డాపే్రతము నెత్తి యాయినుపతగడుపై నుంచెను. పిదప నాముగ్వురు నాయినుపకంబమును బట్టుకొని నిలువఁబడిరి. జటాశంకరుఁ డాచక్రమును మరల వెనుకవైపునకుఁ ద్రిప్ప నారంభించెను. ముహూర్తకాలములో నాయినుపతగడు పైకెగసి పైతట్టు భూమితోఁ జేరుకొనెను. జటాశంకరుఁడు లోపలినుండి యా గది ద్వారమును దెఱచి, యాశవమును వెలుపలకుఁ గొనిపోయి యచటఁ బడవైచెను. తదనంతర మతఁ డాద్వారమును మొదట నెటులఁ దెఱచెనో యటులనే దానిని మరల బంధించివైచెను. మాయారాణి సన్న నెఱింగి జగపతి యాశవమును దుత్తునియలుగ ఖండించి యామాంసాస్థి ఖండములను ప్రవాహజలమందుఁ బడవైచెను. మఱియు నాప్రవాహమునుండి కొంతజలమును గొనిపోయి యచటి స్థానమును బాగుగఁ గడిగి శుభ్రపఱచెను. అన్ని కార్యములనుండి నిశ్చింతులైన పిదప నాముగ్వురుఁ దమతమ వాహనములపై సధిరోహించి తిలస్మాద్యానమువైపునకుఁ బయలుదేరిరి. మఱియు నర్ధరాత్రము గడవకమున్నె యాతిలస్మాతోఁటలోనికిఁ బోయి చేరిరి.

తదనంతరము జటాశంకరుఁడు మాయారాణితో, "నిఁక నా బహుమానమును నొసంగుఁ"డని పలికెను.

మాయారాణి:—మంచిది! నే నొసంగుటకు సంసిద్ధముగ నుంటిని. (నవ్వుచు) ఏమి! జటాశంకరుఁడా! ఇపుడు నాయక్కఱ దీరి యున్నదికదా! నీకాయంతర్భవనపుఁ దాళపుఁజెవి నీయ కుండిన నేమిచేసెదవు?

జటాశం:—చేయునదేదికలదు. నేను నీసమక్షమునఁ బ్రాణములను త్యజింతును.

మాయారాణి:—నీప్రాణములుపోయిన నాకేమి?

జటాశం:—(కిలకిల నవ్వుచు) నేను నిక్కువముగఁ బ్రాణములఁ బాయుదునని తలంచుచుంటిరి కాఁబోలు. కాదు కాదు. అటులేల కావింపవలెను? నేను మొదట మృగాంకవతియొద్దకు నేఁగి నాయపరాధమును క్షమింపఁజేసికొందును. తదనంతరము మీరు నాకు వివరించియుండిన మర్మము లన్నింటిని నామెకు సవిస్తరముగ వివరించి తెలిపెదను. ఇంతియే కాదు. తుదకు మీప్రాణములను గూడఁ దీయుటకు సమకట్టెదను. తిలస్మాద్యానుని విలాసమందిరముయొక్కయు మోహినీభవనముయొక్కయు సమస్తరహస్యములను నేను తెలిసికొని యుంటిని. మఱియు నేనెంతటి యుపద్రవములను గలిగింపఁజాలుదునో దానిని మీరు స్వయముగ నెఱింగియున్నారు. నేనిపుడీ తిలస్మాద్యానమునకు మీసహాయము లేకయే నేకాకిననియుఁ దలంపకుఁడు. కారణంబేమన....

మాయారాణి:—(నవ్వుచు) ఇంకఁబాలింపుము. నీవే ప్రాణము గాకుము. నేనూరకఁ బరిహాసభంగి పలికితిని. నీవు నిక్కవముగఁ దలంచితివిగాఁబోలు. మాయారాణి యాడిన మాట యెన్నఁడు దబ్బఱ గాఁజాలదని విశ్వసింపుము! మఱియు దాతృత్వమందును వెనుకంజవేయునదానినియుఁ దలంపుము! మంచిది. నీవిచటనే కూర్చుండి యుండుము నేనిపుడాయద్భుతాంతర్భవనవుఁ దాళపుఁజెవిని గొనితెచ్చి నీకొసంగెదను.

జటాశం:—కొనితెండు. నేనుకూడ నటులనే దృఢప్రతిజ్ఞగలవాఁడనని భావింపుఁడు. నేనొనర్పఁజేయుదద్భుత కార్యములఁ గాంచి మీరమితానందము నొందఁగలరు.

మాయారాణి:—జటాశంకరుఁడా! చూడుము!! కినియకుము. నేనొకమాట నిన్నడుగవలసియున్నది.

జటాశం:—(నవ్వి) ప్రశ్నింపుఁడు! ప్రశ్నింపుఁడు!!

మాయారాణి:—నేను నీకనుఁ బ్రామి వేఱొక తాళపుఁజెవిని దెచ్చి యిచ్చిన దానిని నీవెటుల గ్రహింపగలవు?

జటాశం:-జటాశంకరు నొక మూర్ఖునిగఁ దలంచుచుంటిరిఁగాబోలు ఆతాళపుఁజెవి పుస్తకాకారముగలిగి యుండును. దాని రెండు కొనలయందునుఁ దేనెటీఁగలు ముట్టడించి యుండును. జటాశంకరుఁడు దానిని బాగుగ గుర్తింపఁగలఁడు.

మాయారాణి:—సెబాసు! నీవెంత కేనియుఁ దగియున్నావు. ధూర్తుఁడవు. చాకచక్యముగలవాఁడవు. నీవు సాధారణముగ నొకరివంచనకుఁ జిక్కువాఁడవుగావు. నీవీయుదంతమంతయు నాదురాత్మురాలు మృగాంకవతి వలన........"

జటాశం:—ఔను. నేనామె వలననే తెలిసికొని యుంటిని. కటకటా! ఏయమ యలభ్యంబగు తిలన్మకై జారును నాకొసంగి మిక్కిలి గారవించియుండెనో యట్టిదయార్ద్రహృదయయగు మృగాంకవతి పక్షమును వీడునటులొనరించి మీవజ్జకుఁ జేర్చి యామెపైఁ బగబూనుటకు బలాత్కరించిన దాయంత ర్భవనపుఁ దాళపుఁజెవి యందలి లోభచింతయే! భగవంతుఁడా! ధనతృష్ణ యెంతటివారికైనను దీరదుగదా?

మాయారాణి:—మంచిది! నీకోరిక ప్రకార మాతాళపుఁజెవి నొసంగుచుంటిని. తదుపరి నీకొక యమూల్యపదార్థమును గూడ నొసంగుటకుఁ దలంచుచుంటిని. నీవు దానిని గాంచుటతోడనే మాయారాణి యీవి సాటిలేనిదనియు నన్నెంతయో ఘనముగ సత్కరించి యున్నదనియుఁ దలంపక మానవు.

తదనంతరము మాయారాణి జటాశంకరునితో నచటఁ గూర్చుండి యుండుటకుఁ దెలిపి యచటినుండి వెడలి యొకయరగంట కాలములో నొకమణిమయ సంపుటమును జేతఁగొని తిరిగివచ్చెను. మఱియు దానిని జటాశంకరుని యెదుట నునిచి వానితోఁ, "గైకొనుము. నీవుకోరిన యనర్ఘపదార్థమును దెచ్చితి" ననెను. జటాశంకరుఁ డాసంపుటమును దెఱచి చూచెను. దానియం దొక చిన్న పాత్రము గలదు. అతఁడు దానిని వెడలించి యిటునటుఁ ద్రిప్పి చూచుచు, "నిదియే నేను కోరిన తాళపుఁజెవి" యని పలికెను. మఱియు నామెతో నేనిపుడు మృగాంకవతి చెంతకుఁబోయి యచటి కార్యచరణములను గొంత తెలిసికొని వచ్చెద" ననెను.

జటాశంకరుఁ డటులా తాళపుఁజెవిని బడసి మాయారాణి వలన ననిపించుకొని యమితానందభరితస్వాంతుఁడై యాతిలస్మోద్యానమును దాఁటి యచటనుండి యుత్తరదిశగ బయలుదేరెను. అతఁ డామార్గమున గొంతదూరము వఱకు వెడలిన పిదప నొక తావున నిలచి యిటునటుఁ బరికింపసాగెను. వెంటనే యచటివృక్షముల మాటుననుండి యిరువురు మనుజులు వెడలివచ్చి వానిని సమీపించి నిలచిరి. మఱియు నాయిరువురలో నొకఁడు జటాశంకరుని వైపునకుఁ బరికించి, *"ఓమగినచావ?" యని ప్రశ్నించెను. దానికిఁ ప్రత్యుత్తరముగ ♦ "చేహ" యని జటాశంకరుఁడు పలికెను. అంత నామనుజుఁడు సంతోషపారవశ్యుఁడయి వానిని కంఠాలింగనము గావించుకొని మిగుల నగ్గింప సాగెను. తదనంతర మామువ్వురుఁ గూడి యచటినుండి ముందువైపునకు దారిపట్టిరి!

---

*ఆతాళపుఁజెవి చేఁజిక్కినదా?

♦ ఔను.

# ౧౭

నేటికిఁ బదిదినములకుఁ బూర్వము మాయారాణి యెట్టిభయంకర దుస్థితియందుఁజిక్కి యుండెనో దానికిఁ గొంచెమైనను పరిమితి లేకుండెను. ఆమె జీవించి యుండినచోఁ దన్నొకమృతప్రాయురాలినిగఁ దలపోయుచుండెను ముకుందసింహుఁడు చెఱనుండి తప్పించుకొని పారిపోవుటచే భయవిచారసంభ్రమములు నలుదెసలనుండి యామెను ముట్టడించి మిక్కుటముగ బాధించుచుండెను. ఇంతయేల? ఆమె యెవరిని వంచించి బంధించి రూపడంచుట కనేక విచిత్ర వ్యూహములను రచియింపవలసి వచ్చెనో యట్టి మృగాంకవతీవిజయేంద్రసింహులును వారిపక్షపాతులు నిపుడెట్టి కార్యాచరణములను గావించుచుండిరను విషయమును గనిపెట్టుయోజనయైన నామెకు లేకుండెను. ఆమె ధ్యానమంతయు ముకుందసింహునివైపునకుఁ గలదు. అతఁడు జీవించియుండిన సమాచారమును దనవంచన కృత్యములును ప్రజలకుఁ దెల్లమగుననుభీతి యామెకు విశేషముగఁ గలిగియుండెను. మఱియు నాదురంతదుస్సహావిచార మామె నొకవ్యథురాలనుగఁ జేసియుంచెను. కాని, జటాశంకరుని కారణంబున నిపు డన్నివిధముల నిశ్చింతురాలనైతిననియుఁ దనపై నావహించి యుండిన పీడాపిశాచ మిపుడు తొలఁగిపోయెననియు, నిఁక శాంతిపూర్వకంబుగఁ దనజీవితమును గడపవచ్చుననియు మాయారాణి తనయుల్లంబున భావించుచుండెను. ఇఁక మహేంద్రనరేశసింహుల వలన దన తిలస్మము ఖండింపఁబడరాదను చింతమాత్ర మామెకుఁ గలిగియుండెను. ఈతిలస్మ కారణంబుననే యన్యాన్యపృథ్వీశులకుఁ బక్కలోని బల్లెమై తన నిరంకుశ ప్రతాపోజ్జ్వలంబున వారిని గంపింపఁజేయుచుంటిననియు, నీతిలస్మము ఖండింపఁబడుచోఁ దానొక సామాన్యురాలుగఁ బరిగణింపఁబడుదుననియు, దీనిరహస్యముల

నెఱింగియుండిన మృగాంకవతి మహేంద్ర నరేశసింహులకుఁ దోడ్పడుచో ననేకానర్థములు సంభవింపఁగల వనియు, నేవెర వునసైన నామెను కనుఁబ్రామి బంధింపవలెననియు వీలు చేఁజిక్కిన తుదముట్టింపవలెననియు మాయారాణి తలపోయు చుండెను.

వాస్తవమందు మాయారాణి తలంపు తప్పిదమైనదిగాదు. మఱియు నేఁ డతిశయించిన యామె గర్వోద్ధతి యంతరిక్షముపై నధిరోహించి యుండెను. జటాశంకరునిఁబోలు పరిజ్ఞానిధియగు మైయారుని తనపక్షమునకుఁ ద్రిప్పుకొని యుండుటచేఁ దాను తలంచిన కార్య మెట్టిదైన నవలీలఁ జేయఁజాలుదుననను ధైర్యమామెకు బాగుగఁ గలిగియుండెను. కాని, రాజేశ్వరి తప్పి విడిపోయెనను చింతమాత్ర మామెను పీడించుచుండెను.

జటాశంకరుఁ డటుల మాయారాణివలన సత్కరింపఁబడి తిల కోద్యానమును దాఁటి పోవునప్పటికి వేకువజాము సమీపించియుండె ను. మాయారాణి యప్పటివఱకు మేల్కొని యుండుటచే శయ్యపై మేనువాల్చుటయె తడవుగ నామెను నిద్రాదేవి యావహించెను. మఱియుఁ దెల్లవాఱి యొకజాము ప్రొద్దెక్కువఱకటులనే నిద్రిం చుచుండెను. తదనంతరము జగపతి యచటికి కేతెంచి యామెను నిద్రనుండి మేల్కొల్పుటచే లేచి కూర్చుండెను. మఱియుఁ బ్రాతః కాల నిత్యకృత్యములను దీర్చుకొని, యామోదప్రమోదంబుల నా పగలంతయుఁ గడపెను. కాని, యర్ధరాత్రము గడచిన పిదప నొక యాశ్చర్యజనకంబగు ఘటనమును గాంచి, యామె దుఃఖభయసం తాపంబులఁ దల్లడిల్లఁ దొడంగెను.

అర్ధరాత్రము గడచియుండెను. పలువిధంబులగు నపూర్వ సుందరోపకరణములతోడను, నాధునిక విలాస వస్తుసమితితోడను నలంకరింపఁబడిన యొక శయ్యాగారమందు దేదీప్యమానంబగు

మణిమయ హంసతూలికాతల్పంబునఁ బరుండి మాయారాణి గాఢ సుషుప్తియందు మునిఁగి యుండెను. నవయౌవనలును సుందరాంగులునగు కొందఱు పరిచారికలు విచ్చుకత్తులను జేత ధరించి యాశయనాగారము వెలుపల నిటునటుఁ దిరుగుచు నప్రమత్తలై కావలి గాయుచుండిరి. నిద్రాభరంబున శయ్యఁజేరి మాయారాణి యెపుడు కనులు మూసెనో, యాసమయంబున మిగుల సొబగులీనుచుండిన యొక బిల్లోరీ గాజుకుప్పెయందు సుగంధతైలముతో నిండి యుండిన దివ్వె యొకటి వెలుఁగొందుచు, సన్నని వెలుతురు నిచ్చుచుండెను. ఆగది కవాటములు మూయఁబడి యుండెను. కాని, కొంతసేపటి కాదీపమెటుల గనుమయ్యెనో తెలియదు. ఇపుడాగదియందు నంధకారము బాగుగ వ్యాపించి యుండెను.

మాయారాణి యొక గొప్ప తిలస్మమునకును రాజ్యమునకును నధీశ్వరిణి. నవయౌవనవతి. సుఖముగ్ధ. నిద్రావస్థయందు నహిత మామె కేమాత్రపుసవ్వడి వినిపించినను మెలఁకువఁగని లేచి కూర్చుండును. సుషుప్తావస్థయం దొక గాజుకుప్పె బ్రద్దలగు సవ్వడి వినిపించుటచే నామె తటాలున లేచి కూర్చుండెను. మఱియు పర్యంకము డిగ్గి తడుములాడుచు నెమ్మదినెమ్మదిగా ద్వారము చెంతకుఁ బోయి దానిని దెఱవఁబోయెను. కాని, దానియం దొక బీగము బంధింపఁబడి వ్రేలాడుచుండుట నెఱింగి యబ్బురపాటుతో మిగులఁ గలఁత నొంతసాగెను. భయాతిరేకంబున నామె గుండియలు దడదడ కొట్టుకొనఁ దొడంగెను. "అకటా! ఇది యెట్టి వైపరీత్యము! ఈగదిలోని కేతెంచిన వారెవ్వరు? ఈబీగము నెవరు బంధించియుంచిరి? గది వెలుపల పహరా లేకుండెనా? నాకు సూచింపకయే యీగదిలోని కేతెంచు సాహస మెవ్వరికిఁ గలిగె? ఈద్వార మిపుడు లోననుండి బీగమువలన బంధింపఁబడి యున్నది

కావున, నిట కేతెంచిన వారెవ్వరో దీనియందే యుండవలెను. ఈ కార్యము జగపతి యొనరించినదికాదుగదా? కాదు కాదు. ఇంత గొప్ప సాహస మామె కేల కలుగఁ గలదు!" యివ్విధంబులగు ననేక యోజన లామె సంభ్రమమును మఱియు వృద్ధి నొందింప సాగెను.

భయకారణంబున నామెనోట నేమాటయు వెడలకుండెను. తన పరిచారికలనైనను కేకలిడి పిలువఁజాలదయ్యెను. తుదకు నిరుపాయయై ద్వారముచెంతఁ గూర్చుండి కన్నులనీరు గాఱ్చుచుఁ దన భాగ్యమును దలంచి దురపిల్లఁ దొడంగెను. అంత నాగదియం దడుగులసవ్వడి లోఁచుటచే నామెకుఁ గలిగియుండిన భీతి యినుమడింప సాగెను. తోడనే మాయారాణి యచటినుండి లేచి గోడతో నతుకుకొని నిలచియుండెను. క్రమముగ నాగదియం దొక మనుజుఁడు యిటునటుఁ బచారు చేయుచుండినటు లామెకు స్పష్టరూపమున దోపఁ దొడంగెను.

మఱియు నామనుజుఁడు మాయారాణి నిలచియుండిన తావుననుండియే పాదములు భూమిపైఁ దట్టుచు ముందున కేగి చుట్టుదిరిగి వచ్చుచుండెను. ఎట్టకేలకు మాయారాణి కొంత ధైర్యమును దెచ్చుకొని యామనుజుని నిహనన మొనరించునుద్దేశ్యముతోఁ దన మొలనుండి కైదువును దూసి వానిపై లంఘించుటకుఁ దలంచెను. అంతఁ నాదిట్టరి దటాలున చేగుత్తి దృఢముగ బట్టుకొని రెండవచేతితో నామె చెంపపై గట్టిగ మోదెను. ఆమె మొదటినుండియు భయాతిరేకంబున దల్లడిల్లుచుండుటచే నావేట్టున కోర్చుకొనజాలకఁ గెవ్వున యఱచి మూర్ఛాగతయై భూమిపైఁ గూలెను.

ఆమనుజుఁడు దన దోర్మూలమునుండి యొక దొంగలాంతరును వెడలించి దానిముఖముపైఁగల మూఁతను దెఱచివైచెను. వెంటనే యాగదియందు బాగుగఁ బ్రకాశము వ్యాపించెను. అనమ

యంబున మాయారాణికిఁ జైతన్యము గలిగియుండినను నామె యామనుజుని గుర్తింపఁజాలదు. కారణంబేమన, నాచతురుఁడు తన మోము నొక నకాబువలన మఱుఁగుపఱచుకొని యుండెను. ఆగది యందలి గోడలు టేకుమ్రాను పలకలవలనఁ గూర్పఁబడి మిగుల స్వచ్ఛమగు మెఱుఁగు మలామాతోఁ బూఁత పెట్టఁబడి యుండెను ఆపర్యంకమునకుఁ బాదముల తట్టుననున్న గోడయం దొక దారు ఫలకము తలుపుతెక్కవలెఁ దెఱవఁబడి యొక్కమాఱుగ నొక మనుజుఁడుమాత్రము ప్రవేశించుటకుఁ దగిన రంధ్రమేర్పడి యుండెను. ఆమనుజుఁడు మూర్ఛాగతురాలై పడియుండిన మాయారాణిని దనచేతులలోనికి దీసికొని యాపర్యంకముపైఁ బరుండఁ బెట్టెను. తదనంతర మాద్వారమునకుఁ దాను బంధించియుంచిన బీగమును విప్పి తనయొద్ద నుంచుకొని యారంధ్రము మార్గమున రెండవవైపునకుఁ వెడలిపోయెను. మఱియు వెంటనే యాదారుపలకముమూఁతవడి యారంధ్రమును నెప్పటియటుల మూసివైచెను.

ఒక గంటకాలము గడచిన పిదప మాయారాణికిఁ జైతన్యముగలిగి కన్నులదెఱచి యాగదియందుఁ జీఁకటి వ్యాపించి యుండుటఁ దిలకించెను.

చేతులతోఁ దడిమి చూచుటవలన, దానొక మంచముపైఁ బరుండియుండుటఁ దెలిసికొనెను. కాని, భయాతిరేకంబున జాలసేపటివఱకుఁ గదలక మెదలక నాశయ్యపైఁ బరుండియుండెను. ఎంతసేపు కనిపెట్టి చూచినను నాగదియం దడుగులచప్పుడుగాని యెట్టి సవ్వడిగాని వినిపింపకుండుటచేఁ గొంతధిటవు దెచ్చుకొని లేచి ద్వారముచెంతకుఁ బోయి చేరెను. మఱియు దానియం దిపుడు బీగము లేకుండుటఁగని బ్రతికితిని దైవమా! యనుకొనుచుఁ దలుపులు దెఱచుకొని వెలుపలకు వెడలిపోయెను. మఱియు నచటఁ

గొందఱు పరిచారికలు పిచ్చుకత్తులతో నాద్వారసంరక్షణను దత్త చిత్తులై యుండుటఁ గన్నగొనెను. మాయారాణి తనులెత్తి కేయుచు, నా పరిచారికలఁ గలయఁగని "గదిలోని కెవ్వరే తెంచియుండి" రని ప్రశ్నించెను. అంత నాపరిచారిక లామె పలుకుల కక్కజపడుచు, "మహారాణీ! మేమత్తిజాగరూకతతోఁ గావలి గాయుచుంటిమి. ఈదెస కెవ్వరును వచ్చినజాడయే లేదు. ఇఁక మీశయనాగారము లోని కెవరు రాఁగల" రని పలికిరి.

పరిచారికల వచనములపై మాయారాణికి విశ్వాసము జనింపకుండుటచేఁ జాలసేపటివఱకు మండిపడుచు వారలను దూషింపసాగెను. మఱియు వారలు దన్ను వంచించి శత్రుపక్షమునఁ జేరియుండిరను సందేహ మామెకుఁ గలుగుచుండెను గాని, వారల యపరాధ మెద్దియు స్థిరపడకయే దండించుట భావ్యము గాదని తలంచి ఖిన్నకుండెను.

భయకారణంబున మరల నాగదిలోనికేగి పన్నుండుటకు మాయారాణికి సాహసము గలుగదయ్యెను. వెలుపల నొక వాలు కుర్చీలోఁ గూర్చుండి మిగతరేయి యంతయు నచటఁ గడపెను. తెల్లవారెను. కాని, బాగుగ ప్రకాశము వ్యాపించియుండలేదు. అంతజగపతి యొకతోటమాలిని నొక యపరాధిని విధంబున నెట్టుచు నచటికిఁ దోడ్కొని వచ్చెను. మఱియు మాయారాణి శయ్యాగారము వెలుపల నొక కుర్చీలోఁ గూర్చుండియుండుటఁ గాంచి యాశ్చర్యమునొందుచు, "నిదియేమి? మీరిచ టేల కూర్చుండి యుంటి" రని యామెను ప్రశ్నించెను.

మాయారాణి:— (సంభ్రమసంకలితస్వరముతో) నేఁడు నన్నాభగవంతుఁడు గాపాడియున్నాఁడు కానిచో, నిప్పటికి నాప్రాణములు వెడలియే యుండును.

జగపతి:—(ఆశ్చర్యచకితుడై) అదియేమి?

మాయారాణి:—నీవీతోఁటమాలిని నిటకుఁ దోడ్తెచ్చిన కారణ మెట్టిదో తొలుత వివరింపుము!

జగపతి:—మొదట మీవృత్తాంతమును విననిగాని దానిని దెలుపజాలను. వేగమె వివరింపుఁడు.

మాయారాణి నెమ్మది నెమ్మదిగా నారాత్రి తనకు సంభవించిన సంభవమును సవిస్తరముగ జగపతికి వివరించి తెలిపెను. ఆయద్భుత సమాచారము నాలించినంతనే జగపతి మిగులఁ దొట్రుపడుచు, నేనిపుడు బంధించి తెచ్చిన తోఁటమాలిని వృత్తాంతము నాలించిన మీమానసమునకు గొప్ప వ్యథజనింపక మానదు. పరిచారికలు మనశత్రువులతోఁ గూడియుండిరని వారిపై వ్యర్థముగ సందేహించుటకంటె నీతోఁటమాలినిపై శంకించుట సమంజసము. పాప మీపరిచారికలు ప్రభుభక్తి విశ్వాసములుగలవారు. వీరిని నేను బాగుగఁ బరీక్షించి యుంటిని.

మాయారాణి:—మంచిది! నేనావిషయమును బాగుగ యోజించి పరీక్షించి విమర్శింతును. ఈతోఁటమాలిని యెట్టియపరాధ మొనర్చియున్నదో, వేగమె వచియింపుము. ఇంతదనుక నిది తనకార్యములయందుఁ గడుజాగరూకతతోఁ బ్రవర్తించుచుండుటఁ బలుమరు గాంచి యుంటిని.

జగపతి:—తోఁటనూడ్చి పరిశుభ్రముగనుంచుట, వృక్షతతికి దోహదమొసంగుట, గుల్మలతాదులను జక్కఁగఁ బ్రాఁకించుట, లతాకుంజములను నిర్మించుట మున్నగు కార్యములయం దీమాలిని మిగుల నేర్పుకత్తెయగును. కాని,దీనిహృదయము తీక్ష్ణవిషకంటక పూరితము. నన్నుఁ బెక్కు విచారములు ముట్టడించి వేధించుటచేతను నెన్నివిధంబులఁ బ్రయత్నించి

జను కంటికి నిదుర రాకుండుటవలనను చీకాకు నొందుచుఁ బుష్పవాటికయందుఁ గొంతతడవు విశ్రమించి శాంతినిఁగూర్చుకొను తలంపుతో నేనీపుష్పోద్యానమునందు సంచరించుచుంటిని. నేను వివిధాలోచన నిమగ్నచిత్తనై శిరమువంచి యడుగులిడుచు స్నానాగారము చెంతకేగు నంత మాలతీలతానికుంజమునుండి యెండుటాకుల మురముర నినాదము నాచెవులకు సోకెను. నేనరమర నొందుచు నచట నిలచితిని. కొంతసేపటికి చిటికెలువైచిన చప్పుడును నాకువినిపించెను. నేనధికసంభ్రమాయత్తచిత్తనై "యిచటనేదియో యొక వింతకార్యము జరుగనుండె"నని తలంచితిని.

మాయారాణి:—ఆసమయంబున నీవామాలతీ లతాకుంజమునకే వైపున నెంతదవ్వున నుంటివి?

జగపతి:—నేనాకుంజమునకుఁ దూర్పువైపున గల ద్రాక్షవల్లరుల యొద్దకుఁ జేరియుంటిని. నాకాసవ్వడి వినుపించుటతోడనే యాద్రాక్షవల్లరులచాటున దాఁగి యామాలతీ లతాకుంజమువైపునకుఁ బరికింపసాగితిని. అచటఁ జీఁకటి దట్టముగ నావరించి యుండినను, నాచిటికెలచప్పుడుతోపాటిరువురు మనుజులాలతాకుంజమందుఁ బ్రవేశించుట నేను గాంచ గల్గితిని.

మాయారాణి—ఆచిటికెల సవ్వడి యెచటినుండి వినిపించెను.

జగపతి:—మాలతీ లతానికుంజమునుండి.

మాయారాణి:—మంచిది! తరువాత?

జగపతి:–నేను భూమిపైఁ బరుండి పొట్టతోఁ బ్రాఁకుచు నెమ్మదినెమ్మదిగ నాలతానికుంజము పొంతకుఁబోయి చేరితిని. అంత దానియందుఁ గొందఱు మనుష్యులు సంభాషించుచుండిన

యలికిడి నాకువినిపించెను. నేనావైపునకుఁ జెవియొగ్గి సావధానచిత్తముతో నాలింపసాగితిని. వారలెంత నెమ్మదిగ సంభాషించుచున్నను, నేనువారికి మిక్కిలి సమీపమునకుఁ జేరి యుండుటచే వారిమాటలను బాగుగ వినఁగలిగితిని. నేనాలతానికుంజము చెంతకుఁ బ్రాకిఁపోయిన పిదప నాకెవరి మాటలు దొలుత వినిపించెనో, యవి యీదురాత్ముఁరాలగు మాలిని వచియించిన పలుకులే!

మాయారాణి:—ఇది యేమని వచియించినది?

జగపతి:—నేను చాలసేపటినుండి మీరాకకెదురు తెన్నులఁ జూచుచుంటినని.

మాయారాణి:—తరువాత!

జగపతి:—దీనిపలుకులకుఁ బ్రత్యుత్తరముగ నాయిద్దరిలో నొకఁడు "నీవు వచనమును నిలుపుకొంటివి. దానికిఁ దగు బహుమాన మిప్పుడే నీ కొసంగెదము. కాని, నేఁడొండొకకారణంబున మృగాంకవతి యిచటికిఁ రాఁజాలదయ్యెను. రేపటి యర్ధరాత్రి సమయంబున నిప్పటివలెనే గుప్తద్వారమును దెఱచియుంచుటకు నీకుఁ జెప్పిపోవుటకుమాత్రము మేమిటకే తెంచి యుంటిమి. నీకింకను గొప్పబహుమాన మొసంగఁబడు"నని పలికెను.

మాయారాణి:—ఇదియేమని ప్రత్యుత్తరం బిడియున్నది?

జగపతి:—ఈదురాత్మురాలు వల్లె యని పలికి యూరకుండెను.

మాయారాణి:—తరువాత నేమిజరిగెను?

జగపతి:—నాకు మరల వారిసంభాషణము వినిపింపఁదయ్యెను. నేను నెమ్మదిగా శిరముపైకెత్తి యిటునటు దృష్టిసారించుచుండఁ గొలఁదిదూరమున నాయాగంతులిరువురు దక్షిణదిశగాఁబో

ఏడవ భాగ

వుచుఁ జూపట్టిరి. వారివెంట నీ
మియుఁ బలుకక నచటనే పడి

మాయారాణి:—నీవు కూఁకలిడి వారి
త్నింపనైతివి?

జగపతి:—వారిరువురు నిపుడు బంధించినచ
కవతి యీతోఁటలోనికి రాకుం
కుంటిని.

మాయారాణి:-సెబాసు! చక్కఁగ నాలోచి
నేమి జరిగెను?

జగపతి:—కొంతసేపటికి నేనచటినుండిలేచి, వెని
తోఁటయందు మిగుల జాగరూకతతో
తిని.

మాయారాణి:—తదనంతరము?

జగపతి:—తదనంతర మొకయరగంట కాలమ
నీవిశ్వాసఘాతుకురాలు దన నివాసమునకు వ
మార్గమందు నాకుఁ దారసిల్లినది. నేను తక్షణము
త్తెను పట్టుకొని, యిది రహస్యద్వారమును బంధించి
లేదోయని సందేహించుచు నాదెస కేగితిని.
ఆద్వారము బంధింపఁబడి యుండుటఁగని దీనిని వెం
దోడ్కొని మీచెంత కేతెంచితిని.

మాయారాణి:—(మాలినివైపునకుఁ గాంచి) ఓసీ! నీపై మోపబ
డిన యీనేరము నిక్కమైనదే కదా?

మాలిని యేమియుఁ బదులు పలుకక మిన్నకుండెను.
అంత మాయారాణి యచటఁ గావలియందు నియుక్తలయి యుం
డిన పరిచారికలదెసఁ గోపఘూర్ణితేక్షణంబులఁ బరికించుచు, "నేఁటి

యా ము యి .

కవతి బంధింపఁబడిన నట్టిచింతయు లేదు.
లిని విధంబుననే కృతఘ్నురాండ్రనియు
ుండిరనియు భావింపకఁ దీర'' దని పలికెను.
లామె యాజ్ఞకు బద్ధులై శిరములను వంచి
మఱియు వారిలో నొకతె కొంతముందున కే
ాడించి (జగపతివైపునకుఁ బరికించి) మీావచ
రయి మృగాంకవతి యీతోఁటలోనికిఁ దప్పక
లుచున్నది. ఆమె యిచ్చోట కేతెంచుటయే
మామెను బంధింపక విడచువారము గా'' మని

ఔను. నాకుఁ గావలసినదియు నదియే! నేనుకూడ
గ మీ కార్యమందుఁ తోడ్పడెదను. మఱియు నర్ధ
యంబున నాచేతితో నాగుప్తద్వారమును దెఱచి
ము తోఁటలోనికిఁ బ్రవేశించు సుఖువును జేగూర్చె
ను. చూడుఁడు! ఈమాట లితరుల చెవిఁ బడరాదు
సుమా జాగ్రత్త! యని వారిని హెచ్చరించెను.

౧౭

మాపాఠకమహాశయులను తిలస్మమందు విహరింపఁజేసి వారి మానసోల్లాసము నినుమడింపఁజేయు తరుణము మాకిపుడు చేకూరి నది. కారణంబేమన, దేనిని తిలస్మముయొక్క సింహద్వార మని నుడువఁదగునో యట్టి మాయారాణి తిలస్మోద్యానమందలి నాల్గవ తరగతి తోఁటలోనికిఁ బోయి కుమార మహేంద్ర నరేశసింహు లిపుడు నివసించుచుండిరి. రణశేంద్రసింహుని రోహిణీగడమునకును ముకుంద మోహనసింహులను కాశీపురంబునకును వీడ్కొల్పిన

పిదప మహేంద్ర నరేశాభయాజిత దిలేరుసింహులను రాజేశ్వరిని వెంటఁదోడ్కొని మృగాంకవతి మాయారాణి తిలస్మోద్యానమందలి నాల్గవతరగతి తోఁటలోనికిఁ బోవుటకు బయలుదేరుటయు, వారలు ముకుందసింహుని కథనానుసార మచటి దేవమందిరమందు నివసించుటకు నిశ్చయించుకొనుటయు మున్నగువృత్తాంతములను మేము పైఁ బ్రకరణమందు లిఖించియుంటిమి. మఱియు మృగాంకవతీమహేంద్రసింహుఁడు మున్నగు వారలను తిలస్మోద్యమని విశ్రామమందిరమునకుఁ గొలఁది దవ్వునఁగల కొండ గుట్టపై విడచి మనము జటాశంకరునివెంట మాయారాణి మందిరమునకేగు ప్రసంగము దటస్థించుటవలన, వారలా తిలస్మోద్యానమందలి నాల్గవతరగతి తోఁటలోని కేమార్గమున నేగియుండినదియు, నామార్గము యొక్క విశేషవృత్తాంతములను వర్ణించి తెలుపుట కింతదనుక మాకుఁ దరుణము చేఁజిక్కదయ్యెను. అయినను నిపుడావిషయముల నిచటఁ బ్రత్యేకించి లిఖించుటయు నంత యావశ్యకముగ మాబుద్ధికిఁ దట్టుటలేదు. కారణంబేమన, మనము గొన్ని మాఱు లాతిలస్మోద్యానములోనికేగవలసియున్నది. కావున,నచటి మార్గములు మనకు వెల్లడిగాక మఱుఁగుఁబడి యుండఁజాలవు.

తిలస్మోద్యానమందలి యానాల్గవతరగతి తోఁట యాశ్చర్య భయావకరభీభత్సరసంబుల భాండాగారము. అచటి సంపూర్ణవృత్తాంతములు తిలస్మము ఖండింపఁబడు కాలంబునగాని తేటతెల్లము గాఁజాలవు. కుమార మహేంద్ర నరేశసింహులు దమ యనుచరుల సమేత మచటికిఁజేరి తొలుతఁబరికించి యుండిన బాహ్య విశేషములనుమాత్ర మిచట నుల్లేఖించుచుంటిమి. మనము తోఁటయని వాడుచుండిన యాస్థానమందుఁ బుష్పఫలపత్రి గుల్మలతాదు లెవ్వియును లేవు. అస్థానమునకు నల్దువైపులఁ జిక్కుమందిరములు నిర్మిం

పఁబడి యుండెను. దేనియందు మన రాజకుమారు లిరువురు విమలచి త్తంబులఁ దమ శుభముల గోరుచుఁ బ్రేమానురక్తలై యుండిన నాయికామణు లిరువురితోడను, నగత్యమగుచోఁ బ్రాణములను సహితము దృణప్రాయముగఁ దలంచి యర్పించుటకు నిరంతరము సంసిద్ధులై యుండు మైయ్యారులతోడను, నివసించుచుండిన దేవ మందిరమును కేంద్రస్థానముగ భావించి మేమచటి వృత్తాంతము లను వ్రాయఁ గడంగుచుంటిమి. దేవమందిర మనుపేరఁ బఱగు చుండిన యామందిరము వాస్తవముగ నొక విష్ణుమందిరముగాని శివాలయముగాని కాదు. అయ్యది నేలనుట్టుమునుండి పదిగజముల యెత్తున నలుబది స్తంభములపై విచిత్రవైఖరి రక్తశిలలతో నిర్మిం పఁబడిన యపూర్వసౌధరాజము. ఆనలుబది స్తంభములకు నడుమఁ బదిగజముల వైశాల్యముగల మఱియొండు స్తంభముగలదు. దాని యందుఁ బలువిధంబులగు యనేక విగ్రహములు నిర్మింపఁబడి నయ నానందకరంబుగఁ జూపట్టుచుండెను. ఆమందిరమున దదితర పదార్థ ము లెవ్వియును లేవు. మఱియు నాదేవమందిరములోనికేగు మార్గ మేవైపుననుండిగలదో యదియెచ్చటనుండియుఁజూపట్టకుండెను. ఇది యుఁగాక మఱియొండు విశేషము గలదు. ఆమందిరములోని మను జులను వెలుపలివైపునుండి యెవ్వరును చూడకుండుటకు దానిచుట్టు పిట్టగోడలెత్తుగఁ గట్టఁబడి యుండెను. ఆదేవమందిరమునకు నలు వైపుల వరుసలుదీర్చి మిసుల దృఢములగు బోదులు నిర్మింపఁబడి యుండెను. ఆబోదులయందుఁ బలువిధంబులగు ఫలపత్ర పుష్పజాతు లుగలవు. కాని, యవి స్వతస్సిద్ధమైనవి గావు. అవియొక విధంబగు ధాతువువలన నిర్మింపఁబడి చూపఱుల దృష్టిని వంచించుటకుఁ బలు విధంబులగు రంగులతోఁ జక్కఁగ బూఁత పెట్టఁబడి యుండెను. ఈ కారణంబున మనమీస్థానమును దోఁటయని పిలచుటయు ననుచి

తము గాంజాలదు. ఆకృత్రిమోద్యానమందు మధ్యమధ్య నిరువురి రువురు కూర్చుండుట కనువగునట్టుల మిగుల స్వచ్ఛతమములగు స్ఫటికశిలలతోఁ గొన్ని వేదికలు నిర్మింపఁబడి యుండెను.

ఆవృత్తశ్రేణులకు నలువైపుల ననేక చిన్నచిన్న గదులును మందిరములును గలవు. వానిప్రత్యేక స్థితినివర్ణించి తెలుపుట కీసమయంబున నట్టి యావశ్యకమునులేదు. కాని, దేవమందిరమునకును నావృత్తశ్రేణువులకును నలువైపుల నొకదానికి మఱియొకటెదురుగ నుండిన మందిరముల నాల్గింటి వృత్తాంతమును మాత్ర మిచట లిఖించినగాని, మన కార్యము నడవఁజాలదు. ఆమందిరములు నాల్గింటికిఁ బ్రక్కనొక్కొక్క ప్రత్యేకపుగదియు, దానికిఁ గొలఁది దవ్వునఁ నొకొక బావియుఁ గలవు.

తూర్పువైపు మందిరమునకు నలుతట్టుగోడలు పిత్తళివలన నిర్మింపఁబడి యుండెను. తత్కారణంబున నామందిరముయొక్క యుపరిభాగముమాత్రము చూపట్టుచుండెను. కాని, దానియందేమికలదో యినుమంతయు గోచరించుటలేదు. మఱి యు దానిమిద్దెపైగల యొక యినుపగొట్టము వంకరగా దిరిగి దాపునకూపమున నుండిన బావిలోనికి వెడలియుండెను. ఆమందిరమునకుఁ జుట్టుగల యిత్తడి గోడలలో నొకదానియందు బంధింపఁబడిన ద్వారమొకటి గలదు. దాని కిరుప్రక్కలంబుల ద్వారపాలకులవలె రెండిత్తడి పురుషవిగ్రహములు చేత విచ్చుకత్తులను ధరించి నిలచి యుండెను.

పశ్చిమదిశయందుఁగల మందిరద్వారమున బెద్దయెముకల గుట్ట యొకటిగలదు. దానియం దొక యినుపగొలుసు పాతిపెట్టఁబడి యుండెను. దానిరెండవకొన యామందిరమునకు సమీపమునగల నూతిలోనికి వెడలియుండెను.

ఉత్తరదిశమందిరము గోళాకారముగఁగాజురాళ్ళతో నిర్మింపఁబడి యుండెను. మఱియు దానికి నలువైపుల బెక్కుయంత్రములు

మరలు చక్రములు మున్నగునవి గలవు. ఈమందిరము చెంతనుండిన బావిలోనికే మాయారాణి తనపతిని తుదముట్టించు తలంపుతో నేగియున్నది.

దక్షిణపార్శ్వపు మందిరమునకు నలువైపుల నాలుగు బురుజులు కలవు. వాని పైభాగ మినుపచిక్కములతో మూయఁబడియుండెను. మఱియు నాబురుజులపై (చిక్కములలోపల) నాలుగు మయూరములు (యవి యేధాతువు వలననో నిర్మింపఁబడి యుండెను.) నిరంతరము నృత్యముఁజేయుచుఁ జూపట్టుచుండును.

నేఁడా దేవమందిరమున రాకుమారు లిరువురును రాజేశ్వరీ మృగాంకవతులును నైయ్యారులును గూర్చుండి పరస్పరము సంభాషించు చుండిరి. "రిక్తగంథము" కుమారమహేంద్రసింహుని చేతి యందుఁ గలదు. మఱియు నతఁడతి ప్రీతితో ముద్దులు మూటగట్టు చుండిన దానిపై యావరణముంజూచుచుండెను. ఇంకదనుక దానిని జదువుటకు వారికిఁ దరుణము లభించియుండలేదు. మృగాంకవతి ప్రేమపూరితేక్షణంబుల కుమారమహేంద్రసింహుని వైపున కవలోకించుచుండెను. మఱియు నటులనే రాజేశ్వరియుఁ గుమారనరేశసింహునివైపునకుఁ గ్రీఁగంటి చూపులను బఱపుచుండెను.

మృగాంక:— (మహేంద్రసింహునితో) మీరు సాధ్యమగునంత శీఘ్రముగ నీరిక్తగంథమును జదివి తుదముట్టింపవలెను.

మహేంద్ర:—ఔను! నేనటులనే తలంచుచుంటిని. కాని, మన మీ కారణంబున మాపినతండ్రి యజయసింహుని, నైయ్యారులను నిచటికిఁ దోడ్కొనివచ్చియుంటిమో యాకార్యము నుండి మొదట తీరికనొందవలసి యున్నది.

మృగాంక:—నేను వీరి కిచటి మార్గమును జూపించుటకు మాత్రమే వెంటఁదోడ్కొని వచ్చితిని. అది యిపుడు దీరియున్నది.

కదా! ఇఁక వీర లిచటినుండి వెడలి యేకార్యమేనియుఁ గావించు టుచితము. మీరును రిక్తగంథమును జదివి ముగించిన పిదపఁ దిలన్మఖండనమందుఁ బ్రవర్తులు గావలయును.

మహేంద్ర:—చంద్రికళామదాలసలను విడిపించి తెచ్చిన పిదపఁ దిలన్మఖండనమందుఁ బ్రవేశింపవచ్చు ననికదా ముకుందసింహనరపాలుఁడు వచియించి యుండెను. ఇదియునుగాక మా పినతండ్రి యభయసింహునివలన ముకుందసింహుని విడిపించిన వృత్తాంతము వినవలసి యున్నది.

అభయ:—అవృత్తాంతము గొంత మీకుఁదెలిపి యుంటిని.

నరేశ:-ఔను. (మృగాంకవతివైపునకు సంకేతించి) ఈమె భూతవేషమును దాల్చుకొని మీసమీపమున కేతెంచిన వఱకుఁ జెప్పియుంటిరి. కాని, యీమెమాయారాణి కాంచనగదాధరసింహుల జెవియుందేమి వచియించియుండెనో దానిని వివరింపరైతిరి. బహుశః యీమె ముకుందసింహభూపాలుని విషయమున గొంత సూచించి యుండును.

మృగాంక:—అదియే! ముకుందసింహుని బంధించుటయందుఁ గాంచన గదాధరసింహులుఁగూడ మాయారాణికిఁ దోడ్పడి యుండిరి. మఱియు జగపతి దీనికి మూలకందము.

మహేంద్ర:—(నవ్వి) ఔను. జగపతియే దీనికి ముఖ్యకారకురాలు.

మృగాంక:— నేనొకవిషయమును చెప్పదలంచుచుఁ బ్రసంగధోరణియందు మఱచిపోవుచుంటిని. వాస్తవమందు జగపతి యొక పురుషుఁడుగాని స్త్రీగాదు. మఱియు వానియందొప్పుచుండినసుందరాకారమే మాయారాణి నిట్టి దశకుఁ గొనితెచ్చినది. జగపతి చాలకాలమువఱకు నాఁడువేష

మును ధరించి యుండుటకుఁ దగిన యాకారమును భగవం
తుఁడు వానికిఁ బ్రసాదించి యుండెను. మఱియు నతఁడు
పొట్టివాఁడు. దాదాపిరువది వత్సరముల ప్రాయము వచ్చి
యుండినను వానికి మీసములుగాని గడ్డముగాని నామ
మాత్రమైనను వెడలియుండలేదు. వానియాకారము స్త్రీల
నుఁబోలి యుండినను వానికధిక బలదారుఢ్యములు గలవు.

మహేంద్ర:—(ఆశ్చర్యముతో) నేఁడొకనూతన సమాచారము
వినవచ్చినది! మంచిది. తరువాత?

రాజేశ్వరి:—సోదరీ! ఆజగపతి పురుషుఁడా?

మృగాంక:—ఔను. ఈసమాచారము మాయారాణి కాంచన
గదాధరసింహులకుఁ దక్క దదితరులెవ్వరికిఁ దెలియదు.
కొన్నిదినములకుఁ బూర్వము నాకీసమాచారము దెలిసెను.
కాని, నేనింతదనుక దీనినెవ్వరితోడను వచియించియుండ
లేదు. మఱియు నిట్టివిధంబుననే ముకుందసింహుని వృత్తాం
తముగూడ తమనల్వురకుఁదక్క నితరులెవ్వరికిఁ దెలియదని
వారికి సంపూర్ణవిశ్వాసము గలదు. ఎపుడీరహస్యము వెల్లడి
యగునో యపుడు వారిప్రాణములకు ముప్పు వాటిల్లుట సం
భవము. తత్కారణంబున వారలిపుఁడు మిగుల సంభ్రమచి
త్తులై యపారదుఃఖ సాగరమున మునింగియుండిరి. నేను
పిశాచమను నామముతో వారిచెవియం దీసమాచారము
వెల్లడించుటయేకాక, నీవృత్తాంతము ప్రజలయందును విజ
యేంద్రసింహ మహీపాలుని సైన్యమందును ప్రబలియున్న
దనియుఁ బలికియుంటిని.

నరేశ:—మంచిది. కాని, యారహస్యము లానలుగురికిఁ దెలిసియు
న్నవిషయములే కాదా! కాంచనగదాధరసింహు లానమా

చారమును మాయారాణితో వచియించుటకేల సందేహిం పవలెను?

మృగాంక:—దానికి మఱియొండు కారణము గలదు.

మహేంద్ర:—అది యెట్టిది?

మృగాంక:—కాంచన గదాధరసింహులిరువురు మాయారాణికిఁ బ్రేమపాత్రులగు నిరువురు యువకులను హత్య గావించి యుండిరి. ఆసమాచారము మాతయూరాణికిఁ దెలియదు. నే నావిషయమును గూడ వారిచెవియందుఁ గొలఁదిగ నూచించియుంటిని.

మహేంద్ర:—అగుచో, మీభగిని పెనుభూతమువలె దోఁచుచున్నది. మీరు ముగ్గురు నొక రక్తమందు జన్మించినవారలే కదా? ఇఁక నీవామె ననుసరింతువో లేదో పరికింపవలసి యున్నది.

మృగాంక:—(కరములను జోడించి) మాయిరువురి విషయమువ నటుల వచియింపరాదు. దీనికి వేఱొండు కారణముగలదు.

మహేంద్ర:—ఆహేతు వెట్టిది?

మృగాంక:—మాతండ్రిగారికి రెండువివాహములు. నేనును రాజేశ్వరియు సేకోదరలము. ఆమె మఱియొక తల్లి గర్భమున జన్మించి యున్నది. తత్కారణంబున మాయిరువురినెత్తురు నామెతోఁ గలియఁజాలదు.

మహేంద్ర:—శుభము! తరువాత నేమి కావించితివో వివరింపుము!

మృగాంక:—తదనంతరము జైమినీప్రసాదు నాతిలస్మోద్యానము వెలుపలకుఁ జేర్చి, యుభయసింహులని ముకుందసింహ నరపాలుని సమీపమునకుఁ దోడ్కొనిపోయి యిరువురకుఁ బరిచితిఁ గలిగించితిని. అటుపిమ్మట నితఁడు దాఁగియుండుటకు

దావును జూపి ముకుందసింహుని విడిపించుటకుఁ గావింపవ
లసిన కార్యములను తెలిపి యాకోటనుండి వెలుపలికి
బోవు మార్గమును జూపించితిని. తదుపరి మిమ్ము బంధవి
ముక్తులనుగ నొనరించుతలంపుతో నచటినుండి బయలుదేరి
కారాగృహమువైపున కేతెంచుచుంటిని. తదనంతరము
దొడరియుండిన సమాచారమంతయు మీరెఱింగియున్నదే!
ఇఁక ముకుందసింహ నరపాలుని బంధవిముక్తునిగ నొనరిం
చుటకై నభయసింహుఁ డేయే కార్యముల నాశ్రయించెనో
మీరు వానిని బ్రశ్నించి తెలిసికొనుఁడు.

మాయారాణి బందిగమునుండి ముకుందసింహుని బం
ధవిముక్తునిగ నొనరించినవాఁ డభయసింహుఁడనియు మఱియు
మాయారాణి యాముకుందసింహు నంతమొందించు తలంపుతో
నచటికి జగపతీ కాంచన గదాధరసింహులను వెంటఁదోడ్కొని
పోయిన సమయమున నాశబ్దములనాలించి మూర్ఛాగతురాలయ్యెనో
యాశబ్దములనుగూడఁ బలికినవాఁ డభయసింహుఁడే యనియు మా
పాఠకమహాశయు లిపుడు గ్రహించియుందురు. రాకుమారు లిరు
వురుఁ బ్రశ్నించుటచే నభయసింహుఁడు దానొనరించియుండిన కా
ర్యాచరణము లన్నింటిని సవిస్తరముగ వివరించి వారికిఁ దెలుపసా
గెను. రాకుమారు లిరువురు నావిచిత్రగాథ నాలించుచు నానందప
రవశులగు చుండిరి.

## ౧౯

కుమార మహేంద్రసింహుని మైయారుల కాతిసోమ్మద్యానమం
దలినాల్గవతరగతి తోఁటలోనికి వచ్చిపోవు మార్గమును దెలిపి మృ
గాంకవతి వారినిపీడ్కొల్పెను. ఆమె యభయసింహునకు రోహిణీ

గడమున కేగుటకుఁదెలిపి తక్కిన సైనికులను వేర్వేఱు కార్య ములయందు నియోగించి వారిని మఱియొకవైపునకుఁ బుత్తెంచెను.

మే మీతోఁటయందలి మందిరములనుగూర్చి పైన లిఖించి యుంటిమి. మఱియు దీనియందలిఫలవృక్షములుకృత్రిమములనియు స్వతస్సిద్ధమైనవి గావనియుఁగూడ నెఱింగించి యుంటిమి. అట్టిస్థితిఁ బరికించి కుమార మహేంద్రసింహుఁడు మృగాంకవతితో, "మాని నీమణీ! నాల్గవతరగతితోఁటయందు ఫలవృక్షములు మెండుగఁ గల వనియు భోజన భాజనంబుల కెట్టిబాధయుఁ గలుగదనియు ముకుం దసింహ నరపాలుడు వాక్రుచ్చి యుండెనుగదా! ఇచట నవి యేమి యుఁ జూపట్టకుండుటకుఁ గతంబేమి" యని ప్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరముగ "మీపలుకులు నిక్కువములు. మఱియు ముకుం దసింహ నరపాలుఁడును దబ్బఱ పలికి యుండలేదు. (చేతితోఁ జూపుచు) ఆవైపున దృఢప్రాకారావృతంబగు వన మొకటి గల దు. దానియందనేకవిధములగు ఫలవృక్షములు గలవు. వెలుపలి వైపుననుండి యొకవెల్లువ ప్రాకారమును జీల్చుకొని దానిలోనికి బ్రవహించుచుండుటచే నందలి వృక్షములు ఫలపుష్ప సంభరితము లై నయనేంద్రియముల కనిర్వచనీయంబగు మహానందమును గూర్చు చుండెను. దానియందలి వృక్షములు [illegible] రాతనములై మర ణించుచుండినను నూతనముగ [illegible] ద్ధి నొందుచుం డును. ఈతిలస్మాధీశ్వరుఁడు [illegible] మా జా స్థానమును బాగుచేయించ [illegible] మీకుఁ జూపింతు" [illegible]

తదనంత [illegible] నికిఁ [illegible] మేము

లో మగుడి వచ్చెద”మని పలికి వానివలన ననిపించుకొని రాజేశ్వ రిని వెంటఁదోడ్కొని యచటనుండి వెడలిపోయెను.

కుమార మహేంద్ర నరేశసింహు లాదేవమందిరమందు నివసింపుచు నగత్యమగు నపుడా ఫలవృక్షములచెంతకుఁ బోయి తమ యుదరములను నింపుకొని మఱల నాదేవమందిరములోనికి మగుడి వచ్చుచుంటిరి. మఱియు నాసోదరు లిరువురుఁ గలసి (రిక్త గ్రంథమును' గడుశ్రద్ధ జదివి తుదముట్టించిరి. కాని, దానియందు గొన్నిస్థానముల సాంకేతికపదములు చేర్పఁబడి యుండుటచే వాని మర్మములు దెలియమి బాగుగ గ్రహించుటకు సాధ్యముగా కుండెను. అయినను తిలస్మరహస్యములు గుప్తమార్గము లంతర్భ వనములు మున్నగు పెక్కు విషయములు వారికి బాగుగఁ దెలిసి యుండెను. ఇఁక మృగాంకవతితోఁ దమకు సమావేశము గలుగుట తోడనే యాసాంకేతిక పదములయొక్క మర్మములను మాత్రము వారు తెలిసికొనవలసి యుండెను.

చంద్రికళా పరిణయవీచికల మహేంద్రసింహుఁడెంత తెప్ప లఁదేలుచున్నను, మదాలసపై నరేశసింహుఁ డెంతమరులుగొని యుండినను, మృగాంకవతీ రాజేశ్వరులు తమయసమాన సౌందర్య గరిమచేతను నమూల్యోపకారముల వలనను, నారాకుమారు లిరు వుర మానసం[illegible] మునకుఁ బూర్ణముగ నాకర్షించుకొని యుండిరి. [illegible] లసల ప్రేమప్రభావ సంజనితభీతి నాయిరువు[illegible] నధికయత్నంబుతో నెట్టులనో యడచివట్టు[illegible]

రా[illegible] మున నివాసమేర్పఱచు కొని, నే[illegible] కొనుటకుఁ గాని

అర్ధరాత్రము గడచియుండెను. తిలస్మోద్యానమందలి రెండ వతరగతి తోటనుండి పుష్పసుగంధమును ముద్చిలించి తెరతెర లుగ వీతెంచుచుండిన తెమ్మెరలు నిండుజవ్వనంబున నివ్వటిల్లుచుం డిన యానుకుమారగాత్రు లిరువుర నల్లనల్లన జోకొట్టుచు నిద్రిం బుచ్చుచుండెను. కుమారమహేంద్ర నరేశసింహులిరువు రహోరా త్రంబులు దమతమ ప్రియురాండ్ర యెడం బాటునకు వగలంబొగులు చుండుటచేం దదీయధ్యాన వశంబున వారలు స్వప్నావస్థయందుం దమప్రాణప్రియలగు మోహాంపుం బడతులంజేరి మృదుమధురాలా పంబులతోడను హాస్యకలాపంబులతోడను బ్రొద్దులు పుచ్చుచు, వారి సుకోమల కరపల్లవంబుల యానందము ననుభవించుచుండెను హాస్తము లిపుడు కనుదెఱచినమాత్రముననే విధివైపరీత్యంబున దమశిరములకుం జేరనున్నవని పాపము వారలేమెఱుంగుదురు?

అంత నొక్కమాఱుగ నొకయార్తనాదము వెడలివచ్చి పలువిధంబులగు స్వప్నసుఖంబుల ననుభవించు చుండిన రాకుమారు లిరువురకు మెలంకువం గలిగించెను ఆధ్వని చెవిసోకినంతనే వారిరు వురు లేచికూర్చుండి సాశ్చర్యవీక్షణంబుల నలుదెసలం బరికించుచు నీయార్తనాద మెచటినుండి వెడలివచ్చుచుండెనని యోజింపసాగిరి. వారలెంత సావధానచిత్తంబుతో యోజించినను నాధ్వని యెట్టిదో వారికిం దెలియం దయ్యెను. కాని, యాయార్తనాదము దేవమందిర మునకుం దూర్పుతట్టునంగల మందిరములలో నొకదానినుండి వెడ లివచ్చుచుండెననిమాత్రము వారలు దెలిసికొనంగలిగిరి. తమ మంది రమునుండి యాధ్వని నిర్గమించు చుండిన దెసకుం బోవుట, వారికి సముచితముగం దోంపకుండుటచే సౌధోపరిభాగమునకు వెడలి గాఢదృష్టి యావైపునకుం బరికింపం దొడంగిరి.

అరగంటకాలము దనుక నాయార్తనాద మొక్కటీరుననే వారికి వినిపించు చుండెను. తదుపరి నదిక్రమక్రమముగ నన్నగిల్లి

కు సద్దణిగెను. కొంతవడి కొకమనుజుఁ డామందిరములలోనొక
దాని తలుపులను దెఱచుకొని వెలుపలకు వెడలివచ్చుచుండుట
వారికిఁ జూపట్టెను. మఱియు నతఁడు నెమ్మదినెమ్మదిగ నాదేవమం
దిర సమీపమున కేతెంచి యచటఁ గొంత తడవునిలచి, మరల
నచటనుండి బయలుదేరి తూర్పువైపు మందిర సమీపమునఁగల
బావిచెంతకుఁబోయి నిలచెను. అతఁడచటను గొంతసేపటివఱకు
నిలచి, మరల ముందువైపునకుఁ దారిపట్టెను. ఆమనుజుఁడటుల సం
చరించుచు సంచరించుచుఁ జిన్నచిన్న మందిరముల చాటునకుఁ
బోయి మనరాకుమారుల దృక్పథమునుండి యదృశ్యుఁడయ్యెను.
మఱియుఁ గొంతసేపటి కాదెసనుండి యెవతెయో యొకస్త్రీ విలపిం
చుచుండిన యార్తనాదము వారికి వినిపింప సాగెను.

మహేంద్ర:—ఆశ్చర్యము! ఆమనుజుఁ డీకోఁటలోని కెటులరాఁ
గలిగెనో తెలియకున్నది.

నరేశ:—అందుపై నీయార్తనాదమింకను నాశ్చర్యమందుఁ జిక్కఁ
జేయుచున్నది. అనుమతింతురేని నేను వెడలి యానవమా
చారమెట్టిదో యరసివచ్చెదను.

మహేంద్ర:—మంచిది.........కాని, నీవిచటనే యుండుము!
నేనుపోయి వచ్చెదను.

నరేశ:—అగుచో, మన మిరువురము గలసిపోవుదము. నడువుఁడు.

మహేంద్ర:—కాదు కాదు! ఒకరిచ్చోటనుండుట యత్యావశ్యకము!
మంచిది! నీవేపోయిరమ్ము! ఎట్టియాటంకమును లేదు. కాని,
వెంటఁ గృపాణమును మాత్రము దీసికొనివెళ్లుము.

సహోదరులిరువురు సౌధోపరిభాగమునుండి క్రిందికి
దిగిరి. నరేశసింహుఁడు చిలుకకొయ్యకు వ్రేలాడుచుండిన తనయడి
దెమును దీసికొని యాదేవమందిరమునకు నెట్టయెదుమఁగల గోశాశా

రవు స్తంభముచెంతకుఁబోయి నిలచెను. ఆస్తంభమందుఁ బలువిధ
ములగు విగ్రహములు నిర్మింపఁబడి యుండెనని మేముపైన లిఖించి
యుంటిమి. నరేశసింహుఁ డావిగ్రహములలో నొకదానిపైఁ జేయి
నునిచి నొక్కుట వలన వెంటనే యొకచిన్న గవాక్షము తెఱవఁబడి
లోనికేగుట కొకమార్గ మేర్పడెను. అతఁ డాస్తంభమందుఁ బ్రవే
శించి కొంతసేపటికా కృత్రిమవనమునకు వెలుపలఁ జూపట్టి సాగె
ను. ఆస్తంభమందుఁగల మార్గమెట్టిదో యతఁడా కృత్రిమవనమున
కెటులఁ జేరగలిగెనో యావృత్తాంతము మఱియొకమాఱెవ్వరే
నియు నిచటికి వచ్చి పోవు సందర్భమున వర్ణింపఁబడును. కావున
నిచట సంక్షేపముగ లిఖించి మాకార్యమును దీర్చుకొన దలంచు
చుంటిమి. ఏవైపున కామనుజుఁ డేగియుండెనో, మఱియు నేదెసనుండి
యాయార్తనాదము వెడలివచ్చుచుండెనో యాదిట్టునకుఁ గుమార
నరేశసింహుఁడు బయలుదేరి పోవుచుఁ దుదకు ద్వారము దెఱచి
యుండిన యొకమందిరము సమీపమునకుఁ బోయి చేరెను.
అచట నాదుఃఖితస్త్రీ చూపట్టదయ్యెను. కాని, తానెవనినిజూచి
వెంబడించి వెళ్ళెనో యామనుజుఁడుమాత్ర మామందిర ద్వారము
నొద్దఁ బదారుచేయుచుఁ వానికిఁ జూపట్టెను. ఆమనుజుఁడు
కుమార నరేశసింహునిఁ గాంచినంతనే తటాలున నామందిరమం
దుఁ బ్రవేశించెను. మననరేశసింహుఁడును వానిని వెంబడించు తలం
పుతో నిర్భయముగ నామందిరమందుఁ జొచ్చెను. ఆమందిరము రెం
డంతస్తులుగలది. మఱియు దానియందుఁ బెక్కు గదులు గలవు. ఆ
గదులన్నింటికి రెండువైపుల రెండు ద్వారములు గలిగియుండుటచే
నెవ్వరేనియుఁ దొలుత నొక గదియందుఁ బ్రవేశించి యామందిర
మందుగల గదులన్నింటియందును సంచరింపఁ గలరు.

కుమారనరేశసింహుఁ డెంత వేగముగ నామనుజుని వెంబ
డించినను, నాతఁ డొక గదియందుఁ బ్రవేశించి యొకగదినుండి

మఱియొకగదిలోనికిఁ బోవుచు నెటుల మాయమయ్యెనో తెలియదు. అది రాత్రికాలంబగుటచే నాగదులయందుఁ జీఁకటిదట్టముగ నావరించియుండెను. అట్టితరుణమున నాగదులయందు సంచరించి యామనుజునిజాడఁ గనిపెట్టుట మిగుల గఠినకార్యము. ఇదియునుగాక, నతఁడు దనకు శత్రువుఁడు గాఁడు గదా యను సందేహము వానికిఁ గలిగియుండుటయు సహజము. నిరుపాయుఁడై నరేశసింహుఁడచటనుండి మరలెను. కాని, యతఁడామందిరము వెలుపలకు బోఁజాలఁడయ్యెను. కారణంబేమన, నతఁ డామందిరమం దేద్వారమున బ్రవేశించి యుండెనో యదియిపుడు బంధింపఁబడి యుండెను మన రాకుమారుఁడు దానికవాటములను బెకలించి వైచుటకుఁ బ్రయత్నించి చూచెను. కాని, యదివానికి సాధ్యము గాదయ్యెను. తుద కతఁడు దుఃఖితుఁడై చేయునదిలేక యొకగదిద్వారము చెంత నిలచి వివిదాలోచన నిమగ్నమానసుఁడై యుండెను. కొంతవడికి కామందిరపైభాగముననుండి మున్నుదాను వినియుండిన స్త్రీయార్తనాదము వానికి మరల వినిపింపసాగెను. అతఁడాధ్వని ననుసరించి రెండవయంతస్తులోని కేగుటకుఁ దలంచెను. కాని, దానిపై కేగుటకచటనుండియు మార్గము చూపట్టకుండెను. ఇపు డారాకుమారుని హృదయమెంత దారుణవ్యథఁ జిక్కియుండెనో, యదివానికే తెలియును. కాని, వివరించుటకు సాధ్యముగాదు. ఔను! మాపాఠకమహాశయులలో నెవ్వరిహృదయము ధైర్యసాహసములతో నిండియుండెనో వార లారాకుమారుని హృదయస్థితిఁ గొంత గ్రహించినను గ్రహింపఁ గలరు.

కుమార నరేశసింహుఁడు పెక్కువిధంబులగుఁ బ్రయత్నములను గావించియు విఫలమనోరథుఁడయ్యెను. వాని కాస్త్రీసమీపమునకేగి యామె దుఃఖకారణమును దెలిసికొనుటకుగాని, తాను

వెంబడించివచ్చిన మనుజుని జూడఁ గనిపెట్టుటకుగాని, మఱియు
నామందిరమునుండి వెడలి తన సహోదరుఁడగు మహేంద్రసింహు
నితో నచటి సంభవములను విశదీకరించుటకుగాని సాధ్యము గా
కుండెను. తుద కతఁడు సేయునదిలేక చేతులు నిముడుకొనుచు,
మిన్నకచటఁ గూర్చుండవలసిన వాఁడయ్యెను.

కుమార నరేశసింహుఁడు మిగతరేయి యంతయు నచటఁ
గడపెను. ప్రాతఃకాలీనధవళకాంతులు దమకు లభించిన మార్గంబు
లలోనఁ బ్రవేశించి యామందిరమందును గదులయందును బ్రకా
శమును గలిగించుచుండెను. అంత నాకస్మికముగ వానికి వెనుక
త్తునుండి యొకద్వారము తెఱవఁబడిన సవ్వడి వినిపి
చెను. అతఁడు వెనుకకు మరలి కాంచునంతఁ బూర్వము బంధి
పఁబడియుండిన యొకగది తలుపు లిప్పుడు తెఱువఁబడి యుండుట
గాంచి, నిర్భయముగ దానియందుఁ బ్రవేశించెను. మఱియు న
టఁ గొన్ని మెట్లు కట్టఁబడియుండుటఁ గాంచి కుమార నరేశ
హుఁ డతిరయంబున నామెట్లపయి నెక్కి పోవుచు రెండవయంత
లోనికిఁ బోయి చేరెను. మఱియు ... గలయఁగని ది
... నుండి
స్థానమం దుండిన తీరు ...
యొక గదిలోని కే ...
నెను. క్రమ క్రమమ ...
వదార్థములు స్పష్ట ...
గదియందుఁ బ్రవే ...
సొంపుగ నిర్మిం ...
దానిపై నొకవిల్లు ...
హుఁడు వానిని ...
మ్ములపైఁ జేయి ...

నవి యక్కఱకు వచ్చునవి గావనియు నతఁడు దెలిసికొనెను. తదు
పరి నతఁ డాగదినుండి రెండవగదిలోనికిఁ బ్రవేశించెను. ఆగది
యంగణ భూమిపై నొకశవము బడియుండెను. మఱియు దానిశిర
ము ఖండింపఁబడి యచటనే కొంత దవ్వునఁ బడియుండెను. మన
రాకుమారుఁ డాశవమును బాగుగఁ బరిశీలించి, యదియు శిలాని
ర్మితంబే యని తెలిసికొనెను. మూఁడవగదియందుఁ బ్రవేశించెను.
ఆగదికి నలుదెసల గోడలయందుఁ గొన్ని చిలుకకొయ్యలు గలవు.
వానియం దొక్కొక్క కరవాలము వ్రేలాడుచుండెను. అవి కృత్రిమ
ములు గావు. మిగుల స్వచ్ఛంబగు లోహమువలన మిగుల నంద
ముగఁ జేయఁబడి యుండెను. కాని, వానిపై ధూళిపడి మాసి
వాసిఁ జెడియుండెను. పిదప నతఁడు నాల్గవగదియందుఁ బ్రవేశించె
ను. దానియం దొక కాష్ఠాసనము గలదు. దానిపై నేధాతువువల
ననో మిగుల సొంపుగ నిర్మింపఁబడిన యొకస్త్రీవిగ్రహము గూర్చుం
డియుండెను. ఆవిగ్రహమును గాంచుటతోడనే యది మాయారాణి
కనిష్ఠభగినియగు రాజేశ్వరి ప్రతిస్వరూపమని మన నరేశసింహుఁ
డు గుర్తింపఁగలిగె[illegible] నతఁ డొక్కమాఱుగ మోహపార
వశ్యుఁ[illegible] గ్గార్పకఁ జూడఁదొడంగెను.
[illegible]ఁ గాంచు మంచితరుణము
[illegible]తి గాక యది యొక ప్రతి
[illegible] లెవ్వరును లేకుండుటచే
[illegible]కి లేకుండెను. మఱియు
[illegible]ందము జనించుచుండెను.
[illegible] యంగప్రత్యంగముల
[illegible]కాంతిని కన్నులఁ గఱవు
[illegible]గదినుండి యొకనవ్వది

వానికి వినిపించెను. మనరాకుమారుఁడు విభ్రాంతమనస్కుఁడై తాను వెంబడించిన మనుజుని జాడ యందుఁ జూపట్టఁగలదని తలంచుచు నాగదిలోనికిఁ బోయెను. కాని, యందెవ్వరును జూపట్టరైరి.

ఆగదియం దొక రజితమందసము గలదు. దానికిమధ్యభాగమున జేయిపట్టునంతటి రంధ్ర మొకటి గలిగియుండెను. మఱియు దానిచుట్టు బంగరుయక్కరములతో నిటుల లిఖింపఁబడి యుండెను.

"ఈరంధ్రమందుఁ జేయిఁ జొనిపి దీనియందలి యద్భుత పదార్థమును వెడలించి చూడుఁడు."

కుమార నరేశసింహుఁడు దానివలనఁ గలుగు మంచిచెడ్డల నాలోంచుకయు యోజింపకఁ దటాలున నారంధ్రమందుఁ దనచేయి నుంచెను. కాని, యతఁడు మరలఁ దానిని వెలుపలకు వెడలింపఁ జాలఁడయ్యెను. అతఁ డారంధ్రములోఁ జేయి పెట్టినంతనే యొక యినుపసంకెల వానికరమందుఁబడి యతఁడు దనచేతిని వెలుపలకుఁ దీసికొనుట కనుజ్ఞ నొసంగకుండెను. కుమార నరేశసింహుఁ డబ్బురపాటు నొందుచు నారంధ్రములోనికిఁ దొంగి చూచి యది యచటి భూమితోఁ గూడి యుండెననియు దాని నీవలావలకు జరుపుటకైనను శక్యము గాదనియుఁ దెలిసికొనెను.

## ౨౦

కుమార నరేశసింహుఁ డాదేవమందిరమునుండి వెడలిన పిదపఁ గుమార మహేంద్రసింహుఁడు దన తమ్ముని రాకకై ప్రతీక్షించుచుఁ గూర్చుండి యుండెను. వానిరాకయందుఁదడవగుచున్న కొలఁది వానికిఁ గరవరపాటు వృద్ధి నొందుచుండెను. తుదకారేయి యంతయుఁ గడచి బాగుగఁ దెల్లవాఱెను. మఱియుఁ దూర్పుదెసనుండి సహస్రకిరణుఁడు దర్శనమొసంగి నెమ్మదినెమ్మదిగా నాకవ

ముపై నెక్కి పోవుచుండెను. ఇపు డొక జాముప్రొద్దెక్కి యుండినను, దనయనుంగుసోదరుఁడు మగుడి రాకుండుటచే నతఁ డేయాపద యందైనను జిక్కియుండఁడుగదా యను చింత వానికి వృద్ధి నొందసాగెను.

కుమార మహేంద్రసింహుఁడు సంశయాకులచిత్తుఁడగుచుఁ దనతమ్ముని గవేషించి తోడ్కొని తెచ్చు తలంపుతో నచటినుండి బయలుదేరుటకు సిద్ధపడుచుండెను. అట్టితరుణంబున మృగాంకవతి రాజేశ్వరిసమేతముగ నచటికి వచ్చిచేరెను. వారిని గాంచుటతోడనే కుమార మహేంద్రసింహుని హృదయమం దొక విధంబగు నాశ యంకురించి వానికలవరపాటును గొంత యుపశమిల్లఁజేసెను. అతఁ డచటనొంటరిగ నుదాసీనతతోఁ గూర్చుండి యుండుటయు, వానిచెంత నరేశసింహుఁడు చూపట్టకుండుటయుఁ గని, మృగాంకవతికి మిక్కిలి యక్కజముగఁ దోచెను. అతఁ డేదియో యొక విపత్తియందుఁ జిక్కియుండెననియు, నియ్యది తిలస్మవ్యవహారము గావునఁ గొలఁది యేమరుపాటువలననే యట్టియాపదలు గలుగుట సంభవమనియు, నది యొక వింతసంగతి గాదనియు నామేధావిని యగు మృగాంకవతి తక్షణము గ్రహింపఁగలిగెను.

మృగాంకవతి మహేంద్రసింహునితో, నుదాసీనతకుఁ గారణమును కుమార నరేశసింహుఁ డచటఁ జూపట్టకుండుటకు హేతువును బ్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరమం దతఁడ సకలమును వివరించి తెలిపి, నరేశసింహుఁ డిచటనుండి వెడలి దాదాపు తొమ్మిది గంటలకాలము గడచి యుండెననియుఁ దెలిపెను.

ఈసమయంబున రాజేశ్వరి స్వరూపము నెవ్వరేనియుఁ దిలకించినఁ గుమారనరేశసింహుని వృత్తాంతము నాలించుట వలన నందఱికంటె నామె కధికదుఃఖము జనించెనని తలంపక మానరు.

ఇఁక నామె దన వెడఁదకనుదోయిఁ జిమ్మిచెలరేఁగుచుండిన కన్నీటి నెట్టెటులో నాపుకొనుచుండుటను గాంచిన మృగాంకవతీమహేంద్ర సింహులామె హృదయభావమును గ్రహించు టొక కఠినవిషయము గాదు. కుమారమహేంద్రిన రేశసింహులిరువురు నీగొప్పతిలన్మను ను దప్పక ఖండింతురను విషయ మామెకు నిశ్చయముగఁ దెలిసి యుండినను, నిపు డామె మానసము మిక్కిలి పరితపించుచుండెను. ఔను! తనప్రాణప్రియునిపై నేతెంచి యుండిన కష్టవార్త నాలించి యేచిగురుఁబోడికి దుఃఖసంతాపములు జనింపకుండును?

మృగాంక:—(రాజేశ్వరితో) ఈస్థానమున కొకమనుజుఁ డేతెంచి యుండిన నది యొకయాశ్చర్యకరంబగు విషయముగాదు. కాని, యొకయాఁడది యరుదెంచు టొక యబ్బురంబగు విషయమే! (మహేంద్రసింహుని వైపునకు సంకేతించి) ఇచట నొకస్త్రీ యార్తనాదము వినిపించెననికదా వీరు తెలిపియుండిరి!

రాజేశ్వరి:—నిక్కమము. అక్కచెల్లెండ్రమగు మనయిరువురముఁ దక్క నీనాల్గవతరగతి తోఁటలోని కేతెంచు మార్గమేనా ల్గవస్త్రీకిని దెలియదని నామనోనిశ్చయము గాని, మగవా రిలో నిచటికిరాఁదగిన వారెవ్వరేనియు నుండిన నుండ వచ్చును.

మృగాంక:—కాని, యీదేవమందిర స్థానము నాకును ముకుంద సింహ నరపాలునకును దక్క నితరులెవ్వరికిని దెలియదు. మంచిది! అదియటుండనిమ్ము. మన మిచటనుండి వెడలి కు మారనరేశసింహునిజాడ నరయు టత్యావశ్యకము. మన వగతు లీస్థానమున కరుదెంచుట కఠినవిషయమై యుండిన ను. మనకుఁ గొంత సందేహము గలిగియేయుండును. చ

దుము! రాకుమారులు ముస్నగువారలు మాయారాణి బం
దిగమునుండి వెడలివచ్చిన పిదప మనము వారినివెంటఁ
దోడ్కొని సురంగమార్గమున నేగుచుండిన సమయంబున
నాయేనుగులద్వారమునొద్ద నొక దుష్టుఁడు పొంచియుండి
రాకుమారుని గాయపఱచునని మనము దలంచియుం
టిమా? అట్టివిధంబుననే సీతావునగూడ నెవ్వఁడేనియుఁ
జేరియుండెనేమో యెవ్వరెఱుంగుదురు!

తదనంతరము రాజేశ్వరీమృగాంకవతీ మహేంద్రసిం
హులు మువ్వురుఁ గుమారనరేశసింహుని నన్వేషించుట కచటి
నుండి బయలుదేరిరి. మఱియు వారలు నరేశసింహుఁడు వెడలియుం
డిన్న మార్గము ననుసరించి పోవుచు నొక మందిరమును నమీపించిన
తోడనే మృగాంకవతి యచటనిలచి బంధింపఁ బడియుండిన
యామందిరద్వారము వైపునకు గాఢదృష్టిఁ బరికింప సాగెను.
మరల నచటినుండి బయలుదేరి రెండవమందిరము చెంతకుఁబోయి
నిలచెను. దానిద్వారముగూడ బంధింపఁబడియుండెను. మృగాంక
వతి యాద్వారమును బాగుగఁ బరిశీలించి తల వంకించుచు, నచటి
నుండి ముందునకు సాగిపోయెను. ఇవ్విధంబున రాజేశ్వరీమహేంద్ర
సింహులను వెంటఁదోడ్కొని మృగాంకవతి యేడెనిమిది మందిరము
లను దాఁటిపోయెను. ఆమందిరద్వారము లన్నియు బంధింపఁబడి
యుండెను. ఆద్వారములనుగూడ మృగాంకవతి బాగుగఁ బరిశీలించి
యుండెను గాని, యామె యభిమతంబెద్దియు దీరకుండెను. తదనం
తరము గుమారనరేశసింహుఁ డేమందిరమందుఁ జిక్కియుండెనో,
తదామందిరము నమీపించినతోడనే మృగాంకవతి యచటనిలచి,
దానివైపునకుఁ గంభీరదృష్టిఁ బరికించుచు, నహర్షంబున మహేంద్ర
సింహునితోఁ "గుమారనరేశసింహుఁ డీమందిరమున గలఁడు.

కేవల మారాకుమారుఁడొక్కఁడే కాదు. ఇంకను నిరువురు మనుజు లీమందిరమునఁ గలరు. (వేలితో నాద్వారమువైపునకుఁ జూపుచు,) "దానికమ్మినుండి మూఁడినువగుండ్లు క్రిందివైపునకు వ్రేలాడుచున్నవి. పరికింపు"డని పలికెను.

మహేంద్ర:—అయినువగుండ్ల యందలి విశేషమెట్టిది?

మృగాంక:—ఈమందిరములోని కెందఱు ప్రవేశింతురో యన్ని యినువ గుండ్లు క్రిందకు దిగి యుండును.

మహేంద్ర:—(ఆద్వారమువైపునకుఁ జూపి) దీనియందు పండ్రెండు గుండ్లు గలవుగదా? నీవు వచియించినటుల పండ్రెండుగురు మనుజు లీమందిరమునఁ బ్రవేశించిన నాగుండ్లన్నియుఁ గ్రిందకు దిగియుండుననియే తలంపము. అంతకంటె నధికముగ దీనియందుఁ బ్రవేశించిన నవు డేమి కాఁ గలదు.

మృగాంక:—ఈమందిరములోనికిఁబండ్రెండుగురుకంటె నధికముగఁ బ్రవేశింపఁ జాలరు. తిలన్మవ్యవహారమం దొకరి బలత్కార మేమియుఁ బనికిరాదు.

మహేంద్ర:—మంచిది! దీనియందు నాసహోదరుఁడు గలఁ డని నీవెటు లెరింగితివి?

మృగాంక:—కేవలము దర్శించుటవలననే! ఈతోఁటలోని యొక మనుజుఁ డేతెంచినటులను తదువరి నొకస్త్రీయార్తనాదము శ్రుతిగోచరంబయినటులను మీరువచియించియుంటిరి గదా! అందువలన వారిరువురైరి. ఇఁక నామనుజనిజాడనరయుచుఁ గుమార నరేశసింహుఁ డిచటి కేతెంచి యుండెను గావున నాముగ్వురు నీమందిరమం దుండి రనినేనూహించితిని.

మహేంద్ర:-నీవ్వుచక్కగ నాలోచించితివి! కాని, సాధ్యమగునంత శీఘ్రముగ నీవిషయమును నిశ్చయించుకొని నరేశసింహుని

విడిపించుటకుఁ బ్రయత్నింపవలెను. అతఁ డెట్టి యాపద యందుఁ జిక్కియుండెనో తెలియదు.

మృగాంక:—నేనిప్పుడే దానికిఁ దగునేర్పాటు గావించెదను.

తదనంతరము మృగాంకవతి గొంతతడవు యోజించిన పిదప మహేంద్రసింహునితో "నీద్వారమును దెఱచుట కష్టసాధ్యము. కాని, యాద్వారపుకమ్మినుండి మూఁడుగుండ్లు క్రిందికిదిగియు మఱితొమ్మిదిగుండ్లు కమ్మినంటుకొనియున్నవి గదా! ఆతొమ్మిదింటిలో నొకదానిని బట్టుకొని బలపూర్వకముగఁ గ్రిందివైపునకులాగి యేమిజరుగునో చూడుఁ"డనెను.

కుమారమహేంద్రసింహుఁడటులనే కావించెను. అతఁడుపైకెగసి యాతొమ్మిది గుండ్లలో నొకదానినిఁ బట్టుకొని క్రిందివైపునకు దిగలాగెను. అది క్రిందివైపునకు జారినతోడనే కుమారమహేంద్రసింహుఁడు దానిని విడచిపెట్టి దూరముగఁ దొలఁగి నిలచెను. అంత నాకస్మికముగ నా మందిరమందుఁ గొన్నిబండ్లు పగుగిడుచుండి నటుల నొక భయంకరధ్వని వెడల నారంభించెను. ఆముగ్వురు నా ద్వారమునకుఁ గొంత దూరమున నిలచి యిపుడేమి కానుండెనో యని పరికించుచుండిరి.

కొంతసేపటికి కాసౌధోపరిభాగమునుండి "యిటుచూడుఁడు! యిటు చూడుఁ" డను శబ్దము వెడలివచ్చెను. అంతఁ గుమార మహేంద్రసింహుఁడును రాజేశ్వరీమృగాంకవతులును మోములను బైకెత్తి యావైపునకుఁ జూడసాగిరి. ఆసౌధోపరిభాగమునుండి నకాబువలన మోమును మఱుగుఁ బఱచుకొని యుండిన యొక మనుజుఁడు గ్రిందివైపునకు వంగియుండి వారలు దనవైపునకు శిరములనెత్తి గాంచుటతోడనే యొక కాగితపుమడతను క్రిందకి విసరివైచెను. మృగాంకవతి వెంటనే దానిని దీసి చదువుకొని కుమార మహేం

ద్రసింహునితో “మీరిప్పు డీయినుపగుండును క్రిందివైపునకు లాగి యుంటిరో దానిని మరల నెప్పటియట్లుల వెనుకకు నెట్టివేయుఁ డని పలికెను.”

మహేంద్ర:—సరియే! కాని, యట్లొనరించుటవలన ప్రయోజన మేమి? ఆకాగితమం దేమి లిఖింపఁబడి యున్నది?

మృగాంక:—మొదట నేను వచియించినట్లుల దానిని పైకి నెట్టివే యుఁడు. పిదప నీకాగితమందలి వృత్తాంతమును దెలిపెదను. ఆలసించుచో మనకు హాని కలుగఁగలదు.

నిరుపాయుఁడై కుమార మహేంద్రసింహుఁడు పైకెగసి యాయినుపగుండును బలపూర్వకముగ వెనుకవైపునకుఁ నెట్టివైచెను. మఱియు నది యెప్పటియట్లుల నాకస్మాత్తో నంటుకొని పోయెను. వెంటనే యాభయంకరధ్వని సించిపోయి యానుందిరమందు నిస్తబ్ధత వ్యాపించెను. తదనంతరము మృగాంకవతి యాకాగితమును వాని కొసంగెను. కుమార మహేంద్రసింహుఁ డాకాగితముపై నీదిగువను లిఖించిన విధంబున వ్రాయఁబడియుండుటఁ గనుగొనెను.

౧ ౨ ౩ ౪ ౫ ౬

ఏచ షేమచే కాటనో కేమారేయా డేహ మేసో

౭ ౮ ౯ ౧౦ ౧౧ ౧౨

కిమటా చ్యాలా మేమ మను నిపో ఇచ్చో

౧౩

లవ

౧౪

కశీచా

౧౫

ఊప.

ఈజాబునందలి వృత్తాంతమును జదువుకొని కుమారమహేంద్రసింహుఁడు బాగుగ గ్రహించెను. కారణంబేమన, నాజాబు యైర్యారీభాషయందు లిఖింపఁబడియుండెను. మఱియుఁ గుమార మహేంద్రసింహుఁ డాభాషను బాగుగ నేర్చియుండెను. కాని, దానిని లిఖించినవా రెవ్వరో యది వానికిఁ దెలియదయ్యెను. అతఁడు దన నామము 'ఊప' యని లిఖించియుండెను. మన రాకుమారునకు దానియర్థము దెలియకుండుటచే మృగాంకవతివైపునకుఁ గాంచి "ఊప" యన నర్థమేమి? యని ప్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరమందు మృగాంకవతి వానితో "మీరు వేగిరింపఁ బనిలేదు. ఆ మనుజుని జాడ యిపుడే తెలియఁగల"దని పలికెను.

కుమార మహేంద్రసింహుఁ డామె పలుకులకు మారాడక నోడి ద్వారమువైపునకుఁ బరికించుచు నిన్నకుండెను. బహుశః మా పాఠకమహాశయుల కైయ్యారిభాష తెలిసియుండదు. కావున, నా కాగితమందలి శబ్దముల కర్థ మిచట లిఖించుచుంటిమి.

౧ ౨ ౩ ౪ ౫ ౬.
ఇచట నేనుంటిని భీతిల్లవలదు రాకుమారునకు గష్టము గల్గదు
౭ ౮ ౯ ౧౦ ౧౧ ౧౨
కొంతసేపు తాళుఁడు నేను స్వయముగ గ్రిందికి వచ్చుచుంటిని
౧౩
అ
౧౪
ఒడలు మండిన
౧౫
ఊప!!

## ౨౧

నే డర్ధరాత్రిసమయంబున మృగాంకవతి యాతోఁటలోని కేతెంచుననియుఁ దానామెను బంధింతుననియు నువ్విళ్ళూరుచు మాయారాణి మిగుల సంతోషస్వాంతయై యుండెను. కాని, గత రేయి తన శయ్యాగారమం దావిచిత్రలేఖనము బ్రదర్శించిన యానటకుఁ డెవ్వఁడో తెలియక మిగులఁ గలవరపాటు నొందుచుండెను. ఆమనుజుఁ డెవ్వఁడో తెలిసికొనుటకుఁ బెక్కుభంగుల యోజించి చూచెను. కాని, యామెబుద్ధి కేమియుఁ దట్టకుండెను. అతఁ డెవ్వఁడైననేమి? ఇదియంతయు మృగాంకవతి కలిగించుచుండిన యుపద్రవములనియు, నామె బంధింపఁబడినచో నీవేఁకరములన్నియుఁ దొలఁగిపోఁగల వనియు నామెకుఁ దోఁచుచుండుటచే, ముకుందసింహుని మరణమువలన నెంతటి సుఖానుభవ మామెకుఁ గలిగియుండెనో యట్టిసుఖమే యిపుడు మృగాంకవతిని తుదముట్టించుటవలన దనకుఁ గలుగఁగలదని యామె నిశ్చయించుకొని యుండెను.

అర్ధరాత్రము గడుచుటకుఁ బూర్వమే మాయారాణి జగపతిని వెంటఁదోడ్కొని, యేవైపుననుండి మృగాంకవతి యాతోఁటలోని కేతెంచుసమాచారమును వినియుండెనో యాదెసఁగల గుప్తద్వారము చెంతకుఁ బోయి చేరెను. మాయారాణి యాజ్ఞానుసారమాదౌవారికలగు పరిచారికలు విచ్చుకత్తులనుఁ జేత ధరించి యారహస్యద్వారమున కిటునటు వృక్షములమాటునను బొదలచాటునను దాఁగియుండిరి. రాఁగల యాపదలనుండి తన్నుఁ దప్పించుకొను నుద్దేశ్యముతో యామారాణి కొంత దవ్వున నొకచోట దాఁగి కూర్చుండి యుండెను.

ఇపు డాగుప్తమార్గమున మృగాంకవతి యాతోఁటలోని కేతెంచు సమయము డగ్గఱించెను. తత్కారణంబున జగపతి తాను

దాఁగియుండిన స్థానమునుండి లేచి యెవ్వరేనియు ద్వారమును దె
ఱచుటకు సన్నఁజేసిన దానిని దెఱచు నభిప్రాయముతోఁ దన
మోముపైనకాబునుధరించి యాద్వారముచెంతకుఁబోయి కూర్చుం
డియుండెను. మఱియుఁ దనచేత కైజారును ధరించి యవసరము
గలిగినచోఁ బోరుటకుఁగూడ సర్వవిధంబుల సంసిద్ధయై యుండెను.
కొంతసేపటికి వెలుపలనుండి యాద్వారము నెవ్వరో తట్టుచుండిన
సవ్వడి వినిపించుటచే జగవతి యధిక ప్రమోదభరితమానసయగు
చుఁ దటాలున నాద్వారమును దెఱచి యొకప్రక్కకుఁ దొలఁగి నిల
చెను. కాటుకరంగువస్త్రమును ధరించి మోములను నకాబులవలవ
మఱుఁగుఁ బఱచుకొనిన యిరువురు మనుజు లాతోఁటయందుఁ బ్రవే
శించిరి. అది రాత్రికాలమగుటచే నాయిరువురుఁ బురుషులో లేక
స్త్రీలో యను విషయ మెఱుంగుటకు మిగుల గష్టముగ నుండెను.
కాని, యాయిరువురిలో నొకరి యాకారము పొడువుగ నుండుటచే
నతఁడు పురుషుఁడై యుండునను సందేహ మంకురించుచుండెను.

ఆయాగంతు లాతోఁటయందుఁ బ్రవేశించిన తోడనే జగ
వతి యాద్వారమును బంధించివైచి యాయిరువురకుఁ దనవెంట
నేతెంచుటకు సంజ్ఞచేసెను. ఇచట స్థితి మాఱియుండెనని పాపమా
యాగంతులేమి యెఱుంగుదురు? వారలెట్టి చింతయులేక నిర్భయ
ముగ జగవతివెంట నేఁగుచుండిరి. జగపతియు నాయిరువురను వెం
టఁదోడ్కొని తమపరిచారికలు దాఁగియుండిన స్థానమును సమీ
పించి యచట నిలచెను. మఱియు నాయాగంతులవైపునకుఁ దిల
కించి, "అయ్యలారా! నేను మీయాజ్ఞానుసారముగఁ గార్యమును
నెఱవేర్చితినికదా! నాకీయఁదగు బహుమానము నొసంగుఁ" డనెను.
దానికిఁ బ్రత్యుత్తరముగ నాపొడగరియగు నాగంతుఁడు గాక రెండ
వవాఁడామెతోఁ "దానొకపురుషుఁడై యుండియు స్త్రీరూపమును

దాల్చుకొని నిరంతరము మాయారాణి పజ్జఁ జేరియుండు జగపతికి నొరులయొద్దనుండి బహుమతుల నందుకొనుట కెట్టి యావశ్యకమును లేదు. ఆమరాత్మురాలు మిక్కిలి ధనాఢ్యురాలు. మమ్ములను బంధించు నభిప్రాయముతో నాదుష్టురాలగు మా మాయారాణియు నీస్థానమం దెచటనో దాఁగి యున్నది. ఆపాపాత్మురాలి నిచటికి శీఘ్రముగఁ బిలుచుకొనిరమ్ము. మేము ముఖ్యముగ నామెను బహూకరించుటకే యిచటికే తెంచి యుంటి"మని పలికెను.

వాస్తవమందు జగపతి యొకపురుషుఁడుగాని స్త్రీగాదు ఈ రహస్యమెవ్వరికినిఁ దెలియదు. తత్కారణంబున మేమింతదనుక వానిని స్త్రీగనియే లిఖించుచు వచ్చితిమి. ఇపుడాతనివిషయ మెల్లరకుఁ దెల్లమయి యుండెను గావున, మేమును నిఁక వాని విషయమునఁ బురుషవాచక శబ్దములనే ప్రయోగించుచుందుము.

ఆయాగంతుని వచనముల నాలించి జగపతి కధికభయసంభ్రమములు జనించెను. ఇపుడు తమ గూఢరహస్యములు వెల్లడి యయ్యెననియు, వెల్లడిగానున్నవనియుఁ దమ ప్రాణములకు ముప్పు వాటిల్లుట తథ్యమనియు వానికి నిశ్చయముగ దోఁపఁదొడంగెను. ఆయాగంతుఁడు వచియించియుండిన రహస్యపూర్ణవాక్యములను జగపతి యొక్కఁడే వినియుండెనా? కాదు కాదు. ఆవాక్యములను మాయారాణియు నచటఁ దాఁగియుండిన పరిచారికలెల్లరును బాగుగ నాలించియుండిరి. మాయారాణి దన కొక్కమారుగఁ గలుగనుండిన ప్రాణహానియు మానసనష్టమును నగౌరవమును నపఖ్యాతిని దలంచి తొక్కటపడుచు, నావాక్యములఁ బలుకుచుండిన ఆయాగంతుని కంఠస్వరమును గుర్తించుట కాధ్వనివైపునకు ధ్యానమిడి కడుశ్రద్ధ నాలించుచుండెను. కాని, ప్రయోజనమెద్దియు లేకపోయెను. కారణంబేమన, నామనుజుఁడు దన కంఠస్వర మెవ్వరును

గుర్తింపఁ గూడదను తలంపుతోడనే ధ్వనిని మార్చి మాట్లాడు చుండెను.

ఆయాగంతు లిరువురను బంధింపవలెనను యోజనయందు జగపతి బాగుగఁ జిక్కియుండినను వారిలోనొకఁడు పలికియుండిన యామర్మపూరిత వాక్యములు వానిహృదయమును జలింపఁ జేయుటచే వాని మాటలకు మాఱెద్దియుఁ బలుకఁ జాలఁడయ్యెను. కాని, యచట నలుదెసల దాఁగియుండిన పరిచారకలు మాత్రము వెడలి వచ్చి ఆయాగంతు లిరువురను ముట్టడించి నిలచిరి. మాయారాణి దనకుఁ దోడ్పాటుగవచ్చి చేరునను నాశ జగపతికి గలిగియుండెను. కాని, వాని యాశ నిరర్థక మాయెను. కారణంబేమన, నాయాగంతుకుఁడు పలికియుండిన వాక్యముల ప్రభావ మందఱికంటె నామెపై నధికముగ జూపుటచే భయవిహ్వలచిత్తయగుచు నచటనుండి పరుగిడి తనకొలువుకూటములోనికి బోయి కూర్చుండెను. మఱియు నచటఁ గావలియందు నియుక్తలయి యుండిన పరిచారికలలో నొకతెను జీరి "ఓసీ! యీతోఁటయం దిరువురు పగతులు ప్రవేశించి యుండిరనియు, వెంటనే వారి శిరములను ఖండించి నాయొద్దకుఁ గొనితేవలెననియు నాయాజ్ఞగా మనసైనికుల కెఱింగింపుము. పొమ్ము! తడయకు" మని పలికి యాపరిచారికను మొదటి తరగతి తోఁటలోనికిఁ బుత్తెంచెను.

ఇచట జగపతి పరిచారిక లెల్లరుఁ దనకు సహాయముగవచ్చి నిలుచుటఁ గాంచి యెట్టులోఁ గొంతధైర్యమును దెచ్చుకొని ఆయాగంతులతో నివ్విధంబున సంభాషింపఁ దొడంగెను.

జగపతి:--మీర లిచటి కేల యరుదెంచితిరో తొలుత వివరింపుఁడు.

రెం॥ యాగం:—నీప్రశ్నకు మేమేల ప్రత్యుత్తర మిడవలెను?

జగపతి:—అగుచో, మీమిత్త్రియే మిమ్మిటకుఁ గొనితెచ్చినటుల భావింపవలసియున్నది.

మొ॥ యాగం:—(నవ్వి) ఔను. నిక్కువము. నీమృత్యువే మమ్మి
టకుఁ దోడ్కొని వచ్చినది.

ఇవ్వచనము నాలించినంతనే జగపతి గోపోద్దీపిత మాన సుఁడై ఆయాగంతునిపైఁ దనకరవాలమును విసరెను. కాని, యతఁ డతినేర్పుతో నడుగులనుమార్చి యావ్రేటును తప్పించుకొనెను. మఱియు రెండవ యాగంతుఁ డతిరయంబున వానివెనుకకుఁ బోయి వెన్నుపై సత్తువగొలఁది పదతాడనము గావించెను. ఆతాడనము వలన జగపతి మూఁతి పగులునటుల గుభేలున భూమిపై బోరగిలఁ బడెను. కాని, యతఁడు వెంటనే తన్ను సంబాళించుకొని లేచి నిలచెను. మఱియుఁ బరిచారికల దెసఁబరికించి "యీయిరువురను బంధింపుఁ"డని యాజ్ఞాపించెను. ఆపరిచారిక లాయిరువుర యద్భుత వ్యవహారముంగాంచి తొలుత నుండియు విస్మయాందోళిత చిత్తలగు చుండిరి. మఱియు వారిరువురుఁ బురుషులనియు వారికి గట్టినమ్మ కము దోఁచియుండెను. ఇదియునుగాక, జగపతిబలదార్ఢ్యములపై వారికెంతయో విశ్వాసముగలిగి యుండెను. కాని, తమకన్నుల యెదుట వానికిఁ గలిగిన దుస్థితిఁ గాంచియు నాయాగంతుని వచ నముల కతఁడు మాఱెద్దియుఁ బలుకక మిన్నకుండుటయుఁ గాంచి యాపరిచారికల హృదయభావము క్షణకాలములో మార్పునొం దెను. వారలా యాగంతు లిరువురను ముట్టడించి నిలచియుండినను వారి కెట్టిహానియుఁ గలిగింపఁ జాలకుండిరి. జగపతి పరిచారికలఁ గలయఁగని "యీముచ్చు లిరువురు పారిపోఁగూడదు. వేగమే బంధింపుఁ"డని మరల వారిని హెచ్చరించెను.

దీర్ఘకాయుఁడగు యాగంతుఁ డతిసాహసంబునఁ గైజాగుగల జగపతి కరమును దృఢముగఁ బట్టుకొని వానితో "మేము పారిపోవు టకే తెంచి యుండలేదు కాని, నీవు పారిపోవుటకు మాత్ర మెడ

మీయకుందుము. (పరిచారికల వైపునకుఁ బరికించి) మేమిచటనుండి పారిపోవువారముగాము. మీరు మమ్మిచటికిఁ గొనిపోఁదలంచినను, నిశ్చింతగ మీవెంట నేతెంచుటకు సంసిద్ధముగ నుంటి"మని పలికెను.

ఆయాగంతు లిరువురు సామాన్యులు గారనియు వారి మెదుటఁ దాను గర్వించుట వ్యర్థమనియుఁ దన్నొక గొప్పయాపద యెదుర్కొన నుండెననియు జగపతి కిపుడు దోఁపఁదొడంగెను.

ఇంతలో "దొంగ దొంగ"లను యఱపులు దిక్కులు పిక్కటిల్లుచు వినిపింప సాగెను. మఱియుఁ గొందఱు సైనికులు కాగడాలవెలుతురున నాదెస కేతెంచుచుండుటయుఁ జూపట్టసాగెను. వారలు మాయారాణి యాజ్ఞానుసారము దొంగలిరువురను(ఆగంతులిరువురను) బంధించుటకు మాటలాడునంత కాలములో నచటికిఁ జేరి, పరిచారికలమధ్య నిరువురు నకాబు పోషులు ఖడ్గములను పెఱచి నిలచియుండుటయు, వారిలోనొకఁడు జగపతి చేయిఁబట్టుకొని యుండుటయుఁ గనుఁగొనిరి.

ఆసైనికు లెట్టి కార్యమునకుఁ గడంగుటకు మున్నె రెండవయాగంతుఁడు జలదగంభీరస్వరంబుతో, "సోదరులారా! మిత్రులారా!! మేమిచటనుండి పారిపోవుదుమని భీతిల్లుకుఁడు. మేమిచటికేతెంచిన హేతువు వేఱు గలదు. మేము మీకు శత్రువులము గాము. మీవిరోధుల కనుచరులమును గాము. నేను మీనిజమిత్రుఁడను. శ్రేయోభిలాషుఁడను. సూర్యోదయమైన పిదప నాముఖము పైనుండి యీనకాబును దొలఁగించివైతును. అపుడు మీరు నన్నుఁ గాంచి మీ పూర్వసహచరునిగఁ దెలిసికొనగలరు. నేనిపుడు మిగుల బశ్చాత్తాపసంతప్తహృదయుఁడనగుచు మీ యవివేకమును వెల్లడించుట కిచటి కేతెంచియుంటిని. మీపరిభవమగు ముకుందసిం

హా నరపాలుని కంఠముపైఁ గత్తి పెట్టుటయుఁ మీరాకావిషయము దెలియకుండుటయుఁ గడుంగడు శోచనీయము. ఇట్టి విచారకరంబగు విషయము వేఱేమి కలుగఁగలదు? ముకుందసింహ నరపాలుని తుదముట్టించి వాని కోరికలన్నింటి భగ్నమొనర్చి—మానగౌరవములనుమంట గలిపి—వనితల హృదయములయందు ఘోరదుఃఖసంతాపములను జనింపఁజేసి—నిరంతరము మీవెంట నుండుచు మీపై నధికారమును చెలాయించుచుండిన నిశాచరుని—స్వామిద్రోహిని—క్రూరచిత్తుని—లంపటుని—విశ్వాసఘాతుకుని మీరలెఱుంగఁజాలకుంటిరి. కటకటా! యిది యవివేకముగాక—యజ్ఞానముగాక—యంధకారముగాక వేఱేమి కాఁగలదు? దయార్ద్రహృదయుండును—సత్యసంధుఁడును-సకల గుణగణాలంకారుఁడును నిరుపమాన సుందరాకారుఁడును—బాహువీర్య బలపరాక్రమధౌరేయుండునునగు మీప్రభువు ముకుందసింహ నరపాలుఁడు మరణించి నేఁటి కెన్నియో వత్సరములు గడచియుండెనని మీరు తలంచకుఁడు, భావింపకుఁడు. అది యంతయుఁ గపటనాటకము. ఇంద్రజాలము. అకటా! వాని నెత్తుటఁ దడసిన భూమి యింకను నాఁటియుండదని ఘంటాపథముగ వచియింపఁగలను. గురుతరదృష్టాంతరములను జూపఁగలను. సిద్ధాంతీకరింపఁ గలను. నిక్కువముగ మీపృథ్వీశుని యకాలమరణమునకు మీకనుతాపము గలుగుచుండిన—మీకు వానిపైఁ బ్రగాఢానురాగము గలిగియుండిన—వానియెడల మీకు భక్తిశ్రద్ధలు కుదిరియుండిన—మీహృదయములు కృతజ్ఞతతో నిండియుండిన—మీభూపాలకహంతకుని నామమును వినగోరుచుండిన—వివరించి మిమ్ము గాఢనిద్రనుండి మేల్కొల్పుటకే యిచటి కేతెంచియుంటి"మని పలికెను.

ఆయాగంతకుని వచనములచట నుపస్థితులైయుండిన సైనికులయొక్కయు పరిచారికలయొక్కయు హృదయకమలములను గం

వించి వైచెను. తమ యేలిక ముకుందసింహుని స్మరణ వారిహృద
యాకాశమునఁ దటిత్తుఁబోలి మెఱసెను. ఆపుడమితోఁడచిరకాలము
ననే మరణించెననియు, వానిహంతకుఁడు దమచెక్కియనుండి తమపై
నధికారమును జెల్లించుకొనుచుండెననియు, నాలించి యాసైనికుల
హృదయక్షేత్రమందు జ్ఞానయవివేకములకుఁ దుములసంగ్రామము
ప్రారంభమయ్యెను. వారి హృదయరాజ్యమందుఁ గరుణాక్రోధ
ములు ఘోరవిప్లవమును గావింపఁదొడంగెను. ఆసైనికులెల్లరు దు
రంత విచారమున గొట్టుపడి దిటవుదక్కి కన్నులనీరు జొటజొటఁ
గార్చుచు, "మహాశయా! వచియింపుఁడు. వేగమే వచియింపుఁడు!
మాయేలికను—దయాసాంద్రుఁడగు మాప్రభువుని—ధర్మావతా
రుని—సాధుమూర్తిని వంచించి, హింసించి, ఖండించిన యాకుటి
లవర్తనుఁడు—దుష్టుఁడు—ఘాతుకుఁడు—దుశ్చారిత్రుఁ డెవఁడు?
ఎవఁడు? ఎందుఁగలఁ" డని నలుదెసలనుండియు నొక్కమాటుగఁ
బ్రతిధ్వనించెను. ఆసైనికుల పలుకులకుఁ బ్రత్యుత్తరముగ రెండవ
యాగంతుఁ డిట్టులఁ బలికెను:—

"నాయనుచరుఁ డిపుడెవని హస్తమును బట్టుకొని యుండెనో,
యాకుటిలుఁడే! కలుషాత్ముఁడే! మీప్రభువును నుగ్గాడిన నృశంసుఁ
డు. వాని మానగౌరవములను భంగపఱచిన కుత్సితుఁడు. వీనికి
మాయారాణి దర్బారు నందధిక మానసన్మానములుగలవని భీతిల్ల
కుఁడు. మఱియు నీజగపతి వాస్తవముగ స్త్రీయో లేక పురుషుఁడో
మీరాలోకించుక పరీక్షించి తెలిసికొనుఁడు. ఈదురాత్ముఁ డనేక
వత్సరములనుండి మీనేత్రములయందుఁ ధూళిఁ జిలుకుచు స్త్రీరూ
పమునుదాల్చి మీవెంట నుండుచు, మీపై నధికారమును చెల్లిం
చుకొనుచుండినను, మీరావిషయమును గుర్తింపఁ జాలకుంటిరి.
ఇదియుఁగాక మీకు మఱియొక రహస్యముగూడ నెఱింగింపవలసి

యున్నది. కాని, యది యిపుడుగాదు. కొంతసేపు తాళుఁడు. తెల్ల వాఱనిండు. అంత దనుక మమ్మీరువురను వేఱొక స్థానమునకుఁ గొంపోవక నిచటనే యుండనీయుఁడు.

ఆయాగంతుని భాషణమువలన నచటి పరిస్థితి మిగుల దీక్ష్ణ రూపమును దాల్చెను. ఆసైనికు లచట గుంపులు గుంపులుగఁ గూడి రెండొరులు చెవిఁగొఱుకు కొనఁదొడంగిరి. కొందఱి నేత్రములనుండి కన్నీరు జాలువారఁ దొడంగెను. కొందఱు సిగ్గుచే శిరములను వంచుకొనుచుండిరి. కొందఱు పశ్చాత్తాపచిత్తులగుచుఁ దమహృదయములఁ జేయిఁజేర్చి యున్నురనుచుండిరి. కొందఱు తమ ముఖములపై వ్రేలిడి వివిధాలోచన నిమగ్నమానసులగుచుండిరి. మఱికొందఱు క్రోధావేశులై పండ్లు గీఱుచు జగపతివైపునకుఁ జురఁజురఁ జూచుచుండిరి. అది యొక రాత్రికాలమైనను మాయారాణి సైనికులవెంటఁగల కాగడాల వెలుతురునందు సమస్తము స్పష్టరూపంబునఁ జూపట్టుచుండెను. ఆసైనికులు జగపతివైపునకుఁ బాగుగ నిదానించి చూచుచుఁ గొంత వ్యత్యాసమును గనిపెట్టుచుండిరి. భయచింతాసంభ్రమములు జగపతిని మృతప్రాయునిగ నొనర్చుచుండెను. వాని మోము వెలవెలఁబాఱుచుండెను. ఆసిపాయిలెల్లరు నావేశపూరితులై యుండుటఁ గని, యిఁక నాలసించుట చతురతగాదని తలంచి, మసయాగంతు లిరువురు సంజ్ఞాపూర్వకముగఁ బరస్పరమెద్దియో సంభాషించుకొనిరి. తదనంతరము రెండవయాగంతుఁ డతినేర్పున జగపతి పైటచెఱఁగుఁబట్టి క్రిందికి దిగఁజార్చి తటాలున గంచుకమునుబట్టి చించివైచెను. తోడనే దానినుండి కృత్రిమములగు రెండుచెండ్లు జారి క్రిందఁబడెను. ఇపుడు వానిరూపమందుఁ బురుషాకారము గోచరింపఁదొడంగెను. దానిని గాంచుటతోడనే మాయారాణి సైనికులకుఁ బూర్ణరూపంబునఁ

క్రోధము హెచ్చెను. తమప్రభువు ముకుందసింహుఁ డీదుష్టుని కారణంబుననే మృత్యువాతఁ జిక్కెనని వారి కెపుడు నిశ్చయమయ్యెను. మఱియు నచటఁ గల పరిచారికలెల్లరు నాశ్చర్యచకితులగుచు నొండొరుల మోములను దిలకింపసాగిరి. అట్టి పరిస్థితిఁ గని జగపతి చేతిని విడచి ఆయాగంతు లిరువురు నచటనుండి కొంత దవ్వునకుఁ దొలఁగి నిలచిరి. ఆసిపాయిలు జగపతిని ముట్టడించి నిలచి యొకరినొకరు నెట్టుకొనుచుఁ దమకుదమకుఁదోఁచినవిధంబున వానినిఁ బ్రశ్నింపఁ దొడంగిరి. కాని, వారిప్రశ్నములకు నుత్తరమొసంగునట్టి స్థితియం దతఁడు లేకుండెను. తుద కాసిపాయి లొండొరులతోఁ గూడఁబలుకుకొని ఆయాగంతులనమేతము జగపతిని రాజప్రధానియొద్దకుఁ దోడ్కొనిపోవుటకు నిశ్చయించుకొనిరి.

ఆసమయంబున సైనికులెల్లరుఁ గ్రోధావేశులై యుండుటచే జగపతి చేయివిడచి దవ్వునకేగి నిలచియుండిన ఆయాగంతు లిరువుర సమాచారమును వారలు బొత్తిగా మఱచియుండిరి. ఆసైనికు లవ్విధంబున నిశ్చయించుకొనిన పిదప నాయాగంతు లిరువురు నిలచియుండిన దెసకుఁ బరికించిరి. కాని, వార లచ్చోటఁ జూపట్టరైరి. అంత నాసైనికులు మిగుల సంభ్రమచిత్తులగుచు నలుదెసలఁ జూడ నారంభించిరి. వార లెపు డదృశ్యులయ్యిరో యెచటి కేగియుండిరో యావిషయ మెవ్వరికిఁ దెలియదు.

మొదటివాఁడు:—సోదరులారా! ఆయాగంతులిరువురు నిచ్చోటనే
నిలచియుండిరి గదా?

రెండవవాఁడు:—ఔను. అది మేముగూడఁ జూచియుంటిమి. కాని,
వారలిపుడెటు లదృశ్యులైరి? వింతగ నున్నదే!

మూఁడవవాఁడు:—వారు పారిపోవువారుగారు. ఇందెచటనో దాఁగి
యీవినోదమును బరికించుచుందురు.

ఇవ్విధంబున నాసైనికులు పరస్పరము సంభాషించుకొని ఆయాగంతుల నెమకుచు నచట సంచరింప సాగిరి. వార లచట నుండినగదా చూపట్టుట! అంతఁ దెల్లవారెను. ఇంతలో నాయూశ్చర్యజనకంబగు ఘటనావృత్తాంత మైంద్రజాలమువలె గాలితోఁ గూడి దాదవ్వులవఱకు వ్యాపించెను. ఇపుడు మాయారాణిసైనికులు మిగుల స్వాతంత్ర్యులయి తమరాణికి శత్రువులగు నాయాగంతుల పక్షమున జేరియుండిరి. వార లాయాగంతు లిరువురను వెదకి వెదకి వేసారిరి. కాని, వారిజాడ యెచ్చటను జూపట్టదాయెను. తుదకు నిరుపాయులై సైనికు లాజగపతిని తమవెంట నీడ్చుకొని రెండవతరగతి తోఁటనుండి వెడలిపోవుట కచటనుండి బయులు దేరిరి.

మాయారాణి కీవృత్తాంతము దెల్లమగుట తోడనే మిగుల సంభ్రమచిత్త యగుచుఁ దనప్రాణములును జగపతి యనురుణుబు దక్కుట కష్టసాధ్యమని యామె నిశ్చయించు కొనెను. మఱి యికనిపు డేది కర్తవ్యంబని యామె పెద్దతడవు యోజనాసాగరంబున మునింగి యుండెను. ఇపుడామె స్వరూపమును గాంచుటవలన నునవామె హృదయభావమును గొలఁది గొప్ప గ్రహింప వచ్చును. ఆమె మోము వెలవెలఁబాఱి కనురెప్పలు భూమివైపునకు వ్రాలి యుండెను. అప్పుడప్పు డామె తనూలత గంపించుచుండెను. నేత్రములు చంచలములగు చుండెను. ఆధరోష్ఠము లదరఁదొడంగెను. ఆమె కనుదోయి యెఱ్ఱబాఱి మోము జేవుఱించుటవలన నచటఁగల పరిచారికలెల్లరు నామెకు హద్దుమీఱిన కోపావేశముదయించి యుండెనని తలంపసాగిరి.

మాయారాణి యటులఁ గొంతతడవు వివిధాలోచనలఁజిక్కి తనయుల్లంబున నిటులఁ దలంపసాగెను.

"ఇపుడాదురాత్ములకుఁ బ్రబోధించుటయందుఁ గాలమేల వృథాపుచ్చవలెను? ఈకొలఁదిమంది సిపాయిలను వశపఱచుకొన

జాలనిచో, తిలన్మరాణినను పేరు గాల్పనా? నాయాజ్ఞ నుల్లంఘించిన విశ్వాసఘాతుకులగు సైనికులను నేనివు డుచితరీతిని దండింపకుండిన నన్ను నరకు సేయు వారెవ్వరుందురు?"

ఇవ్విధంబున మాయారాణి తనలో దాననుకొనుచుఁ దటాలున నచటినుండి లేచి కొలువుకూటములోనుండి పోవుచు, మున్ను పిచ్చివాని వేషమునుదాల్చి వచ్చిన యభయసింహుని, మూఁడవ తరగతి తోఁటయందు బంధించుట కేమార్గమున గదాధరసింహుఁడు వానిని వెంటఁదోడ్కొని పోయియుండెనో, యామార్గమందుఁగల గదిలోనికిఁ బోయిచేరెను. ఆగదినుండి మఱియొకగదిలోనికి ద్వారము గలదు. మాయారాణి యాద్వారమును దెఱచి యాగదియందుఁ బ్రవేశించెను. దానియందొకబావి గలదు. ఆబావిలోని కొక యినుపగొలుసు వ్రేలాడుచుండెను. మాయారాణి యాగొలుసును బట్టుకొని యాబావిలోనికిఁదిగి యొకవిశాలమగు స్థానమందుఁ బ్రవేశించెను. దానియందు గాఢాంధకారము వ్యాపించియుండెను. మాయారాణి యాకటికి చీఁకటియందుఁ దడుములాడుచు నొకవైపునకుఁబోయి యచట నేదియోయొక మరనుద్రిప్పెను. తోడనే యాస్థానమందు బాగుగ వెలుతురు గలిగెను. మఱియు దానియందుఁగల సకలపదార్థములు స్పష్టరూపంబునఁ జూపట్టసాగెను. ఆప్రకాశము మిద్దెనుండి వ్రేలాడుచుండిన యొకకాఁచగోళమునుండి వెడలుచు నాస్థానమంతయుఁ బ్రకాశవంతముగ నొనరించుచుండెను. అదియొక విశాలమగు చావడివలెఁ దోఁచుచుండెను. కాని, దానికి నలువైపుల గోడలుగలిగి యుండుటవలన నదియొక గదియని వచియించినను నెట్టియాటంకము గలుగదు. ఆస్థానము పలువిధంబులగు నద్భుతపదార్థముల తోడను చక్రములు, మరలు, మీటులు మున్నగు యంత్రసామగ్రులతోడను నిండియుండెను.

అగదికిమధ్యఁ జంద్రకాంత శిలావినిర్మితంబులగు యిరువదినాలుగు స్తంభములు రెండువరుసలుగా నిర్మింపఁబడి యుండెను. రెండేసిస్తంభములపైస్ఫటికంపు శిలలతో విచిత్రవైఖరి నిర్మింపఁబడిన యార్చిలు మిగుల సొంపుగఁ జూపట్టుచుండెను. ప్రతియార్చికి మధ్యనొకొక పెద్దగంట వ్రేలాడుచుండెను. ప్రతియార్చికొకవైపున స్తంభముతో జేరి భూమియం దొక గాఁడియు దానియం దొక చక్రమును గలవు, మఱియుఁ బ్రతిదానిపైనను బెద్దపెద్ద యక్కరములు పరిస్ఫుటముగ జెక్కఁ బడియుండెను. మాయారాణి యాయక్షరములను జదువుకొనుచు "రెండవతరగతి తిలస్మద్వార"మని చెక్కఁబడియుండిన యార్చియొద్దకుఁబోయి నిలచెను. మఱియు నచటి చక్రమునుబట్టి త్రిప్పనారంభించెను. అదినాలుగైదు మాఱులు గిరగిరఁ దిరిగి నిలచిపోయెను. మాయారాణి యచటినుండి బయలుదేరుచు "మంచిది! ఇపుడాదుష్టురాలీతోఁటనుండియెటుల వెడలిపోగలదో చూచెదఁగాక" యని తనలోఁ దానను కొనుచు నెదుటివైపు గోడసమీపమునకుఁ బోయిచేరెను. ఆగోడయందుఁ గొంతకొంత యెడమున వరుసగ నైదలమారులు గలవు. కాని, వానిపైని కవాటములులేవు. ప్రతి యలమారునందు నాలుగేసి యరలు గలవు. మొదటియలమారు గాజురత్తెలతో నిండియుండెను. రెండవదానియందు రాగిడబ్బాలు విస్తారముగఁ గలవు. మూఁడవయలమారునందుఁ గాగితపుచుట్టలు విశేషముగఁ జూపట్టుచుండెను. కాని, యవి చాలాభాగము చెదపురుగులకాహారమై యుండెను. నాల్గవదానియం దష్టధాతువులవలన నిర్మింపఁబడిన యనేకవిగ్రహములు గలవు. ఐదవయలమారునందు నాలుగు తామ్రశాసనములు గలవు. వానియందలి యక్షరములు మిగుల దేటగఁ జెక్కఁబడి యుండెను.

మాయారాణి గాజురత్తెలుగల యలమారును సమీపించి దానినుండి యొకరత్తెను వెడలించెను. దానియం దొకవిధంబగు నర

కు నిండి యుండెను. తానాయరకుఁ గొంత ద్రావి యారుత్తైను దీసి కొని రెండవయరలవారుచెంతకుఁ బోయిచేరెను. దానినుండి యొక రాగిడబ్బాను వెడలించి యచటనుండి బయలుదేరి తానాస్థానమున కేతెంచియుండిన మార్గముననే మరలఁ దనకోలుపుకూటములోనికిఁ బోయి చేరెను. ఆసభామండపమున కెదుట వివిధవర్ణవస్త్రింబుల జెన్నొందుచుండిన మొక్కలు, పూలమొక్కలు, వనలతలు, మున్నగునవి చక్కని మంటికుండెలయందుఁ బెఱుగుచు నాస్థానమునకు మిగుల వన్నెదెచ్చు చుండెను. మాయారాణి యచటికిఁ జేరుటతోడనే యారాగిడబ్బాను దెఱచి దానియందలి చూర్ణము సగమువఱకా మొక్కలపైనను లతలపైనను జలికి, మిగతచూర్ణముగల డబ్బాను గాజురుత్తైను దీసికొని, తనపరిచారకలందఱిపై యజమానురాలగు తరళయనుదానిని వెంటఁ దోడ్కొని మిద్దెపైకి వెడలిపోయెను. ఆవిద్రోహులగు సైనికులు జగపతిని వెంటఁదోడ్కొని రాజప్రధానియొద్దకుఁ బోవు తలంపున నామార్గముచెంత కరుదెంచుటకుఁ బూర్వమే పైన లిఖించియుండిన కార్యాచరణము లన్నింటిని మాయారాణి యతిచుఱుకుగ నొనరించి యుండెను.

తదనంతరము మాయారాణి దనచేతియందలి గాజురుత్తైను తరళకుఁజూపి "నీచేయి పట్టుము. దీనియందలి యరకుఁ గొంత నీయంజలియందు వెలువరించెదను. నీవు వేగమే దానిని గ్రోలి రాఁగలవిపత్తినుండి తప్పియుండుము" మనెను.

తరళ:—(చేతులను జోడించి) తిలస్మమహారాణీ! మీరు నాపై నపారదయ గలదని నేను మొదటినుండియు నెరింగియుంటిని. మఱియు నాప్రాణములు మీ హితకార్యసిద్ధికై యర్పించుటకు నిరంతరము సంసిద్ధురాలను.

మాయారాణి:—(తరళ యంజలియందుఁ గొంత యరకుఁబోసి)

దీనిని వెంటనే కోరిలుము. మఱియు సావధానచిత్తవై నేను వచియించువిషయములను గడుశ్రద్ధ నాలింపుము.

తరళ:—వచియింపుఁడు. మీారిటుల సంభ్రమచిత్తులగుటకును మీా స్థితి యివ్విధంబున బరివర్తనము నొందుటకును హేతు వె య్యదియో వినుటకు మిక్కిలి యాతురము నొందుచుంటిని.

మాయారాణి:—తరళా! నీయెదుట నాకెట్టి రహస్యమునులేదు. నే నిదివఱకే నారహస్యములన్నింటిని నీకుఁ దెలిపియుంటిని. రెండు విషయములనుమాత్రము నీకుఁ దెలుపక నింతవఱకు దాఁచి యుంచితిని. వానిలో నేఁడొకటి వెల్లడియయి యుం డెను. ఇఁక రెండవదానిని మఱియొక సమయమందుఁ జెప్పి నీకు వినిపింతును. నారహస్య మొరులకుఁ దెల్లమగుచోఁ బ్రాణహాని తప్పక కలుగఁగలదని తొలుతనే యెఱింగియుం టిని. తుదకటులనే సంభవించెను. ఆదురాత్ములగు నకాబు పోషు యాగంతులిరువురు నిట కేతెంచి యెట్టి యనర్థమును గలిగించి యుండిరో యది నీవెఱుంగనిదికాదు. ఇఁక జగ వతి రహస్యము మఱుఁగు వడియుండుట యసంభవము. మఱియు దానిలోపా టాదుష్టు సైనికుల హృదయభావము ను మాఱియున్నది. నేనొకవేళ నెట్టి యనుచితకార్యమేని యుఁ గావించి యుండినను వారలు నాపై ద్వేషభావమును వహించుట నీతిగాదు. కానిమ్ము! వారు నన్ను దిరస్కరించి యెట్టిలాభమును బడయఁజాలరు. అకటా! నేనొక మహాతిల న్నమునకుఁ రాణినని గూడ వారలు మఱచి యుండిరి. చూడుము! నేనిపు డీతోఁటనుండి వెలుపలకుఁ బోవు మార్గ ములను బంధించివైచితిని. ఇపుడు వార లెవ్విధంబునను దీని లోనుండి వెలుపలకు వెడలఁజాలరు. నేను వారికెట్టి దుస్థితిఁ

కలిగించెదనో కొంత తడవులోఁ బరికింపఁగలవు. నేను క్రింద
కొలువుకూటమున కెదుటి పూలమొక్కలపైఁ జిలికియుండిన
మచ్చుమందు మిగులఁ బ్రభావముగలది. దానివాసన చాల
దూరమువఱకు వ్యాపింపఁగలదు. మచ్చుమందులలో దీని
కెనయగున దీప్రపంచమందు వేఱొకటి లేదు. ఇది యా
దురాత్ములపై విషతుల్యముగఁ బనిసేయఁగలదు. నీవిపు డా
సైనికులసమీపమున కేగి వారికిఁ దగురీతి బోధించి నాసమీ
పమునకుఁ దోడ్కొనిరమ్ము!—వలదు వలదు.—మంచిది!
ఇటు చూడుము!—పోనిమ్ము!—నీకు వేఱొకమాటఁ జెప్పు
చుంటిని. ఇఁక నాప్రాణములు దక్కుట కష్టసాధ్యము.
అయిననేమి! వేలకొలఁది మనుజులను యమసదనమునకుఁ
బుత్తెంచిగాని నేను మరణింపను. కటకటా! నాపాలిటి మృ
త్యుదేవతలవలె నాదురాత్ములిరువురు నెచటినుండి వచ్చి
రో తెలియదు. మంచిది! చూచెదనుగాక! (తన చుబుక
ముపై వ్రేలిడి) నాకు సందేహముగ నున్నది. వారిలో
నొకఁడు తప్పక......ఔను.—తప్పక! తప్పక!! అతఁడే
కావలయును. ఔను......రెండవవాఁడు.........కూడ
గ్రహించితిని. సందేహములేదు. నే నావదార్థమును చేతు
లారఁ గోల్పోయితిని. నేను చెడుకార్యమునే కావించియుం
టిని. మంచిది! నేనిపుడు వేఱొకవిషయమును యోజించు
చుంటిని. నేనిఁకఁ దెగువను బూనవలసియున్నది. ధైర్యము
ను జిక్కపట్టకదీరదు. సాహసము! సాహసము!!......నీవు
నన్నొక్కమాఱు విడిచిపోకుము. ఏమి! నాయభిప్రాయము
నీవు గ్రహించితివా? ఇవుడు నాదేహము......మంచిది.
నీవు వెడలి ప్రయత్నింపుము. సమ్మతించిన నరియే! కాని

చో, నేఁ డీతోఁటయందు నెత్తురు కాల్వలుగట్ట ప్రహింప గలను.

మాయారాణి పలుకులలోఁ గొన్ని తుది మొదలు లేని వయి యుండినను నాథూర్తురాలగు తరళ యామె యభిప్రాయము ను వెంటనే గ్రహింపఁగలిగెను. మఱియు నామెతో, "మహారాణి! చింత నుడుగుఁడు. నే నిపుడే వారిచెంతకుఁ బోయి తగురీతి బోధించెదను. మీరు కొంచము శాంతింపుఁడు. మఱియుఁ దిలన్మకవచమును తక్షణము........" యివ్విధంబునఁ బలుకుచుఁ దరళ యచటినుండి వెడలుటకు సిద్ధపడెను.

అంత మాయారాణి తుళ్ళిపడి యతిసంతసముతో "సెబాసు! తరళా! సెబాసు! నీవు బాగుగ జ్ఞప్తికిఁ దెచ్చితివి. నేను దానిని బూర్తిగా మఱచియుంటిని. నీవు వెడలిపోకుము. నీతో నింకను గొంత మాట్లాడవలసి యున్న" దనెను.

---

ఇది ఏడవ భాగము.

# లవంగలత

సాంఘిక నవల.

హిందీభాషనుండి ఆంధ్రీకరింపఁబడినది.

స్త్రీల కెన్నఁడు స్వాతంత్ర్యము నొసంగరాదనియు వారలు పసితనంబునఁ దలిదండ్రుల వశమందును యౌవనంబునఁ బతి యాధీనమందును వృద్ధాప్యమున బుత్రుని స్వాధీనమందును మెలంగుచుండవలెనని మన శాస్త్రకారులు లిఖించియుండిరి. అందువలనఁ దమ పరివారమునకే గాక జనసమాజమంతకును గుశలముగలదు. మన హిందూసమాజమం దీరీతి చిరకాలమునుండి ప్రచలితమై యున్నది. ఎచ్చటెచ్చట నీనియమోల్లంఘనము గావింపఁబడుచుండెనో, యచ్చటచ్చట దురాచారములు పాపములు-అశుభములు పెంపొందుచుండుట సాధారణముగ మనము గాంచుచునే యున్నాము. స్త్రీస్వాతంత్ర్యలీలాక్షేత్రములగు విదేశములను గాంచుఁడు! భారతదేశమందుకంటె నచట సతీ సాధ్వీమణులసంఖ్య యతి స్వల్పము. నేఁడీ పతితదినములందు లక్షలకొలఁది మూర్ఖస్త్రీలు భారతవర్షమునందుండినను నిచటి స్త్రీలయందెట్టి పాతివ్రత్యమును ధర్మజ్ఞానమును గలిగియుండెనో యట్టి సద్గుణములు ఖండాంతర స్త్రీలయందుఁ జూపట్టుటరుదు. స్త్రీలకు విద్యగఱపుట చెడుగైన విషయము గాదు. మఱియు స్వాతంత్ర్య మెల్లరకు వాంఛనీయము. కాని, దానికిఁ బరిమితి గలిగియుండవలెను. స్వాతంత్ర్యమను నెపముతోఁగూడిన యుచ్ఛృంఖలావృత్తి యెన్నఁడను మోదనీయముగాదు. ఆవిషయములన్నియు నీనవలయందుఁ గథారూపమున వర్ణింపఁబడియున్నవి. లవంగలతయను నొకబాలిక స్వాతంత్ర్యయై యెట్టి భయంకర కష్టపరంపరల ననుభవించియుండెనో, ఒక యువకుని ప్రేమపాశంబున జిక్కి యెటుల వంచింపఁబడెనో,-స్వమతమును వీడి అన్యమతమును స్వీకరించుటవలన నెట్టి యధోగతి సంభవించెనో వానిని జదువుటవలన పాఠకమహాశయుల హృదయములు జలదరింపక మానవు. రమేశుని ధూర్తత్వము-తారయొక్క పాపలీల-దుష్ప్రవర్తనమువలన గలుగు భీషణపరిణామము-పరమేశ్వరుని న్యాయాన్యాయ విచారణదక్షత-వీని యుజ్వలోదాహరణము లిందుఁ జక్కగ చిత్రింపఁబడియున్నవి.

| మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA115B185 |
| పుస్తకం పేరు | మాయామయి(07) |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 297 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |